# శ్రీ మదాంధ్ర

# రామాయణము

కిష్కింధా కాండము.

మూలము

శ్రీ వాల్మీకి రామాయణము



ప్రణీతము

పోచిరాజు కామేశ్వర రావు

# శ్రీ మదాంధ్ర

# రామాయణము

కిష్కింధా కాండము.

మూలము

శ్రీ వాల్మీకి రామాయణము

ప్రణీతము

పోచిరాజు కామేశ్వర రావు

# శ్రీమదాంధ్ర రామాయణము

(మూలము: శ్రీవాల్మీకి రామాయణము)

## కిష్కింధా కాండము

## సర్గము 1.

కం. సూర్యోఘు ఘన స్తుత్యా!
సూర్యాన్వయ శరధి పూర్ణసోమా! రామా!
సూర్యచ్ఛా త్రారాధ్యా!
సూర్యాత్మజ మిత్రవర్య! శూరవరేణ్యా! 1.

రామలక్ష్మణులు పంపా సరోవరము సేర రాముఁడు సీతా వియోగమును దలంచి విలపించుట, పంపా తటి వర్ణనము, ఋష్యమూక గిరిని సమీపింప సుగ్రీవుఁడు వీరినిఁ గాంచి భయభ్రాంతుఁ డగుట.

కం. పంపా సరోవరమ్మున
నింపుగఁ బద్మోత్పలములు నింక ఝుషమ్ముల్
పెంపార రాఘవులు గని
కంపింప మనము ధరణిజ కాంతుఁడు వగచెన్ 2.

తే.గీ. చూచి నంతట నా సరస్సును ముదమున
హృదయ ముప్పొంగ రాముఁడు రేఁగఁ బ్రేమ
యింద్రియమ్ములు కంపింప నిట్లు పలికె
ననుజు సౌమిత్రి తోఁ గమలాక్షుఁ డడరి 3.

తే.గీ. వెలుఁగు చున్నది వైదూర్య విమల జలము
తోడ ఫుల్ల పద్మ కుముద ద్రుమ వితాన
సంయుతమ్ము సౌమిత్రి గాంచ నిట రమ్య
మైన పంపా తటాకమ్ము మేను లలర 4.

తే.గీ. చూడు మీ పంప ప్రక్కన సుందరంపుఁ 5.

గాననమ్ము నెత్తైన శిఖలను వృక్ష
రాజములు శైలముల భంగి రమ్యముగను
గనఁ బడుచు నుండ లక్ష్మణ! కన్ను లలర

చం. భరతునిఁ గాంచ నేరమిని బాధయు సీతను దొంగిలింప నా
ర్తి రగుల దుఃఖ తప్తున కతీతము మాధవ మిచ్చు చున్నదే
యురుతర పీడ నా కయిన నొప్పుగఁ జిత్రపుఁ గాననం బొసం
గు రుచిర హర్ష మీ కుసుమ గుచ్ఛక శీతల వారి యుక్తమై 6.

ఆ.వె. పద్మసంచయ సువిభాసిత మతి సుంద
రమ్ము మృగ ఖగాకులమ్ము సర్ప
సంచరితము వెలిఁగె శాద్వల మట నీల
పీత వర్ణముల నవిరళముగను 7.

తే.గీ. పఱుపు వోలెఁ బఱుపఁ బడెఁ బన్నుగ నట
వివిధ తరుల సుమము లెల్ల విరుల బరువు
చేత వంగిన కొమ్మలఁ జెట్లఁ జుట్టు
కొన్న పుష్పిత లతలతోఁ జెన్ను మీఱె 8.

తే.గీ. కామ సంభవ యుక్తంపు గంధయుక్త
ఫల సుమమ్ముల నిండిన పాదపముల
సుఖ మొసంగు ననిలము తోఁచు  సమయ మిది
చైత్ర మాసమ్ము సౌమిత్రి చారుతరము 9.

కం. కనుమా వన రూపము లో
యనుజా సుమ శాలినుల మహార్తవ వర్ష
మ్మును గురియు చుండఁ దోయ
మ్మును గురిసెడు తోయదమ్ముఁ బోలుచు నిచటన్ 10.

కం. సురుచిర గిరులన్ వెలిఁగెడు
తరువు లనేకములు కంపితములై చల్లెన్
విరివిగ మారుత వేగ మ
డరఁ బుష్ప చయమ్ము నీ పుడమిపైఁ గనుమా 11.

తే.గీ. రాలినవి రాల నున్నవి రాల కుండ
వృక్షముల నిల్చి నట్టివి విరులఁ గనుమ
వాయు వింపుగ వానితో వార కుండ
నాడు చున్న విధము తోఁచు నక్కజముగ 12.

కం. వివిధ నగ శాఖల పయిం
బువుల వెలయు వాని పైన మూరు భ్రమరముల్
కవియన్ గాలి చలించిన
రవములతో ననుసరించు రమ్యముగఁ దమిన్ 13.

ఆ.వె. శైల గుహల నుండి చాగు వాయువుఁ బోలి
మత్త కోకిలల సుమధుర నాద
ములు సెలంగుచు ద్రుమములను నాడించు న
ట్లగపడుఁ బరికింప నంచితముగ 14.

కం. ఇమ్ముగ మారుత మెల్లెడఁ
గ్రమ్మఁగ నధికమ్ముగా నొకటి నొక్కటి యీ
కొమ్మలు కలియఁ గదలి వృ
క్షమ్ములు పెనవేసి నట్లు కనఁబడు చుండెన్ 15.

ఆ.వె. చందనమ్ము భంగి డెందమునకు సుఖ
మొసఁగి చల్లగాను వెస ధరించి
గంధ మనిలము శ్రమ కనఁబడ నీయక
వీచు చుండె నిచట విరివిగాను 16.

చం. కదలుచు వీయ గాలి మధు గంధ వనమ్మునఁ గూయఁ దుమ్మెదల్
త దనుగుణమ్ము నర్తనము తత్తరు సంతతి సేయఁ గాంచుమా
పదపడి కొండ సెత్తములఁ బాదప రాశి సపుష్ప రాజి స
మ్మదముగఁ దాఁకు శాఖలు క్రమమ్ముగ శైల శిఖాలి వెల్గుచున్ 17.

ఆ.వె. కొమ్మల కొనలఁ గుసుమమ్ములు వెలయంగ
సెగురు చుండ గాలి కెత్తు నందు 18.

మధుకరమ్ము లుండ మౌళి సదృశములై
పాడు నట్టు లుండె౯ బాదపములు

తే.గీ. పూయ౯ బూవు లెల్లెడల నింపుగను బసిడి
నగ లన౯గ౯ గర్ణికార ఘన నగ రాజ
ము లగపడు చున్న విట పచ్చ వలువములు ధ
రించి నట్టి నరుల భంగి మించి వనిని 19.

చం. వనమున దార సీత నెడ౯బాయ వసంత మొసంగ దుఃఖమున్
ఘనముగ నాకు లక్ష్మణ ఖగవ్రజ నాదిత కాననమ్మునన్
మనము దహించు చుండె౯ గడు మన్మథు౯ డిత్తఱి శోక తప్తమున్
నను దమి౯ పిల్చు చుండెను వనప్రియ మారసి వెక్కిరించుచున్ 20.

ఆ.వె. మార తప్తు నన్ను ఘోరతరమ్ము బా
ధించు చున్నయది ముదితము చాత
కం బది సెలయేట౯ గాకుత్స్థ! కూయుచు
మధుర నిస్వనముల నధికముగను 21.

కం. విని మున్నీ శబ్దమ్ము ల
వనిజ మమప్రియ మురియుచు౯ బర్ణకుటికలో
నను బిల్చి తాను హర్ష
మ్ము నందెడిది జానకి భృశముగ సౌమిత్రీ! 22.

కం. కను విందుగను వివిధము ల
యిన చిత్ర విహంగమమ్ము లెల్లను నానా
స్వనముల నలరుచు నున్నవి
వనిని లతా గుల్మ పాదపముల౯ దిరుగుచున్ 23.

చం. పొగడ౯గ నాత్మ బంధువులు పుల్గుల జంటలు విందు నింపుగా
మగ మఱి యాడుతుమ్మెదల మత్త రవమ్ములు పాడు చుండె౯ ది
య్యగ నిట౯ బాదపమ్ములు ననంగుని బారిని నన్ను ద్రోయ౯గా
బగ౯ గొనుచుండె౯ గోయిలల పాటలు చాతక రమ్య నాదముల్ 24.

తే.గీ. బొగ్గు కాఁగ నశోకపు మొగ్గ లెల్ల
మధుకరమ్ముల రొద లెల్ల మంటల చిట
పటలు కాఁగ నెఱ్ఱని పల్లవ తతి మంట
కాఁగ నన్ను వసం తాగ్ని కాల్చు చుండె 25.

ఉ. సన్నని ఱెప్పవెండ్రుకలఁ జక్కని కన్నులు మంచి జుట్టునున్
మిన్నగ పెల్గ మాట లవి మించఁగఁ దియ్యఁదనమ్ము నందు నా
యన్నుల మిన్న జానకిని నక్కట చూడక యున్నచో నికఁన్
మన్నను లాభ మెయ్య దిల మానిని దూరము కాఁగ లక్ష్మణా! 26.

తే.గీ. నా దయిత సీత కీ యరణ్యము సెలంగు
చుండ కోకిల సంచయ శోభితమ్ము
నయి మనోజ్ఞముగ ననఘ! యందమైన
యీ వసంత కాలం బెల్ల నిష్ట మగును 27.

తే.గీ. ప్రేమ తాప సంజనిత మత్క్లేశమే వ
సంత కాల వర్ధిత మయ్యె నంతఁ గాల్చు
నచిరమే నన్ను శోకాగ్ని యడరి యిపుడు
నిశ్చయమ్ముగ లక్ష్మణ నీవ కనుమ 28.

కం. వీక్షింపక నా దయితను
వీక్షించి రుచిర మనోజ్ఞ వృక్షముల నయో
యక్షయ మయ్యెను లోపల
వక్షమునకుఁ దాప మడరి పదపడి యనుజా! 29.

కం. కనిపింపని వైదేహి మ
ది నొసంగును శోక వృద్ధి తీవ్రతరముగం
గనిపించు వసంతము స్వే
ద నాశకము కూడ నాకుఁ దద్ద యొసంగున్ 30.

కం. మృగశాబాక్షి సతి వలని
వగపున భృశము తపియించు వానికిఁ గ్రూరం
బగు చైత్ర వనానిలము నొ 31.

సఁగు చున్నది తాప మెడఁద సౌమిత్రి యిటన్

తే.గీ. అచ్చ టచ్చటఁ జేసి నృత్యమ్ము లీ మ
యూరములు దమ టెక్కలు మూర స్ఫటిక
జాలముల భంగి విస్ఫార గాలి వలన
భాసిలుచు నున్న వెల్లఁ బ్రభలఁ జెలంగి 32.

కం. కనుమా లక్ష్మణ శిఖినులఁ
గని పరివేష్టించి శిఖులు కామ వశములై
పెనుచుచు నున్నవి విరహ
మ్మును మద నార్తునకు నా కమోఘముగ నెదన్ 33.

ఆ.వె. ఆడు నెమలి మన్మ థార్తయై మగ నెమ
లి పతి సరస కరిగి లీల దనర
నృత్య మాడు చుండె నెమ్మితో లక్ష్మణ!
కొండ నెత్తములను గూర్మి తోడ 34.

ఆ.వె. దాని చెంత కంతఁ దాఁ బర్విడి మయూర
మే యనంగ విద్ధ మింపుగఁ బరి
హాసమున కనంగ నఱచుచు విప్పి టె
క్కలను జేరు చుండెఁ గనుమ యనుజ! 35.

కం. అసు రాపహృతము కాకు
న్న సరణిఁ దోఁచును మయూర నారి వనమునన్
వెస రమ్య కాననమున ని
జ సతి సరస నృత్యము నది సలుపఁ దొడంగెన్ 36.

తే.గీ. వాస మతి దుర్లభము నాకుఁ బత్ని సీత
లేక పుష్ప మాసము నందుఁ బ్రేమ మృగము
లందుఁ గనుమ యీ కేకిని యాత్మ నాథు
చెంతన రమించు చున్నది చిత్రముగను 37.

కం. నను గూడి యివ్విధము ప్రే 38.

మను దరి సేరి జనక సుత మరులు జనింపన్
వనిత హరింపఁ బడక యు
న్న ననుజ! చారుతర నేత్ర నడయాడు నిటన్

కం. చలి కాల మేఁగఁ బుష్ప
మ్ముల నిండిన కాననములఁ బుష్పమ్ములు ని
ష్ఫలములె నాకుఁ దలంపం
గ లక్ష్మణ! కనుమ నిరర్థకము లవి యెల్లన్ 39.

ఆ.వె. కడు మనోజ్ఞము లయి కనిపించినను వెల్గు
లీనుచుఁ గుసుమముల నూని తుమ్మె
ద గమి ధ్వనులు సెలఁగఁ దరువు లెల్ల నయినఁ
బూలు వ్యర్థము లయి నేలఁ గూలు 40.

ఆ.వె. గుంపు లయి తిరుగుచుఁ గూయుచుఁ దియ్యగ
నొండొరులఁ బిలుచుచు నున్న పగిది
సంచరించి నెమ్మి శకునమ్ములు విర హో
న్మాదుఁ జేయు చుండె నన్ను భృశము 41.

కం. ఎచటఁ బ్రియ సీత యుండెనొ
యచటం దనరిన వసంత మప్పుడు మదిలో
రుచిరమ్ముగ నా వలెనె త
లఁచుఁ దప్పక మైథిలియుఁ బరవశ యయి తమిన్ 42.

కం. మిన్నగ బాధింపఁగ నరు
లున్న వసంతము ధరణిజ యొంటరిగం దా
నున్నెడ తలంచి చేయున
దెన్నఁగ నేమి కలదు నలినేక్షణ కనుజా! 43.

చం. వదలును శ్యామ ప్రాణములు పద్మ పలాస నిభాక్షి సీతయే
మృదుతర నిత్య భాషిణియు మీఱ వసంతము నిశ్చయమ్ముగన్
సుదృఢము నాదు డెందమునఁ జూడఁ దలం పిది యివ్విధమ్ముగా
బ్రదుకఁగ నింక నోల్ల దెడ బాటున కోపక సాధ్వి లక్ష్మణా! 44.

కం. కల దనురాగము సీతకుఁ
దలఁపన్ నా పయి సతమ్ము తద్దయు నట్లే
కల దవనిజ పై నాకును
దలఁ పది మిక్కుటముగ నెదఁ దరుణీ మణిపై 45.

కం. సుమ గంధ మూను వాయువు
హిమ వంతము సుఖపు స్పర్శ నిడు నట్టిది నేఁ
డు మదిఁ దలఁప సీతను మా
రె మంటగ విచిత్రముగ నరివ్రాతఘ్నా 46.

కం. ఏ మారుతం బరసి మును
నే మైథిలితో మురిసితిని కరం బకటా
యా మారుతమ్ము నేఁడు వి
నా మైథిలి శోకమును ఘనమ్ముగఁ బెంచెన్ 47.

ఆ.వె. సీత లేని తఱినిఁ గూఁతలు కూసిన
కాకి యా ద్విజమ్ము కలఁత తోడ
నేఁడు ముదము నూని నెమ్మి నిలిచి చెట్టు
పై నినాద మీయఁ గాన నగును 48.

కం. ఖగ రాజ మిదియ కాకము
మగువకుఁ బరిచారకుండు మైథిలి కచటం
తగ నిపుడు సీత దరికి న
ను గొని చనును నిక్కముగఁ గనుమ సౌమిత్రీ! 49.

ఆ.వె. పుష్పిత తరుల పయి మోదముగాఁ గూయు
చుండఁ బక్షు లలరి సుస్వనముల
నాలకింపుమ మద మాత్మల వృద్ధి సే
యునవి యక్కజముగ నుర్వి లోన 50.

కం. విసరఁ బడి గాలి చేతను
పెస నీ తుమ్మెద తిలకపు విరి గుత్తులపైఁ 51.

బ్రసరింపఁ బాఱు చున్నది
వెసఁ బ్రియఁ గదియంగ నెంచు ప్రియుని విధముగన్

చం. నిలిచె నశోక మిచ్చట వనిం గడు కాముక శోక వర్ధనం
బిల సుమ గుచ్ఛకమ్ము లవి యిప్పుడు గాలికి నూఁగు చుండి మి
క్కిలి వెత నీయ నాకుఁ బరికింపఁగఁ జూతము లా సుమాలితో
వెలసె నరాలిఁ బోలి తగ విభ్రమ మానస సాంగరాగులన్ 52.

కం. కనుమీ చిత్రపుఁ బంపా
వనరాజుల సంచరించు వర కిన్నరులన్
వనరుహము లెల్లెడఁ దరుణ
దినకర నిభముగ వెలుంగఁ దెలి గంధములన్ 53.

తే.గీ. నిర్మ లోదక బాసిత నిత్య పద్మ
కుముద సంచయ యుత జల కుక్కుట చయ
హంస కారండ వాకీర్ణ మమల గంధ
విలసితమ్ము పంపను నరవృషభ! కనుమ 54.

కం. జలమున సూర్యాభంబుల్
నలినమ్ములు వ్రాల నలి గణము కింజల్క
మ్ముల విలసిల్లఁగ నింపుగ
లలితం బీ పంప వెలుఁగ లక్ష్మణ! కనుమా 55.

ఆ.వె. సంతతము చరింపఁ జక్రవాకమ్ములు
కుంజర మృగ రాశి కొండనెత్తి
ములఁ జరించి యుదకమును గోరి వచ్చుచుం
డు నిరతమ్ము పంపఁ గనుమ యనుజ 56.

తే.గీ. పవన వే గాహత తరంగ భంజి తాబ్జ
వితతములను  బంపాతటి  విమల నీర
భాసితమ్ముల లక్ష్మణ! పద్మ సంచ
యమ్ము వీక్షింపు మిచ్చట నెమ్మి మీఱ 57.

చం. పరమపుఁ బంకజప్రియను బద్మదళాక్షినిఁ జూడ కున్నచో
ధరణిజ వ్యర్థమే బ్రతుకు తప్పక యొల్లను జీవితమ్మునున్
మరుఁ డిటఁ దెచ్చు జ్ఞప్తికి నమానుష కర్ముఁడు మేలు గోరు భా
మ రమణి దుర్ల భాపహృత మానస మందఁ గలంత నిత్తఱిన్ 58.

ఆ.వె. ఈ వసంత మింక నీ పుష్పిత తరులు
నన్ను దివిరి చంప కున్న నాకు
శక్య మగు భరింపఁ జనుదెంచి నట్టి యీ
పుష్పశరు ననంగు మూరి యనుజ! 59.

ఆ.వె. ఆమె గూడి యేవి యగు రమణీయము
లవియె నాకు లేక యామె మారె
నరమణీయములుగ  నక్కజమ్ముగ నొక్క
త్రుటిని నెల్ల ననుజ దుస్సహముగ 60.

ఆ.వె. తమ్మి ఱేకులు పడ నిమ్ముగ దృష్టి ప
థమ్ము నందు నాకు నమ్మడతుక
కంటి ఱెప్ప లింపుగఁ గనిన భంగినిఁ
దోఁచు చున్న దిచటఁ దుల్య మగుడు 61.

కం. తగిలి వనజ కేసరముల
నగముల మీదుగను వీచు ననిలము నోకం
దగ నాకు సీత నిశ్వా
స గత  సురభి రమ్య వాయు సరణినిఁ దోఁచెన్ 62.

కం. కనుమా లక్ష్మణ! పంపకుఁ
గన దక్షిణ దిక్కు నందుఁ గల గిరి తటులన్
ఘన కర్ణికార యష్టుల
మనోజ్ఞములు బుష్పితములు మనుజవరేణ్యా! 63.

కం. గిరి రాజు ధాతు సహిత మ
డరి నిత్యము వాయు జవ మడర రేణువులం
గర మధికమ్ముగఁ జిత్రము 64.

గ రేఁపు చున్నది యరయుము కాకుత్స్థ వరా!

కం. శైలప్రస్థము లవి యను
జా! లేక దళమ్ములు సుమ జాలమ్ములతో
మేలుగఁ గింశుకము లడరఁ
జాల వెలుఁగు చుండెఁ గంటె సౌమిత్రి! యిటన్ 65.

కం. మొలకెత్తి రమ్య పంపా
జల తటిఁ గరవీర తరులు సహ గంధ సుమ
మ్ములు చారు మల్లికా ద్రుమ
ములు మాలతు లింపుగ నిట ముద మిడు చుండెన్ 66.

సీ. పచ్చపూమొగళులు వావిళు లడవి మొల్ల లడరఁ బువ్వులఁ జెలఁగు చుండి
బువ్వుల గురివింద నివ్వటిల్లఁగ వాసనల తోడ మొల్ల పొద లడరంగఁ
గానుగు లిప్పవృక్షమ్ములును దినిశములు పొగడలు సంపెఁగలు వెలుంగ
బొట్టుగు లింపుగఁ జుట్టు వెలయ నాగగన్నేరులు విరులఁ జెన్ను మీఱఁ
తే.గీ. గడిము లురిమిరు లింకను గజ్జరమ్మ
లుండ నిండి సుమమ్ములఁ గొండ దరులఁ
బద్మకములు లోధ్ర తరులు పసిడి రంగు
న నలుపు టశోక తరులు దనరుచు నుండ 67.

సీ. ఊడుగు గోరింట లున్నత పూర్ణకమ్ములు నామ్ర దేవదారులును బాట
లమ్ములు కోవిదారమ్ములు పుష్పితమ్ములు ముచుకుంద తరులు వెలుంగ
నేఱుమద్దెలు నట మూఱు చుండఁగఁ గేత కోద్దాల భూజము లుండ శింశు
పా శిరీష ధవ భూభవములు మోదుగు బూరుగు లింపుగ మూఱు చుండ
తే.గీ. నెఱ్ఱ గోరింట గిఱక తా ళ్లెల్లఁ దనర
నక్తమాల తరులు చందన ద్రుమములు
కాఱ గంధము పుష్ప నికాయ మృదు ల
తా నిచయ వేష్టిత తరులు తద్ద తనర 68.

కం. గాలికి నూఁగఁగఁ గొమ్మలు
సాలము లొండొరుల దరికిఁ జన లత లెల్లన్
స్త్రీల పగిది మత్తడరఁగ 69.

వ్రాలిన వవి యనుసరించి లక్ష్మణ! కనుమా

తే.గీ. పాదపము నుండి పర పాదపమ్మునకును
శైల మందుండి మఱియొక్క శైలమునకు
వనము నుండి యన్య వనికిఁ జనుచుఁ దాఁ ద
నియక యొక రసమున వీచె నెమ్మి గాలి 70.

కం. తియ్యని వాసన లీనెడు
నయ్యలరుల తోడఁ గొన్ని యలరఁగ ద్రుమముల్
నెయ్యపు మొగ్గల వృక్షము
లయ్యెను నల్లగఁ గరమ్ము నట కొన్ని కనన్ 71.

కం. విమలం బియ్యది స్వాదు త
ర మియ్యది యిది వికసించె రమ్య తరముగాఁ
దమి నివ్విధమ్ముగఁ దలఁచి
భ్రమరము వ్రాలెఁ గుసుమములఁ బరమప్రీతిన్ 72.

ఆ.వె. తేనెఁ గ్రోల నెంచి తేనియతిండి ని
లిచి యొకింతసేపు లేచి తిరిగి
క్రన్ననఁ జను మఱియొక దరికిఁ బంపా త
టంపు ద్రుమము లందు నింపు గొలుప 73.

కం. పుడమి పయిఁ దగ స్వయమ్ముగఁ
బడిన విరులు సుఖ మొనర్పఁ బన్నుగ నింపౌ
పడక నమర్చినవి కనుమ
యడరి కుసుమ రాసు లిచట నద్భుత రీతిన్ 74.

ఆ.వె. వివిధ వర్ణములగు విరులు చెదరి గిరి
సాను తలముల వరుస వివిధములు
జాతి ఫలకల నిటఁ బీత రుధిర వర్ణ
ములుగ మార్చెఁ జూడుము ముద మొసఁగ 75.

కం. పంతము గొన్న విధమ్ము హి 76.

మాంతమ్మునఁ బుష్ప రాశి నడరెడు తరువుల్
వింతగ సుమ మాసమ్మున
నం తెఱఁగక పూయుచుండె ననుజా! కనుమా

కం. కుసుమ శ్రేష్ఠమ్ముల నళు
లు సరాగము లడరు చుండ రుచిర శిఖాలిన్
ముసురుచు నగ రాజములు ము
రిసి నొండొరులఁ బిలుచు గతి లీలగఁ దోఁచున్ 77.

ఆ.వె. మునిఁగి తోయ మందు మురిపెముతోడఁ గా
రండవ విహగమ్ము మెండుగ రమి
యించు చుండెఁ గాంత నెలమిఁ గూడి కనుమ
ప్రేమ నా కెడంద రేఁగు పగిది 78.

కం. మనసున కింపగు నీ రూ
పు నదిని మందాకినిఁ దగఁ బొడచూపు జగ
మ్మున గుణముల విఖ్యాతము
కన రమణీయము భృశమ్ముగను సౌమిత్రీ 79.

చం. కలిగిన సాధ్వి దర్శనము కాంతను గూడి వసింత మిచ్చటం
దలఁపను శక్రు నైన నెడఁదన్ స్మరియింప నయోధ్య నైన శా
ద్వలముల రమ్య దేశములఁ బన్నుగ నే విహరింప నామెతోఁ
గలఁత నెఱుంగ నన్యములఁ గల్గ దభీష్టము నాకు లక్ష్మణా! 80.

కం. నానా పుష్ప దళ తరుల
కాననమునఁ గాన కున్నఁ గాంతను సీతన్
మేను దహించెడు దుఃఖము
మ్రాను లొసంగును భృశముగ లక్ష్మణ! నాకున్ 81.

తే.గీ. చక్రవాక సంచయ నిత్య సంచరితము
శీతల జల కారండవ వ్రాత సేవి
తమ్ము పుష్క రోత్పల సంయుతమ్ము విమల
తోయ పంపా సరోవరమే యరయుము 82.

ఉ. కొంగలు నీటిలోఁ దిరుగు కోళ్లు మహా మృగ రాశి తిర్గు చుం
డంగ ముదమ్ము తోడుతఁ గడంగి విహంగ చయమ్ము కూయు చుం
డంగను బంప శోభల నెడంద జనింపఁగఁ జేసె మోహమే
యంగనఁ బూర్ణ చంద్ర ముఖి నంబుజ నేత్ర స్మరింపఁ జేయుచున్ 83.

ఆ.వె. చిత్రసాను తటుల నాత్రముగను మృగ
ములు తిరుగఁగ మృగుల ముందు ముదము
మీఱఁ గని విరహిత మృగశాబ లోచన
సీతఁ దలఁప బాధ సెలఁగె నెడఁద 84.

ఆ.వె. స్వస్తి కలుగు నాకు శైలసానువు లందు
మత్త ఖగ చరితము లిత్తలముల
సీత నంబుజాక్షి నాతతముగ రమ్య
తలము లందుఁ గాంచఁ దప్పకుండ 85.

ఆ.వె. సీత పంప గాలి సేవింప నాతో సు
మధ్యమ రహి సెలఁగ మానినీ మ
ణి సుఖముగ బ్రతుకఁగ నిశ్శంక నగు నాకు
లక్ష్మణ! వెత వీడి రమ్యముగను 86.

ఆ.వె. పద్మ గంధ యుక్త పంపోపవన మారు
తమ్ము పీల్చు వారు ధన్యులు సుమి
శోక నాశక మది శుద్ధ మైనది లక్ష్మ
ణ! నిరతము వసింప నర వరు లట 87.

కం. యువతీ లలామ పద్మ ద
ళ వరాంబక మద్విరహిత లలనా మణి యె
ట్లవనిజ ప్రాణము లూనును
వివశ జనక నందన మది భీతి సెలంగన్ 88.

ఉ. ఏమని చెప్ప నేర్తు మిథిలేశుఁడు ధర్మవిదుండు సత్య వా
క్యామెను గూర్చి నన్నడుగ నాత్మజ యెక్కడ యంచు వేదనన్ 89.

క్షేమము కోరి పౌర తతి చేరువ సత్పథ మూని మందు నీ
రాముని వెంట వచ్చిన ధరాసుత యక్కట  యెక్క డున్నదో

ఆ.వె. నన్ను ననుసరించె నన్నుల మిన్న సీ
తా సతీ మతల్లి ధరణి తనయ
భ్రష్ట రాజ్య మందభాగ్యుని లేకుండఁ
దాను  సే నసువుల నూనఁ గలసె 90.

ఆ.వె. అవ్రణ ముఖ మంచి తాంబుజాక్షులఁ గూడి
మంచి వాసనల విమలముగా పె
లుంగు నట్టిది యరయంగ లేక మనము
కలఁతఁ జెందె నిపుడు కరము నాకు 91.

ఉ. ఎన్నఁడు విందుఁ దియ్యనివి యింపొనగూర్చు సహాస వాక్యముల్
మిన్నగ పల్కు సీత యిట మీఱిన దుఃఖము కాననమ్మునన్
మున్ను వచించు చుండెడిది వోవ విచారము హర్ష మందఁగం
జెన్నుగ మన్మ థార్తుఁ గని చెప్పుమ లక్ష్మణ! నిశ్చయమ్ముగన్ 92.

కం. తన కోడ లెక్క డని యడి
గినఁ గౌసల్య జనని నను గిర లే మందుం
గని యా మనస్విని నయో
ధ్యను బదులుగ రాజపుత్ర! యార్తి సెలంగన్ 93.

కం. చని భాతృ వత్సలుని  భర
తునిఁ గనుమా లక్ష్మణ! వడి దుస్సహ దుఃఖ
మ్మున మనఁ జాలను నే సీ
త నరయ కుండ నొక యింత తడ పైన నిఁకన్ 94.

కం. విలపించు చుండ రాముఁ డి
టు లనాథుని వలె మహాత్ముఁడు పలికె వచన
మ్ముల నవ్యయముల యుక్త
మ్ముల లక్ష్మణుఁ డిట్టు లతి సముచి తార్థమ్ముల్ 95.

ఆ.వె. నిగ్రహింపు మనుజ! నీకు భద్ర మగును
బురుష పుంగవ! వగపు తగ దిట్లు
విమల చిత్తు లొందరు మది విభ్రమము నె
న్నండు ధీర! శాంతి నుండఁ దగును 96.

తే.గీ. తలఁపఁ బ్రియ జన స్నేహము కలిగి నట్టి
దుఃఖమును ద్యజియింపుమ తూర్ణ మింక
నూనె నిండుగఁ బీల్చినచో నరయఁగఁ
దడిసి నట్టి వత్తియు మండుఁ దద్ద సెలఁగి 97.

మ. తగఁ దా దాఁగిన రావణాసురుఁడు పాతాళమ్మునం గ్రిందు నై
న గతిం జేరిన దాని కింక ధృతిఁ బ్రాణక్షీణుఁ డౌ శీఘ్రమే
పగవానిం గని నంత రాక్షసుఁడు దా భద్రమ్ముగా నీనిచో
మగువన్ సీతను సే వధింతు నిఁక రామా! వాని నొక్కుమ్మడిన్ 98.

కం. దితి గర్భమ్మున దాఁగిన
సతి సీతను గూడి తా నొసఁగ కున్న సతిన్
వితత పరాక్రమమున సే
నతని నచటఁ జంపు వాఁడ నత్యుగ్రుఁడనై 99.

తే.గీ. స్వస్తి నందుమ యగ్రజ! జాలి గొలుపు
బుద్ధి వీడుమ భద్రము వొందు మింక
లేక యత్నము వడయంగ లేరు కార్య
సిద్ధి నష్టము లందినఁ జిత్రముగను 100.

కం. ఉత్సాహమే బలము సుమి
యుత్సాహమ్మునకు మించి యుర్వి బలము లే
దుత్సాహ మూను మగ్రజ!
సోత్సాహులు గాంచ రింతయును దుర్లభమున్ 101.

ఆ.వె. పొంద జాల నిరాశఁ బురుషు లుత్సాహము
నఁ బను లందు సుంత నారి సీత
నుదరి గాంతు మింక నుత్సాహ మాత్రము 102.

న ననుమాన మేల నరవరేణ్య!

తే.గీ. వెనుక నుంచుమ శోకము మనుజ వర్య!
విడువు ముద్వేగ మెల్లను వీరవర్య!
తమ్మెఱుఁగరు మహాత్ములు తద్దయు సుకృ
తాత్ము లెల్లరు నిది సత్య మార్య! కనుమ 103.

తే.గీ. ఇట్లు నుడువంగ శోకార్త హృదయుఁడు విని
వీడి మోహ శోకములను వీరుఁ డా ర
ఘు కుల సూనుఁడు రాముండు గొప్ప ధైర్య
మూనె నింపుగఁ జిత్తమ్ము లోన నంత 104.

కం. అతుల పరాక్రమ రాముం
డతీత చింతాత్ముఁడు చనె నరయుచుఁ బంపా
విత తోదకమ్ములను దే
లు తరుల వీక్షించుచును సురుచిరముగ వడిన్ 105.

ఆ.వె. చూచుచు సెలయేర్లు సుందర కందర
ములు సలిపి విచారముల ననుజుని
తోడ భారపు టెద తోడ వగ పడర
రాఘువుండు చనె నరవరుఁ డంత 106.

తే.గీ. మత్త గజ గామి యవ్యగ్ర మానసుండు
లక్ష్మణుండు మహాత్ముఁడు రాముఁడు చను
చుండ నప్రమత్తతఁ గాచు చుండి చనియె
ధర్మ మెంచి బలమ్మునఁ దద్ద యంత 107.

తే.గీ. ఋష్యమూకము చెంత చరించు బల్లి
దుండు శాఖామృగ గణాధిపుండు గాంచి
సుంద రాకారు లా రఘు శూర వరుల
భీతిలి కడు చేష్ట లుడిగి వింత నుండె 108.

ఆ.వె. ఆ మహాత్ముఁడంత నరసి వా రిరువుర 109.

నడచు చుండ నచటఁ గడు భయమ్ము
నంది తిమ్మఁ డంత నత్యంత దుఃఖమ్ము
మంద గజ గమనుఁడు మదినిఁ బడసె

కం. కని రామ లక్ష్మణుల నా
ఘన బలుల భయమ్ము నంది కపు లెల్లరు వా
రి నివాసపు టాశ్రమమున
కు నరిగిరి సుఖ తటి కంత గుప్తమ్మునకున్ 110.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నొకటవ సర్గము.

# కిష్కింధా కాండము

# సర్గము 2.

ఆయుధములతోఁ జనుదెంచు రామలక్ష్మణులను సుగ్రీవుఁడు వీక్షించి వాలి దూత లను శంకతో భీతిల్లి హనుమంతుని వారి వివరములను దెలిసికొన వారి వద్దకుఁ బంపుట.

కం. అల కాంచి మహాత్ముల రా
మ లక్ష్మణుల భ్రాతల నట మనుజ గణశ్రే
ష్ఠుల వీరుల నాయుధ ధా
రుల సుగ్రీవుఁడు వడసె గురుతరము కలఁతన్ 1.

తే.గీ. హృదయ ముద్విగ్న తప్త మయి చలియించు
చుండ వానరు లందు శ్రేష్ఠుండు మెండు
గ భయ మంద డెందము నందుఁ గాళ్లను నొక
చోట నిలుప లేకుండె నచ్చో నతండు 2.

చం. స్థిరముగ స్వీయ చిత్తమును ధీరుల నారయ వీర్య వంతులన్ 3.

హరి వరుఁ డుంచ లేక యట నత్యధికమ్ము విచార తప్తుఁడై
వరుస బ లాబలమ్ములను బన్నుగ నెన్నుచు ధర్మచిత్త వా
నర పతి భీతిలెం గరము న్యస్త సహాయుల సంప్రదించుచున్

ఆ.వె. రామలక్ష్మణుల నరయుచు సుగ్రీవుఁడు
ప్లవగ పతి భయమ్ము వడసి భృశము
కాంచి సచివులను వచించె నివ్విధముగ
బాషణముల నంతఁ బరఁగఁ గలఁత 4.

ఉ. వారలు నార చీరలను వంచన నూని దురాస దాటవిం
జేరిరొ వాలి పంపునను శీఘ్రమ సందియ మయ్యె నాత్మలో
నారయుఁ డంచుఁ బల్కిన మహాత్ముఁడు వానర రాజు ధన్వులౌ
వారినిఁ గాంచి యన్య శిఖఁ బన్నుగఁ జేరి రమాత్య వర్యులే 5.

ఉ. వానర వీర యూథపులు వానర నాథుని నొక్క రొక్కరున్
మానుగ వచ్చి చేరిరి సమంచిత బుద్ధిని నాక్షణమ్మునన్
వానరు లెల్లకొండలను వచ్చిరి దాటుచు నొక్క చోటికిం
గోనలఁ బర్వతమ్ముల సుఘోరము సెల్గఁగఁ గంపనమ్ములే 6.

తే.గీ. అంత శాఖామృగమ్ములు గెంతుచు వడి
నమ్మహాబలవంతులు కొమ్మలను సు
పుష్పితమ్ము లద్రుల చెంత మూరు భూజ
ములను విఱిచిన పెల్లను జెలఁగి కరము 7.

కం. హరి వరు లెల్లరు సెల్లెడ
ల రయమ్ముగ గెంతు చుండఁ ద్రాసము లయ్యెం
బరువు లిడెను బిల్లులు మృగ
వరములు శార్దూల తతులు వడి వడి నంతన్ 8.

కం. గిరి రాజ మందు నిలిచిన
హరీంద్రు మంత్రులు కదిసిరి హరిగణ ముఖ్యుం
గరములు మొగిడ్చి వినయ మ
డరంగ వీక్షించుచు నెదుట నిలిచి యుండన్ 9.

కం. హనుమ భయ విహ్వాలుం డయి
న నాథు సుగ్రీవు నిజ మనమ్మున వాలిన్
ఘనముగ శంకించెడు వా
నిని గని వాక్యజ్ఞు డిట్లనియె వచనములన్ 10.

ఆ.వె. వాలి వలని భయము వదలుము మనమున
నీ మలయ గిరి తటి నెట్టి భయము
వాలి వలన గనము వానరర్షభ! యించు
కేని నిక్క మెంచ మాననీయ! 11.

కం. హరి పుంగవ! భీతిల్లు దె
వరి వలనను నీవు నిట్లు వాని గన నిటం
బరమ క్రూరుం గ్రూరం
పు రూపు నా వాలిని భయము వడయ నేలా 12.

తే.గీ. ఎవని చే భయపడు చుంటి వీవు మదిని
నట్టి యా పాప కర్ముని నరయ నిచట
దుష్టు వాలి నగ్రజు వలదు భయ మింక
నీకు సౌమ్య! గాంచ నిడుమ నీకు నేను 13.

ఆ.వె. కించపఱచి కొంచు నుంచ కుంటివి నీదు
మదిని స్థిరముగాను మ్రాను దిమ్మ
రి తనము గనబడె విరివిగాను నీ యందు
నిట్లు ప్లవగ వర్య! యిచట నకట 14.

తే.గీ. తెలివి జ్ఞానము నిండుగ వెలయు నట్లు
చూపు మింగితమ్ముల వీడి తాప మింక
భూతముల నెల్ల బాలింప బుద్ధి లేక
యున్న రాజునకు నశక్య మెన్న మదిని 15.

కం. విని హనుమంతుని శుభ గిర
లను సుగ్రీవుడు సకలముల నతనితో బ 16.

ల్కెను శుభ తరమ్ము లైన వ
చనముల నివ్విధముగాను శంకాత్మకముల్

చం. కలుగదె భీతి యేరికిని౯ గాంచ విశాల తరాక్ష దీర్ఘ బా
హుల నసి చాప ధారుల సు రోద్వహ సన్నిభ మానవేంద్రులం
దలఁపగ వాలి చోదితులు తప్పక యౌదురు పూరుషోత్తముల్
వలతురు పెక్కు మిత్రులను బార్థులు వారిని నమ్మరా దిలన్ 17.

ఆ.వె. నరుఁడు దెలియ వలయు నమ్మించి నమ్మిన
వార లేమఱంగ నారసి కప
టమున మెలఁగు వారి సమయమ్ము న ప్రహరిం
చు రిపులను సతమ్ము హరివరేణ్య! 18.

తే.గీ. వాలి వీక్షింప మేధావి పనుల యందు
రాజులు బహుదర్శను లరులను వధింతు
రెవ్విధము నైన వారల నెఱుఁగ వలయుఁ
బ్రాకృత పురుషుఁ డైన నిరంతరమ్ము 19.

ఆ.వె. చని ప్లవంగమ! యతి సామాన్యుని విధము
వారి నెఱుఁగుమ తగ భాష లందుఁ
జేష్ట లందు నింకఁ జేరి రూప ప్రకా
రముల నెవ్వ రని నిజముగ హనుమ! 20.

ఉ. నేరుమ వారి భావమును నెమ్మి మనమ్మున వార లున్నచో
వారికి నమ్మకం బిడుచుఁ బన్నుగఁ బల్మఱు సంస్తుతించుచున్
మూర హితమ్ము నా పయి సమున్నత రీతి వనంపు రాకకై
కారణ మెల్లఁ జెప్పుఁ డను కార్ముక ధారుల సర్వ మింపుగన్ 21.

ఆ.వె. పలుకుల నెఱుఁగఁ దగు వార లింపుగ శుద్ధ
చిత్తు లయిన హనుమ చేష్ట లందు
మంచి చెడుల నేరుమ యుభయు లందు వ
చనము లాలకించి సత్యముగను 22.

కం. పనిచిన నిట్లు కపీంద్రుం
డనిలాత్మజుఁ డంతఁ దలఁచె నరుగఁగ డెంద
మ్ముౕన హనుమ రామలక్ష్మణు
ల నరయ వేగముగ సంబరము సెల్ల సెదన్ 23.

కం. అన విని దురాసదు సుభీ
ముని నుడు లట్ల యని స్తోత్రముం జేసి తగం
జనఁ దొడఁగె రామలక్ష్మణు
లు నరర్షభు లున్న దరి కురుత రౌజమునన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు రెండవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 3.

సుగ్రీవుని మాటలు విని హనుమంతుఁడు రామ లక్ష్మణు లున్న చోటున కేఁగి వా రెవరో దెలిసికొని సుగ్రీవునితో మైత్రి చేయుఁడని కోర రాముఁడు మారుతి విజ్ఞానమున కచ్చెరు వంది యంగీకరించుట.

కం. ఆ సుగ్రీవు గిర లెఱఁగి
పాసి హనుమ ఋష్యశృంగ పర్వత మంతన్
భాసుర మహాత్ముఁ డెగిరెను
రా సుతు లా రాఘువులు పరఁగు చోటునకున్ 1.

కం. కపి రూపము నంత విడిచి
కపటపు సన్యాసి రూపకము నూని తగం
గపి వరుఁడు మారుతాత్మజుఁ
డపు డేఁగెను హనుమ యమ్మహాత్ములఁ గాంచన్ 2.

చం. కపి వరుఁ డంత రాఘవులఁ గ్రన్ననఁ జేరి వినమ్రుఁ డౌచుఁ ద
ద్ద పొగడి చేసి సన్నుతులు తాను మనోజ్ఞము లైన వాక్యముల్
విపులముగా వచించెఁ దమిఁ బ్రీతి నొసంగఁ గరమ్ము వారికిన్
నృపకుల వార్ధి చంద్రులకు నెమ్మిని నివ్విధ మంత శ్లక్ష్ణముల్ 3.

ఆ.వె. యుక్త విధము వాన రోత్తముఁడు మరుత్త
నయుఁడు పూజ సేసి నమ్రత రఘు
నందనులను గాంచి నరవృషభుల సత్య
విక్రముల మృదువుగఁ బేర్మిఁ బలికె 4.

ఉ. తోరము దేవ రాజ ఋషి తుల్యులు తాపస వర్యు లిర్వురున్
మీరలు సంశితవ్రతులు మేలిమి వర్ణులు నీ యరణ్య సం
చారుల జంతు జాలముల సంతతి కివ్విధి భీతి కొల్పుచుం
జేరిరి యే కతమ్మున వచింపుఁడు గాంచుచుఁ జెట్ల నిచ్చటన్ 5.

ఉ. యీ నది కిచ్చి శోభలను నెల్లెడఁ జూచుచు ధైర్యవంతులై
మౌనుల భంగి నిల్చి రిట మానుగఁ బచ్చని నార చీరలం
గానఁగ నిశ్వనమ్ములు ముఖమ్మున నీ ప్రజ భీతి నెందఁగా
నేనిక హస్త సన్నిభములే పరికింపఁగ మీ భుజమ్ములే 6.

మ. మృగరాజేక్షణ సన్ని భాక్షులరు బల్మిన్ దిట్టలున్ వీరులుం
దగఁ జాపమ్ములు శక్ర చాప సమముల్ ధైర్యమ్ముగా నూనిరే
జగతిన్ శ్రీయుత రూపవంతులరు నుక్షశ్రేష్ఠ విక్రాంతులే
పగవారిం బరిమార్ప శక్యుల రనూపశ్రీ కరస్కంధులే 7.

తే.గీ. మానవర్షభులరు ద్యుతిమంతు లమర
సన్నిభులు నిజప్రభల నచలమును వెలిఁ
గించు చుంటిరి యేల యీ గిరికి నేఁగు
దెంచితిరి పాల నార్హులు దేశములకు 8.

తే.గీ. పద్మ పత్రేక్షణులు జటాపర్వ ధరులు
సదృశ రూపులు వీరులు చక్క దేవ
లోకమున నుండి వచ్చిరె రుచిరముగను 9.

జంద్ర సూర్యాభ దీర్ఘ వక్షః ప్రవరులు

ఆ.వె. దేవ రూపు లైన ధీర మానవులు గో
వృషభములను బోలు విక్రములరు
సింహ మధ్యములరు శ్రేష్ఠు లుత్సాహవం
తులు సమద పరాక్రములరు ఘనులు 10.

ఆ.వె. బాహు లాయతములు పరిఘ సన్నిభములు
వృత్తము లరయంగ విరివి నూన
భూషణమ్ము లర్హము లవి యేల ధరింప
కుంటిరొ యెద నేర కుంటి నేను 11.

చం. పుడమినిఁ గావ నిద్దఱును బూర్ణము సాగర శైల యుక్తమై
యడవుల వింధ్య మేరువుల నందము లొల్కుచు మూరు చుండ మీ
రడరిన నర్హు లౌదురు మహాబల విక్రమ ధైర్యవంతులై
పడసిరి చిత్ర చాపములు వజ్రి ధనుస్సమ కాంతు లీనఁగన్ 12.

కం. అమ్ములు బుస్సు మనెడి స
ర్పమ్ముల పగిదిఁ గనిపింపఁ బ్రాణావలినిం
బమ్మి యణఁచునవి నిండఁగ
నమ్ముల పొదు లడరు చుండె నందము లొలుకన్ 13.

కం. అతి దీర్ఘములు పుటపుఁ బసి
డితో విభూషితము లీ బెడిదములు కత్తుల్
వితత మడరు చున్నవి మెఱ
సి తమ తమ కుబుసములు విడిచిన ఫణుల వలెన్ 14.

ఉ. ఈ విధ మేను బల్క నిట నించుక యేని వచింప రేల సు
గ్రీవుఁడు వాన రాధిపుఁడు పృథ్విని దిర్గుచు నుండె నన్నచేఁ
దా విడువం బడంగ నెదఁ దద్ద తపించుచుఁ గంటి మిమ్ము నే
నా వర వానరప్రవరు నానతి నే హనుమంతుఁడం గపిన్ 15.

ఉ. నన్నెఱుఁగుండు వానర గణప్రభు మంత్రిని మారుతాత్మజున్ 16.

మిన్నగఁ గామరూపుఁడను మించి వహించితి భిక్షు రూప మే
సెన్ని కపీంద్రు కాంక్షితము నింపుగఁ గామ చరుండ వచ్చితిం
జెన్నుగ మీ సఖిత్వము రుచింపఁగఁ గోరుట కంప నాథుఁడే

ఆ.వె. రామ లక్ష్మణుల నరసి పలికి యిటుల
వాక్య నిపుణు లందుఁ బరమ ఘనుఁడు
ను హనుమంతుఁ డంత నుడువ కెట్టి పలుకు
లుండె మారుతాత్మజుండు నిలిచి 17.

కం. విని యా పల్కులు హృష్టా
ననుండు రాముం డపుడు ఘనశ్రీ యుతుఁడే
యనుజుని లక్ష్మణు తోడ వ
చనమ్ము లివ్విధిఁ బలికెను జారుతరములన్ 18.

తే.గీ. మంత్రి సుగ్రీవున కితఁడు మాన్య వాన
రేంద్రునకు మహాత్మున కట యెవ్వరిఁ గన
సెంచితిమొ వానికిం జనుదెంచె నితఁడు
మన సమీపమున కెలమి ననుజ! కంటె 19.

ఆ.వె. సురుచిరముగ ననుజ! సుగ్రీవు మంత్రితో
నీ కపి వరు తోడ సెలమి వాక్య
విదునితో రిపుఘ్న! యుదరి మధురములు
స్నేహ యుక్త గిరలు సెమ్మిఁ బలుకు 20.

తే.గీ. సిద్ధి లేకున్న ఋగ్వేద శిక్ష లోన
మూర కున్న యజుర్వేద ధారణమున
సామవేద వైదుష్యము చాలకున్నఁ
బలుక నేర రెవ్వరు నిట్టి భాషణములు 21.

ఆ.వె. నేరు నితఁ డవశ్య మా రమణీయ సు
వ్యాకరణ సకలము బహు వచనము
లుచ్చరించిన నిట నొక్క టేనియు నప
శబ్ద మందు లేదు సత్యముగను 22.

చం. వదనము నందు నేత్రముల ఫాల తలమ్మున భ్రూవు లందునున్
వెదకిన నన్య గాత్రముల వీసము నైనను లేదు దోషమే
పదములు కావు తోరములు వ్యాప్తము లింకను గావు వేగముల్
మృదువు లశంకలౌ గిరలు మించి యురమ్మునఁ గంఠగమ్ములౌ 23.

తే.గీ. అద్రు తావిలంబిత గిర లద్భుతములు
వెలసె సంస్కార యుతములై లలితములు మ
నోహరము లుచ్చరించెను నుడుల నెల్ల
స్వచ్ఛముగ శుభప్రదముగ వానరుండు 24.

ఆ.వె. ముచ్చటగ నతండు ముచ్చోటుల జనింప
వచనములు బలుకఁ గృపాణ ధారి
శత్రు వైన నా వచనముల హర్షమ్ము
నంద కుండునె నిజ డెంద మందు 25.

కం. అనఘ! యితనిఁ బోలెడు దూ
తను బొందక యున్న నెట్టి ధరణీశుం డై
నను మున్ను స్వీయ కార్యము
ల నందెనె ఫలమ్ము నిద్ధరా తల మందున్ 26.

ఆ.వె. ఏరి చెంత నుండు నిట్టి గుణ గణ వి
రాజితుఁ డగు దూత లక్ష్మణ! ధర
నా ధరాధినేత నా కార్య సాధక
దూత గిరల సిద్ధి తోర మందు 27.

కం. అన విని సుగ్రీవు సచివుఁ
గని వాక్యజ్ఞు ననిల సుతుఁ గాకుత్స్థుం డి
ట్లనె సౌమిత్రి పరమ వా
క్య నిపుణుఁడు వచనము లంతఁ గమనీయముగన్ 28.

తే.గీ. అమ్మహాత్ముని సుగ్రీవు నంచిత గుణ
గణముల నెఱుఁగుదుము ప్లవగ గణ నాథుఁ 29.

బండితవరు నన్వేషింప వచ్చి నట్టి
వారలము మే మెఱుంగుమ పవన తనయ!

ఆ.వె. ఎవ్విధి వచియించి తీవు సుగ్రీవు వ
చనముల నడరి హరి సత్తమ! యిట
నట్ల చేయు వార మయ్య మే మింపుగ
నీదు భాషణముల మోద మడరె 30.

కం. విని నిపుణ వాక్యములను బ
వనాత్మజుఁడు సంతసమ్ము వడసి మనమునన్
ఘన విజయంబు దలఁచి చె
ల్మిని ఁ జేయఁగ నుత్సహించె మేటి నృపులతో 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు మూడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 4.

లక్ష్మణుఁడు హనుమంతునితోఁ దమ రాకకుఁ గారణమును వివరింప మారుతి కృతకృత్యుఁడ నైతి నని దలఁచి రామలక్ష్మణులను దన మూఁపున వహించి సుగ్రీవుని కడకుఁ గొనిపోవుట.

కం. విని కృతకృత్యుం డా గిర
లను ముదితుండు మధురమ్ములను హనుమ మరు
త్తనయుండు దలఁచె డెంద
మ్మున సుగ్రీవునిఁ గపీంద్రుఁ బుణ్య చరిత్రున్ 1.

ఆ.వె. పొందు నింక రాజ్యమును దగ సుగ్రీవుఁ
డమ్మహాత్ముఁ డతి రయమ్ముగాను 2.

జేరెఁ జేయు నట్టి యా రాముఁ డరుదెంచెఁ
జక్కని పని గూడ జరగు వేళ

చం. పడసి ముదమ్ము నా ప్లవగ వర్యుఁడు రామునితో వచించె ని
ట్లడరుచు వాక్య కోవిదుఁడు హన్మఁడు పంపకుఁ జెంత నున్న యీ
యడవుల కేల వచ్చితిరి యార్య! సహోదరు తోడ నివ్విధిన్
నిడుపఁడు లింక వ్యాళము లనేక మృగమ్ములు దిర్గు నిచ్చటన్ 3.

ఆ.వె. ఆలకించి పలుకు లంత రాముని యాజ్ఞఁ
దెలిపె లక్ష్మణుండు తెల్లముగను
రాముని వివరముల రమ్యముగను దాశ
రథి చరిత మపు డను రక్తి తోడ 4.

చం. దురిత విదూరుఁ డా దశరథుండు నరేంద్రుఁడు ధర్మ వత్సలుం
డురుతర కాంతి మంతుఁడు నిజోన్నత ధర్మము నూని నిత్య మా
దరమున నాల్గు వర్ణముల ధర్మములం దగ నిల్పె ధాత్రిలోఁ
బరు లన లేరు ద్వేషమును బార్థుఁ డొకింత వహింపఁ డేరిపై 5.

తే.గీ. మూరి పుడమి నగ్నిష్టోమ ముఖ మఖములు
విరివి దక్షిణల నొనర్చెఁ బృథ్వి భూత
రాశికిఁ బితామహుని భంగి రాగ మడరఁ
గఁ దనరిన యట్టి భూరి భూ కాంతుఁ డతఁడు 6.

ఉ. ఆరయ రాముఁ డా దశర థాత్మజుఁ డీతఁడు పూర్వ జన్ముఁడుం
గోర శరణ్యుఁ డెల్లరకుఁ గూర్మి వహించును దండ్రి యాజ్ఞలన్
వీరుఁడు రాజ లక్షణ వివేక యుతుండు సుతోత్తముండు దా
మూరిన రాజ్యసంపద విముక్తుఁడునై యరుదెంచెఁ గానకున్ 7.

ఆ.వె. భార్య సీతఁ గూడి వనమున కేతెంచె
రాముఁడు వశి గొప్ప ప్రభల వెల్గు
వాఁడు దిన లయంపుఁ బ్రభ తోడ వెడలెడు
భాస్కరుని విధమ్ము పఱఁగి హనుమ! 8.

ఆ.వె.	ఆ కృతజ్ఞుని సుమహా తేజు సర్వజ్ఞు
గుణ గణముల నయితిఁ గూర్మి దాసు
నిగను లక్ష్మణుఁడను  నెమ్మి యనుసరించి
తిని యనుజుఁడ నతనికి నర పతికి	9.

ఉ.	అర్థుని సౌఖ్య రాసులకు నందటి మేలును గోరువాని భూ
ర్యర్థుని శ్రీ విహీనుని మహాటవిలో వసియించు వాని పూ
జార్హను భార్య నొంటరిగ నారసి రాక్షస కామ రూప నిం
దార్హుఁడు దొంగిలించె నొకఁ డాతని నేరము మారుతాత్మజా!	10.

మ.	దను నాముండు కుమారుఁడౌ దితికి పే తప్తుండు శాపార్థమై
దను జాకారము వొందెఁ దా నచట సద్ధర్ముండు సుగ్రీవుఁడే
ఘనుఁ డా వానర యూధ నాథుఁ డిల నొక్కండే సమర్థుండు చె
ప్పు నతండే యని మాకుఁ దెల్పెను మహా పుణ్యాత్ముఁడే మారుతీ!	11.

తే.గీ.	అమ్మహా వీరుఁ డెఱుగు భార్యాప హారి
నంచు మాకు నంతఁ దెలిపి మించి వెలుఁగు
లందు నేఁగె స్వర్గమునకు నడుగ నీవు
తెల్పితిని నిజ మెల్ల నో ధీర వర్య!	12.

తే.గీ.	నేను  రాముఁడు సుగ్రీవు వాన రేంద్రు
శరణు చొచ్చితి మిప్పుడు చక్కఁగ నొసఁ
గి ధనము జగత్పతి యయి  సుకీర్తి  వడసి
పతిగ సుగ్రీవు రఘుపతి వడయ నెంచె	13.

తే.గీ.	ఎవ్వని జనకుండు శరణ్యుఁ డిద్ధ ధర్మ
వత్సలుం డా దశరథుని  పట్టి రాఘ
వుండు దాను స్వయము శరణ్యుండు కోరె
నిపుడు సుగ్రీవు శరణము నివ్విధమ్ము	14.

ఆ.వె.	లోకముల ననిశము వీఁక రక్షించు వాఁ
డీ శరణ్యుఁ డన్న యితఁడు నాకు
ధరణి మించి నట్టి ధర్మ నిరతుఁడు సు	15.

గ్రీవు శరణు గోరె నీ విభుండు

తే.గీ. ఎవ్వని ప్రసాదము వలన నీ ప్రజలు స
తమ్ము సంతసించుచు నుందు రమ్మనుజ వ
రుండు రాఘవేంద్రుఁడు గోరు చుండె నేఁడు
వానరేంద్రు ప్రసాదము వార కుండ 16.

చం. సకల జగమ్ము లందు గుణ సంయుత రాజ వరేణ్యు లెల్ల రే
రి కరుణ మాన్యు లైరి యిల లీలగ నయ్యజ సూను పుత్రుఁ డీ
సకల గుణాభి రాముఁడు యశస్వి జగమ్ముల వానరేంద్రుఁ గో
రి కదిసెఁ గోరఁగా శరణు రేఁగ విచారము మిక్కుటమ్ముగన్ 17.

తే.గీ. వగపు నిండిన శోకార్తుఁడు గదియంగ
శరణముం గోరి వానర చక్రవర్తి
నిట్లు సుగ్రీవుఁడు బ్రసాద మింపుగ నొన
రింప నర్హుఁ డగును జుమ్మి పెంపు మీఱ 18.

కం. అన లక్ష్మణుండు కన్నీ
రు నిండ వచనమ్ము లిట్లు లోలాత్ముండై
విని హనుమంతుఁడు వాక్యము
లను వాక్య విశారదుఁడు నలరి కడు పలికెన్ 19.

ఉ. వచ్చిరి యిట్టి ధీ వరులు భాగ్య వశమ్మున వానరేంద్రునిన్
మెచ్చుచుఁ గాంచ నర్హులు నమేయ జితేంద్రులు నన్నవాలిచే
నచ్చపు వైరమే తనర నయ్యెను రాజ్య వివాసితుండు దా
నిచ్చట దొంగిలింపఁ బడ నింపగు భార్య వసించు నిగ్గిరిన్ 20.

తే.గీ. చేయు సాయ మన్వేషింప సీతను రవి
నందనుండు సుగ్రీవుఁడు నర వరేణ్యు
లార! మీకు మమ్ములఁ గూడి మూరి వాన
రేంద్రుఁ డింపడరఁగ రాఘవేంద్రు లార! 21.

కం. పలికి మృదువుగా వచన 22.

మ్ము లిట్లు హనుమంతుఁ డంతఁ బొడఁగని రాముం
బలికెఁ దిరిగి తరలెదమా
కలియఁగ సుగ్రీవు నంచుఁ గమనీయముగన్

చం. విని హనుమంతు పల్కులను బెన్పుగ ధర్మరతుండు లక్ష్మణుం
డనె హనుమంతునిం బొగడి యర్చలొసంగి కరమ్ము భ్రాతతో
వినుమ ముదమ్ముతోఁ బలుకు వీనినిఁ గాంచుమ చెప్పి నట్టులం
బనులను జేయు వాఁ డిటకు వచ్చెను మించి ఫలించు కార్యమే 23.

ఆ.వె. సుప్రసన్న ముఖము చూడ వ్యక్త మగు చు
న్నది వచించు చుండ ముదముతో ని
తండు మారుతాత్మజుండు వీరుఁ డనృత
మ్మును బలుకఁ డనుచు నెపుడు దృఢముగ 24.

తే.గీ. అంత ప్రాజ్ఞుఁడు కపి మారుతాత్మజుండు
హనుమ సుగ్రీవు కడకు వారినిఁ గొని చనె
వీడి భిక్షు రూపమ్మును వీఁపు పైన
నుంచి కపి రూప మూని తా నంచితముగ 25.

కం. విపుల యశస్వి పవన సుత
కపి వీరుఁడు సంతసమున ఘన కార్య ఫల
మ్ము పడసి రాఘవులను గూ
డి పర్వత వరము కదిసె వడి శుభ మనమునన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నాల్గవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 5.

రామ లక్ష్మణులు సుగ్రీవునిఁ గలుసుకొని యగ్నిసాక్షిగా మిత్రు లగుట, సుగ్రీవుఁడు తన యన్న వాలి తనకు శత్రు వయ్యె నని తన భార్య నపహరించె నని యభయము వేఁడ రాముఁడు వాలిని వధింతు నని మాట యిచ్చుట, వీరు మిత్రు లయిన సమయమునఁ బద్మము వంటి సీత యెడమ కన్ను, పసిడి రంగు వాలి యెడమ కన్ను, వహ్నిఁ బోలు రావణుని యెడమ కన్ను నదురుట.

కం. వదలి గిరి ఋష్యమూకము
కదిసి మలయ పర్వతమ్ము కపి రాజునకున్
విదితం బొనరించె హనుమ
పదిలపు రాఘవుల రాక పన్నుగ నంతన్ 1.

ఉ. వచ్చె నితండు రాముఁ డనఁ బ్రాజ్ఞుఁడు దా దృఢ విక్రముండునౌ
వచ్చెను భ్రాత లక్ష్మణుఁడు పన్నుగఁ దోడుత రాఘు వాన్వయుల్
సచ్చరితుండు దాశరథి సత్యము నిల్పుచుఁ దండ్రి యాజ్ఞనున్
మెచ్చి వహించు మూర్ధమున మేటి మగండు ధరాతలమ్మునన్ 2.

తే.గీ. జాతుఁ డిక్ష్వాకు కుల మందు సతము ధర్మ
మందు సుప్రసిద్ధుఁడు వన మందు వాస
ముండ నతని భార్యను రావణుండు రక్క
సుం డపహరింపఁగ శరణు చొచ్చె నీదు 3.

చం. ఎలమిని నశ్వమేధము లనేకము లింకను రాజసూయముల్
పలుమఱు సేసి దక్షిణల వహ్నినిఁ దృప్తిలఁ జేసి సత్య వా
క్కుల నిలఁ జేసి పాలనము గొప్పగ వెల్గిన వాని పుత్రుఁడే
లలన నిమిత్తమే శరణు రాముఁడు గోరుచు నిన్ను జేరెనే 4.

ఆ.వె. నీదు సఖ్య మెంచి నిన్ను జేరిరి యన్న
దమ్ము లిర్వు రిపుడు నెమ్మి రామ
లక్ష్మణులు నిరంతరము పూజనీయులు
నర్చన లొసఁగుమ మహాత్ముల కిట 5.

ఉ. ఆ వచనమ్ము లెల్ల విని యా హనుమంతుఁడు పల్క నంత సు
గ్రీవుఁడు వీడి భీతి నెద రేఁగిన దెల్లను రాఘువార్థమై 6.

వావిరి వొంది సంతసము పాయ జ్వరం బది యెల్ల దర్శనీ
యావన తాకృతిం బడసి యందపు మానవ రూప మిట్లనెన్

ఉ. ఆరసి రాఘవోత్తముని నార్యులు ధర్మ వినీతు లంచునున్
మూరి వచించె వాయుజుఁడు భూత దయా రతు లంచు సత్యమున్
మీరలు నాదు స్నేహమును మెచ్చి వరించుట నాదు భాగ్యమే
మూరును లాభ ముత్తమము పొందఁగ నా కది గౌరవం బగున్ 7.

తే.గీ. చాచి నట్టి నా చేతులఁ జక్కఁగను గ్ర
హించుఁడు రుచియించిన మీకు నంచితముగ
నాదు చెలిమి మీ చేతుల నరవరేణ్య!
గౌరవమ్ముగ బంధింపఁ గలరు ధృతిని 8.

మ. విని సుగ్రీవుని భాషణమ్ములను సంప్రీతిన్ వచింపంగ న
ట్లు నరేంద్రుండు రఘూద్వహుండు నతి లోలుండై ముదం బేర్పడం
దన పాణిప్రవరమ్ములం గపి కరద్వంద్వంబుఁ బీడించి ప్రీ
తిని గాఢమ్ముగఁ గౌఁగిలించికొనెయెన్ ధీరుండు సుగ్రీవునిన్ 9.

ఉ. వీత సుభిక్షు రూపుఁ డరి వీర విమర్దనుఁ డంతఁ గాష్ఠముల్
ప్రీతి గ్రహించి వాయుజుఁడు లీలగ నగ్ని జనింపఁ జేసి పే
గాతిశయమ్మునన్ విరుల నర్చన లింపుగఁ జేసి వెల్గఁగా
నాతత మౌచుఁ దా నునిచె నగ్నిని నింపుగ వారి మధ్యనున్ 10.

తే.గీ. అంత దీప్యమానపు టగ్ని కడరి వా రు
భయులు రామ సుగ్రీవులు భవ్యముగను
జేసిరి ప్రదక్షిణము భక్తి శ్రేష్ఠ తరపు
స్నేహమును బడసి రపుడు చెలువముగను 11.

చం. హరివర రాము లంత ముది తాత్ములు చూచి పరస్పరమ్మునుం
గర మనురక్తిఁ దృష్టి నెదఁ గాంతులు సెందక యుండి రిద్దఱున్
హరి వరుఁ డిట్లు పల్కెఁ దమి నార్య! సుమిత్రుఁడ వైతి నీవు నా
కరయ సుఖమ్ము దుఃఖము మహాత్మ! సమం బిక నీకు నాకునున్ 12.

తే.గీ. అంత నాకులఁ బువ్వుల నలరు శాఖఁ
ద్రుంచి పఱచి యా రాముని తోడ దాని
పైన నాసీనుఁ డయ్యెను వానరేంద్రుఁ
డపుడు సుగ్రీవుఁడు ముద మేపార నెడఁద 13.

తే.గీ. ముదమునఁ బ్లవగర్షభుఁ డంత మూరి చంద
న తరు శాఖా వరము సుపుష్పితము మారు
తాత్మజుఁ డొసంగె సౌమిత్రి కరి దమనున
కత్యధిక రక్తి రమ్యాస నార్థ మపుడు 14.

చం. ముదితుఁడు మంచి గ్రీవుఁ డట మూరి వచించె ముదమ్ము బాధయున్
విదితము కాఁగఁ గన్నులను వీరుని రాముని తోడ నివ్విధి
న్మదిని భయమ్ము మీఱఁ గడు నా సతి చూఱఁగొనం బడంగఁ గొం
డ దరి సుతప్త చిత్తుఁడను డస్సి వసింతును భర్జితుండనై 15.

చం. వనమున భీతి తోడ నిట వాసము సేయుదు భ్రాంత చిత్తతన్
ఘనముగ బాధ పెట్టెఁ గపి కాంతుఁడు వాలి మదగ్రజుండు పై
రి నయితి భీత చిత్తున కరిందమ! నా కభయం బొసంగుమా
నను దగఁ గావ నర్హుఁడవు నా కభయం బగు రీతిఁ జేయుమా 16.

కం. అన విని ధర్మజ్ఞుఁడు ధ
ర్మ నిరతుఁడు ప్రభా తనుండు రాముఁడు పలికెం
దన ముఖమునఁ జిరు నవ్వొల
య నరర్షభుఁ డివ్విధముగ నా కపివరుతో 17.

చం. కపి వర! నేను జేయ నుపకారము దాని ఫలం బెఱుంగుదుం
గపటుని వాలి నీదు ప్రియ కాంత గ్రహించిన వానిఁ జంపుదున్
సు పతితుఁ డౌను భూమి పయి సూర్య నిభమ్ములు కంకపత్ర రా
శి పఱప వజ్రి వజ్ర నిభ చిత్ర శితమ్ము లమోఘ బాణముల్ 18.

తే.గీ. తీక్ష్ణములు విష సర్ప తతి నిభ ఋజు గ
మన సుపర్వములు శరములను వడి విడు
వంగ నిహతుఁడై కూలును బర్వతములు 19.

కీర్ణ మయి భువిఁ గూలు పగిదిని గనుమ

కం. విని స్వీయ హితమ్ములగు వ
చనమ్ములను రాముఁ డనఁగ సంతస మేపా
ర ననియె సుగ్రీవుండు హ
రి నాథుఁడు ఘనతర గిర లరి వినాశకముల్ 20.

తే.గీ. నీ యనుగ్రహము నృసింహా! నిండ నేను
రాజ్య మింకఁ బ్రియ సతిని రామ! పొందఁ
గలను నరదేవ! వైరి నగ్రజుని సెట్లు
రూపు మాపు దవ్విధి నొనరుపుమ సేఁడు 21.

తే.గీ. మైత్రి రామ సుగ్రీవులు మాట లాడు
నపుడు జానకీ వాలి దశాననుల న
లిన సువర్ణ జ్వలన సదృశ నిజ నయన
ములు సమమ్ముగ నదరెను మూరి వింత 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేనవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 6.

సుగ్రీవుఁడు రామునితోఁ దాను సీతను రావణుఁడు గొనిపోవుచుండఁ జూచితి నని జానకి యుత్తరీయము నాభరణములతో విసిరిన భద్రపఱచితి నని చూపింప రాముఁడు గుర్తించి దుఃఖముతో రావణునిఁ జంపుదు నని వాని వివరముల నింకను జెప్పు మని సుగ్రీవు నడుగుట.

కం. తిరిగి పలికె సుగ్రీవుం
డు రాఘవుని రాముఁ గని కడు ముదితు నిట్లున్ 1.

హరి సత్తముఁడు సచివుఁడు ప్ర
వరుఁడు సచివు లందు రామ! పలికెను నాతో

చం. వనమున కేల వచ్చితిరొ భ్రాతను లక్ష్మణుఁ గూడి యుండఁగా
వనమున రాక్ష సాపహృత భార్య ధరాసుత యయ్యె నంచు ని
న్నును మఱి వీడి లక్ష్మణుని నొవ్వుచు నొంటరి నుండ గృధ్ర రా
జు నిహతుఁ డయ్యె రక్కసుని శూరత నంచు జటాయు వత్తఱిన్ 2.

ఉ. చెచ్చెర వీడు దీవు వ్యథ సీతను బాసిన దుఃఖ మెల్లనుం
దెచ్చెద నష్ట వేదముల తీరున నున్న రసాతలమ్మునన్
సెచ్చెలి ద్యో తలమ్మునను నీరజ లోచన నీదు దార నే
నిచ్చెదఁ దెచ్చి నీకు నృపరేంద్ర! రఘూత్తమ! నిశ్చయమ్ముగన్ 3.

మత్తకోకిల. నిక్కమౌ వచనమ్ము లెల్లను నే వచింపఁగ నందఁగా
నుక్కునన్ స సురేంద్రుఁ డైనను నుర్వి సీత నశక్యుఁడౌ
మెక్క నీ సతి యేరికిం బుడమిన్ విషంబ మహాభుజా!
తక్కు మీ వగ పెల్ల నీ ప్రియ దారఁ దెచ్చెద నిచ్చెదన్ 4.

ఉ. గొంకు వహింప కా యసుర క్రూరుఁడు దాఁ గొని పోవుచుండఁగా
నంకమునం జలింపఁగ ఘనార్తిని నేడ్చుచు రామ! లక్ష్మణా!
పంకజ నేత్ర యట్టు లని పన్నగ నారి నిభమ్ము నూహతోఁ
బొంకముగా నెఱింగితిని భూసుతయే యని లేక శంకయే 5.

కం. ఏనవ వానిని నన్నిటఁ
దా నరసి గిరి తట మందుఁ దరుణీమణి మే
లైన వసనమును నగలను
మానిని విడిచె శుభములను మనుజవరేణ్యా! 6.

తే.గీ. భద్రపఱచితి నింపుగ వాని నెల్ల
సంగ్రహించి నిచ్చట నేను సత్యవంత!
తేఁ బనిచెద నిటకు వాని దివ్యములను
గుర్తుపట్ట నర్హుఁడవు రఘుకుల చంద్ర! 7.

ఆ.వె. అంత రాముఁ డనియె నా ప్రియ వచను సు
గ్రీవు నరసి ప్రీతి గిరల నిట్లు
తేరఁ బనుపు మింక వీర! శీఘ్రమ యీ వి
లంబనమ్ము వానర వర! యేల 8.

ఆ.వె. పలుక రాముఁ డిట్లు వానరేంద్రుఁడు గహ
నంపు గుహను జేరి యింపుగ వడి
నొసఁగఁ బ్రీతి నంత వెస నుత్తరీయము
సాభరణముఁ దెచ్చి యలరఁ జూపి 9.

కం. కనుమా రాఘవ యీ నగ
ల నుత్తరీయమ్ము నంచు లలితమ్ముగ నా
ఘన కపి సుగ్రీవుఁడు వ
ల్కెను రామునితో నని పరికింప నొసంగెన్ 10.

కం. వాసము నాభరణమ్ముల
నాసఁ గొని కని శుభముల మహాత్ముండు ఘన
త్రాసుం డయ్యెను హిమమే
మూసిన శశిఁ బోలె నాస్యమునఁ గన్నీటన్ 11.

ఆ.వె. సీత పైనఁ బ్రేమ సెలగంగఁ గన్నీరు
కాఱఁగ విలపించి మీఱ వగపు
హా ప్రియతమ! యంచుఁ ద్యజియించి ధైర్యము
కూలెఁ బుడమి పై రఘు సుతుఁ డంత 12.

ఆ.వె. రాముఁ డెడఁద నూని రమ్యాభరణములు
పలుమరులు తనియక పలవరించు
చుండి నిశ్వసించె మెండుగ బిల మందు
నున్న రోషిత ఫణి యన్న పగిది 13.

కం. ధారాళముగఁ గనులఁ గ
న్నీరు స్రవింపఁ దన ప్రక్క నిల్చిన వానిన్
ధీరుని లక్ష్మణు నారసి 14.

యా రాముఁడు వగవఁ దొడఁగె నతి దీనముగన్

ఉ. కాంచుమ లక్ష్మణా! విసరఁ గ్రన్నన జానకి బల్మి నేఁగఁగా
నంచిత వస్త్ర భూషణము లందము లొల్కుచు నున్న వింకనున్
సంచిత మిద్ధి పచ్చికను జక్కఁగ నీ నగ వెల్గు చుండెనే
మించిన పూర్వ రీతిని నమేయముగా నిది సీత భూష యౌ 15.

తే.గీ. అన విని పలికె లక్ష్మణుఁ డంత నే నె
ఱుంగఁ గేయూరములు నే నెఱుంగఁ గుండ
లము లెఱుఁగుదు నూపురముల నమిత భక్తిఁ
బాదముల కనిశ మిడంగ వందనములు 16.

తే.గీ. అంత రాముఁడు సుగ్రీవు నారసి యనె
నిట్లు పల్కుమ సుగ్రీవ! యెచ్చటికి న
సురుఁడు క్రూరుఁడు గొనిపోవఁ జూచి తీవు
నాదు ప్రాణ సమప్రియ నారి నపుడు 17.

ఆ.వె. ఎచ్చ టుండు నతఁడు వచ్చె వ్యసన మెవ్వ
ని వలన నతఁ డిట్లు నేను దన్ని
మిత్త మసుర గణము మించి నాశన మొన
రింతుఁ గాంతు వారి యంతునెల్ల 18.

కం. హరియించి మైథిలి నొసఁగి
కరమ్ము రోషమ్ము నాకుఁ గాంతారమునన్
స్థిరముగ మృత్యుద్వార మ
సురుఁడు తెఱచెఁ దనదు మృతికి సుగ్రీవ! వడిన్ 19.

కం. తెలుపుమ సుగ్రీవ! యతని
ఖలు రజనీచరు నెవండు కాంతను గొనియెన్
లలితను నాదు ప్రియతరను
బలుకుమ యమ సదనమునకు బంపెద నతనిన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నాఱవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 7.

రాముని వచనములను విని సుగ్రీవుఁడు రాముని నూఱడించి రావణుని వధించి సీతను దెచ్చి యిత్తు నన రాముఁడు సుగ్రీవుని కార్యము చేయుదు నని ప్రతిన చేయుట.

కం. పలుకంగ రాముఁ డార్తుఁడు
కలఁతను సుగ్రీవుడు విని కపివరు డంతం
బలికెం బ్రాంజలి వచన
మ్ము లిట్లు గద్గదిక నశ్రు పూర్ణ ముఖుండై 1.

ఆ.వె. రామ! ఘోర పాప రాక్షసు దౌష్కుల్యు
వంశ మెద్ది యతని వాసమెద్ది
విక్రమమ్ము నేని పృథ్వీప నందన!
నేను నేర నెల్ల మాననీయ! 2.

చం. ప్రతిన నొనర్చి నీ కిచటఁ బల్కుచు నుంటి నరిందమా! ధృతిన్
వెత నెద రామ! శీఘ్రముగ వీడుమ చేసెద యత్నమెల్ల నా
తతముగ నెట్లు మైథిలినిఁ దప్పక కందుము నవ్విధమ్ముగా
హతు నొనరింతు రావణు సహానుచ రావళిఁ బౌరుషమ్మునన్ 3.

ఉ. ఎవ్విధ మీవు డెందమున నింపుగ హర్షము నంద నేర్తువో
యవ్విధ మేను జేసెద మహాత్మ! భృశమ్ముగ రామ! వీడుమీ
యివ్వగ వెల్ల నింక నెద నిత్తఱి ధైర్యము నూను మార్య! నీ
కివ్విధి బుద్ధి లాఘవ మ దెట్లు తగుం బరికింపు మింపుగా 4.

ఉ. నాకును బ్రాప్త మయ్యె వెత నాదు సతీ విరహమ్ముచే నెదం 5.

దాఁకగ నేను గ్రుంగితినె ధైర్యము నెమ్మది వీడి యుంటినే
ప్రాకృత వానరుండ నయి బాధను దల్పక యుంటిఁ జూడుమా
నీ కతి ధైర్యశాలికి వినీతున కేల విచార మివ్విధిన్

ఉ. వచ్చెడు నీదు భాష్పములఁ బన్నుగ ధైర్యము నూని నిల్పుమా
యచ్చపు మానమున్ ధృతిని నార్తి ననర్థుఁడ వార్య వీడఁగా
హెచ్చగు నర్థ నాశమున నెచ్చిన నొవ్వుల భీతి నింకనున్
వచ్చినఁ బ్రాణ హాని ధృతిఁ బాయక ధీరులు నిల్తు రెన్నఁడున్ 6.

ఆ.వె. బేల యైన వాఁడు చాల నిరాశచే
సంతతమ్ము మునుఁగు వంత లోన
భారవంత మైన పడవ నీట మునుంగు
రీతి నవశ నిజ చరితుఁడు కాఁగ 7.

ఆ.వె. అంజలించి పేడ నార్య! స్నేహమ్మునఁ
దగఁ బ్రసన్నుఁడ వయి ధైర్య మూను
శోకమునకుఁ జోటు సుంతయు నీ నన
ర్హుఁడవు నీవు నర వరోత్తమ! మది 8.

ఆ.వె. సుఖము వడయ లేరు శోకమ్ము నందున్న
యట్టి వారు సుంత నెట్టి రీతి
నింక వారి తేజ మెల్లను క్షీణించు
శోక మూన రామ! నీకుఁ దగదు 9.

తే.గీ. ఎవ్వఁ డుండు శోకమ్మున నింక వాని
జీవితమ్ము సంశయ మగుఁ జింత సేయ
శోక మెల్లను వీడుమ శూరవర్య!
యడరి ధైర్యముఁ గేవల మాశ్రయింపు 10.

కం. మన మిత్రత్వమున హిత
మ్ము నే నుడివితిఁ గఱపు తలఁపుగఁ దలఁపకుమీ
వనరఁ దగదు నీ కివ్విధి
మనమునఁ దగ గౌరవింప మన స్నేహమునున్ 11.

ఆ.వె. సుమధురముగ నట్లు సుగ్రీవుఁ డూఱడిం
ప రఘురాముఁ డపుడు బట్ట కొంగు
నఁ దుడిచికొనియె వదనమ్మును గన్నీటఁ
దడిసి నట్టి దానిఁ బడసి శాంతి 12.

కం. విని సుగ్రీవుని వాక్యము
ల నూఱడిల్లి మనమందు రాఘవుఁడు కపీం
ద్రునిఁ గౌఁగిలించికొని ప
ల్కెను దగు భాషణము లతి లలితముల నిట్లున్ 13.

తే.గీ. మిత్రునకుఁ జేయఁ దగినది మేటి హితము
యుక్త మైనది సుగ్రీవ! యుదరి యనుగు
ణ మొనరించితి స్నేహమునఁ దగిన తఱి
దుర్లభమ యిట్టి మిత్రుఁడు దొఱకుట యిల 14.

చం. సహజపు బుద్ధి నందితిని చక్కగ నిప్పుడు వానరోత్తమా!
యహితుని నా దురాత్ముని మహాసురు రావణు రౌద్రుఁ గాంచఁగా
గృహ పరిమార్గణమ్ము తగు కృత్యము నీ కిట సీత నందఁగా
నహరహ మింకఁ జేయఁ దగు యత్నము నెల్లను మిక్కుటమ్ముగన్ 15.

ఆ.వె. ఏనుఁ జేయ వలయు నెద్ది శంకింపక
చెప్పఁ దగుదు దాని శీఘ్రముగను
వర్షకాల మందు వసుధ నెల్ల మొలకె
త్తు పగిది ఫలియించుఁ దోరముగను 16.

కం. హరిశార్దూలా! నే నీ
గిర లభిమానమ్మునఁ బలికితి సత్యములం
బరికించి గ్రహింపుమ యీ
వర వాక్యమ్ముల నెడందఁ బన్నుగ నింకన్ 17.

కం. మున్ను నృత మాడ లే దిఁక
నెన్నండు వచించు వాఁడ నేఁ గా నవనిం 18.

జెన్నుగఁ జేయుదు నీ పైఁ
గ్రన్నన నీ సత్యము పయిఁ గపివర ప్రతినన్

కం. విని రాముని మాటలను బ్ర
తినను విశేషమ్ముగను మది ముదము వడసెన్
ఘనముగ సచివుల నా కపు
లను గూడి కపీంద్రుఁ డంత రఘుపతిఁ గనుచున్ 19.

కం. నర వానరు లిర్వురు నొ
క్కరి కొక్కరు సదృశులు దమ కష్ట సుఖము లొం
డొరు లేకాంతము పల్కిరి
సురుచిరముగ వారు కలిసి శుభములు వడయన్ 20.

కం. విని యమ్మహానుభావుని
ఘను నృప ముఖ్యు వచనములు కార్యము ఫలియిం
చె నని తలంచెను డెంద
మ్మున హరి వీరప్రవరుఁడు ముద మేపారన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 8.

సుగ్రీవుఁడు రాముని మాటలకు సంతసించి తన విరోధి వాలిని వధింపు మని కోరి యన్న వాలితో
వైరమునకుఁ గారణమును రాముఁ డడుగ వివరింపఁ దొడఁగుట.

కం. ముదము వడసి సుగ్రీవుఁడు
హృది రాముని మాటలు విని యెలమినిఁ బలికెం 1.

బదపడి యుండఁగ లక్ష్మణుఁ
డెదుటను  రాఘవుని తోడ నిట్లు వచనముల్

ఆ.వె. ఎల్ల వేళ లందు నినవంశ చంద్ర! నీ
స్నేహ మంద నేను నిఖిల సురల
దయకు నర్హుఁడ నయి తనరితి నిశ్శంక
సద్గుణ విలసితుఁడ! చక్కగాను 2.

మ. సుర రాజ్యమ్మును బొంద నర్హుఁడను గాఁ జోద్యంబె నీ సాయ మి
ద్ధర నా కుండఁగ స్వీయ రాజ్యమును బొందంగన్ వెసన్ రాఘవా!
వర బంధువ్రజ మిత్ర వర్గమున సంభావ్యుండ నే నైతి ని
ద్ధ రఘుక్షేత్రజ స్నేహ మగ్ని యెదుటన్ దక్కంగ నా కింపుగన్ 3.

తే.గీ. నీకుఁ దగి నట్టి మిత్రుఁడ నేను నగుదు
రాఘవ యెఱుంగఁ గలవు మెల్లగను డెంద
మందు స్వయము నా గుణముల నడరి నేన
చెప్ప నర్హుండ గాను నృసింహ వర్య! 4.

చం. తలఁపఁగ నాత్మవంత నర ధైర్యము భంగిని నిశ్చలం బగున్
లలితపుఁ బ్రీతి సంతతము రాజిలు చుండు మహాత్ము లందు నీ
వలె విలసిల్లు వారి మది వస్త్రము లాభర ణాగ్ని బీజ  రూ
ప్య లలిత లోహ రాసు లవిభక్తములే యగు సాధు కోటికిన్ 5.

తే.గీ. ఉన్న వాఁడును ధనము లేకున్న వాఁడు
మెండు సంతోషి మఱి దుఃఖితుండు నైన
దోష హీనుండు నారయ దోషి యైన
మిత్రుఁ డౌను శరణ్యుండు మిన్నగాను 6.

తే.గీ. అట్టి స్నేహమ్ము నందిన బెట్టిదముగ
నిజ వయస్యార్థ మెన్నండు నిజ  సుఖమ్ము
ధనము దేహమ్ము నైనను దప్పకుండ
విడువ శంకింప నేరరు విబుధ జనులు 7.

ఆ.వె. లక్షణముల నింద్రు ప్రతి యైన లక్ష్మణుం
డుండ నెదుట రాఘవుండు రాముఁ
డట్లి యనెను విని మహాకపి సుగ్రీవు
భాషణముల నపుడు తోష మడర 8.

ఆ.వె. అంత నిలిచి యుండ నరసి రాముని లక్ష్మ
ణుని మహాబలునిఁ గనులను జూచి
చూచి దిక్కులు కనె సుగ్రీవుఁడు తరువుఁ
దుమ్మెదల విరులను దూర మందు 9.

తే.గీ. సాలమం దాకులు విరులు చాల యున్న
శాఖఁ నొకటిఁ ద్రుంచి పఱచి చక్కఁగ రఘు
రాము తోడ సుగ్రీవుఁడు రామ సఖుఁడు
దాని పైనఁ గూర్చుండె నంత ముద మార 10.

ఆ.వె. అరసి వారి హనుమ యాసీనులను సాల
వృక్ష శాఖ నొకటి విఱిచి వినయ
వర్యు లక్ష్మణుని నృవర్యునిఁ గూర్చుండఁ
జేసె సమ్మదమునఁ జెలువముగను 11.

తే.గీ. కని ప్రసన్న సముద్రము కరణి నున్న
రాముని ఫల పుష్ప సహిత రమ్య గిరిని
నుండ సుగ్రీవుఁడు మురిసి యుదరి పలికె
నిట్లు మెల్లగ వాక్కుల నెలమి నిండ 12.

చం. వనమున భీతి తోడ నిట వాసము సేయుదుఁ దప్తచిత్తుఁడన్
వనరుచు ఋష్యమూకమున భార్య విహీనత దుఃఖ మంది పై
రి నయితి వాలికిం దఱిమెఁ బ్రేమ వహింపక యన్న నన్ను భీ
తుని నను గావ నర్హుఁడవు తోరముగా దయ జూపు నాపయిన్ 13.

కం. అన విని ధర్మజ్ఞుఁడు ధ
ర్మ నిరతుఁడు ప్రభా తనుండు రాముఁడు పలికెం
దన ముఖమునఁ జిరు నవ్వోల 14.

య నరర్షభుఁ డివ్విధముగ నా కపివరుతో

కం. ఉపకారము మిత్ర వరుని
యపకారం బిద్ధరిత్రి నరి లక్షణముల్
కపివర! నీ భార్యా మణి
యపహర్తను జంపు వాఁడ నటఁ దథ్యముగన్ 15.

చం. ఇవి కడు వేగవంతములు నిద్ధ పతత్ర విభూషితమ్ములున్
భువి ఘన తిగ్మ తేజములు పుట్టిన వింపుగ కార్తికేయ భూ
రి వనము నందు బాణము లరిందమ! హేమ విభూషితమ్ము లె
ల్ల విరియఁ గంక పత్రము లరాతికి వాసవ వజ్ర తుల్యముల్ 16.

ఆ.వె. రమ్య పర్వ నిచయ రాజితమ్ములు తీక్ష్ణ
శిఖల గూడి కరము జెలఁగు రోష
సర్ప సంచయమ్ము సరణి కపివరేణ్య!
నా శరములు భండనమ్ము నందు 17.

తే.గీ. వాలిఁ గృత దోషు శత్రువు భ్రాతృ రూప
మందు నున్న వానినిఁ గూల్తు నరయు మిపుడు
శర విఘాతుఁడై భువిఁ గూల హరివరేణ్య!
చెదరి నట్టి శైలము వలె శీఘ్రముగను 18.

తే.గీ. ఆలకించి రాముని మాట లంత నతుల
హర్ష మందె సుగ్రీవుఁడు హరి చమూప
తి పలికెను బాగు బాగని కపివరుండు
శోక తప్తుఁడ నా కీవ చుమ్ము గతివి 19.

ఆ.వె. మిత్రుఁడ వని నిట్టు లాత్రముగఁ బలుకు
చుంటి నగ్ని యెదుట నంట నీ క
రము వయస్యునిగను రామ ప్రాణమ్ముల
కన్న నొట్టు నాకు మిన్న నీవు 20.

ఊ. లోపల నున్న దుఃఖమున లోలతఁ బల్కుదు నాకు నిత్యమున్ 21.

వేఁపు నొసంగ నిట్లు రఘువీర! వయస్యుఁడ వైన కోపునన్
పే పలుకంగ భాష్పములు వేగమ రాలఁగ నొండు పల్కులం
దాపము మీఱఁ బల్కగను దద్ద యశక్తత నుండి యంతటన్

తే.గీ. భాష్పముల ధార నెల్లను బరఁగ నది న
దీ మతల్లి వేగ నిభమ్ము ధృతి వహించి
దాని సుగ్రీవుఁ డూనె స్వాంతమున రామ
సన్నిధిని నుండి యత్నించి మిన్నగాను 22.

కం. కన్నీటి నాపి చక్కఁగఁ
గన్నులఁ దుడిచి కొని స్వీయ కరముల రాముం
బన్నుగఁ దేజస్వి నరసి
సన్నగ ననె నిశ్వసించి శాఖాచరుఁడే 23.

ఉ. వాలి మ దగ్రజుండు మును పార్థివ! కైకొనె నాదు రాజ్యముం
ద్రోలెను నన్ను నింద లిడి రోషము నూని భృశమ్ము బల్మి నా
యాలిని సంగ్రహించెఁ బ్రియ మైనది ప్రాణము కన్న నాకు నా
మేలు సతమ్ము కోరు వర మిత్రుల నుంచెను గార నెల్లరన్ 24.

కం. ఆతతముగ యత్నించెను
వీతప్రాణు నొనరింపఁ బెక్కు మఱులు న
న్నాతఁడు వానరు లాతని
చేతఁ బనుపఁ బడి మడిసిరి శీఘ్రమ నాచేన్ 25.

ఆ.వె. నిన్ను గూడ నపుడు నే నట్టి శంకతోఁ
గంటి రాఘవేంద్ర! కదియ కుంటి
నేను భీతి తోడ నిన్ను భయము నందు
సర్ప మొసఁగు వెఱ నఖర్వముగను 26.

కం. హనుమన్ముఖాభిచరు లుం
డ నాకుఁ దోడుగ మెయినిఁ బడసి ప్రాణములన్
మనుచుంటి నాపదల నే
మునిఁగిన రఘువీర వినుమ భువి నేఁ డకటా 27.

ఉ. ఈ హరి వీరు లెల్లపుడు నింపుగఁ గాతురు నన్ను మీఱఁగా
స్నేహ మెడంద నే నిలువ నిల్తురు తోడుగ వత్తు రేఁగినన్
సాహస మూని క్లృప్తముగఁ జక్క వచించితి విస్తరింపకే
యీ హరి వాలి యన్నయె యహీన బ లారిగ మాఱె నాకిటన్ 28.

చం. అతని వినాశనమ్మునసె యార్య నశించును నాదు దుఃఖమే
యతుల సుఖమ్ము జీవితము నాతని నాశము పైన నిల్చు నా
తతముగ నాకు భీతిలుచుఁ దద్ద వచించితి సెల్ల నీకు దుః
ఖితునకు నింక సౌఖ్యనకుఁ గేళి సఖుం డగు దిక్కు రాఘవా! 29.

కం. విని సుగ్రీవుని మాటలు
కని యాతని రాముఁ డడిగెఁ గారణ మే మం
చును వైర మేర్పడుటకు ని
ల నిజమును వచింపుము సకలం బని యింకన్ 30.

ఆ.వె. వాన రేంద్ర నీకు వాలికి వైరపుఁ
గారణము సెఱిఁగి సుఖ మొనగూర్తు
నే బలా బలములు నిక్కముగ గణించి
విశ్వసించి వీడు భీతి సెల్ల 31.

కం. నీ వవమానింపఁ బడఁగ
నే వినఁగఁ జలించె నాదు నిమ్మళ మెదలోఁ
బ్రావృట్కాలపు నీటి మ
హా వేగము భంగి భృశము హరిశార్దూలా! 32.

ఆ.వె. ఎక్కిడి ధను వింకఁ జక్కఁగ విడువ బా
ణము నశించు నీ ఘన రిపు సత్త
ముండు భయము వీడి పొల్పుగ వచియింపు
మెల్ల శాంతి నూని తల్లడిలక 33.

తే.గీ. పలుక రాఘవుఁ డిబ్బంగి వాక్యములను
హర్షమంది సుగ్రీవుఁడు హరి వరులు న 34.

లువురు సంతసింపంగఁ దాను వచియింపఁ
దొడఁగె వైర కారణ మెల్లఁ దూర్ణ మంత

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నెనిమిదవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 9.

సుగ్రీవుఁడు తన యన్న వాలి వృత్తాంతమును రామునకు వివరించుట, మాయావి యను రక్కసునితో యుద్ధమున కేఁగి యెంతకు రాకున్న సుగ్రీవుని మంత్రులు వానరులు రాజుగఁ జేయ వాలి మాయావిని వధించి తిరిగి వచ్చుట.

కం. వాలి వరాఖ్యుం డన్నయుఁ
గాల నిభుఁడు సకల శత్రుకాయమునకుఁ దా
మేలుగ గౌరవము జనకు
చే లలి నాచేతను సురుచిరముగ నందున్ 1.

తే.గీ. మా జనకుఁ డరుగ దివికి మంత్రు లెల్ల
వానరులు నంత జ్యేష్ఠుని వాలిఁ గపి వ
రేణ్యు సమ్మతముగఁ జేసిరి హరి రాజ్య
మునకు రాజుగఁ దగఁ బట్టము నెఱిఁ గట్టి 2.

తే.గీ. పడయఁగఁ బిత్రు పైతామహ పాలి తాఖి
ల కపి రాజ్యము నిత్య మగ్రజున కేను
వినయుఁడ నయి సేవకుని భంగిని భృశమ్ము 3.

సేవ లొనరించు చుంటిని చెలువముగను

కం. మును మాయావి యను నతఁడు
ఘన తేజుఁడు పెద్ద కొడుకు కన దుందుభి నా
మునకు నొక స్త్రీ నిమిత్తము
నను వాలి విరోధి యయ్యె నరశార్దూలా! 4.

మ. గిరి కేతెంచె నతండు రాత్రి తఱిఁ గిష్కింధాపురద్వార మా
ఖర రక్షోవరుఁ డార్చుచుం గరము శంకా హీనమే పిల్చె సం
గర కాంక్షన్ విని వాలి నిద్ర నడరం గాంతుండు యా శబ్దమున్
హరి రాజేంద్రుఁడు నుర్కెఁ దాళ కెద రోషావేశుఁడై యుగ్రుఁడై 5.

కం. వారించిన నే నమ్రత
నారీ రత్నములు వాలి నగచర నాథున్
మూరి యసురేంద్రుఁ గోపము
తో రణమునఁ జంప నుఱికె దుర్వారుండై 6.

ఆ.వె. త్రోసి వారి నెల్లఁ దూర్ణము బల్లిదుఁ
డేఁగె హరి వరుండు వేగముగను
నేను బ్రేమ తోడ వాని ననుగ మించి
తిని విడువక యంత ధృతి వహించి 7.

ఉ. నన్నును నగ్రజుం బ్లవగ నాథుని దూరము నందుఁ గాంచినన్
వెన్నును చలింప రక్కసుఁడు భీతి భృశమ్ముగఁ గల్గఁ బాఱఁగా
వెన్నెల కొంచె ముండ వినువీథినిఁ జంద్రుఁడు వచ్చుచుండఁగాఁ
గ్రన్నన వెంటఁ బాఱితిమి భ్రాతయు నేను రయమ్ము మీఱఁగా 8.

ఆ.వె. నేల గడ్డి తోడ నెగడ నొక్క బొఱియ
లోనఁ దూఱె వేగ తాను జేరి
మేము నంతఁ జేరి మేటి రంధ్రమ్మును
ద్వరితము నిలిచితిమి తడయకుండ 9.

ఆ.వె. కని యసురుని వేగ కలుఁగు లోనికి నేఁగ 10.

రోష వశుఁడు నయి యురుతరముగను
నన్ను గాంచి పలికె నన్న సంక్షుభితేంద్రి
యుండు వానరోత్తముండు కినిసి

తే.గీ. నిలువు మీవు సుగ్రీవ! యీ బిలపు ద్వార
మందు నప్రమత్తత నేను ముందు లోని
కరిగి చంపి శత్రువు నటఁ దిరిగి వచ్చు
నంత దనుక కదలకుండ నింత యేని 11.

ఆ.వె. ఆలకించి గిరల నంత నేనఁగ వత్తు
నంచు శత్రుదమన! మించి యొట్టు
వాని పదము లందు వల దని వేయించు
కొని రయమునఁ దాను జనియె నంత 12.

చం. కలుఁగునఁ దూఱ నన్న కధికమ్ముగ వత్సర మొక్క టేఁగఁగా
బిలపు సమీప మందుఁ దమి వేచుచు నుండ గతించె నాకునుం
గలఁగితిఁ బ్రేమ నాత్ర మధికమ్ముగఁ గల్గఁగ డెంద మందుఁ దా
ను లయము నందె నేమొ యని నొచ్చితి శంక వహించి రాఘవా! 13.

చం. కడవఁగఁ జాల కాల మటఁ గాఱఁగ రక్తము ఫేన యుక్తమై
వడివడి నా బిలంపుఁ బెను ద్వారము నుండి కనంబడంగ నే
నెడఁదఁ గలంత నెందితి నహీనము వింటిని రాక్షసధ్వనుల్
కడు భయ మొంద నన్నయును గయ్యి మొనర్చుచుఁ బల్కఁ డింతయున్ 14.

తే.గీ. ఎఱిఁగితి మనమ్ము నందు లయించె నన్న
యంచు గాంచి చిహ్నమ్ముల నచట నట్లు
మూసి కన్నముఁ బర్వతము వలె నున్న
ఱాతి తోడ దుఃఖించితి నాతతముగ 15.

కం. ఉదకం బొసంగి యన్నకు
నెద దుఃఖం బంద భృశము నేఁగితి నంతం
గదలి సఖా! కిష్కింధకు
నది దాఁపఁ దివిరి యెఱిఁగిరి యఖి లామాత్యుల్ 16.

తే.గీ. అంత నన్నభిషేకింప నయ్యమాత్య
వరులు పాలించు చుండఁగ వాన రాధి
రాజ్య మేతెంచె వాలి నా భ్రాత చంపి
రక్కసుని శత్రువుని బల్మి రామ! యపుడు 17.

ఆ.వె. నన్నట నభిషిక్తు నన్న కాంచి కినిసి
రక్త లోచనుండు క్రౌర్య మూని
నాదు మంత్రి వరుల నాదరింపక బంధి
తులుగఁ జేసె వాలి తూర్ణముగను 18.

తే.గీ. వాని నిగ్రహింపఁగ నాకు వఱల శక్తి
యన్న యన్నట్టి మన్నన మిన్న గాఁగఁ
బాప కర్ముని నెదిరింప నోప నైతి
బుద్ధి పుట్టక సుంతయుఁ బోరు నందు 19.

ఆ.వె. చంపి యంత వాలి శత్రువుఁ బురమున
కు నరుదెంచినఁ గని తనర భక్తి
గౌరవింప నేను గరుణింపఁ డీయఁ డా
శీస్సు లక్కట తనిసి యెద నాకు 20.

కం. నతు లీయ నా కిరీట
మ్ము తాఁక యన్న పద యుగము మూరిన రుషతో
నతఁ డింతయుఁ గరుణింపఁగ
మతి నూనఁడు వాలి నన్ను మాన్య వరేణ్యా! 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ దొమ్మిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 10.

సుగ్రీవుఁడు రామునితో వాలినిఁ దన యన్న ను గరుణింప మని తా నెంత వేఁడినఁ గోపము మానక రాజ్యము నుండి తనను బహిష్కరింప ననేక దేశములఁ దిరిగి ఋష్యమూకమున నలుగురు మంత్రులతో వసించు చుంటి నని పల్కుట.

కం. అరుదెంచిన యన్నను నేఁ
గరుణింప మని హిత మెంచి కడు రోషాత్ముం
బరిపరి విధముల వేఁడితి
హరిగణ నాథుని నరేంద్ర! యనురాగమునన్ 1.

ఉ. వచ్చితి వీవు భాగ్యమునఁ బన్నుగ క్షేమము తోడ నగ్రజా!
యిచ్చ ననాథు నన్నిచట నింపుగ నర్హుఁడ వీవు కావఁగా
నచ్చపు సంతసం బిడుదు వార్తులు నైన యనాథ కోటికిన్
మెచ్చి వహింతు ఛత్రమును మిన్నగ నే వ్యజనమ్ము నీ కిఁకన్ ! 2.

చం. నిలిచితి నే బిలంపు దరి నిండఁగ వత్సర కాల మగ్రజా!
కలఁత నెలంగ రక్త మది కాఱఁగఁ జూచితి శోక చిత్తతం
గలుఁగున నుండి నాదు మది గాఁగ భృశమ్ముగఁ బెద్ద ఱాతితో
బిలమును మూసి చేరితిని వీడి తదంకము పట్టణమ్మునున్ 3.

ఉ. చేర విషాద వక్త్రమునఁ జింతఁ దపింప నెడందఁ నంత న
న్నారసి మంత్రులుం బురజ నావళి నన్నభిషిక్తుఁ జేసి రా
ర్యా! రతిఁ గోరకున్నను మహాత్మ క్షమింపుమ నన్ను దానికై
వీర వరేణ్య! పాలనము పేర్మినిఁ జేయుమ రాజు వీవయే 4.

ఉ. మన్నన కీవ యర్హుఁడవు మారుగ నీ కిట రాజ్య మూనితిం
జెన్నుగ నీవు లేని యెడఁ జెల్మినిఁ గాంచుమ నన్ను బ్రీతినిన్
మున్నిట చూచి నట్టి విధి మూరి యమాత్యులతోఁ బురమ్మునున్
మిన్నగ హీనకంటకము మేలుగ నిల్పితిఁ గాచి నిత్యమున్ 5.

ఉ. ఇల్లడ యీయఁగాఁ దిరిగి యిచ్చుచు నుంటిని రాజ్య మెల్ల నీ
కుల్లము నందు వీడి రుష నొప్పఁగఁ గైకొని శత్రుసూదనా!
చల్లగఁ గావు మయ్య నను జక్కఁగఁ జేతులు నే మొగుడ్తు వీ
రెల్లరు శూన్య రాజ్యమున నేపున నిల్పిరి నన్ను రాజుగా 6.

ఆ.వె. పలుకఁ బ్రీతి మీఱఁ బలుకుల నిట్లు నే
ను రఘునందన! విని హరి వరుండు
వాలి చీ యని కటు వాక్యములు పలికెఁ
దా ననేకములను దనరి యిట్లు 7.

చం. జనులను బిల్చి యచ్చటికి సమ్మద మంత్రుల నెల్లఁ దాను బ
ల్కెను జెలు లాలకింపఁగఁ జలింప మనమ్ము భృశమ్ము నివ్విధిన్
ఘనుఁడు మయాత్మజుం డడరి కయ్యముఁ గోరుచు రాత్రిఁ బిల్వఁగా
నను విదితంబ మీ కది మనమ్ముల నింపుగ నేఁగ నే వడిన్ 8.

తే.గీ. అనుగమించె నీ భ్రాత నన్నడరి దారు
ణుండు తూర్ణము మమ్మసురుండు గాంచి
భీతిఁ బర్విడి తూఱెను బిలము నందుఁ
జేర మే మతనిని వేగ మూరి యంత 9.

చం. అసురుఁడు దూఱ నా కలుఁగు నందు సుఘోర బిలమ్ము నందు నా
రసి కడు క్రూర దర్శనుని భ్రాతను బల్కితి నిట్లు చంపకే
యసురుని రా నశక్తుఁడనె యా దనుకన్ నిలు మింపుగా నిటన్
పస వధియించి వచ్చెదను బల్మిని నీ యసు రోగ్రు నచ్చటన్ 10.

ఆ.వె. ఎంచి యీతఁ డుండు నంచు దుర్గమ బిల
మునఁ బ్రవేశ మింపుగ నొనరించి
తి వడి నే నసురునిఁ దిలకింపఁ నొక్క సం
వత్సరమ్ము పట్టి నుత్సహింప 11.

కం. కనఁబడె భయావహ రిపువు
కనుల కనిర్వేదముగను ఖలుఁడు హతుం డ
య్యెను బంధు జనుల తోడుత 12.

ఘనుండు నాచేత నంతఁ గయ్యము లోనన్

కం. వాని ముఖము నుండి భృశము
తా నఱవ రుధిరము కాఱెఁ దద్బిల మందున్
పే నిండఁ కష్ట మయ్యె న
హో నిలువంగ నట నాకు నొక క్షణ మయినన్ 13.

ఆ.వె. దుందుభి సుతుఁ జంపి దుష్ట శత్రువును వి
క్రముని నంత వెడలఁ గలుఁగు ముఖము
మూసి యుండఁ గాంచి పేసరి సుగ్రీవ
యని పలుమఱుఁ బిలువ వినను బదులు 14.

ఆ.వె. అంతఁ దన్ని బిలము నందున్న ఱాతినిఁ
బల్మఱుఁ బదములను బలిమి నిష్క్ర
మించి కలుఁగు నుండి మించిన కోపమ్ము
న నరు దెంచితి వడి నగరమునకు 15.

తే.గీ. భ్రాత చేత నే వారింపఁ బడితి రాజ్య
కాంక్షతో నున్న సుగ్రీవు ఖలుని చేత
మఱచె నితఁడు భాతృస్నేహ మధురిమమును
దనదు మదిలోనఁ గ్రూరత తద్ద సెలఁగ 16.

చం. పలికుచుఁ బల్కు లివ్విధము వాలి యభీతి బహిష్కరించె న
న్నల వడిఁ గట్టు పుట్టమున నన్న దయా రస హీన చిత్తతం
దొలఁగఁ బడంగ నాదు సతి దుష్టు మదగ్రజు చేత భీతి భూ
వలయము నెల్లఁ గాంచితి నపారము కానన వార్ధి పూర్ణమున్ 17.

తే.గీ. కలఁత భార్యాపహరణ దుఃఖమ్ము మీఱ
ఋష్యమూక గిరి వరము నెందు వాలి
సేరఁగ నశక్యుఁ డగు నన్య కారణమునఁ
జేరి నివసించు చుంటిని వీర వర్య! 18.

చం. జరిగిన దెల్లఁ జెప్పితిని శత్రుత యేర్పడ కారణమ్మునుం 19.

బరఁగెను బాధ లివ్విధము పాప విహీనున కార్య! గాంచుమా
హరి పతి భీతి చేత కడు నార్తుఁడ లోక భయంక రోగ్రుచే
నరవర! నిగ్రహించి కపినాథుని నన్నిటఁ గావుమా దయన్

కం. పలికినఁ గపి సుగ్రీవుఁ డి
టుల నవ్వుచుఁ బల్క రాముడు దొడంగె నిటుల్
లలితమ్ముగఁ దేజస్వియు
నిల ధర్మజ్ఞుఁడు వచనము లెలమి నయోక్తుల్ 20.

ఆ.వె. ఇవి యమోఘములు దినేంద్ర సన్నిభములు
నిశిత శర వరమ్ము లశని తుల్య
ములు వధించు వాలిఁ గలుషాత్ము దుర్వృత్తు
వేగముగ నిఁకఁ గపి వీర! కనుమ 21.

కం. ఎంత దనుక నేఁ గాంచనొ
నంత దనుక దుష్ట చరితు నతనిం ఖలు నీ
కాంతాపహారిఁ బాపినిఁ
గాంతువు ప్రాణముల తోడఁ గపిశార్దూలా! 22.

తే.గీ. నిన్ను నాత్మానుభవమున మిన్న యైన
శోక సాగర మందుండఁ జూచు చుంటిఁ
బొందఁ గలవు కోరిక లెల్లఁ బుష్కలముగ
నిన్ను దరియింపఁ జేయుదుఁ గ్రన్ననఁ గను 23.

కం. విని యా మాటలు హర్ష
మ్మును బౌరుషముఁ గడుఁ బెంచు ముఖములఁ దాఁ ब
ల్కెను సుగ్రీవుఁడు వాక్యము
లను బరమప్రీత మదిని రాముని తోడన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బదవ సర్గము.

# కిష్కింధా కాండము

# సర్గము 11.

సుగ్రీవుఁడు వాలి యొక్క బలమును రాముని కెఱిఁగించుట, వాలి దుందుభినిఁ జంపిన విధమును వివరించి మతంగ మహర్షి వాలికి నొసఁగిన శాపమును దెలిపి యట్టి వాని నెట్లు జయింపఁగల వని సంశయింప, రాముఁడు సుగ్రీవుని విశ్వాసమునకై దుందుభి కళేబరమును దన పాదాంగుష్ఠమునఁ బది యోజనములు త్రోసినను శంక తీరక రాముని నొక్క బాణమున మద్ది చెట్టును జీల్ప మని యడుగుట.

కం. విని యంత హర్ష పౌరుష
ఘన వర్ధన వచనములను గాకుత్స్థుఁ డనన్
ఘనముగ స్తుతించె నా రా
మునిఁ బూజించెఁ గపి వరుఁడు పురుషోత్తమునిన్ 1.

చం. జ్వలిత సు తీక్ష్ణ మర్మచయ భంజన బాణ పరంపరన్ జగ
మ్ముల దహియింపఁ జాలుదువు పూనినఁ గోపము లోక రాశినిం
బ్రళయము నందు కాల్చు రవి భంగిని నీవు రఘూత్తమా! త్రుటిం
గలుగ దొకింత శంక మదిఁ గల్లలు గావు మదీయ వాక్యముల్ 2.

చం. అయినను వాలి పౌరుషము నయ్యది యెట్టిదొ వీర్య మెట్టిదో
ప్రియ సఖ! ధైర్య మెట్టిదియొ వీరవరోత్తమ! రామ! యాలకిం
చి యిపుడు నే వచింపఁగ నశేషము పిమ్మటఁ జేయు కార్య మె
ద్ది యుచిత మౌనొ దానిని మతిం దగఁ దల్పుమ రాఘవాన్వయా! 3.

చం. దినమణి తోఁప కుండగనె ధీరుఁడు వాలి యతిక్రమించు చుం
డును వడి పశ్చి మాంబుధిఁ బటుత్వము మీఱఁగఁ దూర్పు వార్ధినిన్
వనధి యవాచి నుండి యుఁక వార్ధి నుదీచిని నశ్రమమ్ముగనన్ 4.

ఘన గిరు లెక్కి వీర్యమున గట్టు శిఖాలి గ్రహించు రువ్వుచున్

కం. నిజ వీర్యమ్మును జూపం
గఁ జెట్లనేకములు ద్రుంచుఁ గపి వాలి సత
మ్ముఁ జరించి వని దశరథా
త్మజ! బల్మిని సారవంత తరులన్ ధృతినిన్ 5.

ఉ. దుందుభి నాముఁడై సెలగు దున్న యొకండు హరాద్రి తుల్యుఁడే
పొందెను వేయి యేనుఁగుల భూరి బలమ్మును వీర్య వంతుఁడే
యంద వరమ్ము లింపుగను నత్యధికమ్ముగ గర్వియై చనెన్
సుందర వార్ధి చెంత కటఁ జూడ ఘనాంగుఁడు నా నదీపతిన్ 6.

తే.గీ. చేరి యూర్మిమంతము నంత వారిరాశి
రత్న సంచయమును ఘోర రణము నొసఁగు
మంచు నర్ణవమును గోరె మించి నట్టి
గర్వమున దుందుభి తమి నఖర్వ బలుఁడు 7.

ఆ.వె. అంత నసురుఁ గాంచి యర్ణవం బా కాల
చోదితు ఘన బలుని మేదినీశ!
పలికె లేచి యిట్లు పల్కులు ధర్మాత్ముఁ
డడరఁగ వినయము తడఁబడకుండ 8.

ఆ.వె. యుద్ధ మొసఁగ నీకు యుద్ధ విశారద!
నే సమర్థుఁడ నని నీ సరి యని
తలఁపఁ జాల వినుము తెలిపెద నీ కని
నొసఁగు నట్టి వాని యుక్తముగను 9.

ఉ. తాపస కోటి కాశ్రయుఁడు త్ర్యంబకు మామయు శైల రాజు సం
ప్రాపిత కంద రాలి హిమవంతుఁడు ప్రస్రవణావృతుండు దు
ష్ప్రాపుఁడు శత్రు కోటికి ధరాతల మందు ననీక నైపుణుం
డై పరఁగున్ సమర్థుఁ డగు నాజిని నీకు నొసంగఁ బ్రీతినిన్ 10.

చం. కడలిని నేరి భీతుఁ డని క్రన్నన నా యసురోత్తముండు ప 11.

ర్విడె వడి వింటి నుండి వడి నేఁగెడు ఘోరపు టమ్ము భంగిఁ దా
నడరుచుఁ జేరి శీత గిరి యందు వనమ్మును గుంజ రాభముల్
కడు తెలి జాతి బండలను క్షౌణి తలమ్మునఁ గూల్చి యార్చినన్

తే.గీ. శ్వేత మేఘాకృతి నలరు శీత శైల
మంత సౌమ్యుఁడు నా హిమ వంతుఁ డనియెఁ
బ్రీతి దర్శనుండు నిలిచి యాతత నిజ
శిఖర మందు వచనములు శ్రేష్ఠముగను 12.

తే.గీ. ధర్మ వత్సల! దుందుభి! తాప మీయ
నాకు తగదు నీ కిట్లు రణమ్ము నందుఁ
గాను గుశలుండఁ దపసుల కేను శరణ
మిడుదు సంతత మిచ్చట నెలమి నుండ 13.

కం. విని శైలేంద్రుని ధీమం
తుని పలుకులు దుందుభి రుష తోడుతఁ బలికెం
గను లెఱ్ఱఁబడఁగఁ గ్రోధ
మ్మున భృశము నరవర! వాక్యముల నిబ్బంగిన్ 14.

ఆ.వె. యుద్ధము నొనరింప నిద్ధర నీ వస
మర్థుఁడ వయి తేని మద్భయమ్ము
బొడము నుద్యమింపఁ బూన వేని వచింపు
మింక సమర మొసఁగు నెవరు నాకు 15.

కం. మును విన నట్టివి యట్టి వ
చనమ్ములను నాలకించి శైలేంద్రము ప
ల్కెను గ్రోధం బడర నెడఁద
ఘనముగ నసురోత్తముఁ గని కాకుత్స్థ! యిటుల్ 16.

ఉ. వాలి ఘనుండు ప్రాజ్ఞుఁడును వాసవ తుల్య పరాక్రముండు ధీ
శాలి కపీంద్రుఁ డుగ్ర బల సంయుత విక్రము డాతఁ డిచ్చు న
క్కాలము నందు నా నముచి కయ్యముఁ బొందిన రీతి నింద్రుచే
నాలము నీకు రాక్షస వరా! చను మందఁగ ద్వంద్వ యుద్ధమున్ 17.

తే.గీ. శీఘ్ర మేఁగు కిష్కింధకుఁ జెన్ను పురికిఁ
గోరిన సమరం బాతఁడు వీర పుంగ
వుండు దుర్ధర్షుఁ డనిశము నుండు సమర
కార్యముల వానరేంద్రుఁడు శౌర్య ధనుఁడు 18.

కం. విని హిమవంతుని పల్కులు
ఘనుఁడా దుందుభి వెడలెను గ్రన్ననఁ గపి వీ
రుని కిష్కింధా పురవర
మున కతి కోపమ్మున నెదఁ బోరుఁ దలఁచుచున్ 19.

మ. వడిఁ దానూని భయంపు మాహిషపు రూపం బంత శృంగమ్ములే
కడు తీక్ష్ణమ్ములు గాఁగ వారి యుత మేఘవ్రాత సాదృశ్యమౌ
బెడిదం బైన శరీరమే తనరఁ దా వేగంబ కిష్కింధకుం
గెడ కేతెంచిన నార్చె దుందుభి సదిగ్దేశమ్ము కంపింపఁగా 20.

తే.గీ. దుందుభిస్వన నిభ మార్చి దుందుభి నిజ
ఖురములం ద్రవ్వుచుఁ బుడమిఁ గ్రూర శృంగ
ములఁ గరి వలెఁ బొడిచి ద్వారము నతి దర్ప
మున సమీప తరులఁ ద్రుంచి తనరి నిలువ 21.

ఆ.వె. ఆలకించి ధ్వనిని నంతః పురము నందు
నున్న వాలి యంత నన్నుల గమిఁ
గూడి తారలఁ దగఁ గూడిన శశి భంగి
లేచి వచ్చెఁ దాళ లేక వేగ 22.

కం. వనచరు లగు కపులకు విభుఁ
డనియె మిత వచనము లిట్టు లా వాలి తగం
గని దుందుభి సువ్యక్తము
గ నక్షరము లసురు తోడఁ గ్రన్నన నంతన్ 23.

ఆ.వె. ఏల యడ్డు కొనుచు నీ పుర ద్వారము
ముందు నిల్చి యిట్టి చందమున న 24.

అతువు నే నెఱుఁగుదు  మతి నీ బలము నెల్లఁ
గాచి కొనుమ నీదు కాయ మింక

కం. విని వానరేంద్రు పలుకులు
ఘన ధీమంతుండు వలుక ఘన కోపమునం
గను లెఱ్ఱఁ బడఁగ దుందుభి
మినుకుల నిట్లనియెఁ దా నమిత దర్పమునన్ 25.

ఆ.వె. స్త్రీల నడుమ నిల్చి ధీర వరేణ్య! ప
లుకఁగఁ దగదు నీకు రోషమూని
కయ్య మొసఁగ నాకు నయ్యవసరమున
నీ బలము నెఱుఁగుదు నేను వీర! 26.

చం. అయిన సహింతుఁ గోపము నిజాత్మను రాత్రి యొకింత యింక నీ
వ యడరి కామ భోగముల నత్యధికమ్ముగ రమ్ము ప్రొద్దుటం
బ్రియముగ నిమ్ము కానుకలు ప్రీతి నొసంగుము కౌఁగిలింతలన్
దయితుల కెల్ల మిత్రులను దప్పక కూడుమ వానరేశ్వరా! 27.

తే.గీ. కాంచు మయ్య నీ కిష్కింధ నంచితముగ
నాత్మ సము నిల్పుమ నగర మందు నింక
దారల రమింపు మింపుగ వీరవర్య!
నీదు దర్ప నాశకుఁడను నేను వినుమ 28.

తే.గీ. మత్తుని నిరాయుధు మఱి ప్రమత్తు లేక
సుప్తుఁ గామమోహితుని వసుధను నిన్ను
బోలు వానినిఁ జంపిన వాలి! భ్రూణ
హంతకునకు సమానుండ యగును జుమ్మి 29.

కం. విని యా మాటలు కపి వరుఁ
డు నగుచు మెల్లగఁ బలికె నుడుల నీ రీతిన్
వనితలఁ దా రాదుల నె
ల్లను వీడి రయమ్ముగనం జెలఁగఁ గోపంబే 30.

చం.	అసుర వరేణ్య! మత్తిలితి నంచును నీవు దలంప రాదు న
న్ను సమర భీతి లేని యెడ నొవ్వక నిల్వుమ యీ మదం బిటన్
రస మగు నిన్ను గొట్ట సమరమ్మున వీరుల కర్థ పానమే
వెస వచియించి యివ్విధము వీర వరేణ్యుఁడు వాలి యంతటన్ 31.

తే.గీ.	తీసి పితృ దత్త కాంచన దివ్య మాల
శక్ర దత్తము నలిగి భృశముగ వాలి
నిలిచి దుందుభి గిరి నిభునిఁ గదిసి వడిఁ
గొమ్ములను బట్టి ధరపయిఁ గొట్టి యఱచె 32.

తే.గీ.	వాలి గిఱగిఱ త్రిప్పియవ్వసుధఁ గూల్ప
నఱచి బిగ్గరగ నటుల నంతఁ గాఱె
రక్త మా దుందుభి మహాసుర వరు చెవుల
నుండి ధారగ నాగక మెండుగాను 33.

తే.గీ.	ఘోర మయ్యెను యుద్ధము కోరి జయము
నొండొరు లతి సంరంభము నూని యెదలఁ
గలియ దుందుభి వానరేంద్రులకు నంత
శక్ర తుల్య విక్రముఁడు భృశమ్ము సెలఁగి 34.

ఆ.వె.	వాలి జాను ముష్టి పాదప ఘన శిలా
వ్రాతముల నొనర్చె రణము భీక
రముగ సమరమును బరస్పర మొనరింప
వాలి పెరిఁగె నసుర బలము తగ్గె 35.

చం.	బల మిఁక ధైర్య యత్నములు వ్రాలఁ బరాక్రమ మెల్ల దుందుభిన్
ఖలు నసురేంద్రు నెత్తి కపి కాంతుఁడు వే పడఁ ద్రోసె నుగ్రుఁడై
యిల పయి నాజినిన్ నలిఁగి యిద్ధరఁ గూలె మహా శరీరుఁడే
విలయము లయ్యెఁ బ్రాణములు వేగమ దుందుభి కంత రాఘవా! 36.

ఆ.వె.	తన కర యుగమున నతని మరణించిన
వాని నెత్తి యంత వాలి విసరె
నొక్క త్రుటిని నొక్క యోజన దూరమ్ము 37.

వేగముగను గినిసి వీరవరుఁడు

ఆ.వె. వేగవంతముగను విసరఁ బడి చనుచు
నుండ వాని ముఖము నుండి రక్త
బిందువు లనిలంపు వేగమున మతంగ
మౌని వరుని యాశ్రమమునఁ బడెను 38.

తే.గీ. పడిన రక్త బిందువులను బరమ ముని మ
తంగుఁ డారసి చింతించెఁ దనదు హృదిని
నెవ్వఁ డితఁ డిట్టు లొనరించె నేల యంచు
గోప మడర మహాత్ముఁడు తాపసుండు 39.

కం. ఎవ్వనిచే నే ముట్టితి
నివ్వన మందు రుధిరమ్ము నే దుష్టుఁ డహో
యెవ్వెట్టి యే దురాత్ముం
డివ్విధ మొనరించె నంచు నెన్నుచు నంతన్ 40.

కం. పలుకుచు నివ్విధము ముని వె
డలి బయటకు మహిషమును బుడమి పయిఁ బ్రాణ
మ్ములు వోవం బడ శైలము
వలె భీమాకారము నటఁ బరమర్షి కనెన్ 41.

కం. కని నిజ తపో మహిమ విస
రిన వానిని వాలి నంతఁ గృతకార్యుని ని
చ్చెను శాప మమోఘమ్మును
ముని వర్యుండు కుపితుండు బోరన నిట్లున్ 42.

కం. ఏరి వలన నాదు వనం
బీ రీతిఁ దడిసె రుధిర మహీనము కాఱం
జేరఁ దగఁ డాతఁడు వనము
చేరిన మరణమ్ము నందు శీఘ్రము యిచటన్ 43.

ఉ. ఆసుర భీమ కాయమున నాపతితమ్మున వృక్ష రాసులే 44.

భాసుర కాననమ్మునను భగ్నము లైనవి యెల్ల చోటులం
గోసులు నాల్గు మేర నిటకుం జనుదెంచిన తత్క్షణమ్మునన్
దోసపుఁ గారణమ్మున సుదుర్మతి ప్రాణము లెల్లఁ గోల్పడున్

తే.గీ. నా వనము నాశ్రయించి యున్న యతని సచి
వులు ననర్థు లిచట నుండఁ బో వలయు వి
ని వచనమ్ము లెల్లరు వారు నిలిచినఁ జన
కుండ శపియింతు వారిని నుగ్రముగను 45.

ఉ. పెంచితి నీ యరణ్యమును బేర్మిని స్వీయ కుమారు భంగినిం
ద్రెంచుచుఁ బత్ర మూలము లతీతము లింకను గుట్మలమ్ములన్
మించి ఫలమ్ము లిచ్చట నమేయముగాఁ జరియించు వారి కే
నుంచితి మేర నొక్క దిన మ్ముంటకు నిచ్చటఁ బోక యున్నచో 46.

కం. వారిం గాంచిన నే న
వ్వారలు బహు వర్షము లిఁకఁ బాషాణములై
వారక పడి యుండఁ గలరు
ధారుణి నంచు వచియింపఁ దాపసుఁ డంతన్ 47.

కం. ముని చంద్రు వాక్యములు విని
చని రెల్లరు వానరులు వెస వనమ్మును వీ
డి నగచ రేంద్రుని వాలినిఁ
గనిరి తమిని వాలి వారిఁ గని యిట్టు లనెన్ 48.

చం. వర కపు లో మతంగ వన వాసుల రిచ్చట కేల వచ్చి రె
ల్లరు కుశలంబె మీ కిట నరణ్యమునం దని వాలి పల్కఁగా
వర ముని శాప వాక్యములు వా రరుదెంచిన కారణమ్ము సె
ప్పిరి వివరమ్ము లెల్లఁ గపి వీరున కప్పుడు హేమ మాలికిన్ 49.

తే.గీ. ఆలకించి శాఖాచరు లన్న గిరలు
కదిసి యర్థింప నా మునిఁ గర యుగము మొ
గిడ్చి యాదరింపక లోనికిఁ జనిన ముని
వాలి శాప భయమ్మున వణఁకఁ దొడఁగె 50.

ఆ.వె. శాప భయము మీఱ శాఖామృ గేంద్రుఁడు
ఋష్యమూక గిరికి నేఁగ వెఱచు
గాంచ దాని నింక నెంచఁ డెన్నఁడు వాలి
మానసమ్ము నందు మాన వేంద్ర! 51.

కం. అతఁ డిటకు రామి నెఱిఁగి గి
రి తటమునకు భీతి వీడి నృవరేణ్య! యమా
త్య తతినిఁ గూడి చరింతును
విత తారణ్యమున రామ! వీరవరేణ్యా! 52.

తే. గీ. దుందుభుని యస్థి నిచయమ్ము త్రోయఁ బడఁగ
బల్లిదుని చేత నియ్యది వఱలు చుండెఁ
గాంతితో గిరి కూట నికాశ మగుచు
ఘన తరం బయినది దీనిఁ గాంచు మార్య! 53.

కం. పెనవేసిన శాఖలతో
ఘన సాలము లాఱు నొకటి ఘన బలుఁ డా వా
లి నరేంద్ర! యడరి యొక్కొక
టిని దళ హీనమ్ముఁ జేయు రేవం జేవన్ 54.

కం. ఇది యతని యసమ వీర్యం
బుదితమ నా చేత నెల్ల నుర్వీప సుతా!
కదనమున నెట్లు వాలిని
నెదిరింపఁగ నగును నీకు నెఱిఁగింపు మయా 55.

ఆ.వె. అట్లు పలుకు నతని నరసి సుగ్రీవుని
నగుచు లక్ష్మణుండు నర వరేణ్యుఁ
డడిగె నిట్టు లేమి యడరి చేసిన విశ్వ
సింతు వాలి వధను సుంత చెపుమ 56.

ఉ. ఆ వచనమ్ము లెల్ల విని యంత వచించెను బల్కు లిట్లు సు
గ్రీవుఁడు కాంచి లక్ష్మణునిఁ గేళి విధమ్ముగ వాలి స్వీయమౌ 57.

చేవ సెలంగఁ జీల్చె నిటఁ జెట్లను సాలము లొక్క టొక్కటిన్
ధీవరుఁ డేసి బాణములు దిట్టతనమ్మున నట్లు పల్మఱున్

ఆ.వె. రాఘవుండుఁ జీల్చ లక్ష్మణ! పాదప
ము నటుల నొక బాణమున నది తిల
కించి వాలి నిహతుఁ డంచుఁ దలంతును
మించు విక్రమమున నంచు నేను 58.

చం. కను మిది దున్న యెమ్ముకము కాలిని నొక్కట దీని నెత్తి వీఁ
క నిట శతద్వయప్రకట కార్ముక దూరము ద్రోయఁ గల్గినన్
మనుజ వరుండు రాముఁడు సమంచిత రీతిని విశ్వసింతు నా
తని బల విక్రమమ్ములను దార్ఢ్యము నంచు వచించి యింకనున్ 59.

తే.గీ. పలికి రక్తాంత లోచనుఁ దలఁచి యెడఁద
రాముని నొకింత తడవు నరప్రవరునిఁ
బల్కె సుగ్రీవుఁ డా రాఘవకుల తిలకుఁ
గాంచి సంశయ మడర వాక్యజ్ఞుఁ డిట్లు 60.

తే.గీ. శూరు వరుఁడు శూరఘ్నుఁడు మూరు పౌరు
షమున వాలి యజేయుఁడు సంగరమున
వానరుండు బల్లిదుఁడు దేవతలు సేయ
లేని కార్యము లొనరించుఁ దాను దివిరి 61.

ఆ.వె. ఋశ్యమూక గిరిని నిచట నే నిలిచితి
వానిఁ దలఁచి భీతి వానరేంద్రు
దుర్జయుని దురాసదునిఁ జింత తోడ వీ
డ నసమర్థుఁడను గిరిని నరేంద్ర! 62.

కం. ఘన శంకఁ జలిత మానస
మున ననురక్తులు నమాత్య పుంగవు లుండన్
హనుమత్సహితము చరియిం
తును వన మందు నిట భయ మతులమై యున్నన్ 63.

తే.గీ. దొఱికితివి శ్లాఘనీయ మిత్రుఁడవు మిత్ర
వత్సల! పురుష శార్దూల! సత్సఖ! నిను
శీత శైలాభు నాశ్రయించితిని కంటి
భ్రాతృ బలమును గన లేదు బలము నీది 64.

ఆ.వె. ఎన్న నెంచ నిన్ను నిన్నగౌరవపఱ
పఁ దలఁప నోసఁగఁ దలఁపను భయమ్ము
నీకు నుంత పిఱికి నే నైతి వాని కా
ర్యములఁ గాంచి నంత రామ! కరము 65.

కం. చాలుఁ బ్రమాణములు గిరలు
మేలి తవాకృతి ధృతు లవి మిత్రమ! తెలుపం
జాలును నీ తేజమ్మును
లీలగ భస్మయుత వహ్ని లీలను రామా! 66.

కం. విని సుగ్రీవు మహాత్ముని
మినుకుల రఘు రాముఁ డంత మీఱఁగ నగవే
తన వదనమ్మున బదు లి
చ్చెను హరి గణ నాథుని నరసి నృవరుఁ డిట్లున్ 67.

ఆ.వె. పొగడఁ దగిన యట్లు పుట్టింతు విశ్వాస
మడరి విక్రమమ్ము నందు హరి వ
రేణ్య! నమ్మకమ్ము లేనిచో నీకు మా
విక్రమమున నాజి విశ్వసింపు 68.

మ. అని సుగ్రీవునితో సుసాంత్వ గిర లత్యం తాదరం బేర్పడన్
ఘనుఁ డా లక్ష్మణ పూర్వజుం డసురు శుష్కంబైన యక్కాయముం
దన పాదాంగుళి నెత్తి త్రోసెఁ ద్రుటి మాత్రం బంత దూరమ్ముగాఁ
దను వేఁగం బది యోజనమ్ములు మహా దక్షుండు లీలన్ వడిన్ 69.

ఆ.వె. విసర రాముఁ డట్లు వీక్షించి సుగ్రీవుఁ
డంత లక్ష్మణుండు నరయు చుండ
రామునిఁ గని యా నరప్రవరునిఁ బల్కె 70.

నర్థవంత గిరలు హరివరుండు

చం. అలసిన వాఁడు భ్రాత తను వార్ద్రము మాంస యుతమ్ము నూత్నముం
గలఁగిన వాఁడు త్రోసె మును కాంచఁగ మత్తుఁడు నాతఁ డత్తజిన్
సు లఘువు మాంస హీన మిది చూడఁగ నౌ తృణ సన్నిభమ్ముగాఁ
లలితముఁ ద్రోసి తీ విపుడు రాఘువ! దీనిని సంతసమ్మునన్ 71.

ఆ.వె. ఎండి నట్టి దాని కింకఁ దడిసి నట్టి
దాని కంతరమ్ము తద్ద యుండుఁ
గాన బలము నందు వానరేంద్రున కింక
నీకు నంతరమ్ము నేర నేను 72.

తే.గీ. సంశ యంబిది మీ జవ సత్త్వ భేద
మందు మీ బలాబలముల నరయఁ గలను
సాల మొక్కటి నీ వొక్క శరము చేతఁ
జీల్పఁ గలిగి తేని పురుష సింహ! నేను 73.

తే.గీ. హస్తి హస్తాభ వితతాస్త్ర మందు నారి
నిపుడు నించి యాకర్ణాంత మింక లాఁగి
రామ! విడువుమ బాణము రమ్యముగను
శరము భేదింప సాలము నరయ నాకు 74.

ఆ.వె. సంశయమ్ము తొలఁగు సంపూర్ణముగఁ జాలు
నింకఁ జింత సేయ నెడఁద నా ప
యిఁ బ్రతిన నొనరింతు నింక ప్రియము నాకు
గూర్పు మెలమి రాజ! నేర్పు మీఱ 75.

తే.గీ. ఎట్లు ప్రభ లోన దినకరుఁ డెక్కు డగును
గిరుల హిమవంతుఁ డధికుఁడై పరఁగు నెట్లు
మృగముల మృగ రా జెవ్విధి మీఱు నట్లు
నరుల విక్రమమున రామ! వరుఁడ వీవు 76.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బదునొకండవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 12.

రాముఁడు సుగ్రీవునకు నమ్మకముఁ గలిగింప విల్లు గొని బాణమును వేయ నది యేడు మద్ది చెట్లను భేదించి తిరిగి రాముని తూణీరమును జేర సుగ్రీవుఁడు తృప్తి జెంది వాలితో మొదట తలపడి యోడి పాఱుట, వాలి సుగ్రీవు లొక్క విధముగ నుండ భేద మెఱుంగ లేక తాను బాణము వేయ నశక్తుఁడ నని రాముఁడు పలికి గుర్తింప వీలుగ సుమములతో నున్న నొక గజపుష్ప లతను సుగ్రీవునిచే ధరింపఁ జేసి తిరిగి వాలితో యుద్ధమునకు సన్నద్ధునిఁ జేయుట.

కం. ఆ సంశయాత్మక గిరల
నా సుగ్రీవుఁ డన రాముఁ డాతని కీయన్
భాసురముగ నమ్మకమును
దా సంధించె ధనువు ఘనతర ఘోరమ్మున్ 1.

తే.గీ. అట్లు సంధించి శరమొక్క టంత మాన
దుండు వేయ సాలము పైకి దుస్సహంపు
నారి రవము నిండ దిశలు నరవరేణ్యుఁ
డడరి స్వర్ణ భూషితమును దడయకుండ 2.

ఉ. వేగము మీఱ సాల ఘన వృక్షము లేడిటిఁ జీల్చి  యాగకే
యా గిరి భూతలమ్ము పెస నంతటఁ దాఁటుచుఁ జొచ్చి భూమినిం
చాగి శరమ్ము క్ష్మాతలము సయ్యన వీడి ముహూర్త మందు వే
వేగ నిజేషుధిం గదిసె వింతగ రాముని విక్రమమ్మునన్ 3.

చం. కని యట నేడు మద్దెలను గ్రన్నన( జీల్చ(గ బాణ వేగమే
యినకుల చంద్రు( డేయ( గపి యెంతయు విస్మయ మంది యంత వం
చి నిజ శిరమ్ము భూమి పయి( జెన్నుగ వ్రాలి విభూషణాలి ప్రే
ల నరవరేణ్యు నంజలిని రాముని యంఘ్రుల నంటి యిట్లనెన్ 4.

తే.గీ. రామ! యస్త్ర విదప్రవర! ఘన శూర!
ధర్మ సంవిద! యిట్టి నీ కర్మ మరయ
హర్ష మొదవె మిక్కుటముగ నాత్మ లోన
నంచు నింకయు నిట్లనె నంచితముగ 5.

చం. శరమున సేంద్ర నిర్జరుల( జంప సమర్థు(డ వీ వనంగ నా
హరిపతి వాలినిం బలుక నక్కట యేల నరర్షభా! యనిం
దరులను వీ(క నేడిటని దట్టపు శైలము నింక భూమినిన్
శరమున( జీల్చ నొక్కటిని( జాలుదు రెవ్వ రెదిర్చ నిన్ననిన్ 6.

ఆ.వె. నిన్ను బొంది నే(డు నేను మిత్రునిగ న
తులపు( బ్రీతి నంద( గల(త యెల్ల(
దొల(గె( బూర్ణముగను దూర్ణము రాఘవ!
వరుణ వాసవాభ! పార్థివేంద్ర! 7.

ఆ.వె. అంజలింతు నే(డ భంజింపు మాజిని
భాతృ రూపు( డైన వాలి నార్య!
ప్రియము గూర్చ నాకు భీకర వైరిని
రఘు కులాబ్ధి చంద్ర! రమ్య తేజ! 8.

కం. విని కౌ(గిలించికొని ప్రీ
తిని సుగ్రీవుని( బలికెను ధీనిధి రాముం
డనుజుం డా లక్ష్మణునకు
ననుగుణ వచనమ్ము లిట్లు హరి సత్తముతో 9.

తే.గీ. పోవుద మిట నుండి వడి సుగ్రీవ! ముందు
నీవు చనుమ కిష్కింధకు నీదు భ్రాత
నా రిపుని పిలువుమ భండనమున కచట 10.

సత్వర మరిగి యనిన వచనము లిట్లు

ఆ.వె. ఎల్ల రేఁగి రంత నల్ల కిష్కింధకు
వాలి నగరమునకు వడి వడిగను
దరుల వెనుక వారు దాఁగి యింపుగ నిల్చి
రా వనమ్ము నందు నాత్రముగను 11.

తే.గీ. అఱచె నంత నా సుగ్రీవుఁ డంబరమ్ము
పగులు నట్టులు బిగియించి వస్త్ర మపుడు
వాలి నాజికి పిలిచెడు లీల ధైర్య
మూని సంభ్రమించి భృశము వానరుండు 12.

కం. విని తమ్ముని ఘోరధ్వని
కినిసి మహాబలుఁడు వాలి గిఱ్ఱున వెడలెన్
ఘనుఁడు బయట కస్త తట
మ్మున నుండి వెడలెడు రవినిఁ బోలి రయమునన్ 13.

తే.గీ. జరిగె వాలి సుగ్రీవులకు రణ మంత
ఘోరముగను బుధునకు నంగారకునకు
జరిగి నట్టి భంగిని నిరువురకుఁ దుముల
ము వనమం దతి భీకరముగఁ జెలంగి 14.

తే.గీ. అశని సన్నిభ తలముల నన్నదమ్ము
లపుడు వజ్ర సదృశ ముష్టు లడర భృశము
గ నొనరించి రన్యోన్యము కయ్య ముదరి
క్రోధ మూర్ఛిత చిత్తులై ఘోరముగను 15.

చం. కరమున విల్లు నూని కనెఁ గయ్యము సేసెడి యన్నదమ్ములం
బరఁగఁగ వార లశ్వినుల భంగిని నన్నిట నొక్క రూపులై
నరవరుఁ డా రఘూద్వహుఁడు నాశ కరాస్త్రము జంకె వేయఁగన్
హరివరు లందుఁ దా ననుజు నన్నను జక్కఁగ నేర కుండినన్ 16.

ఆ.వె. అంతఁ దాడితుండునై కపి సుగ్రీవుఁ 17.

డన్న వాలి చేత నచటఁ గాన
కున్న రాఘవేంద్రు సన్నగిల్ల బలము
ఋశ్యమూకమునకు నేఁగెఁ బాఱి

కం. చేరె వనమునకుఁ గ్లాంతుఁడు
దా రుధిర నిమగ్న దేహి తాడనములచే
ఘోరముగ నలయఁ దనువు మ
హా రోషమునఁ దఱుమఁబడి యగ్రజు చేతన్ 18.

కం. వని సేరిన సుగ్రీవునిఁ
గని ఘన తేజస్వి వాలి కపి పుంగవుఁ డా
యనుజనితో ముక్తుఁడ వయి
తని శాప భయమునఁ జనె నిజాలయమునకున్ 19.

ఉ. పావని భ్రాత లక్ష్మణుఁడు పన్నుగ వెంటఁ జనంగ వేగ సు
గ్రీవుఁడు నున్న చోటు పరికించి వనమ్మును జేర రాముఁడే
భూవరుఁ గాంచి రాఘవుని భూమినిఁ జూచుచు సిగ్గు తోడ సు
గ్రీవుఁడు వల్కె దీనముగ ఖేదముతో వచనమ్ము లివ్విధిన్ 20.

తే.గీ. పిలువు మంచును నాతోడఁ బలికి యపుడు
చూపి నీ విక్రమమ్మును భూపవర్య!
వైరి చేతను గొట్టించి ఘోరముగను
జేయఁ బడె నిది యేమి నీ చేత రామ! 21.

ఆ.వె. చెప్పి యున్న నీవ యప్పుడు నిక్కము
గ వధియింప వాలిఁ గపివరు నని
నంత నిచట నుండి యరుగు వాఁడను గాను
నేను సుంత యేని మానవేంద్ర! 22.

ఆ.వె. జాలి గొలుపు మాట లాలకించి పలుక
నా మహాత్ముఁ డట్లు హరి వరుండు
దీనముగను దిరిగి యా నరేంద్రుఁడు రాముఁ
డనియె నిట్లు పలుకు లాదరమున 23.

తే.గీ. వినుమ సుగ్రీవ! యాగ్రహము నెద వీడి
బాణ మది యే కతన విడువఁ బడలేదొ
యపుడు నా చేత నది యెల్లఁ గపి వరేణ్య!
పలుకు వాఁడ నిక్కముగను వలదు కలఁత 24.

ఉ. మీరలు వేష భూషలను మేనుల మీ గమనమ్ములందునున్
మూరిరి యన్నదమ్ములు నమోఘముగా నట నొక్క భంగినిన్
వీర! పరస్పరమ్ము మఱి విక్రమ మింక స్వరమ్ము వాక్కులన్
నేరను భేద మింతయును నిన్నును నన్నను జూచినంతటన్ 25.

ఉ. కావున నేను మోహితుఁడఁ గాంచను రూప విభేద రీతులన్
నే వడి వేయ లే దపుడు నిక్కము వైరి వినాశకమ్మునుం
గావఁగ నిన్ను బాణమును గాల సమమ్మును మూలఘాత మే
నే విధిఁ జేయ శక్యుఁడను హీనము నక్కట వానరేశ్వరా! 26.

తే.గీ. ఎఱుక లేక చులకఁదనమే తనరఁగ
నాది నిన్ విపన్నునిఁ జేయ నగచరేంద్ర!
వీర! నా మూర్ఖ మింకను వెఱ్ఱితనము
తెల్ల మగును గాదె యెడఁద తల్లడిల్ల 27.

చం. ఘనతర పాతకం బగునుగా యభయం బిడి చంప మిత్రునిం
గన ననుజుండు నేను నిజ కాంత ధరాసుత నీ యధీన మం
దు నిలిచి యుంటి మెల్లరము తోరపు నీ శరణమ్ము నింపుగా
వనమున మేము గోరితిమి వానర పుంగవ! వీడి శంకనున్ 28.

తే.గీ. ఉద్యమింపుమ యిప్పుడ యొప్పుగాను
గాంచు వాఁడవు సుగ్రీవ! మించి వేయ
నొక్క బాణము నే నాజి నుర్విఁ గూలి
వాలి దొర్లుచు నుండఁగ నేల భయము 29.

తే.గీ. నిన్నెఱుఁగు గుర్తు నొక్కటి నీదు ద్వంద్వ
యుద్ధ మందు గుర్తింప నే నుచిత రీతి 30.

నింక ధరియింపు మని పల్కి యంక మందు
నున్న లక్ష్మణుతో ననె నన్న యిట్లు

తే.గీ. లక్ష్మణ! శుభ లక్షణము లలరుచు నున్న
యట్టి గజ పుష్పమును గుసు మావృతమ్ము
నొకటి సుగ్రీవు కంఠమం దుంచుమ కొని
యిమ్మహాత్ముని కడ కేఁగి యెలమి నిపుడు 31.

కం. నా విని గిరి తట జాతము
నా వర గజపుష్పలత సుమాకలితమ్ముఁన్
పే పెకలిచి యాతఁడు సు
గ్రీవుని కంఠమున వేసెఁ బ్రీతి సెలంగన్ 32.

ఆ.వె. ఆ లత తన కంఠ మందుండ సుగ్రీవుఁ
డలరె సంధ్య యందు నలరు తోయ
దంపుఁ బంక్తి వోలె నింపుగఁ గొంగలు
మాల వోలె నమర లీలగ నట 33.

కం. చనెఁ గిష్కింధకు నా వా
లి నగరి కా రాముఁ గూడి ప్రియతమ సఖునిం
దను కాంతుల సుగ్రీవుఁడు
విని రామ వచనముల నతి వేగముగఁ దమిన్ 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బండ్రెండవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 13.

రామ లక్ష్మణులు సుగ్రీవునితోఁ గిష్కింధకు నేఁగుచు మార్గమునఁ బ్రకృతి సౌందర్యము గాంచుచు చని
సప్త మునుల యాశ్రమమును గాంచి యర్చించి కిష్కింధా పురి చేరుకొనుట.

కం. చనె ఋష్యమూక పర్వత
ము నుండి కిష్కింధకు హరి భుజపాలిత మై
న నగరికి రాఘవుఁడు ధ
ర్మనిరతి సుగ్రీవుఁ గూడి రయమున నంతన్ 1.

తే.గీ. చాపము గ్రహించి తప్త కాంచన విభూషి
తమ్ము నాదిత్య రుచి సన్నిభమ్ము లమ్ము
లం గొని రణ జయమ్ముల రాముఁ డరుగు
చుండ నమ్మహాత్ముని ముం దఖండ బలులు 2.

ఆ.వె. సంహతంపు గళుఁడు చారు సుగ్రీవుఁడు
మఱియు లక్ష్మణుండు మనుజ వరుఁడు
నేఁగు చుండ వెనుక నెలమి మారుతి నల
నీల తారలుం జనిరి హరిపులు 3.

చం. వెడలిరి పుష్ప భార నత వృక్ష సమూహము నిర్మ లాంబువుల్
వడివడి పాఱ సాగరముఁ బన్నుగఁ జేరు నదీ నికాయముం
గడు దమిఁ గాంచు చుండి ఘన కందర నిర్ఝర శైల రాజముల్
కడు ప్రియ దర్శనమ్ము లగు గ్రావ దరీ సగుహా శిఖావళిన్ 4.

తే.గీ. పరమ వైడూర్య సన్నిభ పర్ణ విలసి
తముల నా నాళ సంభరిత వర కుట్మ
లములఁ బద్మ చయముల జలప్రపూర్ణ
వర సరస్సు లరయుచు నధ్వమ్ము నందు 5.

తే.గీ. హంస కారండగణ సార సాంబు కుక్కు
ట చయ వంజుల చక్రవాక చయ పర వి
హంగ సంచయ సంత తాభంగ నాది 6.

త జని తారవముల వించుఁ దరలు చుండి

కం. లేఁత కసవుఁ దిను హరిణ
వ్రాతము నిర్భయ చయమును వన గోచర సం
ఘాతము సెల్లెడఁ దిరుగుచుఁ
బ్రీతిని నిలిచెడు మృగముల విరివిగ గనుచున్ 7.

చం. సమద తటాక వైరులను జారు తరార్జున దంత భూషి తా
లి ముదిత కూల ఘాతకుల లీలఁ జరించు ద్విపావలిన్ వరాం
గములను బర్వ తాభముల గ్రావ తటమ్ములు గూల్చు వాని వా
రిము గసమాన దేహులను రేణు కణమ్ములు లేపఁ గాంచుచున్ 8.

కం. వన చరము లనేకముల గ
గన చర విహగమ్ముల నటఁ గాంచుచు సుగ్రీ
వుని వశ మందు నిరంతర
ము నడచు వా రేఁగిరి రయమున ముద మారన్ 9.

కం. వెడలెడు వారిం గాంచుచు
నడరుచు రఘు రాముఁ డడిగె నారసి యచటం
గడు చోద్యపుఁ దరు తతి యగ
పడ సుగ్రీవుని వనమునఁ బరమప్రీతిన్ 10.

చం. వెలుఁగుచు వృక్ష షండ మిట వింతగ వారిద రాశి సన్నిభం
బిలఁ గదలీ వృతమ్ముగ నహీన ముదావహమై విరాజిలెం
దెలియఁగ దీని నెంచెదను దెల్లముగా నిది యేమియో కుతూ
హల మెదఁ గల్గెఁ దోరముగ నర్థుఁడ వీ వది తీర్ప మిత్రమా! 11.

ఉ. అంత మహాత్ము వాక్యముల నా రఘు రాముఁ డనంగఁ బ్రీతితో
నంతయు నేఁగుచుం దొడఁగె నర్యమ సూనుఁడు చెప్ప నివ్విధిన్
సంతత శుద్ధ మూల ఫల సంచయ సంయుత మీ వ నాశ్రమం
బంతయు విస్తృతం బయిన యర్గ్య వనోప వ నావృతంబునై 12.

తే.గీ. మఱియు శ్రమ నాశనం బిది మసలిరి యిట 13.

సప్తజన నామ మును లతి సంశ్రితవ్ర
తులు తలల నుంచి క్రిందునఁ దోయ శయను
లై పరఁగుచు నియమముల నంచితముగ

తే.గీ. వాయు వాహారముగఁ గొని వారు సప్త
దినముల కొకపరి కదలకను దపమున
నిలిచి యేడు వందల యేండ్లు నిజ శరీర
ముల నరిగిరి స్వర్గమునకు మునులు ఘనులు 14.

ఆ.వె. తరు గణమ్ము కాఁగ గురుతర ప్రాకార
మాశ్రమమ్ముఁ జేర నలవి కాదు
సేంద్ర నిర్జ రాసురేంద్రుల కైనను
వారి మహిమ వలనఁ బార్థివేంద్ర! 15.

ఆ.వె. పక్షు లింక నన్య వన మృగమ్ములు ప్రవే
శింప వీ వనమును దెంపు మీఱి
తెలియక నరిగిన నతిక్రమించి తిరిగి
రా నశక్య మగును వాని కింక 16.

కం. విన నగు సక లాభరణము
ల నినాదము లక్షరమ్ములను గీతములన్
ఘన తూర్య నాదముల నిం
కను రామ! యడరును దివ్య గంధము లచటన్ 17.

తే.గీ. వెలుఁగుఁ ద్రేతాగ్ను లచ్చట విరివిగాను
ధూమ మనవరతం బటఁ దోరముగను
బాద పాగ్రము లందు సువ్యాప్త మగును
బావురముల రంగు నెఱుపు వర్ణములను 18.

ఆ.వె. వెలుఁగు చున్న విచట వృక్షములు పొగతోఁ
గూడి కొనఁగ వాని కొనలు భృశము
మబ్బు లలము కొనిన మంచి వైడూర్య ప
ర్వతముల పగిదిఁ గనఁ బడుచు నుండి 19.

చం. మునులకు నంజలించి తగ మ్రొక్కుము లక్ష్మణుఁ గూడి రాఘవా!
ఘనతర ధర్మ మానసుఁడ! కానము సుంతయుఁ గీడు వారిలో
ఘనులగు భావితాత్ములకుఁ గ్రన్నన మ్రొక్కుదు రెవ్వ రింపుగా
మనమున నుంచి భక్తిని సమంచిత రీతిని మానవేశ్వరా! 20.

కం. అనుజుని లక్ష్మణు తోడుత
మునులకు మోడ్చి కరములను బురుషోత్తముఁ డా
యినకుల తిలకుఁడు రాముం
డు నతు లొసంగెను నరేంద్రుఁడు వినమ్రుండై 21.

ఆ.వె. వందనము లొసంగి యందఱు రాముఁడు
లక్ష్మణుండు వానరప్రభుండు
వానరులును ముదిత మానసు లెల్లరు
నేఁగఁ దొడఁగి రంత వేగముగను 22.

కం. చని చాల దూర మాశ్రమ
ము నుండి కని రంత వారు పోఁ జాలని యా
ఘన వాలి పాలిత పుర
మ్మును గిష్కింధను బుర వరముల శ్రేష్ఠమ్మున్ 23.

కం. రామానుజ రాములు శా
ఖామృగ వీరులు గ్రహించి ఘన శస్త్రాలిన్
పే మడియఁ జేయఁగ రిపునిఁ
దా మేఁగిరి తిరిగి యింద్ర తనయు నగరికిన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ
బదుమూడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 14.

రాముఁడు సుగ్రీవునకు వాలిని వధింతు నని మఱియొక మారు వక్కాణించి యుద్ధమునకుఁ బిలువ
మని యాతనితో నన సుగ్రీవుఁడు బిగ్గరగా యుద్ధార్థ మఱచుట.

కం. వేగంబ వాలి పాలిత
మా గురు కిష్కింధకుఁ జని యందఱు నంతన్
దాఁగిరి తరుల వెనుకను మ
హా గహన వనంబు నందు నాత్రము తోడన్ 1.

కం. ఆ వని సెల్లెడ విపుల
గ్రీవుఁడు సుగ్రీవుఁ డరసి ప్రీతుండు భృశం
బా వనము లన్న నిత్యము
పే వూనెను గోప మంత విస్తారముగన్ 2.

మ. పరివారం బటఁ దన్ను జుట్టికొని నిల్వం బ్రీతి సుగ్రీవుఁ డం
బరముం జీల్చు విధమ్ము నాదమును బీభత్సంబుగా నా ప్రభా
కర సూనుండు మరుజ్జ వాభిముఖ మేఘవ్రాత శబ్దాభముం
ద్వరఁ దాఁ జేసెను గర్జనం బనికి నాహ్వానించు భంగిం దమిన్ 3.

తే.గీ. గర్విత మృగ రాజ సదృశ గమనుఁ డిద్ధ
బాల సూర్య సన్నిభ గాత్ర బాసితుండు
పలికె సుగ్రీవుఁ డంత నిప్పలుకు లిట్లు
కార్య దక్షు రాముని్ఁ గాంచి వీర్య వంతు 4.

కం. హరులం బట్టంగ వల ల
మరిన పసిడి తోరణము లమర నందముగం
బరఁగ ధ్వజ యంత్రములు భా
సుర కిష్కింధా పురమ్ముఁ జొచ్చితి మార్యా! 5.

ఆ.వె. ఏ ప్రతిజ్ఞఁ బూర్వ మీవు సేసితొ వాలి 6.

వధ నిమిత్త మిపుడు వచ్చిన లత
వంటి నాకు దాని ఫలియించు నట్టు లొ
నర్పుమ కరుణించి నరవరేణ్య!

తే.గీ. ఇట్టు లనఁగ ధర్మాత్ముఁ డప్పట్టునఁ గపి
వరుఁడు సుగ్రీవుఁ గని రఘువరుఁడు శత్రు
సూదనుఁ డనె సౌమిత్రి నీ సుగళ మందు
నుంచ గజపుష్పము కపీంద్ర! యంచితముగ 7.

ఆ.వె. ఆర్తి యేల నిన్ను గుర్తింప నీ లయ్యె
లతయె కంఠమం దలరుచు నుండఁ
దార కాలి తోడఁ దనరెడు విపరీత
సూర్యుని వలె నీవు శోభితుఁడవు 8.

ఆ.వె. కూల్తు నింక నొక్క ఘోర బాణమ్మున
వాలి వలని భయము వైర మెల్లఁ
గూడ వానరేంద్ర! వీడుమ సంశయ
మెల్ల డెంద మందు నుల్ల మలర 9.

ఆ.వె. వాలిఁ జూపు మింక భ్రాతృ రూప రిపుని
నాకుఁ జాలు వాని వీఁకఁ జంప
సమర మందు దొర్లు శత్రువు భూమిపై
దుమ్ము మేని కంటఁ దోరముగను 10.

తే.గీ. నాదు దృష్టి పథము నందు నా దురాత్ముఁ
డు వడి మరలఁ గలిగిన విడువక ప్రాణ
ములను దోష మెంచఁ దగుదు మూరి నింద
సేయ నర్హుఁడ వగుదువు సెలఁగి నన్ను 11.

ఆ.వె. కనఁగ సాల సప్తకమును గూల్పఁగ నొక్క
యమ్ము చేత నప్పు డార్య! చూతు
విపుడు కూల వాలి పృథ్విని నాదు వీ
ర్యమ్ము చేత సంతసమ్ము మీఱ 12.

కం. అనృతము పూర్వము నా చే
తను వచియింపఁ బడ లేదు తనరిన పెతలుం
దనరఁగ నాశయె ధర్మ
మ్మున నెన్నఁ డయిన నసత్యము పలుక నేరన్! 13.

కం. ప్రతిన నొనర్తు సఫలము త్వ
రితముగ వీడు భయము బలరిపు వొసఁగుచు నా
తత వర్షము క్షేత్రమ్మును
వితతము ఫలియింపఁ జేయు విధమున మిత్రా! 14.

తే.గీ. ఇంక గర్జింపుమ పిలువ నంకమునకు
వాలి నా కపివరు హేమ మాలిని విని
దేని వానరుం డరుదెంచుఁ గాన నిన్ను
సంగరమున సుగ్రీవ! చెలంగి భృశము 15.

ఆ.వె. వచ్చు బయటకుఁ బుర వరము వీడి బల ద
ర్పుండును జితకాశి పూర్వ మీ పె
దిర్ప లేక యుండ ధీరత వాలి యు
ద్ధప్రియుండు వేగ తలపడంగ 16.

ఆ.వె. ఎఱిఁగి స్వీయ వీర్య మింపుగను బరుల
ధర్షణమ్ము యుద్ధ తలము నందు
సైప నోప రెల్ల శౌర్య వంతులు విశే
షించి స్త్రీల యెదుట మించి వీర! 17.

కం. విని రాముని మాటలు దా
నినదించెఁ గపీశ్వరుండు నింగిని భేదిం
చు ననఁగ ఘన నాదమ్మును
ఘనుఁడా సుగ్రీవుఁ డంత గంభీరముగన్ 18.

తే.గీ. ఆలకించి యా శబ్దమ్ము నావు లెల్ల
భీతిఁ బర్వు లిడెఁ బ్రభలు వీడ వేగ 19.

రాజవరు పరాజయమున రాజ కాంత
లాకులమునఁ బాఱు పగిది  నగపడంగ

తే.గీ.  పాఱె మృగములు వెఱచి సంభ్రమము మీఱ
సమరమున గాయ పడిన గుఱ్ఱముల వోలెఁ
గూలెఁ బక్షు లభ్రము నుండి నేల పైన
హీన పుణ్య గ్రహము లన దీనముగను 20.

తే.గీ.  నీరద శ్రేణి సన్నిభ నిస్స్వనుండు
సుప్రసిద్ధ దినక రాత్మజుండు శౌర్య
గుణ వివృద్ధ తేజుఁ డొసంగె ఘోష మనిల
చంచ లోర్మి వార్ధి నిభము మించి యట్లు 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బదునాలుగవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 15.

సుగ్రీవుని యఱపును విని యోర్వక వాలి వెడల నుద్యమింప నతని సతి తార శంకించి రాముని తోడున్న తమ్మునితో యుద్ధము తగదని యాతనిని యువరాజునిఁ జేసి సుఖముగ నుండుట మేలని చెప్పి వారింప వాలి వినకుండుట.

కం.  వినె సుగ్రీవుని సుమహా
త్మని నినదము నంత నోరుపు నెఱుంగని వా
లి నిలిచి యంతఃపురమునఁ
దన యనుజుండె యఱవంగఁ దచ్ఛబ్దమ్ముల్ 1.

మ. విని యా నాదము సర్వభూత సుమహా విత్రస్త మా వాలి యం
తన నిశ్చేష్టత నిల్చి వేగ మదిఁ గ్రోధం బంది యుగ్రుండు గాఁ
గన కాంగప్రభ లంత నిష్ప్రభలు కా గ్రస్తార్తియౌ సూర్యు రీ
తినిఁ గన్పట్టెను వానరేంద్రుఁడు మహోద్రేకమ్ములో మున్గఁగన్ 2.

తే.గీ. ఉగ్ర దంష్ట్రలతో వాలి యుగ్ర కోప
మూన దీప్తాగ్ని వలె నుండె హీన వారి
జ సమ్మృణాల పద్మాకర సదృశుఁడై క
నం బడెను ఘోరముగను వానర వరుండు 3.

కం. పదముల భూమిని సెల్లను
నుదరుచుఁ జీల్చెడు విధముగ నుఱికెను హరి తా
నెద సైపఁ జాలని రవం
బు దనర నట నాలకించి బోరన నంతన్ 4.

ఉ. తార యనంగ వాలి సతి తద్దయుఁ బ్రీతినిఁ గౌఁగిలించి వే
గారవ మొప్పఁ బల్కులను గాంచి నిజేశ్వరుఁ ద్రస్తు భ్రాంతునిన్
వారక పల్కె నివ్విధము పన్నుగ వీడుమ క్రోధ మెల్లయున్
మూర నదీ రయాభముగఁ బ్రొద్దున మాలల వీడు భంగినిన్ 5.

చం. చని తగు గాల మందు ననిఁ జల్పెదు చక్కఁగ వానరేశ్వరా!
కన మధికమ్ముగా రిపులఁ గాంచము నీ యబలమ్ము సుంత యొ
ప్పను ద్వరితమ్ము నీవు చన భండన భూమికి మీఱి పల్కెదన్
వినుమ కతమ్ము నెందులకు వీరవరా! వల దంటి నే నిటన్ 6.

ఉ. వచ్చెను మున్నితం డని కపారపుఁ గిన్క వహించి కొట్టఁగా
వచ్చిన వాని నీ వడరి పాఱెను దిక్కుల కెల్ల భీతితోఁ
జెచ్చెఱఁ గల్గె సంశయము చెన్నుగ నేలనఁ బీడితుండునై
వచ్చినఁ దిర్గి వానిఁ గనఁ బన్నుగ నా కెద మిక్కుటమ్ముగా 7.

ఉ. మించిన యత్న దర్పములు మీఱిన యాతని సంభ్రమమ్మునుం
గాంచఁగ నా నినాదమును గారణ మల్పమె యెంచి చూడఁగన్ 8.

సంచిత మైన సాయమున సత్తువ మూరఁగ వచ్చి యుండుఁ దా
నంచుఁ దలంతు బల్లిదుఁడు నైన శరణ్యుని యండ యుండఁగన్

ఆ.వె. సహజముగ నిపుణుఁడు చక్కని బుద్ధిమం
తుఁడు గణింప కుండ వడి బలమును
జొరఁడు సఖ్య మందు సుగ్రీవుఁ డెన్నండు
వానరప్రవరుఁ డవశ్య మెంచ 9.

తే.గీ. మున్ను వింటి వృత్తాంతము పుత్రుఁ డంగ
దుని వలన హితం బగు నది తోరముగను
నుడివెదను బ్రీతిఁ జారులు నుడువి రంగ
దునకు వనమునకుఁ జన నాప్తులు సుతునకు 10.

తే.గీ. అయ్యయోధ్యాధి నాథుని యనుఁగు సుతులు
రామలక్ష్మణులు రణ దుర్జయులు సుప్ర
సిద్ధు లిక్ష్వాకు కుల మందు శ్రేష్ఠు లొసఁగ
ప్రియము సుగ్రీవునకు వచ్చిరి తమి నిటకు 11.

కం. రాముఁడు పరబల దమనుఁడు
భీమ యుగాంతాగ్ని నిభము వెడలును సమరో
గ్రామేయ కర్కసుండొఁ
దా మిత్రుఁడు వీర! నీదు తమ్ముని కెంచన్ 12.

తే.గీ. సాధువులకు నివాస వృక్ష సదృశుండు
పరమ గతి యౌను మించి యాపన్నులకును
రక్షకుం డగుఁ దా నార్తులకుఁ గరమ్ము
యశమునం దేక యోగ్యుండు భృశ మతండు 13.

తే.గీ. జ్ఞాన విజ్ఞాన సంపన్న మానితుండు
స్వీయ పిత్రాజ్ఞ నిత్య సుస్థిరుఁడు నాక
రుండు గుణముల కింపుగఁ గొండ ధాతు
సంచయమ్మున కైనట్టి సరణి నతఁడు 14.

తే.గీ. సమర కర్మము లందు దుర్జయుఁడు నప్ర
మేయుఁడు మహాత్ముఁడు ఘనుఁడు మేటి బలుఁడు
నట్టి రామునితోఁ గయ్య మక్షమమ్ము
సుమ్ము నీకుఁ గపీశ నిక్కమ్ము నుడువ 15.

చం. నుడివెద నొక్క మాటను నినుం జిన సేయఁగ నిచ్చగింప నేఁ
గడుఁ దమి నాలకించి యిఁకఁ గార్యముఁ బూనుమ చేయఁ బ్రీతితో
నడరు హితమ్ము నీకు విని యంతయు నవ్విధి నాచరింపఁగాఁ
దడయక వానరేంద్ర! యెదఁ దాపము వీడుమ వీరపుంగవా! 16.

ఆ.వె. యౌవరాజ్య మందు ననుజుని సుగ్రీవు
ని నభిషిక్తుఁ జేయుమ నియమముగ
శీఘ్రముగను నీకుఁ జేయఁ దగదు వాని
తోడ విగ్రహమ్ము వీడి దయను 17.

కం. దూరమున నుంచి వైరము
గారవమున గాంచి మిన్నగను సుగ్రీవున్
వీరుని రాముని తోడుత
మూరి వహింపఁ జెలిమి భృశముగ నీ కొప్పున్ 18.

ఆ.వె. లాలనీయుఁ డౌను భ్రాత సుగ్రీవుఁడు
చిన్నవాఁడు నిక్క డున్నను నత
డక్క డున్న నీకు నగును బంధువు సంత
తమ్ము వానరుండు నెమ్మి చూడు 19.

చం. అతనిని మించి బంధువు నిహమ్మునఁ గాంచను నేను నీకు నా
తతముగ దాన మానములఁ దద్దయుఁ బ్రీతిని సత్కరింపుమా
పతిత మొనర్ప వైరమును బన్నుగ నిల్చును నీదు సన్నిధిన్
సతత మొసంగి సేవలను జక్కఁగ భక్తిని వానరేశ్వరా! 20.

తే.గీ. ప్రీతి సుగ్రీవుఁడు విపులగ్రీవుఁ డౌను
నీకు నుత్తమ బంధువు వీఁక నతని
సోదరప్రేమఁ గాంచుమ యొండు మార్గ 21.

మెద్ది లేదు నీ కిఁక వానరేంద్ర! నిజము

తే.గీ. నాకుఁ బ్రియము సేయఁ దలచిన మఱి నన్ను
నీ హితము కోరు దానిగ నీ వరసినఁ
దివిరి యాచింప నిన్ను నాదు వచనముల
నింపుగ నొనరింప వలయు నెలమి నీవు 22.

కం. కరుణింపుమ నను విను మీ
గిరలను వీడుమ కినుకను క్షేమము కాదీ
గురు తర వైరము శక్ర స
మ రఘువరుని తోడ నిట్టి మనుజేంద్రునితో 23.

కం. పలికెను బథ్య వచనములు
లలితమ్ములఁ దార య ట్లరసి పతి వాలిన్
విలయపుఁ దఱినిం గాల గ
త లయుఁడు వాలికి రుచింపఁ దగ వట నకటా 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బదునేనవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 16.

తార పల్కులను విని సుగ్రీవునిఁ దప్పక నెదిరించి వాని గర్వమును మాత్ర మడఁతును గాని వాని ప్రాణములను దీయ నని మరలు మని తా వెడలి వాలి తమ్మునితో యుద్ధము సేయు చుండ రాముఁడు వాలిపై నుగ్ర బాణమును వేయ నా శర ఘాతమునకు వాలి నేలఁ గూలుట.

కం. తారను నిజ దార శర
త్తారాధిప సన్నిభ ముఖి ధర్షించుచుఁ దా 1.

ఘోరముగఁ బల్కె నా హరి
వీరుఁడు వచనములు వాలి వింతగ నిట్లున్

తే.గీ. ఉత్సహించుచు గర్జించు చుండ నట్లు
భ్రాత మీదు మిక్కిలి వైరి పద్మనేత్ర!
సైపుటకుఁ గారణం బెద్ది సత్త్వవంతు
నకుఁ దలంప నుండు చెపుమ నాకు నింక 2.

చం. సమర తలమ్మునన్ మరలఁ జాలని ధిక్క్రియ సైప నట్టి స
ద్విమల చరిత్ర శూరులకు బెట్టిద మైన తిరస్కృతిన్ సహిం
ప మరణ తుల్య మై భృశము బాధ సెలంగు మనమ్ము నందు ని
త్యము నధికమ్ము నై తనరు నంబుజ లోచన భీత మానసా! 3.

ఉ. కాను సమర్థుఁడం దలపఁ గయ్యము కోరెడు వాని యుద్ధమున్
సే నొనరింప కుండఁగను నిల్వఁగ హీనపు గ్రీవుఁ దమ్మునిన్
దీనునిఁ జేయ నాకుఁ దగు దిట్ట తనమ్మున మించి గర్జితున్
మానిని! వీర ధర్మ మిది మాన్య వరేణ్యుల కెన్నఁ డేనియున్ 4.

తే.గీ. వలదు నీకు విచారము తలఁచి నాకు
రాఘవుని వలని విపత్తు రమణి! ధర్మ
వేత్తయుఁ గృతజ్ఞుఁ డా రఘు వీరుఁ డేల
పాపమున కొడంబడును నృపవర్షభుండు 5.

ఉ. నీవు వరాంగనా యుతము నెమ్మి తొలంగుమ రాఁగ నేలనో
పే విదితంబు నయ్యె నిటఁ బేరిమి సూపఁగ నిట్లు నీవు సు
గ్రీవుని నేను మార్కొనెదఁ గృత్స్నము గర్వ మడంతు వాని దౌ
చేవను దీయఁ బ్రాణములు శీఘ్రము వీడుమ సంభ్రమమ్మునున్ 6.

ఆ.వె. ఆతని సమరంపు టాశను దీర్తును
నేను నిలిచి యనిని మానితముగ
వృక్ష ముష్టి తతులఁ బీడింపఁ బడి వేగ
మరలి వెడలు నతఁడు కరము భీతి 7.

చం. కరము దురాత్ముఁ డాజి మమ గర్విత ఘాతములన్ సహింపఁ డొ
ర రమణి! చూపి తిట్టు లనురాగము నా పయిఁ జేసి సాయమున్
మరలుమ యొట్టు ప్రాణముల మామక సిద్ధ జయమ్ము పైననున్
దురమున గెల్చి శీఘ్రముగ దుష్ట సహోదరుఁ దోలి వచ్చెదన్ 8.

ఉ. అంతటఁ గౌఁగిలించుకొని యార్తినిఁ దార నిజేశు వాలినిన్
సాంతము తాఁ బ్రదక్షిణము నా కడు దక్షిణ సేసె వాలికిన్
వంత సెలంగ మంత్రముల స్వస్త్యయనమ్ము లొసంగి గెల్వఁ దా
నంతిపురమ్ము సేరె నిఁక నంగన లెల్లరఁ గూడి దీనతన్ 9.

తే.గీ. చేర నంతఃపురము తార నారుల సహి
తమ్ము వాలి వహించి కోపమ్ము నంత
సర్పము పగిది నిట్టూర్చి సత్వరమ్ము
వెడలె నగరమ్ము వీడి కపి ప్రవరుఁడు 10.

ఉ. చూచెను నిశ్వసించి కపి శూరుఁడు శత్రువుఁ గాంచ నల్దెసల్
చాచుచు వాలి చూపులను సత్త్వ సమృద్ధుఁడు నుగ్ర తేజుఁడై
వేచుచు నుండ సిద్ధముగ వీరునిఁ జూచెను హేమ పింగళుం
డౌ చిన భ్రాతనున్ వెలుఁగ నగ్ని నిభమ్ముగ మంచి గ్రీవునిన్ 11.

తే.గీ. చూచి సుగ్రీవుని బలుని వేచు చుండఁ
గట్టి వసనమ్ము గట్టిగ బెట్టిదంపుఁ
గిన్క నూని వాలి యెదురేఁగి వడి ముష్టి
ని బిగియించి దిట్టమ్ముగ నిల్చె ననికి 12.

మ. కనె సుగ్రీవుఁడు నంతఁ దాఁ బిడికిలిన్ గాడమ్ముగా వే బిగిం
చి నిరీక్షించెడు హేమమాలిని నిజశ్రేష్ఠాగ్రజున్ వాలినిం
గని సుగ్రీవుని వాలి యాగతునిఁ బల్కం జాగెఁ గోపమ్ము నన్
ఘన సంగ్రామ కళార్గ్య పండితునితోఁ గారిన్య వాక్యమ్ములన్ 13.

మ. కను మీ ముష్టి బిగింప నంగుళములన్ గాఢమ్ముగా వేగ తీ
యును నీ ప్రాణము లెల్లఁ దాఁక నిను నత్యుగ్రమ్ముగా నిచ్చటన్
విని సుగ్రీవుఁడు వాలి పల్కులను నిర్భీతిన్ వచించెన్ ఘనుం 14.

డని నీ మూర్ధము విచ్చు ముష్టిఁ దగ ప్రేయన్ నేను ఘోరమ్ముగన్

ఆ.వె. అంత వాలి చే రయమ్మునఁ దాడితుం
డయి కినుక సెలంగ నంగ మెల్లఁ
దడియ రుధిరమున వితతముగ సుగ్రీవుఁ
డస్ర యుత గిరి నిభ మగపడె నట 15.

తే.గీ. అంత సుగ్రీవుఁ డేకతమైన సాల
మొక్కటి పెకలించి బలిమి మొక్కవోక
తేజ మడర వాలి నడిచె నోజఁ బర్వ
తమ్ము నడుచు వజ్రము భంగి దారుణముగ 16.

తే.గీ. సాల తాడనమ్ము తగిలి చాల కంప
మందె వాలి మహాబలి యర్ణవమ్ము
నందు గురుతరమౌ భార మడర సార్థ
మైన నావ పగిది కాన నయ్యె నతఁడు 17.

ఉ. భీమ స వీర్య విక్రములు భీమ ఖగేంద్ర సమాన వేగు లు
ద్దామ శరీర గర్వితులు తద్ద పరస్పర రంధ్ర దర్శనుల్
భీమ రిపుఘ్ను లిర్వురు నభీత మనస్కులు చంద్ర సూర్య తే
జోమయ సన్ని భాంగులు విశుద్ధ యశస్వులు వృద్ధి నందుచున్ 18.

తే.గీ. యుద్ధ మందు నుండఁగ వాలి యుక్కు పెరుగు
చుండె మిక్కుటముగ నంత సూర్య సుతుని
వీర వరుని సుగ్రీవుని వీర్య మకట
సన్నగిల్లుచు నుండెను మిన్నగాను 19.

తే.గీ. వాలి వలన దర్ప మడఁగ బలము మంద
గింప రోష మడరఁగఁ జూపింపఁ జాగె
తన లఘుత్వము వాలికి ధైర్య శాలి
కించుక సమర మందుఁ దా మించి ధృతిని 20.

ఉ. కొమ్మల తోడ వృక్షముల ఘోర శిఖావలి వజ్ర కోటి సా 21.

మ్యమ్ములు నౌ నఖమ్ములను నంచిత ముష్టుల జాను పాద యు
గ్మమ్ముల బాహు దండముల మాటికి మాటికిఁ బోరు సల్పఁగా
నిమ్ముగ వృత్ర వాసవుల యేపున ఘోరపు టాజి సాగఁగా

కం. వానరులు రక్త సిక్తులు
కానన వాసు లొకరిని నొక రదల్చుచు రో
షాననులై గర్జించిరి
యా నినదము లంబుదస్వ నాభము లయ్యెన్ 22.

తే.గీ. చూచె రాముఁడు పల్కఁబు చూచు చుండ
దిక్కులను నేల సిగ్గుతో దిట్టతనము
కోల్పడంగ నిజ బలమ్ము కూలు చుండ
నున్న సుగ్రీవుని నపుడు యుద్ధ మందు 23.

కం. కని యార్తు వానరేశ్వరు
ఘనుఁడు మహాతేజుఁ డంతఁ గాకుత్స్థుఁడు వా
లిని వధియింపఁగఁ దన శర
మును వీక్షించెను స్వతూణమున నిశితమ్మున్ 24.

ఆ.వె. అంత వింటినిఁ గొని యాశీవిషోపము
శర వరము తగిల్చి చక్కఁ గాలు
కాల చక్ర నిభము కార్ముక మడరి పూ
రించె వేగ రాముఁ డంచితముగ 25.

ఆ.వె. ఆలకించి యంత నా నారి శబ్దమ్ము
భీతి యుద్భవింప నాతతముగఁ
బ్రళయ మంచు నెంచి పాఱె మృగమ్ములు
విహగ రాజములు వివిధ దిశలకు 26.

తే.గీ. వజ్ర నిర్ఘోష సదృశమ్ము జ్వలిత చంచ
లాభము విడువ బాణము నంబుజాక్షుఁ
డమిత తేజమున దశరథాత్మజుండు
పతిత మయ్యె నయ్యది వాలి వక్ష మందు 27.

తే.గీ. అంత నా మహా తేజుఁడు హరి విభుండు
వీర్య దర్పితుండు తగుల వేగముగ శ
రము రఘువర విముక్తము వ్రాలె నంత
వాలి నేల పైనఁ ద్రుటిని సోలి భృశము 28.

తే.గీ. ఆశ్వయుజ పూర్ణిమా దిన మందు నింద్రు
ధ్వజము వసుధ పైనఁ బడిన పగిది విగత
చేతనుండు తేజం బెల్లఁ జెడఁగ వాలి
నేల పైనఁ గూలఁ బడియెఁ గాల మహిమ 29.

కం. విడిచెను నరోత్తముం డా
బెడిదంపు శరము సువర్ణ విలసితమును గా
లుఁ డనఁ బడెడు నరి దమనము
నడర హరు నయన మహాగ్ని యనఁ బొగ తోడన్ 30.

తే.గీ. మారు తోద్ధత సుమజాల భార నమ్ర
పాద పాశోకము పగిది పడె విచేత
నుండు నై వాలి యింద్ర సుతుండు ధ్వంసి
తేంద్ర సుధ్వజము సరణి నిలను దూలి 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బదునాఱవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 17.

రామ శర ఘాతుఁడై రణ కర్కసుండు వాలి నేలఁ గూలి యార్తితో రాముని ధర్మ హీనుఁడ వైతి వని పరిపరి విధముల నిందించుట.

కం. రణ కర్కసుండు వాలి సు
గుణుఁడౌ రాముని శరమునఁ గొట్టఁబడంగన్
వ్రణ గాత్రుఁడు గూలె నిల ద్రు
ఘణ తాడిత పాదపమ్ము కరణి రయమునన్ 1.

కం. బంగరు నగలు వెలుఁగ స
ర్వాంగమ్ములు నేలఁ దాఁక నమరాధిపు నా
సంగర దివ్య పతాకము
భంగ ద్యుతి భంగి వాలి పడె వడి నేలన్ 2.

ఆ.వె. వానర గణ విభుఁడు వాలి గూలఁగ నేల
నష్ట పూర్ణ చంద్ర నభము భంగి
భూ తలమ్ము వెలుఁగ దా తఱి వింతఁగ
నుంత యేని కాంచి కాంతు నట్లు 3.

చం. పడినను వాలి నేల పయి వానర పుంగవుఁ డట్టు లా మహా
త్ముఁడు నిజ తేజ మేని కళ తోడ పరాక్రమ మింకఁ బ్రాణముల్
విడువడ నేర వింతయును బేర్మి నొసంగఁగ వజ్ర మాల నిం
ద్రుఁడు మును దానిచేఁ దనరెఁ దోరము సర్వము వాలి కింపుగన్ 4.

తే.గీ. వీరుఁ డా హరి యూథప విశ్రుతుండు
హేమ మాలా మహిమ మీఱ నింపు గొలిపె
నరయ సంధ్యా సమయ మందు నరుణ రుచుల
వెల్గు ఘన వారిదము భంగి విస్మయముగ 5.

ఆ.వె. అతని మాల మఱియు నంగము మర్మ ఘా
తి యగు శరము దాఁ బతితుఁ డయినను
ముప్విధమ్ములుగను బొడచూపెఁ గాంతుల
నా సమయము నందు నంచితముగ 6.

తే.గీ. రామ కార్ముక ముక్తము భీమ బాణ
ము హరి వీరు స్వర్గద్వారముఁ గనిపింపఁ 7.

జేయు నదియై పరమ గతి నీయఁ బిలుచు
నట్టు లుండె నప్పుడు గాంచ నస్త్ర వరము

సీ. పుణ్యాంతమున స్వర్గమును వీడి పుడమినిఁ గూలి నట్టి యయాతి వోలె యుగపు
టంత్య కాలము నందు నవనిపైఁ గూలు నాదిత్యుని సదృశమ్ము నత్యధికము
దుర్ధర్షుఁ డైన యింద్రు వలె దుస్సహుఁ డుపేంద్రుని భంగి నమ్మహేంద్రు తనయుండు
హేమ మాలియు వాలి యిద్ధాననుఁడు సింహ వక్షుఁడు నతి దీర్ఘ బాహు యుగుఁడు
తే.గీ. హరి విలోచనుండు వడఁగ నంక మందు
మంట లేని యగ్నినిఁ బోలి మానితముగ
నతనిఁ జూచుచు లక్ష్మణుఁ డనుగ మింప
రాముఁడు గని సమీపించె భీమ కపిని 8.

తే.గీ. వారి రాముని లక్ష్మణు బల్లిదు నట
వాలి కాంచి ధర్మ సహిత పరుష వాక్య
ములను బలికె నింక వినయముగను వీర
వరుఁడు వానర నాథుఁ డిప్పగిది నంత 9.

చం. నృవర సుత ప్రతీతుఁడవు ప్రీతిగఁ గన్పడు చుందు వీవు మా
నవ వర వంశ జాతుఁడ వనంత బలాఢ్యుఁడవే మహా యశ
స్వివి సుచరిత్ర తేజుఁడవు పేరొకనిం గవియంగ నన్య ది
క్కు వఱలు వాని బాణమునఁ గొట్టఁగ నెట్టి గుణమ్ము నందితే 10.

ఉ. రాముఁడు సద్దయాన్వితుఁడు రంజిలి కోరుఁ బ్రజా హితమ్మునుం
బ్రేమ మనస్కుఁ డోజను వివృద్ధుఁడు కాల విదుండు సువ్రతుం
డై మసలున్ నిరంతరము నంచును నీదు యశమ్ము నింపుగా
భూమినిఁ జెప్పు చుండుదురు భూజను లెల్లరు సంతతమ్మునున్ 11.

ఆ.వె. దమము శమము క్షమయు ధర్మము ధృతి పరా
క్రమము సత్య ము లన క్షత్రియులకు
గుణము లౌను రామ! క్రూ రాపరాధుల
దండనమ్ము తోడ ధరణి నెంచ 12.

ఆ.వె. ఆ గుణముల నెన్ని యాభిజాత్య మెఱిఁగి 13.

నీది నెడఁద భృశము నేను వచ్చి
నట్టి వాఁడ ననికి ననుజు సుగ్రీవుని
తోడఁ దారయు వలదు వలదన్న

తే.గీ. నన్ను నన్యుని తోడ రణమ్ము సేయు
వానినిఁ బ్రమత్తు సంరబ్ధు వాలిని నెది
రింపఁగ ననర్హుఁడవు విచారింప నంచుఁ
దోఁచె నాదు బుద్ధి నిటు లగోచరముగ 14.

తే.గీ. ఎఱుఁగ వినిహితాత్ముఁడ వని యిట్లు నిన్ను
ధర్మపుం జాటు నందు నధార్మికుండ
వంచుఁ బాప కర్ముఁడ వని మించి గడ్డి
చేత నావృత మైనట్టి నూతి వంచు 15.

ఉ. ఊనితి సాధు వేషము ననుత్తమ ముందువు కల్మషమ్ములం
గానఁగ రాని పావక నికాశివి ధర్మ చరిత్ర మిథ్యయే
నే నెఱుఁగంగ నిన్నిటుల నేరనె దేశ పురమ్ము లందునున్
నే నఘు మేని చేసితినె నీ కవమాన మొసంగ లేదుగా 16.

ఉ. నిన్నెదిరింప లే దనిని నే నెదిరించుచు నుంటి నన్యునిం
జెన్నుగఁ బండ్లు వేరులు భుజించి చరింతుము కాననమ్మునన్
మన్నన తోడ సంతతము మ్రాన్మనికిన్ నను మానవేశ్వరా!
యెన్నక ధర్మ మింత యిట నేల నదోషు వధింప నెంచితే 17.

చం. నృవర సుత ప్రతీతుఁడవు ప్రీతిగఁ గన్పడు చుందు వెప్పుడున్
సువిదిత సంజ్ఞ లింపుగను జొప్పడు చున్నవి ధర్మయుక్తముల్
భువి వర రాజ వంశమునఁ బుట్టి ప్రసిద్ధుఁడు క్రూర కర్మ రా
శి వెఱవ కుండ ధర్మ మని చిత్రముగా నొనరింపఁ బూనునే 18.

తే.గీ. రామ పుట్టితి రాజకులమ్ము నందు
ధర్మ మాచరింతు వని నిద్దర సువిశ్రు
తుండవు తగని విధముగఁ దోరము తగు
నంచు నెంచి పర్విడ నేల మించి యిట్లు 19.

ఆ.వె. సామ దాన ధర్మ సత్య క్షమలు ధృతి
విక్రమములతోడఁ బృథ్విని నప
రాధ దండనమ్ము రాజ! గుణం బగుఁ
బార్థివేంద్రులకు నవశ్య మెంచ 20.

కం. వన చరులము మృగముల మను
దినమ్ము ఫల మూలములను దింపు మిదియ మా
కు నిజ గుణం బగు రామ! య
వనీ పతివి నీవు మానవ వరేణ్యుఁడవున్ 21.

ఆ.వె. కారణమ్ము లగును గయ్యములకుఁ బుడ
మియు పసిడియు వెండి యయిన నెంచ
నీకు నివ్వనమున నాకున్న పేని పై
నాస ఫలముల కెద నాస పడితె 22.

ఆ.వె. నయ వినయములును మఱియు నిగ్ర హానుగ్ర
హములు కలుప కుంట యవని పతుల
వృత్తి యగును గామ వృత్తులు కాకూడ
దెంచ భూమి పతులు మించి యెపుడు 23.

ఉ. నీ దగు కోర్కి తీరుటయె నీకుఁ బ్రధానమ యస్థిరుండవై
మేదిని నిల్పు పెంచఁగను మిక్కిలి కోపివి రాజ వృత్తినిం
గా దన పెట్టి సంకరము కార్ముక నిత్య పరాయణుండవే
లే దెద రక్తి ధర్మమున లేదు వివేకము విత్త సృష్టినిన్ 24.

ఆ.వె. కామ వృత్తుఁడ వయి యో మనుజేశ్వర!
యింద్రియముల వలన నిద్ధరా త
లమ్ము నందు సంతతమ్ము లాగఁ బడుదు
వత్యధికముగ నిది సత్య మెంచ 25.

తే.గీ. ఒక్క బాణమున వధించి యుదరి యనప
రాధిని నను నీ పేమని రామ! సాదు 26.

పుంగవులతో వచింతువు పుడమిఁ జేసి
యతి జుగుప్సితంపుఁ బనిని నక్కజముగ

ఆ.వె. రాజ గో ధరామరఘ్నులు చోరులు
ప్రాణుల వధియించు వారు నాస్తి
క జనులు పరివేత్తలుఁ జనుదు రెల్లరు
ఘోరపు నరకమునకు రఘురామ! 27.

ఆ.వె. కొండియుండు పిసినిగొట్టు మిత్రఘ్నుండు
గురువు భార్య నెడఁదఁ గోరు వాఁడు
పాపు లేగు గతినిఁ బడయుదు రెల్లరు
సందియమ్ము సుంత యిందు లేదు 28.

తే.గీ. నాదు చర్మ మనర్హము నరులకు ధరి
యింప నెముకలు పెండ్రుక లింపు గావు
విబుధులకు నాదు మాంసము వినుమ నిన్ను
బోలు ధర్మచారు లెవరు ముట్ట రెందు 29.

తే.గీ. పంచ నఖములు కల్గిన పంచ మృగము
లేదుపంది యాళువయు మేలి యుడు మింక
నవనిఁ గుందేలు తాఁబేళు లంచితంపు
భక్ష్యములు క్షత్రియులకు  విప్ర వరులకును 30.

ఆ.వె. నాదు మాంసమును దినరు విబుధ జనులు
తాఁక రస్థి చర్మ తతుల మనుజు
లేను గోళ్ల మృగము నేను జంపఁ బడితిఁ
రాజ! కారణము నరయ నెడంద 31.

కం. ఇందుముఖి తార సత్యము
లందు సకల వేత్త  పలికె నాత్మగృహమునన్
డెందమునఁ గొనక మోహం
బంది యకట కాల వశుఁడ నయితి నరేంద్రా! 32.

తే.గీ. నాథునిగ నిన్ను గొన్న సనాథ కాదె
యీ వసుంధర కాకుత్స్థ! యెడఁద సెంచ
శీల సంపన్న ధూర్తుని స్వీయ పతిగఁ
గొన్న రక్షిత కాంత కాకున్న పగిది 33.

ఆ.వె. కుత్సితుండు నీచ కుజనుండు మిథ్యా వి
నయ మనస్కుఁ డఘ గణ సహితుండ
వైన నీ వకట మహాత్ముఁ డా దశరథు
నకు జనించి తెట్లు నర వరునకు 34.

తే.గీ. నడవడి యను గొలుసుఁ ద్రెంచి యడరి సాధు
జనుల మార్గ మతిక్రమించి నయ వర్త
న మను నంకుశము గణింపక మది రాముఁ
డనెడు నేనుఁగు గూల్ప నే నంత మయితి 35.

చం. తగని కరమ్ము చెడ్డ పని తద్ద విశంక నొనర్చి యిvvిధిన్
సుగతిఁ జరించు సాధువులు చూచి సహింపని యట్టి దానినిం
బగ నొన రించి పే కదిసి వారిని నేమని పల్కు వాఁడవో
యగపడె నీదు విక్రమ మనర్థులపై నరు లందుఁ గాంచమే 36.

చం. కనఁబడి నన్ను మార్కొనినఁ గయ్యము నందు నరేంద్ర పుంగవా!
కనఁబడు నీకు నా యముఁడు గ్రన్నన నే వధియింప నిన్ననిన్
ఘనుఁడను నే దురాసదుఁడఁ గన్పడ కీ విట నన్ను జంపితే
తనరఁగ నిద్రలోఁ బడగదారి నరున్ వలెఁ బాన మత్తునిన్ 37.

తే.గీ. నన్ను రామ! కోరిన నీవు మున్ను సీత
నొక్క దినమున నేఁ దెచ్చి యొసఁగు వాఁడ
యెంచి సుగ్రీవు ప్రియము వధించి తిడనె
చీల్చి రావణు మెడఁ దగిల్చి వటి నీకు 38.

కం. వనధి జలములో నైన న
వనిజను బాతాళ మందుఁ బావనినిం దాఁ
చినఁ దెత్తును నే నీ యా 39.

జ్ఞ నూని ధవ ళాశ్వతరిని సరణి నరేంద్రా!

తే.గీ. యుక్తమై చెల్లు సుగ్రీవుఁ డొంద రాజ్య
మెల్ల నేను స్వర్గమునకు నేఁగ రామ!
యుద్ధ మందు నీచే నిట్లయుక్త మౌను
జంపఁ బడ నధర్మ విధము కంప మంది 40.

తే.గీ. లోక మివ్విధిఁ గాలపు రాక నుండుఁ
దగునె నీ చేత నిట్లు పొందంగ నిహతి
తగిన యట్టి యుత్తరమును దలఁప వలయు
నా కొసంగ నింపుగ రామ! నరవరేణ్య! 41.

కం. అని యివ్విధి నో రెండఁగ
ఘనశర ఘాతవ్యథితుఁడు కపి పుంగవుఁ డా
యినకుల తిలకుం గని యం
త నాపెఁ బలుకు లమరేంద్ర తనయుం డలయన్ 42.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బదునేడవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 18.

వాలి మాటలను విని రాముఁడు వానికి నుత్తర మొసంగుచు నతనిని శిక్షించుటకుఁ గల కారణములను వివరింపఁగ వాలి తృప్తుఁడై మన్నింప మని వేఁడి తన కుమారుఁ డైన యంగదుని రక్షింప మని వేఁడికొన రాముఁ డూఱడించుట.

చం. పలుకఁగ నర్థ ధర్మ యుత వాక్యములన్ వినయమ్ము తోడుతన్
వెలయఁగఁ బౌరుషమ్ము కపి వీరుఁడు వాలి విచేతనుండు కాం 1.

తు లణఁగి నట్టి సూర్యు వలెఁ దోఁచెడు నిర్జల మేఘు తుల్యుఁడుం
జెలఁగని యగ్ని సన్నిభము జీర్ణ నిజప్రభ వానరేంద్రుఁడే

తే.గీ. కాంచి వాన రేశ్వరు నధికముగఁ దన్ను
నవ్విధం బధిక్షేపింప నంత రాముఁ
డిట్లు పలుకఁ దొడఁగె గిర లింపుగఁ గడు
నర్థ వంతములు మహాత్ముఁ డతని తోడ 2.

తే.గీ. కామ ధర్మార్థ లౌకక కాలములను
నేర కుండ బాల్యమ్మున మూరి నన్ను
నింద సేయు చుంటివి పెద్ద లందఱఁ దగ
సంప్రదింపక వానర చపలత నిట 3.

కం. స వ నాద్రి కాననం బై
న వసుధ యిక్ష్వాకు వంశ నాథుల దగు మా
నవులం గూడి మృగ విహం
గ వితతి దండింప నింకఁ గావఁగ నర్హుల్ 4.

చం. భరతుఁడు ధర్మ మానసుఁడు పాలన మింపుగఁ జేయు దానినిన్
విరివి నెఱుంగు ధర్మమును విత్తముఁ గామము వాని తత్త్వముల్
కరుణను నిగ్రహమ్మున సుఖమ్ముగ వర్తిలు నీతి శిక్షలం
బరఁగును నిల్చు సత్యమునఁ బన్నుగ నేరును దేశ కాలముల్ 5.

తే.గీ. విక్రముఁ డతని యాజ్ఞతోఁ బృథ్వి నున్న
యన్య రాజులు మేమును నవని యందు
నిల్ప ధర్మమును మది సంకల్ప మూని
సతము చరియించు చుందు మిచ్ఛను వహించి 6.

తే.గీ. భరతుఁడు నరర్షభుఁడు ధర్మ వత్సలుండు
పాలనమ్ము సేయుచు నుండ వసుధ నెల్ల
ధర్మ నిగ్రహమ్మును జేయఁ దలఁచు వార
లెవ్వ రుందురు ధర లోన నెంచి చూడ 7.

ఉ. ఆరసి ధర్మ నాశకుల నందఱ నిల్చి స్వ ధర్మమందు మే
మే రతి నుంచి యా భరతుఁ డిచ్చిన యానతిపై యథావిధిన్
వారిని నిగ్రహించుచు నవారిత రీతిని నుందు మెన్నఁడున్
మూరిన కామ భావమునఁ బూనితి వీ విట ధర్మ హానికిన్ 8.

ఆ.వె. గర్హితంపుఁ బనినిఁ గపిముఖ్య సేసితే
నిలువ కుంటి వీవు లలిత రాజ
మార్గ మందు నుత్తమంపు మార్గమ్మును
గౌరవింప కుంటి వౌర సుంత 9.

ఆ.వె. ధర్మ వర్తనులకుఁ దండ్రియు నన్నయు
విద్య నొసఁగి నట్టి విబుధ వరుఁడు
జగము నందు నెంచ జనకు లనఁ బడుదు
రు ధర లోన ముగ్గురు హరిముఖ్య! 10.

ఆ.వె. అవరజునిఁ గుమారుఁ నంచిత గుణ శిష్యు
ముష్వుర నెద స్వీయ పుత్రుల వలెఁ
గాంచ వలయు ధర్మ మెంచ నిక్కముగను
జగతి నెల్ల వారి కగును నీతి 11.

ఆ.వె. ధర్మ సూక్ష్మ మరయఁ దద్ద కష్ట మగును
సుజన చరిత మవనిఁ జొచ్చి జనుల
యెదల నున్న యాత్మ యింపుగ నేరు శు
భాశుభముల వాన రాధిపుండ! 12.

కం. చపలుఁడ వకృతాత్ము లయిన
కపులను గూడి చరియింతు కపిగణ నాథా!
విపు లాంధుఁడు జాత్యంధుని
విపరీతమ విశ్వసించు విధముగఁ బనులన్ 13.

కం. ఆ వచనమ్ముల కుత్తర
మే వివరింతు విపులముగ నిట్టులఁ గోపం
బే వలల నన్ను దూఱం 14.

గా వల దుచితమ్ము కాదు కపి గణ నాథా!

చం. కనుమ హరీ! కతం బిదియుఁ గయ్యము నందు వధింప నిన్ను నే
మనమున నిశ్చయించుటకు మాన్య పురాతన ధర్మ మెంచకే
యనుజుని భార్య యా రుమను నక్కట కోడలిఁ గోరి తీవు ధా
త్రిని ననుజుండు ప్రాణము ధరించి వసింప నఘం బొనర్చితే 15.

తే.గీ. ధర్మము నతిక్రమించి నీ తమ్ముని సతి
నీవు కామవృత్తిని నపనింద పాలు
సేసితివి కాన దండ మిచ్చితిని నీకు
నివ్విధమ్ముగ న్యాయమ యెంచి చూడ 16.

కం. వితతమ్ముగ నిల ధర్మ
వ్యతిరేకికి లోక వృత్త వర్జితునకు నే
నితరము దండనమున కే
గతి నెంచినఁ గాంచ నెద్ది కపిగణ నాథా! 17.

ఉ. రాజకు లోద్భవుండను భరం బగు నీ యఘు మే సహింప నే
యోజను స్వీయ పుత్రి మఱియుం దన చెల్లెలిఁ దమ్ము దారనున్
నైజ విరుద్ధ దృష్టిఁ గనినం ద్రుటి నిద్ధర మృత్యు దండనం
బే జరపంగఁ గాముకున కెన్నఁడు నొప్పు నటంచు విత్తమే 18.

తే.గీ. భరతుఁ డివ్వసుధకు నెల్లఁ బాలకుండు
వాని పంపుఁ బాటించెడి వార మేము
ధర్మమును తప్పితివి యివ్విధమ్ము నీవు
నిన్ను నెట్లుపేక్షింతుము కన్నపిదప 19.

కం. భరతుఁడు ఘనుండు ప్రాజ్ఞుఁడు
పరిపాలించుచును ధర్మ బద్ధత సతముం
బరికించి కామ వృత్తుల
గురుతరముగ నిగ్రహింపఁ గొలువున నుండున్ 20.

కం. భర తాదేశమున నిలిచి 21.

హరినాథుఁడ! నిన్ను బోలు నట్టి ఘ నాధ
ర్మ రతులఁ జ్యుత మర్యాదుల
ఖరముగ శిక్షింప మూరి కడఁగుదు మెపుడున్

మ. చను సుగ్రీవుని తోడి స్నేహము వనిన్ సౌమిత్రి సఖ్యాభమై
వనితా రాజ్యము లింక క్షేమమునకై భద్రప్రతిజ్ఞం దమిన్
ఘన శాఖామృగ కోటి సన్నిధినిఁ జక్కం జేసి నే నెట్లు దా
ని నుపేక్షించి చరించు వాఁడ నిచటన్ నిశ్శంక నిర్భీతినిన్ 22.

ఆ.వె. ధర్మయుక్తము లయి తద్ద చెలఁగు కార
ణముల నెంచి నొసఁగిన తవ దండ
నమ్ము యుక్త మంచు నెమ్మదిఁ దలపోసి
గౌరవింపఁ దగుదు కపి గణేశ! 23.

తే.గీ. ధర్మ మని నిగ్రహమ్మును దలఁప వలయు
దీని నన్ని భంగుల నీవు, పూని సఖుని
ధర్మ రతునకుఁ గావఁ గర్తవ్య మంచు
నెఱుఁగ వలయు దృఢమ్ముగ నెవ్వ రేని 24.

తే.గీ. కనిన ధర్మము నీకు శక్యం బగు నది
మనువు నుడివె నప్పుడు రెండు మంచి శ్లోక
గీతములు నయములు కొంటి నీ తఱిఁ దగ
వాని రెంటిని నే నిట వానరేంద్ర! 25.

ఆ.వె. చేయ మానవులు విశేష పాపములను
నిర్మలు లయి రాజు నెగడి యొసఁగ
దండనమ్ము బుధులు తరలు స్వర్గమునకు
నేఁగు వార లగుదు రెల్ల నిజము 26.

తే.గీ. రాజ దండనమ్మున నైనఁ బ్రకృతి మోక్ష
మబ్బిన నయిన దొంగకు నఘము తొలఁగు
రాజు దండింప కున్న నరసి యఘమ్ముఁ
దానిఁ బొందును భూపతి తథ్యముగను 27.

కం. శ్రమణుఁ డొనరింపఁ బాపము
ను మున్ను నిను బోలి వసుధను వినుమ మా వం
శము వాఁ డగు మాంధాత పు
డమి పతి పొందె వ్యసనం బడర ఘోరముగన్ 28.

కం. ఇతరుల యఘములకుఁ బ్రమ
త్తత నున్న ధరాపతు లిలఁ దగిన విధముగన్
రతిఁ బ్రాయశ్చిత్తము సే
సి తొలఁగుదురు ధూళి నుండి శ్రేష్ఠ తరముగన్ 29.

కం. చాలు నిఁక వగవ హరి శా
ర్దూల! వధము ధర్మ బుద్ధితో జరపఁబడెం
జాలము స్వవశమునఁ దనర
సే లీలను మేము నిక్క మెంచఁ గపీశా! 30.

ఆ.వె. కారణంబు నొండు కలదు హరిశ్రేష్ఠ!
వినఁగ దేని నింక మనము నందు
రోష మూనఁ దగవు రుచిరంపు టక్కార
ణమ్ము ధర్మ సమ్మతమ్ము భృశము 31.

చం. వలలను బాశ రాజముల వంచన సైనను దాఁగి యుండియున్
మలఁగక తాము కన్పడుచు మానవు లన్యము లైనవౌ విధ
మ్ములను గ్రహింపరే మృగ సమూహము నింపుగ నక్కతమ్మునం
గలఁత వహింపఁ గోపమునఁ గందను సే హరి వీరపుంగవా! 32.

చం. పరుగిడు చున్న వాని భయపడ్డ మృగమ్ముల నమ్మకమ్మునం
బరఁగెడు వాని నిల్చి గను వానిని మత్తము లప్రమత్తముల్
తిరుగఁగఁ గాంచు చుండి పర దిక్కులు మాంసము నారగింపఁగా
నరులు వధింతు రచ్చటఁ గనంగ ననర్థము దోష మెద్దియున్ 33.

తే.గీ. ధర్మ కోవిదు లైనట్టి ధరణి ధవులు
రాజ ఋషులు పేటాడు వార లిలఁ గాన 34.

నాదు శర నిహతుఁడవు రణమున మృగమ
వీ పెదిర్చిన లేకున్న సెంచ నెడఁద

ఉ. భూపతు లిచ్చువారు శుభముల్ ధర ధర్మము దుర్లభమ్ములం
బ్రాపును జీవితమ్ములను వానర పుంగవ! సంశయమ్ము లే
దీ పుడమిన్ నృపాలిఁ గని యెన్నఁ డగౌరవ మప్రియమ్ము లౌ
యే పలుకుల్ వచింపఁ దగ దిద్ధర వారు నరాకృతుల్ సురల్ 35.

ఆ.వె. నీవు రోష మూని కేవలము పితృ పి
తామహ క్రమమునఁ దనరు ధర్మ
మందు నిలువ నన్ను నరయక ధర్మము
దూఱు చుంటి విట్లు తోరముగను 36.

కం. పలుకఁగ రాముం డివ్విధిఁ
గలఁగి భృశము వాలి యెడఁదఁ గపి పుంగవుఁ డ
ట్టు లెఱుంగ ధర్మ సూక్ష్మము
తలఁపఁడు రాఘవుని యందుఁ దప్పు నొకింతన్ 37.

కం. బదులిడె నంజలి నిడి స
మ్మదమున రఘువీరు తోడ మాటల నిట్లున్
సదయ రఘూత్తమ నీ వ
న్నది యెల్ల నిజంబ యగుఁ గనను సంశయమున్ 38.

తే.గీ. రామ! శ్రేష్ఠున కిడ నుత్తరమ్ము తరము
కాదు ప్రాకృతునకు మున్ను నేఁ దెలియక
యన్న వచనమ్ములకు దోష మెన్నఁ దగదు
నీకుఁ గాకుత్స్థ! మదిలోన నీరజాక్ష! 39.

తే.గీ. నీవు దృష్టార్థ నిక్షిప్త భావ వేత్త
వఖిల జనులకు నొనరింతు వంచిత ప్రి
యమ్ము కార్య కారణముల నరయఁ గలవు
సుప్రసన్నుఁడ వింకఁ బ్రాజ్ఞుండ వీవు 40.

ఆ.వె. వీత ధర్ము నన్ను విగత మర్యాదునిఁ
బాలనమ్ము సేయ వలయు నీవు
ధర్మ సంహితమ్ము తగు వాక్యముల నింక
ధర్మ వేత్త! కరుణఁ దనుపు మయ్య 41.

తే.గీ. సద్గుణ శ్రేష్ఠు నంగదు స్వర్ణ మయ వ
రాంగద విభూషితుని సుతు నరయు నట్లు
చూడను సతిని నన్నునుఁ జుట్టముల న
యిన రఘూద్వహుండ! యెడఁద నెవరి నైన 42.

కం. చిన్నతనము నుండి యతఁడు
మిన్నగ లాలింపఁబడ నిమిష మైనను దా
నన్నరయ కున్న శోషిం
చున్నీరము లేని సరసి చొప్పు నరేంద్రా! 43.

ఆ.వె. బాలుఁ డకృత బుద్ధి చాల ప్రియుఁడు నాకు
నేక సుతుఁడు బలుఁడు వీఁక నీవు
రక్ష సేయ వలయు రమణి తార సుతుని
రామ కరుణ తోడ రాగ మూని 44.

ఆ.వె. చూపు రమ్య దృష్టి సుగ్రీవుని పయి నం
గదుని పైన మించి గతులు మంచి
చెడుల నరసి రామ! శిక్షకుఁడవు రక్ష
కుండ వీవ యింక మెండుగాను 45.

తే.గీ. రాజ! యెవ్విధము భరత లక్ష్మణులను
చూతు వీ వవ్విధము గానె చూడఁ దగుదు
వయ్య సుగ్రీవు నంగదు నంచితముగ
నెల్ల వేళల వారినిఁ జల్లగాను 46.

శా. నా దోషంబుఁ దలంచి డెందమునఁ దా నా తారఁ దప్తాత్మనున్
భేదింపన్ మది నెంచ కుండఁ గనుమా వీరుండ! సుగ్రీవునిన్
నీదౌ ప్రేమ నెలంగఁ బొందఁ దరమౌ నిశ్శంక రాజ్యమ్ము నీ 47.

యాదేశమ్ము వహింప స్వర్గమును వే యందంగ శక్యంబునౌ

ఉ. నీ కర పద్మ మృత్యువును నే వరియించి నివారణమ్ము తా
వీఁక నొనర్పఁ దార నను వీరుని తమ్ముని తోడ నివ్విధిన్
భీకర యుద్ధ కాంక్షి నయి వేగమ వచ్చితి నంచు వాలియే
యీ కరుణా యుతమ్ము లని హీన రవమ్మున మిన్నకుండినన్ 48.

కం. విని రాముఁ డాశ్వసించెను
ఘన ధర్మయు తోక్తుల ఘనుఁ గపి పుంగవు సా
నునయముగ వాలి నివ్విధ
మునఁ గాకుత్స్థుండు సత్యముఁ గనిన వానిన్ 49.

తే.గీ ధర్మ పరము నీ కార్యముఁ దలఁచి నిశ్చ
యించి యుంటిమి మమ్ముల నెంచి యింక
నిన్నును వగవఁ దగ విప్పనికి నెడందఁ
బ్లవగ సత్తమ! చింతా వివశుఁడ వగుచు 50.

తే.గీ. దండితుఁ డగును దప్పక దండ్యుఁ డరయ
దండన మొసంగు దండింపఁ దగిన వాఁడు
కార్య కారణ ఫలితమ్ముగ నగు నట్లు
లయము నంద రుభయులు ధరణిఁ గనంగ 51.

ఆ.వె. వీత కల్మషుఁడవు వేగ మైతివి దండ
నమున ధర్మ యుతము సముచితంపు
నీదు ప్రకృతి గతియు నీకు ధర్మ్యము ప్రాప్త
మయ్యె నివ్విధముగ హరివరేణ్య! 52.

కం. మన మందు నిలిచిన భయ
మ్మును మోహము నేని శోకమును విడువుమ యె
ల్లను దూర్ణముగను దాఁటం
గ నీకు విధిఁ గాదు తరము కపిగణ నాథా! 53.

ఆ.వె. అంగదుండు వానరార్గ్య! నీ యందు నె 54.

వ్విధము నడచు చుండు వినుము యవ్వి
ధంబ సంతతం బతండు నా యందు సు
గ్రీవు నందు నడచు లేదు శంక

కం. విని ధర్మగతు మహాత్ముని
ఘన రిపు దమను వచనములఁ గమ్మగఁ దాఁ బ
ల్కిన రాముఁడు వాలి బదులు
గ నొసంగెను మాట లిట్లు కపివరుఁ డంతన్ 55.

కం. కరుణించి క్షమింపుము న
న్ను రఘువర! విచేతనుఁడ నిను దెలియ కకటా
శర ఘాతుఁడ నింద్రోపమ
గురువిక్రమ! దూఱితి నిటఁ గోదండకరా! 56.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ బదునెనిమిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 19.

క్షతగాత్రుఁడు వాలి నేలపైఁ బడి యుండుట నెఱిఁగి భార్య తార యంగదునిఁ గూడి గుహ వెడలి రాఁగ వానరు లంగదుని నభిషేకింపు మని లేక కిష్కింధను వీడుట యుత్తమ మని పలుక తార వినక యచటకు వచ్చి రామలక్ష్మణులను, సుగ్రీవునిఁ గని దాఁటి భర్తను గాంచి దుఃఖమ్మున మూర్ఛిల్లి లేచి విలపింప సుగ్రీవుఁడు మిక్కిలి దుఃఖితుఁ డగుట.

కం. ఓజ సెడ వానర మహా
రాజు శిత శర క్షతుండు రాముని హేతు
భ్రాజిత వచనమ్ములు విని
తా జడత నొసఁగఁడు బదులు తదుపరి నెగులన్ 1.

తే.గీ. అశ్మ భిన్న శరీరుండు హరివరుండు
వాలి పాదప తాడి తావయవ సంచ
యుండు రామ బాణ హత గాత్రుండు జీవి
తాంత వేళఁ బుడమి మూర్ఛ నంది పడియె 2.

తే.గీ. ప్లవగ శార్దూలుఁడు తనదు భర్త యుద్ధ
భూమి లోపల రఘురామ మోచిత శిత
బాణ మహిమ రాఘవ దత్త పరమ మోక్ష
మందె నంచు వినెను దార డెంద మవియ 3.

చం. విని యతి దారుణమ్ము హరి వీరుని వాలి వధమ్ము చింతతోఁ
దనయునిఁ గూడి యంగదునిఁ దార గుహాంతర మంత వీడి వ
చ్చెను వడి భర్తృ శోకమున శీఘ్రము యంగదు సేన వింటితోఁ
గనఁబడ రాముఁ డచ్చటను గాంచి భయమ్మునఁ బాఱె నయ్యెడన్ 4.

ఉ. వారినిఁ గాంచి తార యట వచ్చెడు వానర వీర బృందమున్
బోరన సేఁగు సేణులను బోలుచు మందను వీడి చావఁగా
ఘోర విధమ్ము యూధపము కుందెడు కోతులఁ జేరి తా ననెం
దార కలంత రామ శర తర్జిత రీతినిఁ బాఱు వారితో 5.

తే.గీ. రాజ సింహునకుఁ బురస్సరమ్ముగా న
రిగెడు వార! వానరు లార! ప్రియ తర విభు
వీడి దుఃఖితులై కడు భీతి తోడ
నెక్కడికిఁ బాఱు చుంటిరి యక్కజముగ 6.

ఉ. భ్రాతయె రాజ్య లబ్ధి కయి రౌద్రము నూని భృశమ్ము వాలినిన్
భ్రాతను జంప లేదు గద వానర పుంగవు లార! దూర సం
పాత సమర్థ రౌద్రతర బాణము రామ విముక్త మైన యే
నాతత మా కపీంద్రుఁడు రయమ్మున నందెనె స్వీయ మృత్యువున్ 7.

ఆ.వె. వాలి దార తార ప్రశ్నింప నవ్విధిఁ
గామ రూపు లైన కపులు స్పష్ట 8.

వచనములఁ బలికిరి వనితా మణికి నిట్లు
ప్రాప్త కాలమును వివరము గాను

ఆ.వె. ఉండ బ్రతికి యంగదుండు పే వెనుకకు
దిరిగి కావు మమ్మ దీను సుతుని
రామ రూప మూని భీమాంతకుండు చం
పి కొనిపోవు చుండె వీరు వాలి 9.

ఆ.వె. విసరఁ బడ్డ తరుల విపుల శిలల నెల్ల
వజ్ర నిభ శరములఁ బగులఁ గొట్టి
నట్టి రాముచే నిహతుఁ డయ్యె వాలి యా
వానరేశ్వరుండు భండనమున 10.

చం. ఎదిరిచి నట్టి సర్వ బల మిప్పుడు విద్రుతమై భృశమ్ముగాఁ
జెదరెను జూచి కూలఁ గపి శేఖరుఁ డింద్ర సముండు వాలియే
పదమున నిల్పుమా సుతుని వారక యా యభిషిక్తుఁ డైన నం
గదుని భజింత్రు వానరులు కావుమ యీ నగరంపు ద్వారమున్ 11.

కం. రుచిరానన! లేకున్న న
నుచిత మునికి నీ కిచట వినుమ తివురుచు వా
రచిర మరుదెంచి యన్య వ
నచరులు చొచ్చెదరు చయ్యన స్వదుర్గములన్ 12.

ఆ.వె. భార్య హీనులును సభార్యులు దార లు
బ్ధులు నితరులు నిజ సతులకు దూర
మైన వారు సెగడ వానరుల వలన
భయము మెండు మనకుఁ బరఁగు నెంచ 13.

తే.గీ. అల్ప బుద్ధుల వాక్కుల నాలకించి
చారుహాసిని మఱి యాత్మ సదృశము లగు
భాషణమ్ములు వల్కెను భామ తార
యంత వారి యెల్లర తోడ నంచితముగ 14.

ఆ.వె.   ఏమి ఫలము నాకు నీ పుత్రుని వలన
నింక  రాజ్య మైన నేల నాకు
వానరర్షభుండు వాలి నశింప నా
జీవితమ్ము నేల  చింత మీఱ   15.

చం.   హరివరు పాద మూలముల నంటెద నేఁ జని యాశ్రయింతు నె
వ్వరు రఘు రామ బాణమునఁ బాతితుఁ డయ్యెనొ యా మహాత్మునిన్
శిరము నురమ్ముఁ దార తన చేతుల గట్టిగ బాఁదుకొంచుఁ దాఁ
బరువిడెఁ బల్కి యివ్విధి నపార విచారము తోడ నేడ్చుచున్   16.

చం.   అటఁ జని కాంచె భర్తను మహావనిఁ గూలిన వానరేంద్రునిం
బటుతర దాన వేంద్రగణ భండన హంతకు యుద్ధ భూమిలోఁ
గటువుగ నుండి పాఱని సగర్వ బలాన్వితు మారు తాభ వి
స్ఫుటు ఘన నిస్వ నాభ రవ శోభితు నింద్ర నిభాద్రి భేదినిన్   17.

చం.   పర గణ మాక్రమించుటను వాసవుఁ బోలిన వాని వర్షమే
కురిసిన యంత మేఘమునకున్ సరి పోలిన యట్టి వాని భీ
కరముగ నార్చు వానిఁ బెను గండని శూరవ రార్తి నిత్య మాం
స రత మహోగ్ర పంచనఖ సత్త్వ విఖండిత సింహ తుల్యునిన్   18.

తే.గీ.   సర్వ లోకార్చితము సధ్వజము సవేది
క విలసిల్లుచు సర్పపుఁ గారణము సు
పర్ణుచేఁ గూల్పఁ బడి నట్టి పావనంపుఁ
జైత్యమును బోలు వానిని శక్రసూను   19.

ఆ.వె.   ఉత్తమంపు వింటి నూని యున్నట్టి రా
ముని నతని యనుజుని ముద్దియ గనె
భర్త సోదరుని శుభవదన తార య
చ్చోట నిలిచి యుండ శోకమునను   20.

ఆ.వె.   రాఘవులను దాఁటి రణ మందు హతుఁడైన
పతినిఁ జేరి కాంచి వ్యథ సెలంగ
మిక్కుటముగ మదిని మేదినిఁ గూలె సం   21.

భ్రాంత యయి రయమునఁ బడతి తార

కం. నిదుర ననఁగ లేచి తిరిగి
వదరుచుఁ దా నార్య పుత్ర! పలుకవె యంచున్
వదలక యేడ్చెను యా మృ
త్యు దామ భాసిత పతిఁ గని దుఃఖం బడరన్ 22.

కం. కురరీ నిభమ్ము రోదిం
చు రమణి తారాసతిఁ గని సుగ్రీవుఁ డెదన్
హరి సుతుఁ డంగదుఁ డేతెం
చ రయమున నచటకుఁ గాంచి సంతాపించెన్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందుఁ
బందొమ్మిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 20.

రామ బాణ హతుఁడై భూమిపైఁ బడియున్న భర్తను వాలినిఁ గౌఁగిలించికొని తార పరిపరి విధముల
విలపించుచుఁ బ్రాయోపవేశమున కుద్యుక్త యగుట.

కం. కని యంతకర రఘూత్తమ
ఘన కర ముక్త శర నిహతుఁ గదిసి యవని వా
లినిఁ దారాధిప సదృశా
నన తార పరిష్వజించె నాథుని నంతన్ 1.

చం. ఘన శర విద్ధు వాలి నిజ కాంతునిఁ గుంజర నాథ సన్నిభున్
వనచర కోటి నాథు సుర వల్లభ సన్నిభుఁ గాంచి యవ్విధిన్
వనరెను శోక తప్త యయి స్వాంతము నందు భృశమ్ము తార కూ 2.

లిన తరు సన్నిభమ్ముగను రేఁగిన సంభ్రమ విస్మయమ్ములన్

తే.గీ. సమర విక్రాంత! వానర సంచ యార్గ్య!
వీర పుంగవ! నీ పేల దార తార
తోడ దీనురాలి నగు నా తోడ నిపుడు
పలుక కుంటివి నీ పెన్క వగచు చుండ 3.

తే.గీ. లెమ్మిఁక హరి శార్దూల! పరిగ్రహింపు
ముత్తమంపు శయ్య నడరి యుర్వి నిట్లు
నిన్ను బోలు రాజవరేణ్యు లెన్నఁ డేని
నిదుర వోదురె కపినాథ! నిక్క మెంచ 4.

ఉ. మిక్కిలి ప్రేమ నీకుఁ దవ మేదిని పైనను మేదినీశ్వరా!
యక్కట మృత్యు వందినఁ బ్రియమ్ముగ నంగము లెల్లఁ దాఁకఁగాఁ
జక్కఁగఁ గౌఁగిలించితివె సత్సతి తారను నన్ను వీడి నీ
వక్కజ మిట్టు లివ్వసుధ నౌర హరీశ్వర! యేమిచెప్పుదున్ 5.

ఆ.వె. వ్యక్త మన్య మొండు పరఁగఁ గిష్కింధను
బోలి స్వర్గ మార్గమునఁ దలంప
ధర్మ మెల్ల నిర్మితం బయ్యె నంచు నీ
వలన రమ్య మైన పట్టణమ్ము 6.

కం. మన వన విహారములు చ
క్కని వాసనలం దనరెడు కానలయం దిం
క నరయ మెన్నఁడు నీ చే
తను విరమింపఁ బడ నాథ! దారుణ మయ్యెన్ 7.

కం హరి యూథప యూథప! నీ
వరయం బంచత్వము పడ వగ సంద్రమునం
గరము నిరానందను నే
నిరాశ నయితిని చెలఁగెను నిస్స్పృహ యెడఁదన్ 8.

ఆ.వె. పతిని హతునిఁ గాంచి పగులదు నా గుండె 9.

శోక తప్త నయినఁ జోద్యముగను
పేయి వ్రక్కలుగను ఱాయి యగును దప్ప
కుండఁ గఠిన మగును మెండుగాను

ఉ. తమ్ముని ద్రోసి పుచ్చితివి తల్పక న్యాయము సుంత యేనియుం
దమ్ముని భార్య నందితివి ధర్మము సెన్నక వానరేశ్వరా!
యిమ్మహి నీవు తత్ఫలిత మివ్విధి నందితి వెంచి చూడఁగా
నెమ్మెయి స్వీయ పాపము వహింపక తప్పునె యేరి కైననున్ 10.

ఆ.వె. నీదు మేలు నందు నిరతి మీఱ హితైషి
ణి నయి నేను పలుక నీకు హితము
మోహము సెలఁగఁ భృశ మో హరీశ్వర! విన
నేర వా పలుకుల నౌర సుంత 11.

కం. రూపమున యౌవనమ్మున
నైపుణమున గర్వమున్న నాక వనితలం
దేపుగ మానద! నాథా!
చూపుదు చాతుర్య మీవు సుందర రీతిన్ 12.

కం. దురతిక్రమమ్ము కాలం
బరయఁగఁ బ్రాణాంతకంబ యవశుఁడవే నో
దరు సుగ్రీవుని వశమునఁ
గర మాశ్చర్యముగఁ బడితి కపివర ముఖ్యా! 13.

ఆ.వె. శోక మెఱుఁగ నట్టి సుదతి నేఁ డక్కట
జాలి గొలుపు కరము సైప లేని
నాథ హీన భంగి నడచు వైధవ్యము
నిట్లు తార వడసె హీనముగను 14.

కం. పినతండ్రి కోపము వహిం
ప నా తనయుఁ డంగదుండు వర లాలితుఁ డా
చినవాఁడు వీరుఁడు సుఖము
ల నెఱింగిన వాఁడు మనఁ గలం డెబ్బంగిన్ 15.

ఆ.వె. చక్కఁగఁ గను మయ్య జనకుని ధర్మవ
త్సలుని శీఘ్ర మింక దనయ! వేని
దర్శనమ్ము మనకు దద్ద దుర్లభ మగు
ధరణి యందు నెందుఁ దథ్యముగను 16.

ఉ. అంగదుఁ బుత్రునిం బయన మై చనుచుండఁ గపీంద్ర! వాని మూ
ర్ధాంగము ప్రీతి మూర్కొనుచు నంచిత రీతిని నూఱడింపు మ
ర్ధాంగి కొసంగు మానతి మహాత్మ! వచింపక యెద్ది యేని యి
ట్భంగిని మిన్నకుండు టది పాడియె చెప్పుమ వానరోత్తమా! 17.

కం. నిన్ను వధించి రఘువరుఁడు
క్రన్ననఁ గొప్ప పనిఁ జేసె రాముఁడు తీర్చెం
జెన్నుగ సుగ్రీవు ఋణము
నన్నర వరుఁడు నెఱవేర్చి యాడిన మాటన్ 18.

తే.గీ. కపి వరేణ్య సుగ్రీవ! సకాముఁడ వయి
తనరుమ రుమా సతిని నీదు దయితఁ బొందఁ
గల వనుభ వింపు మింక నకంటకమ్ము
హతుఁడు కా భ్రాత రాజ్యము నలరి మిగుల 19.

చం. పలుకఁ దలంప వేల కడు బాధను నే విలపించు చుండఁగా
లలితను గాంచి మీఱ ననురాగము వీరిని నీదు పెక్కు భా
ర్యల నిట గాంచుమా హరివరా! యనఁ దారయె వాలి యంగనల్
పలువురు చేరి యంగదునిఁ బట్టి వగన్ విలపించి రెల్లరున్ 20.

తే.గీ. వీర! యంగదు సాంగద వీరబాహు!
విడిచి ప్రియపుత్రుఁ జేసెదు తడయ కిట్టు
లం జిరప్రవాసము వానరప్రవీర
యుక్త మౌనె నీ కియ్యది రక్తి లేక 21.

ఆ.వె. చారు వేష! నీ కుమారుఁ డేనియు నేను
గాని చేసి నట్టి కాంత! దోష 22.

మెద్ది సాంగద నను నిట్లు విడిచి దూర
పుం బ్రవాస మందు మూరి తేల

తే.గీ. అప్రియము నేను చేసిన యట్టి దున్నఁ
దెలియ కేని యాయత భుజ! తలను వంచి
తాఁకి నీ చరణమ్ములు తద్ద వేఁడు
దాన క్షమియింపు హరివీర దాని నెలమి 23.

కం. విలపించుచు దీనతర గ
తులఁ దార యనింద్య వర్ణ దుఃఖము మీఱం
గలియంగ నితర వానర
లలనలు మరణింప నెంచె రమణుని చెంతన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 21.

విలపించి నేలఁ గూలిన తారను గాంచి హనుమ మెల్లఁగ నూఱడించి కిష్కింధకు నంగదుని రాజుగ నభిషిక్తునిఁ జేయ మనిన తార సమ్మతింపక పతితో సహగమనమును గోరుట.

కం. దివి నుండి చూచు చుండఁగ
భువిఁ గూలిన తార వోలెఁ బుడమిం బడఁగా
నువిద నరసి తారను మం
ద వచనముల నూఱడించెఁ దగ హనుమ యిటుల్ 1.

తే.గీ. జీవు లొనరించి నట్టి మంచి చెడు పనుల 2.

ననుసరించియె మరణము నంది నంతఁ
గర్మ ఫలము లనుభవింత్రు గాంత్రు శుభము
ల నశుభమ్ములఁ దప్పక రమణి! వినుమ

తే.గీ. శోచ్య యే శోచ్యునిఁ దలంచి శోక మూను
దీన యే దీనునిఁ దలంచి పూను జాలి
శోచ్యుఁ డెవ్వఁడు శోకించు చుండు నెవఁడు
తనులు బుద్బుద సమములు తలఁచి చూడ 3.

తే.గీ. సంతు కలిగిన నీవు గాంచఁ దగు దంగ
దునిఁ గుమారు నీ వింపుగఁ దూర్ణముగ న
తండు మీ దొనరింపఁగఁ దగిన యట్టి
కార్యముల నరయ వలయు నార్య! యింక 4.

కం. జీవుల రాకలు పోకలు
నీ వెఱుఁగు దనిత్యము లని నెఱ వేర్ప వలెన్
వావిరి లౌకికములఁ దగ
నీ విబుధులు సేయు వాని నింకఁ దలఁపుమా 5.

ఆ.వె. ఎవ్వని పయి వంద లింక వేలు పది కో
టుల ప్లవగ వరులు పటుతర ముంచి
రెల్ల నమ్మకమ్ము నుల్లము లందు నా
వీరుఁ డందెఁ దనదు వీర మృతిని 6.

ఉ. ఈతఁడు చూచె న్యాయము హరీంద్రుఁడు సామము దాన మింక నా
యాతత మైన యట్టి క్షమ నారసె రాజ్యము నందు నింపుగా
నీ తటి నందె ధర్మ జిత మివ్విధి భూమిని దాని కిక్కపి
వ్రాత సమక్ష మందు వగవంగ ననర్హవు వానరీ సతీ! 7.

చం. హరి వరు లెల్ల రింక సుతుఁ డంగదుఁ డీ కపి ఋక్ష రాజ్యముం
బరఁగును నీ యధీనమునఁ బన్నుగ శోక సుతప్తులన్ సతీ
స్థిరులను జేయఁ బ్రేరణము శీఘ్ర మొసంగి గ్రహింప రాజ్యమున్
హరి వర భూమి నెల్లఁ నిఁక నంగదుఁ డేలును విక్రమమ్మునన్ 8.

చం. తనయుఁడు సేయఁగా వలయు ధర్మపుఁ గార్యము నిప్పు డెంచి యె
ప్పని నిట వాన రేంద్రునకు వాలికి నొప్పును దానిఁ జేయఁగాఁ
గను మది కాల యుక్త మగుఁ గాంతునిఁగా నభిషిక్తు నంగదుం
దనరుప నిల్వ గద్దె పయిఁ దద్ద ప్రశాంతినిఁ బొందు దాత్మలో 9.

కం. విని వాని వాక్యములను మ
గని వ్యస నార్త యగు తార గని హనుమంతున్
ఘనుఁ డెదురుగ నిల్వఁగఁ బ
ల్కె నిట్లు వచనమ్ములను హరి వరేణ్యునితో 10.

తే.గీ. అంగదప్రతి రూపులౌ యంగజులను
వంద మందినిఁ కౌగిలఁ బొందు ముదము
కన్న హతుఁ డైననుం బ్రియ కాంతు వీర
వరుని సంశ్లేషణమ్ము గొప్ప యగు సెన్న 11.

ఆ.వె. వాన రేంద్రునకును నే నంగదునకును
సమము గాదు సుమ్ము సకల కార్య
ముల ననంతరమ్ము మూరి సుగ్రీవుఁడు
పిన్నతండ్రి యుండు విశ్రుతుండు 12.

కం. తలఁపకు మీ బుద్ధి హనుమ!
లలి నంగదుని ప్రతి నీ వరయ తండ్రి యగున్
నిలుపఁగఁ దనయు సమర్థుం
డిల మాతకు నెంచ నోప దెవ్విధి నైనన్ 13.

కం. హరిరాజునిఁ జేరుటకు ని
తర మిహ పరములఁ బరమ్ము తలఁపఁగఁ జాలం
గర మొప్పు నాకు నిహతుని
హరి వీరు శయన మిదియ మమాశ్రయ మింకన్ 14.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది యొకటవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 22.

వాలి కొన యూపిరితో మెల్లగ నిశ్వసించి దిక్కులు పరికించి సుగ్రీవునిఁ గని శాంతముగాఁ గిష్కింధకు రాజు కమ్మని యంగదుని రక్షించు మని చెప్పి తన కాంచన మాల యొసఁగి యంగదునకుఁ బిన తండ్రినిఁ గొలువు మని కొన్ని నీతులు నుడివి తుది శ్వాస విడువ భార్య తార కౌఁగిలి మూర్ఛిల్లుట.

కం. కొన యూపిరి నిట్టూర్చుచు
ఘనుఁ డింద్ర సుతుండు మెల్లగఁ గపీంద్రుం డం
త నరయుచు దిక్కులు మొదటఁ
గనె నంగదు నెదుట ననుజు ఘను సుగ్రీవున్ 1.

కం. ప్లవగేశ్వరుండు గని ప్రా
ప్త విజయు సుగ్రీవు వాలి వ్యక్తము లైన
ట్టి వచనములు ప్రేమగ ని
ట్లు వల్కె వెస నాదరం బొలుకఁ దమ్మునిపై 2.

ఉ. నీ వరయంగఁ దల్పకుమ నింద్యునిగా నను డెంద మందు సు
గ్రీవ! భవిష్య చోదితుఁడ రేఁగఁగ బుద్ధి విమోహ మాత్మ నే
నా విధిఁ బాప కర్మమున నక్కట వింతగఁ బాశ బద్ధుఁడన్
వావిరి వశ్యతం బడితి భ్రాతరొ! దోషము నెంచ కుండుమీ 3.

ఉ. ఒక్క తఱిం దలంప మన కొప్పఁగ నేరదు సౌఖ్య మిద్దరన్
దక్కెను భాతృ భావ మది తద్దయు నిర్వుర కన్య రీతినిన్
మక్కువతో గ్రహింపుమ సమంచిత బుద్ధి వహించి నెమ్మి నీ 4.

విక్కపి రాజ్య మెల్ల నిపు డేఁగెద నే నిఁకఁ గాలు వీటికిన్

ఆ.వె. భ్రాత! జీవితమ్ము రాజ్యమ్ము విపులంపు
శ్రియము నింక నాదు శ్రేష్ఠ తర మ
గర్హితంపు యశము గ్రన్నన వీడి నే
నేఁగుచున్న వాఁడ నిద్ధ చరిత! 5.

తే.గీ. ఇట్టి దురవస్థ నా పల్కు నట్టి వాక్కు
లెవ్వి గల వవి యెల్ల నీ కిపు డిఁక నొన
రింప నర్హంబ యగును దలంపఁ గష్ట
మైన వీరవరేణ్య! సమ్మానముగను 6.

కం. కనుమీ బాలుని యంగదు
ఘన సుఖ సంవృద్ధుఁడై సుఖములకు నర్హుం
డు నయిన కన్నీటం దడి
సిన ముఖు ధరఁ గూలి నట్టి చినవాని నిటన్ 7.

ఉ. ఈతఁడు నాకుఁ బ్రాణముల కెక్కుడు వీడఁగ నేను వీనినిం
బ్రీతిని స్వీయ పుత్రు వలెఁ బెంచుమ తక్కువ గాక యెందులన్
దాతవు త్రాత వింక భయదఘ్నుఁడ వౌదువు వానరేశ్వరా!
యే తఱి నైన నీవ యిఁక నిమ్ముగ వీనికి నెంచ నావలెన్ 8.

ఉ. తార కుమారుఁ డంగదుఁడు త్వత్సమ విక్రముఁ డాజి నిల్చు నీ
వీరుఁడు నీకు ముం దసుర వీరుల నెల్లరఁ జంపు వేళలో
వారక యౌవనుండు బలవంతుఁడు సేయును భవ్య కర్మముల్
మూరు రయమ్ము నందు సతమున్ రణ భూమిని నర్కనందనా! 9.

తే.గీ. అర్థ సూక్ష్మము లరయుట యందు నిపుణ
నేరు నుత్పాతముల నెల్లఁ దార హరి వ
రుఁడు సుషేణుని తనయ పలుకఁగ నీమె
సాధు వని చేయ వలయు నిశ్శంక దాని 10.

ఆ.వె. తారకుఁ గలిగిన మతమ్ము సుగ్రీవ! యె 11.

న్నఁడు తదితర విధమునఁ జరియింప
నేర దించు కేని నిస్సంశయమ్ముగ
వాన రర్క్ష నాథ! మాననీయ!

తే.గీ. రామ కార్యము నిశ్శంక భ్రాత నీకుఁ
జేయ నొప్పును సంప్రీతి శీఘ్రముగను
జేయ కున్న నధర్మమై చెలఁగు భృశము
నిన్ను హింసించు మానిన మిన్నగాను 12.

ఆ.వె. కొనుము దివ్య మాలఁ గనక మయమ్ము సు
గ్రీవ! దీని నూను ప్రీతి తోడ
నత్యుదారమైన యట్టి యీ మాల కాం
తి నశియించు నా మృతిఁ గన నెల్ల 13.

కం. పలుకఁగ భాతృస్నేహం
బొలుకఁ గరము వాలి విని సహోదరుఁడు ముద
మ్ము లయము కా సుగ్రీవుం
డల రాహుగ్రస్త చంద్రుఁ డనఁ గన్పట్టెన్ 14.

ఆ.వె. వాలి పల్కులు విని మేలుగ శాంతి సు
గ్రీవుఁ డొంది యెడఁద నా వసేచ
రుండు యుక్త రీతి నుండి యన్న యనుజ్ఞఁ
గాంచనంపు మాల గైకొనె ధృతి 15.

తే.గీ. స్వర్ణ మాల నొసఁగి మృత్యు భావ గతుఁడు
వాలి సుతుఁ డంగదుఁడు నిలువంగఁ జెంతఁ
గాంచి యంత స్నేహమ్మున నంచితముగఁ
బలికె నిట్లు కాలోచిత భాషణములు 16.

తే.గీ. దేశ కాలముల నరసి దిటవుగ సహి
యించి నీ ప్రియాప్రియముల నెంచి సుఖము
దుఃఖమును నంగద! మన మందు సమ రీతి
మసలు సుగ్రీవు వశమందు మానితముగ 17.

ఉ. ఏ విధి లాలితుండ వయి తీ విట నా వలనం గడింది ము
న్నా విధి నీవు వర్తిలిన యంగద! నీ పినతండ్రి గాంచి తా
నే విధి గౌరవింపఁడు సహింపఁ డమిత్రులఁ జేరు వారినిన్
నీ వరులన్ వరింపకుమ నిత్యము వాని వశమ్ము నెన్ను మా 18.

తే.గీ. అర్థ పరుఁ డగు సుగ్రీవుఁ డతఁడు భర్త
దాంతుఁ డాతని వశమందు సంతతమ్ము
నిలువు మధికంపుఁ బ్రణయమ్ము నీకు నప్ర
ణయము రెండు దోషములు కానఁ జను మరపి 19.

చం. పలికి కపీంద్రుఁ డీ గిరలు వాలి శరప్రవ రాభిపీడితుం
డలసి భృశమ్ము నంత వివృ తాక్షుఁడునై నిజ భీమ దంతముల్
వెలువడ భీకరమ్ముగను బృథ్విని౯ గూలెను వీత జీవుఁడై
కలకల మెల్లఁ జెల్గఁగను గాంతి విహీనత శక్ర సూనుఁడే 20.

కం. విలపించుచు నఱచిరి స
ర్వులు హరియూథప వృత కపి పుంగవులు ప్లవ
మ్ములు గత జీవుని వాలినిఁ
గలఁతన్ వీక్షించి యంతఁ గరుణ చెలంగన్ 21.

తే.గీ. స్వర్గతుఁడు కాఁగ నేఁ డిట్లు వానరాధి
పుండు కిష్కింధ పర్వతము లుపవనము
ల సహితమ్ము శూన్యం బయ్యెఁ బ్రభలు దొలఁగె
వానరుల కెల్ల వానర వ్యాఘ్రము చన 22.

తే.గీ. ఎవ్వని భుజ వేగమ్మున నివ్వ నాట
వీ పథము లందుఁ గురియును విరుల వాన
యవ్వర కపి నాథుం డెవఁ డివ్వర పుర
మందుఁ గిష్కింధ నింక నా చంద మరయ 23.

చం. దుర మొనరించె గోలభుని తోడ మహా భుజు తోడ దివ్యుఁడా
సుర కుల గాతతో నడరి చోద్యముగాఁ బదునైదు వర్షముల్ 24.

హరిగణ రాజ వర్యుఁడు మహాత్ముఁడు వారక రేపవళ్లులన్
వర రిపుఁ జంపె షోడశపు వత్సర మందు ఘనుండు వాలియే

ఆ.వె. ఉగ్ర దంష్ట్రుఁ డభయ మొసఁగెను దద్దుర్వి
నీతుఁ జంపి మాకు నాతఁ డట్టి
వీరుఁ డకట యెట్లు ఘోరముగ వధింపఁ
బడియె నేఁడు వాలి భండనమున 25.

తే.గీ. హతుఁడు కాఁ గపినాథుఁడు హరులు వొంద
కుండిరి సుఖమ్ము నొక యింతయు నెద లందు
సింహమయ వన మందు నశింప వృషభ
రాజు వనచర గోవుల రమణ దోఁప 26.

కం. మునిఁగి వ్యస నార్ణవమ్మునఁ
గని హత భర్తృ వదనమ్ము కౌఁగిలి పతిఁ గూ
లెను నేలను దారా సతి
వినిహత వృక్షమ్మును లత పెనఁగిన భంగిన్ 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది రెండవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 23.

తార మృతుఁ డైన భర్త వాలి వదన మాఘ్రాణించి శోకార్త పరిపరి విధముల విలపించుట.

కం. భువి వీడిన భర్తను గాం
చి వానర గణేంద్రుఁ దార చింతా పరయై
యువిద శిరము మూర్కొని ప 1.

ల్కె వచనముల నివ్విధము చలించి మృతినితో

ఉ. నాదు విశుద్ధ వాక్యము లొనర్పక దుఃఖముగం బరుండితే
మేదిని ఱాళ్లు నిండఁగ నమేయము నొవ్వునొసంగ మిక్కిలిన్
సాదర మయ్యెఁ ప్రీతితర మారయ నిమ్మహి కౌఁగిలించితే
యేదియుఁ బల్కకుంటి నను నివ్విధిఁ గాంచియు నేమి చెప్పుదున్ 2.

తే.గీ. పడితి వీ వహో సుగ్రీవు వశము నందు
విధి తలంపఁ జెలంగు నివ్విధమ యెపుడు
వీర! సుగ్రీవుఁడే యయ్యె విక్రముండు
సాహసప్రియుఁ డయ్యెనే యీ హరి పతి 3.

చం. నిలిచిరి ఋక్ష వానరులు సెవ్వగఁ గాంచుమ నీదు చెంతనున్
విలపితుఁ డంగదుండు కడు వేదన నుండి యతండు నిల్చెనే
కలఁతను బల్కు చుండఁగను గాంతను నన్నిటఁ గాంచి యక్కటా
నిలువవు లేచి యేల కడు నిష్ఠుర చిత్తత వానరేశ్వరా! 4.

ఆ.వె. శూర శయన మిద్ది నీ రిపుల వధించి
యెచ్చట శయనింప నిలను జేసి
తీవు మున్ను నచట నీవు హతుఁడ వయి
యక్కటా పరుండ నరయు చుంటి 5.

తే.గీ. విమల వంశోద్భవ! సమరప్రియ మమప్రి
యా! హరీశ్వర! మానద! యాత్మ భార్య
నన్ను నిట్టు లొకర్తె ననాథ నదయ
వెడలి యున్నాడ వక్కట వీడి యిచట 6.

ఆ.వె. ప్రాజ్ఞు లీయఁ దగరు స్వతనూజలను శూర
వరుల కెన్నఁ డేని వాన రేంద్ర!
శూర భార్య నన్ను చూడుమ విధవగఁ
జేయఁ బడఁగ నిపుడు శీఘ్ర గతిని 7.

తే.గీ. భగ్న మయ్యెను నా గౌరవమ్ము నేఁడు 8.

దగ్ధ మయ్యెను నా శాశ్వతంపు గతియు
మునిఁగితి నగాధ మయిన విపులపు శోక
సాగరము నందు నివ్విధి సత్వరముగ

ఆ.వె. నాదు హృదయము కఠినంబ యగును జుమ్మ
రాతిఁ బోలి యుండు నాతతముగ
నిహత పతినిఁ గాంచి నేరదు పగులంగ
వేయి ముక్కలుగను వింతగాను 9.

చం. ప్రకృతిఁ బ్రియుండు స్నేహితుఁడు భర్తయు నన్నియుఁ దానె యౌ నిలం
బ్రకటిత శూర పుంగవుఁడు స్వర్గము నందెను యుద్ధ భూమిలో
సకల ధనాది ధాన్యములు చాల సెలంగినఁ బుత్రు లున్న నే
మకట సతిన్ ధరన్ విధవ యంచునె పిల్తురు భర్తృహీననున్ 10.

తే.గీ. స్వీయ గాత్రపు రక్తము విరివి పాఱు
చుండ వీర! యుంటి విటఁ బరుండి యెట్లు
రక్త వర్ణపు దుప్పటి రమ్యరీతిఁ
బఱచి నట్టి నీ కిష్టంపుఁ బఱుపు యనఁగ 11.

కం. దుమ్ము తనువుపై రక్తము
పమ్మఁగ నెల్లెడల నాథ! పరిరంభణమే
నిమ్ముగఁ జేయం జాలక
నెమ్మిని బాహువుల నుంటిని హరివరేణ్యా! 12.

కం. కృతకృత్యుఁడు సుగ్రీవుం
డతి దారుణముగ వధింప నాజిని రిపు నం
చిత రామ ముక్త మొకటిని
శిత బాణము ఘోర తరము చేతన్ బలిమిన్ 13.

ఆ.వె. బాణ ముండ హృదినిఁ బంచత్వము వడయ
నీవు గాత్ర మంటి నేను గౌఁగి
లింప లేక నిన్ను రిత్త నిరీక్షణ
మేను జేయు చుంటి నిచట నాథ! 14.

ఆ.వె. అంత నీలుఁ డనెడు హరివరేణ్యుఁడు వేగ
గాత్ర సక్త శరముఁ గాంచి లాగెఁ
గొండ గుహ వెలుంగు ఘోర సర్పమ్మును
బట్టు పట్టి లాగి నట్టు లడరి 15.

కం. పెకలింపం బడ నబ్బా
ణ కాంతి యస్తాశ నున్న నగ రాజం బ
ద్దుకొనంగను గన్పట్టు ది
నకరుని రశ్మి పగిదినిఁ గనం బడె నరయన్ 16.

తే.గీ. వాలి వ్రణముల నుండి యపారముగను
గాఱె రక్తధార లపుడు మీఱి నేల
తాలుపున నుండి కాఱెడు తామ్ర ధాతు
జాల సంయుక్త ధారల సరణి దోఁప 17.

తే.గీ. సమర రేణు సంపూరిత స్వ పతి గాత్ర
మును వగచు చుండి సతి తుడిచెను ని జాశ్రు
జలమున శరాహత వ్రణములను గడిగెఁ
గాంత చింతాకలిత యయి ఘనముగ నెద 18.

చం. హత పతి రక్త సిక్తముల నంగములం గని పింగనేత్రు నా
సుతుఁగని పల్కె నంగదుని శూరుని నిర్విధి తార చింత తో
డ తనయ! పశ్చిమస్థితిఁ బడంగ ధరం గడు ఘోర వైరపుం
గతమునఁ బాపకర్మమునఁ గాంచుమ తండ్రి కృతమ్ము ఘోరమున్ 19.

కం. ఉద యార్క నిభ తనుని యమ
సదనమునకు నేఁగు వాని సమ్మానదునిన్
సదమల చిత్త! తనయ! యం
గద! రాజునిఁ దండ్రినిఁ గని కైమోడ్పవయా! 20.

ఆ.వె. అనిన నిట్లు లేచి యంగదుఁడు జనకుఁ
జేరి పలికి తనదు పేరు నంత 21.

స్వీయ పీన వృత్త భీమ బాహుద్వయ
మున జనకుని పాదములను బట్టె

తే.గీ. అంగదుఁ డిట నమస్కరింపంగ నాథ!
పూర్వ రీతినిఁ బ్రేమతోఁ బుత్రు నరసి
వసుధ నుండి 'దీర్ఘాయుర్భవ సుత' యంచు
నేల దీవింప కుంటివి బాలు నిపుడు 22.

ఆ.వె. చేరితిని నిను గత చేతసునిఁ దనయు
సాయ మంది నేను ప్రేయఁ బడఁగ
వృషభ రాజు వనిని మృగరాజుచేఁ జూడ
వచ్చు గోవు వోలె వత్స ముండ 23.

ఆ.వె. చలిపి యివ్విధ మిట సంగ్రామ యజ్ఞము
మేటి రామ శరపు నీటి లోన
నవభృథంపు స్నాన మకట చేసితె ధర్మ
పత్ని లేక యెట్లు వానరేంద్ర! 24.

కం. కాంచన మాలను రణ గుణ
సంచయమునకు నిను మెచ్చి శక్రుఁ డొసఁగె నీ
కంచితముగ నీ గళమునఁ
గాంచ నిపుడు దాని నేల కపి శార్దూలా! 25.

కం. చన దార్య! గతాసు వయినఁ
గన రాజ్యశ్రీ తనువునఁ గపివర నీ కె
ట్లనిన నివర్తిలిన నినుం
డు నగశ్రేష్ఠంపుఁ బ్రభ యుడుగని విధముగన్ 26.

తే.గీ. నా వచనములను గ్రహింప వీ పెడంద
నిన్ను వారింప లేకుంటి నేను సుంత
హత నయితి నే సుతునిఁ గూడి హతుఁడు కాఁగ
నీవు వీడె సిరియె నన్ను నిన్ను గూడి 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది మూడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 24.

శోక సముద్రములో మునిఁగిన తారను బల్లిదుఁ డగ్రజు మరణమును గాంచి సుగ్రీవుఁడు తాను చేసిన పనికి మిగుల దుఃఖించుచు నన్న చితిలోఁ బడుటకు రాముని యనుమతి వేడుట, తారయు రామునితోఁ దనను జంపిన వాలినిఁ జేరెద నని పల్క రాముఁ డాశ్వసించుట.

కం. భరియింప లేని శోకపు
శరధిం గన్నీటి తోడ సంతప్తం దా
నరయఁగఁ దారను బల్లిదు
మరణము సుగ్రీవుఁ డార్తి మగ్నుం డయ్యెన్ 1.

చం. కనులఁ దొరంగ నస్రువులు గాంచి యొకింత విషణ్ణ చిత్తతన్
మన మెరియంగ రాఘవుని మాన్యుని భృత్య సమేతుఁ డై వడిం
గని రవి సూనుఁడే కదిసి కార్ముక హస్తుని లక్ష ణాంగునిన్
ఘన ఫణి సన్ని బాస్త్రుని నఖండ యశో నిధిఁ బల్కె నివ్విధిన్ 2.

ఉ. చేసిన నీ ప్రతిజ్ఞ నవిశేష మొనర్చితి దక్కెఁ దత్ఫలం
బీ సమయమ్ము నందు నృవరేంద్ర తనూభవ! నాకు నేఁ డెదన్
వీసము లేదు భోగములఁ బ్రీతి మఱింకయు జీవితమ్మునం
దా సమయంగ నగ్రజుఁడు తారయు నంగదుఁడుం దపింపఁగా 3.

తే.గీ. భృశము శోకింప రాణి యా మృగ నిభాక్షి
పురము దుఃఖింప యగ్రజుం డరయ మృతిని
నంగదుం డుండ సంశయ మందుఁ గాంచి
రామ! హర్షింపదు మనమ్ము రాజ్య మందు 4.

మ. ఘన రో షాక్షమ ధర్మ వాక్యములు వల్కన్ డెంద మం దోర్వ లే
కనుమానింపక సమ్మతించితిని నే ఖండింపఁగా నగ్రజున్
మును శాఖా మృగ నాథుఁ డస్తమయముం బొందంగ నిక్ష్వాకు నం
దన! వీక్షింపఁగ నాకు తీక్ష్ణముగ సంతాపమ్ము కల్గెన్ మదిన్ 5.

తే.గీ. శైల రాజముపై నివాసమ్ము సేయ
రమ్య ఋశ్యమూకమ్మున రామ పూర్వ
రీతి మే లని యెంతు స్వవృత్తి నూని
లాభ ముండదు నాకు స్వర్గమ్ము నంద 6.

ఉ. చంపఁ దలంప నిన్నెడఁద సత్వర మేఁగుమ యంచుఁ బల్కు నా
యింపగు వాక్కులే దెలిపె నిట్లనఁ జెల్లును వాని కంచు వీ
క్షింపఁగ నాక యీ పనినిఁ జేయఁగఁ గ్రూరముఁ జెల్లె నిట్లు ఘో
రంపు దలంపు గల్గె నెద రాఘవ! యిద్దఱి భేద మెంచుమా 7.

తే.గీ. ఎమ్మహాగుణు సోదరు నిట్లు రాజ్య
దుఃఖ సారమ్ము దలపోసి తూఱిన నెదఁ
గామ మే భ్రాత వధియింపఁ గదలు వీర!
రాఘ వాన్వయ వార్ధి చంద్ర! నను బోలి 8.

ఆ.వె. నన్ను జంపు టతని కెన్న మతము కా ద
తిక్రమింప లేదు స్థిర మగు తన
ప్రకృతి నన్న కలిగెఁ బ్రాణ హరపు దుష్ట
బుద్ధి నే వ్యతిక్రముండ నయితి 9.

కం. తరు శాఖా తాడితుఁ గా
నురు బాధ నఱవఁగ నన్ను నూరార్చి తగం
దిరిగి యిటులఁ జేయ వలదు
హరివీర! యని పలికెను మహాత్ముం డంతన్ 10.

తే.గీ. చూపఁ బడఁగ భ్రాతృత్వము శుద్ధ ధర్మ
మార్య బావ మతని చేత నంచితముగఁ 11.

గామమును గ్రోధమును నిజ కపి గుణమ్ము
చూపితిని నేను రాఘువ! చోద్యముగను

తే.గీ. వృత్రుఁ జంపిన యింద్రుని విధము భ్రాతఁ
జంపి యీ యచింత్యమ్మును సతము వర్జ
నీయము నవాంఛితం బతి నింద్య కార్య
మేను జేసితి పాపమ్ము నో నరేంద్ర! 12.

కం. అవనీ జల తరు వనితలు
భువిఁ బంచుకొని రల పాపమును వృత్రుని శ
త్రు వరుఁ డడుగ నా పాపము
నెవ రక్కట కొందు రెంచ నీ కోఁతి దిలన్ 13.

కం. జన సమ్మా నార్హుఁడఁ గా
నొనరింప నధర్మ యుక్త మ్ముర్విం గుల నా
శన కార్యమ్మును రాజ్యం
బన నేలను యౌవరాజ్య మందఁగఁ దగనే 14.

కం. పాపమునకుఁ జెడ్డకు లో
కాపకృతమ్మునకు నింక నధమమ్మున కే
నేపారితిఁ గర్తగ వ
ర్షాపము గుంటఁ గను నట్టు లార్తి చెలంగెన్ 15.

తే.గీ. అన్న కిడి నట్టి దెబ్బ వా లాప రావ
యవము కాఁగఁ దాపమ్ము హస్తాక్షి కర శి
రములు కా నఘ మదహస్తి ప్రహరము లిడు
చుండెను నదీతటమును గూల్చు విధి నాకు 16.

ఆ.వె. నాదు సత్ప్రవర్తనమ్మును దుస్సహ
మైన నా యఘమ్ము పూని త్రోసె
మది వెనుకకుఁ బసిడి మండు చుండఁగ నగ్ని
దుమ్ము నృవర! రంగుఁ ద్రోయు నట్లు 17.

కం. హరి యూధపుల మహా బల
విరాజితుల కులము నింకఁ బృథ్వీప సుతా!
గురు శోక తాప తప్తుం
డర ప్రాణమ్మున మెలంగు నంగదుఁ డింకన్ 18.

తే.గీ. ఎక్క డుండు సులభ్యుండు నింక సుజనుఁ
డు సువశుం డంగదుం బోలెడు తనయుండు
వీర! కాంచ మా దేశంబు మూర వాలి
బోలు సోదరుం డెందేని పుడమి లోన 19.

తే.గీ. బ్రతుకఁ డంగదుఁ డిల నేఁడు వాలి యడఁగ
బ్రతుకుఁ బరిపాల నార్థమ్ము పడతి తార
హీన సుత యైనఁ దారయు నింకఁ దాప
మడర బ్రతుక కుండుట నిశ్చయంబ యగును 20.

తే.గీ. అన్న దీప్తంపు టగ్నిని నన్న తోటి
సుతుని తోటి సఖ్యం బెంచి చొత్తు నేను
వీరు హరి వీరు లవనిజ వెతకి తెత్తు
రెల్ల నీ యానతి వహించి సెలమి రామ! 21.

ఆ.వె. నీదు కార్య మెల్ల నెఱవేరు రాఘువ!
యే గతించిన మనుజేంద్ర పుత్ర!
కుల వినాశునిఁ గృత కలుషు నజీవ నా
ర్థు ననలమ్ము నందు నుఱుక నిమ్ము 22.

కం. విని యార్తుని వాల్యనుజుని
మినుకులు రఘువీరుఁ డొక నిమిషమునకై తాఁ
గనులం దస్రులు నిండ వి
మనస్కుఁ డయ్యె రిపు గణ దమనుఁ డప్వేళన్ 23.

తే.గీ. మాటి మాటికి వీక్షించు మానవర్ష
భుఁడు జగద్రక్షకుండు నోర్పునఁ బుడమి స
ముండు తారను విలపించు చుండ వ్యసన 24.

మగ్న నచ్చట వీక్షించె మగువ నంత

కం. చారు విలోచనఁ గపిరా
డ్వీరుని పట్టమహిషిం గపివ్రజ సింహుం
బేరిమిఁ గౌఁగిలి వీడని
తారను లేపిరి సతీ మతల్లిని మంత్రుల్ 25.

చం. పతినిఁ బెనంగుచుండ నిజ భర్త సమీపము నుండి తార నా
సతిఁ గొని పోవు చుండ శర చాప విరాజిత హస్తు తేజ మం
దతులిత సూర్య సన్నిభుని నారసి రామునిగాఁ దలంచెఁ దా
ర తనర క్షాత్ర లక్షణ విలాసము ముం గన నట్టి పూరుషున్ 26.

తే.గీ. తార మృగశాబనేత్ర సుచారు నేత్రుఁ
బురుష వర్యు నినకులాబ్ధి పూర్ణ చంద్రు
నింద్ర కల్పు దురాసదు నెరియుచు వడి
నార్త సేరె సమీపము వ్యసన మగ్న 27.

తే.గీ. శుద్ధ సత్త్వ సమీపించి శోక తప్త
చిత్త సంభ్రాంత తను మనస్విని రఘుపతి
నా రణోత్కర్ష లబ్ధ లక్ష్య ఘన వీరుఁ
బలికె నంచితముగఁ దార వాక్కు లిట్లు 28.

సీ. అప్రమేయుఁడ వరయ దురాసదుఁడవు జితేంద్రియుండవు ధర్మ మెన్ను దెపుడు
నక్షయం బగు కీర్తి యతి విచక్షణుఁడవు క్షమ యందు భూమివి క్షతజ సదృశ
నయనుండ వాత్త బాణ శరాసనుండవు బలివి సంహన నోపపన్నుఁడవును
మానవ దేహమ్ము మానుగ విడిచి దివ్యంపు దేహమున నీ వడరు చుందు
ఆ.వె. వొక్క శరము సెట్టి దూని నా ప్రియుఁ జంపి
తట్టి యొక్క శరము పట్టి నన్ను
జంపు రామ! చనుదు నింపుగఁ బతి చెంత
కతఁడు నేరఁ డుండ నరయక నను 29.

తే.గీ. వాలి దివికిఁ బద్మామల పత్ర నేత్రుఁ
డరిగి వీక్షింప కున్న నన్నచట వెదకి 30.

యతఁడు నానా వి ధారుణ యుత శిఖల వి
చిత్ర వేష లచ్చరలను జేర కుండు

ఆ.వె. స్వర్గ మందు నైన వాలి వివర్ణత
యింక శోక మందు నింతి నేను
లేక నీవు సీత లేక రమ్య గిరి త
టమ్ములం బడయు విధమ్ము రామ! 31.

తే.గీ. భార్య లేకున్నఁ జెంత యౌవన పురుషుఁడు
వొందు బాధ నీ వెఱుఁగుదు వందు వలన
నన్ను జంపుమ రాఘవ! నన్ను గనమిఁ
గలుగు దుఃఖమ్ము వాలికిఁ గలుగ కుండ 32.

ఉ. రామ! మహాత్మ! తల్పకుమ రామను జంపితి నంచు నాత్మలో
భామ నిజాత్మయే యగును వాలికిఁ గావున నాత్మఁ జంపఁగా
యో మనుజేంద్ర పుత్ర! కన యుక్తమ స్త్రీ వధ కాదు సుమ్ము నీ
వేమియు నింక నెంచకయె యిత్తఱి నన్ను వధింపు మింపుగా 33.

చం. వివిధము లైన శాస్త్రముల వేదము లందును విందు మివ్విధిన్
భువి సతి యౌ ననన్య విధిఁ బూరుష వర్యున కాత్మ నిత్యమై
యవనిని దార దానమున కారయ యుత్తమ మన్య మెద్ది యే
ని వినమె లే దనంగ నవనీప కుమార! బుధాగ్ర గణ్యులే 34.

తే.గీ. ధర్మ మెంచి నీవును రామ దాన మిమ్ము
నన్ను నా ప్రియునకు దాన నిన్ను వీర
వర యధర్మ యోగము నాదు వధ కతమున
నంట దెన్నఁడు సుంతయు వెంట వచ్చి 35.

తే.గీ. ఆర్త నపనీత నివ్విధి నలమటించి
యున్న దానను జంపఁగ నొప్పు రామ!
ప్లవగ వరు గజ గమను ధీ వరుని హేమ
మాల ధరు విడిచి బ్రతుకఁ జాలఁ జిరము 36.

కం. పలుకఁగ విని తార వచన
ములను మహాత్ముఁడు రఘుపతి పురుషోత్తముఁ డి
ట్టులు హిత భాషణము లపుడు
వలికెం దగ నూఱడించి భామామణితో 37.

చం. వికల మనస్క విట్లగుట వీర వరాంగన! నీకు భావ్యమే
సకలము ధాతృ శాసనము చాలరు దాఁటఁగ నెవ్వ రేని యి
ట్లు కలుగు దుఃఖముల్ సుఖములున్ ధరలోనఁ దలంచి జూచినం
బ్రకటముగా విధాతృని దలంపున నంచు వచింత్రు లోకులే 38.

చం. తనరును మూడు లోకములు ధాతృ వశమ్మున దాఁట నేరినిం
గన మది కాదు సంభవము కాంతరొ! ప్రీతినిఁ గాంతు వింపుగాఁ
దనయుఁడు యౌవ రాజ్యమును దప్పక పొందును బ్రహ్మ పంపునన్
వనరరు వీర పత్ను లిల భామిని! యివ్విధి ధైర్య మూనుమా 39.

కం. రాముఁడు ప్రభావ యుక్తుఁడు
సామమునఁ బరంతపుండు చారుత రాస్యన్
భామ ననునయింప నిలిచె
నా మర్కట వీర పత్ని యాపి రవమ్మున్ 40.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది నాలుగవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 25.

రాముఁడు విధిని నెవ్వరు దాఁట లేరని తారను నంగదుని సుగ్రీవునిఁ దగు మాటల నోదార్చి వాలికి దహన సంస్కారముల నొనరింపుం డన సుగ్రీవుఁ డా కార్యక్రమము పూర్తి చేయుట, తారయు వానరులు వాలికై విలపించుట.

కం. సహ లక్ష్మణుఁడు సమాన వి
రహి తానందుండు గాంచి రాముఁడు తారన్
సహి తాంగదను విచా రా
సహు సుగ్రీవునిఁ బలికెను సాంత్వన గిరలన్ 1.

చం. కలుగదు శ్రేయ మింతయును గందిన శోక మహాబ్ధి మున్గి యి
ట్టుల మృతునిం దలంచుచుఁ గఠోరముగా నిఁక భావి కార్యమున్
వలసిన దాని శాస్త్ర విధి వారక చేయఁగ నుద్యమింపఁగా
వలె నిట వానరేంద్రునకుఁ బన్నుగ నెంచుఁడు దానిఁ జేయఁగన్ 2.

కం. చా లిఁక రాల్పఁగ నశ్రుల
నీ లోకపు వృత్తము నొనరింప వలె వెసం
గాలము మీఱినఁ జేయం
జాలము కర్మము నొకింత సంభావింపన్ 3.

తే.గీ. నియతియె యగుఁ గారణ మను నిత్య మవని
నియతి వలనఁ గర్మములఁ బడయఁగ నగును
జనుల నెల్ల నియోగింపఁ దనరు నియతి
కారణమ్ముగ నెడఁద నిక్కమ్ము నెంచ 4.

తే.గీ. ఎవ్వ రెవ్వరి శాశింప నివ్వసుధను
గారు కర్త లీశ్వరులును గారు వారి
వారి వగు స్వభావమ్ములు వర్తిలుట ని
జమ్ము కాల మన్నిటికిఁ గతమ్ము సుమ్ము 5.

తే.గీ. కాల మయిన నేరదు దాఁటఁ గాలము నిఁక
లొంగ దెన్నండు కాలమ్ము లోకులకు న
తిక్రమింప లే రెవ్వరు తివిరి మఱి స్వ
భావము లగు చేష్టల నొనర్పకయు నుండి 6.

తే.గీ. కాలము కనదు బంధు వర్గమ్ముఁ గార
ణమ్మును బరాక్రమము నేని పమ్ము నాత్మ 7.

వశము నంద మిత్ర జ్ఞాతి వర్గ మేని
కాలమున కుండు నను మాట కల్ల సుమ్ము

ఆ.వె. కాలపుఁ బరిమాణ గతుల సమ్యగ్దృష్టు
లరయ వలయు జగము నందు ధర్మ
మర్థ మింకఁ గామ మైనఁ గాలక్రమ
మనుస రించి యుండు ననవరతము 8.

తే.గీ. ఉదరి ధర్మార్థ కామ సంయోగ పావ
న ఫలము బ్లవగేంద్రుండు తన ప్రకృతి కణు
గుణపుఁ గర్మము నొనరించి కూర్మిఁ బొందె
వాలి మరణించి యివ్విధి భండనమున 9.

కం. నిజ ధర్మము పాటింపఁగ
ని జాసువుల నించుకయు గణింపక తా స్వ
ర్గ జితుం డయ్యెను గపి సా
మజుఁడు గ్రహించెను దివమ్ము మానిత రీతిన్ 10.

కం. హరియూధపుఁ డేఁగిన గతి
పరికింపఁగ శ్రేష్ఠ తరము భాగ్యం బిట్లుం
డరయగఁ జాలు విచార మొ
నరుప వలయుఁ జేయ వలసిన పనుల నింకన్ 11.

ఉ. ఆ వచనమ్ము లాడిన యనంతర మార్యుఁడు లక్ష్మణుండు సు
గ్రీవుని వీత చేతనునిఁ బ్రీతినిఁ గాంచి వినీతుఁ డిగ్గిరల్
పే వలికెం బరంతపుఁడు వేగ మొనర్పుము ప్రేత కార్యముల్
నీ విఁకఁ దార యంగదులు నీ దరి నుండఁగ వాలి కన్నకున్ 12.

ఉ. తెమ్మను కట్టె లెండినవి దివ్యము లెక్కువ చంద నాదులే
యిమ్ముగ సంస్కరింపఁగఁ గపీంద్రుని వాలిని నూఱడింపుమా
నెమ్మినిఁ బుత్రు నంగదుని నీ విట బాలిశు భంగిఁ గాకుమీ
లెమ్ము హరీంద్ర! యీపురము లీలఁ జెలంగును నీ యధీనమై 13.

ఆ.వె. అంగదుని బనుపుమ హరివర! మాలల
వివిధ వస్త్రములను విరివి ఘృతము
తైల మన్యములను ద్వరితముగ నిచట
కుఁ గొనితేరఁ బుత్రకుని బలాఢ్య 14.

చం. శిబికను దార! కీశ వర! శీఘ్రము తే వలె రజ్జు యుక్తముం
బ్రబలఁగఁ గాల యుక్తముగ వాహన రాజము వాలికై వరా
గ్ర బలులు వాన రోత్తములు క్రన్నన సిద్ధముగన్ వహింపఁగా
సబలుని వాలి నిల్వ వలె సత్త్వ సమర్థులు సత్వరమ్ముగన్ 15.

తే.గీ. పలికి మఱి సుమిత్రానంద వర్ధనుండు
భాషణములు సుగ్రీవుతోఁ బర దమనుఁడు
లక్ష్మణుం డివ్విధమ్ముగ భ్రాత రాము
ని వెనుక కరిగి చెంతను నిల్చె నంత 16.

చం. వచనము లాలకించి కపి వర్యుఁడు తార వచింప లక్ష్మణుం
డచిరము చేరి కందరము నా శిబి కానయ సక్త చిత్తుఁడై
ప్రచురపు సంభ్రమం బడర వానర వీరులు మోయుచుండఁగా
నుచితము వాన రేంద్రునకు నుండుట కట్టిది తెచ్చి నిల్వఁగా 17.

సీ. ఒప్పిదము మహాద్భు తోన్నత భద్రాస నోపేత సుస్యంద నోపమమ్ము
పక్షిద్రుమ విచిత్ర పద్గ కర్మ విభూషితము సమంతత సుకృతమ్ము సిద్ధ
జన సంచయ విమాన సన్నిభ జాల వాతాయన సంయు తామేయ శోభి
తము సునియుక్తము తద్ద విశాలము విశ్వకర్మ కృతము విలసితమ్ము
తే.గీ. దారు గిరి చయ శోభిత చారు కర్మ
సంస్కృతము వరాభరణ సంచయ విచిత్ర
మాల్య సువిరాజిత గుహా సముప్ర భోప
రితల రక్త చందన విభూషితము నింక 18.

తే.గీ. ఉదయ రవి వర్ణ నిభ కుసుమోత్కరమ్ము
భ్రాజమాన మాలా సువిరాజితమ్ము
శిబికమును గాంచి రాముఁడు సేర నటకు
లక్ష్మణుని తోడఁ బల్కె నరవరుఁ డిట్లు 19.

తే.గీ. క్షిప్రముం గొని చనవలె నప్రమత్త
త జరుప వలెను వాలి కంత్యక్రియ లన
నాలకించి యంగదుఁ గూడి యలమటించి
వాలి నుంచె సుగ్రీవుఁడు పల్లకిఁ దగ 20.

ఉ. పల్లకి పైన నా మృతుని వాలిని వానర నాథు నుంచి వా
రెల్లరు వస్త్ర రాజముల నింకను మాలల భూషణమ్ములం
బెల్లుగఁ జేయ భూషితునిఁ బెక్కుల రాజు దినేశజుం డిఁకన్
సల్లలి తాంత్య కర్మములు సల్పుఁ డటంచు నొసంగె నాజ్ఞనున్ 21.

చం. చన వలె ముందు వానరులు చల్లుచు రత్నము లింపుగా వెసన్
వెనుకన యేఁగు నా శిబిక పృథ్విపు లెవ్విధి విత్త వంతులై
కనఁబడ నేర్తు రవ్విధము కాంతుని సత్త్రియ లెల్లఁ జాగ నొ
ప్పును గపు లార యెల్లరును బూనుఁ డొనర్పఁగ మించి తద్విధిన్ 22.

తే.గీ. వాలి కంత్యక్రియలు జరుపంగ నట్లు
తార మున్నగు కాంత లంత సుతు నంగ
దునిఁ బరిగ్రహించి హత బంధులు వగచుచు
వెడలఁ జాగిరి యెల్లరు వేగముగను 23.

తే.గీ. వానరీ మణు లప్పుడు వాలి వశలు
వీర వీర యనుచును విచార మెదల
నిండ రోదించు చుండిరి మెండుగాను
స్త్రీలు కూడి యెల్లరు నంతఁ దిరిగి తిరిగి 24.

ఉ. తారయు వానరీ సతులు తద్దయు జాలి జనింప నేడ్చుచున్
మూరఁగ దుఃఖ మాత్మలను ముఖ్యులు వానర యూధ నాథులున్
వీరుఁడు వాలి వెంట నతి వేగమ యేఁగఁ దొడంగ నచ్చటన్
వారి రవమ్ము కన్పడెను బర్వత కానన రోదనం బనన్ 25.

తే.గీ. శోక తప్తు లగు కపు లనేకులు గిరు
ల సెలయేరుల విమల జల సువిలసిత 26.

మునఁ బులిన దేశ మారసి ఘనముగఁ జితి
నెల్లరు కలసి కూర్చిరి తల్లడిలుచు

కం. తమ భుజముల నుండి శిబిక
ను మర్కటులు వాహకులు ఘనులు దింపి విచా
ర మెడఁదల మీఱ నేకాం
తముఁ జేరి నిలిచిరి వారు తాపము తోడన్ 27.

చం. పతిఁ గని తార యా శిబిక పై శయనింపఁగఁ జేర్చి తా నొడిం
బతి శిర మార్తి హా దయిత! వానర! హా పతి! హా కపీశ్వరా!
నుత ఘన బాహు! హా ప్రియ! గనుంగొనుమా నను హా మహార్హ! యం
చితముగ నంచు యేడ్చెఁ గపి శేఖరు పట్టపు రాణి దీనయై 28.

తే.గీ. శోక తప్తు లైన జనుల చూడ వేల
విగత జీవి యైన ముఖము వెలుఁగు చుండె
నస్త సూర్య సన్నిభ వర్ణ మడర బ్రతికి
యున్న రీతి గోచర మగుచున్న దిపుడు 29.

తే.గీ. రామ రూపపుఁ గాలము లాగె నిన్ను
వానరేంద్ర! విధవ లైరి భార్య లెల్ల
నొక్క ఘోర బాణంపుఁ బ్రయోగముననె
కాననమ్మునం దక్కట కాంచ నేఁడు 30.

కం. వీరలు హర్యంగనలే
వీరా! నీ సతులు నీకు ప్రియలు శశిముఖుల్
దూరమ్ము నుండి పదముల
వీ రేతెంచిరి కపీంద్ర! ప్రీతిం గనవే 31.

తే.గీ. కాంచ వేమి సుగ్రీవునిఁ గపి గణేశు
నిపుడు తారుఁడు మున్నగు నీ యమాత్య
వరులు నింకఁ బుర జనులు హరివరేణ్య!
నిన్ను జుట్టి యెల్లరు కూర్చొని రిటఁ గనుమ 32.

కం. విడువుమ కపుల యథోచిత
మడరఁగ మదనోత్కటమ్ము హరి శార్దూలా!
యడవిని విహరింతము లె
మ్మెడఁబా టిట్లు మన కింక నేలం జెపుమా 33.

కం. విలపించు చుండఁ దారను
గలంత తోడ నధికముగఁ గని వానర కాం
తలు శోక కర్శితలు పే
గ లేపిరి సముచిత రీతిఁ గపి సతి నంతన్ 34.

ఉ. వావిరి దుఃఖ తాపమున వాలి కుమారుఁడు నంగదుండు సు
గ్రీవుని గూడి తండ్రిని హరివ్రజ నాథుని నంత నేడ్చుచుం
దా వడి నుంచి యా చితి యథా విధిగా నిడి యగ్ని దీర్ఘపుం
ద్రోవకుఁ బోవఁ దిర్గె పెతతో నపసవ్యము తప్త చిత్తుఁడై 35.

తే.గీ. సంస్కరించి వాలిని వారు శాస్త్ర రీతిఁ
బ్లవగ వరు లెల్ల నీయఁ దర్పణము లంత
విమల జల పూరితమ్ముగ వెల్గు నట్టి
నదికి నేతెంచిరి విచార వదను లపుడు 36.

తే.గీ. అంతఁ జేరి సుగ్రీవ తా రాదు లంగ
దుని నునిచి యగ్రమున వారు తూర్ణముగను
వాలి కతి భక్తి యుక్తులు వానరేంద్రు
నకు నొసంగిరి యుదకము వికల హృదులు 37.

తే.గీ. రాముఁడు సమాన శోకుండు భీమ బలుఁడు
దీనుఁ డయి తాను సుగ్రీవు దీన ముఖుని
చేత నంత కాకుత్స్థుఁడు ప్రేత కార్య
ములను జేయించె విధి యుక్తముగ భృశమ్ము 38.

కం. వెలిఁగించి యగ్ని సదృశ
జ్వలి తాంగుని వాలి రామ బాణ నిహతునిన్
బలు సుగ్రీవుఁడు సేరెను 39.

స లక్ష్మణుని రాఘవేంద్రుఁ జక్కఁగ నంతన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది యేనవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 26.

సుగ్రీవుని కిష్కింధకు రాజుగ నభిషేకించుట, యంగదునకు యౌవ రాజ్యాభిషేక మొనర్చుట,
రాముఁడు వర్ష కాల మేఁగఁగనె రావణ వధకై యత్నింప మని సుగ్రీవుని వేఁడుట.

కం. ఘన దుఃఖతప్తు సుగ్రీ
వుని నార్ద్రాంబర కపీంద్రుఁ బొడగని యంతం
జని ప్లవగ మహామాత్రు ల
తని చుట్టును జేరి రవనత వరాంగులునై 1.

ఆ.వె. ఎల్ల రంత మానవేంద్రు మహా బాహుఁ
బనుల నల పెఱుఁగని వానిఁ జేరి
రెలమి రాఘవుని మునీంద్రు లెల్లఁ బితామ
హుని సమీప మందు నున్న విధము 2.

కం. హనుమంతుఁడు కాంచన శై
ల నిభుఁడు తరు ణార్క సదృశ లసితాస్యుండుం
గని రాము నంజలించి వ
చనమ్ముల్ లిట్లు వచియించె శ్వసనాత్మజుఁడే 3.

తే.గీ. నీ దయ దనర సుగ్రీవుఁ డీ దురాప
మైన వానర రాజ్యము నందె నివ్వి
ధిఁ బితృ పైతామహ మెలమి ధీవరేణ్య! 4.

రామ! యిక్ష్వాకు వంశాబ్ధి రత్నదీప!

చం. అనుమతి నీయ నీవు మనుజాధిప! వానర పుంగవుండు దాఁ
జని శుభ పట్టణమ్మునకు స్నానము నోషధి గంధ యుక్త చం
దనముల నాచరించి యుచితమ్ముగఁ గూడి సుహృజ్జనాళినిం
దనరుచు సర్వ కార్యములు తత్తపనాత్మజుఁ డర్హ రీతినిన్ 5.

చం. తగు విధి మాల్య రత్నములఁ దద్దయు గౌరవ మేర్పడంగ ని
న్ను గపి గణాధినాథుఁడు ఘనుం డట రాఘవ! సత్కరించు శై
ల గుహకు నేఁగుదెంచు మిఁక లక్ష్మణుఁ గూడి నరేంద్ర! కూర్చుమా
సుగతిని స్వామి బంధమును శూర! యొసంగుమ మాకు హర్షమున్ 6.

కం. పలుకఁగ మరుత్తనయుఁ డా
పలుకులు విని రాఘవుండు పర వీరఘ్నుం
డు లలిత వాక్యజ్ఞుం డి
ట్టుల బదు లిడె నంత రాముఁడు హరి వరునకున్ 7.

చం. ఇఁకఁ బదునాలు గేండ్లు తగ నేఁగినఁ గాని పురమ్ము లందు నే
ని కపి వరేణ్య!యే నగరినిం జరియింపను దండ్రి పంపు వీ
డక వని లో వసింతును ధృఢంబ సమృద్ధ గుహాంతరమ్మునన్
సుకరము నిల్వ నేగఁ దగు సూర్య కుమారుని తోడ నెల్లరున్ 8.

ఆ.వె. చేరి యుక్త విధిని శీఘ్రము సుగ్రీవు
ని నభిషిక్తుఁ జేయుఁ డనఘు రాజ్య
మందు హనుమ తోడ నని యిట్లు సుగ్రీవు
వృత్త విదుని నరసి ప్రీతిఁ బలికె 9.

తే.గీ. వృత్త సంపన్న! వీర్యుఁడ! విక్రముండ!
యగ్రజుని జ్యేష్ఠ సూనుని నంగదు నిను
బోలు విక్రమమున బలమున ఘనుండు
యౌవ రాజ్యమం దభిషిక్తు నీ వొనర్చు 10.

ఉ. వచ్చెను వర్షకాల మిఁకఁ బన్నుగ నుండును నాల్గు మాసముల్ 11.

హెచ్చుగ నిచ్చుఁ దోయముల నియ్యది శ్రావణ  మగ్ర మాసమే
యచ్చపు వేళ కా దిది యనర్థమ యెల్లరు నుద్యమింపఁగా
నిచ్చట శైల రాజమున నింపుగ నుందును గూడి లక్ష్మణున్

తే.గీ. ఈ గిరి విశాలమౌ గాలి యింక సలిల
లము లపారము కమ లోత్పల విలసితము
మాకు వస నోచితం బగు నో కపీంద్ర!
మీర లేఁగుఁ డతి శుభంపు మేటి పురికి 12.

చం. కదిసినఁ గార్తికమ్ము దశకంఠు వధింపఁగ నుద్యమింపుమీ
యది యగు యుక్త కాలము ప్లవాళిపతీ! మన కెల్ల వారికిం
బదపడి చేరుమీ గృహము పన్నుగ నీ వభిషేక మందుమా
ముదము నొసంగు మెల్లరకుఁ బొంది స్వ రాజ్యము మిత్ర కోటికిన్ 13.

ఆ.వె. ఇట్లనుమతి నంది యెలమి సుగ్రీవుఁడు
వానరాధిపుండు వాలి పాలి
తంపుఁ బత్తనమ్ము నింపగు కిష్కింధ
కరిగె శీఘ్ర తరము హరివరుండు 14.

ఉ. చేరిన వానరేంద్రుఁ గని చేసిరి యింపుగ వందనమ్ములన్
మూరి సహస్ర వానరులు బోరన నిల్చిరి చుట్టి యెల్లెడం
బౌరులు గాంచి రాఢ్వరుని వంచి శిరమ్ము లొసంగి సన్నుతుల్
ధారుణి పైనఁ గూలిరి పదమ్ములు దాఁకుచు గౌరవమ్మునన్ 15.

తే.గీ. వారినిఁ గని సుగ్రీవుఁడు పల్కి తగిన
రీతి లేపి యెల్లర నంత భ్రాత యంతి
పురమునకు నేఁగె సుందరంపుఁ దటి కెలమి
బల్లిదుండు రాజస మొప్ప నుల్ల మలర 16.

తే.గీ. చేరి తిరిగి వచ్చిన కపి శేఖరుఁ బరి
కించి ప్లవగేశ్వరు నభిషేకించి రంత
నమరులు సహస్ర నేత్రుని నభిషవమ్ము
సేసి నట్టి విధమ్ముగ వాసి కెక్క 17.

సీ. తెచ్చిరి విమలంపుఁ దెల్లని ఛత్ర మభ్ర విభూషితమ్ముఁ వాలవ్యజినము
పాండరము ప్లవగ పార్థ వర్యునకై యశస్కర మైనట్టి స్వర్ణ దండ
మంతఁ బదాఱు కన్యామణు లరుదెంచి రింపుగఁ గైకొని యిద్ధ రత్న
రాసు లౌషధములు రమ్య బీజము లంకురమ్ముఁ లొలికెడు క్షీరమ్ము తోడఁ

తే.గీ. బుష్ప చయము ధవళ వస్త్రములు వ రాను
లేపనములు సుగంధ పరీతములు కు
సుమ సరములు దివ్యపుఁ జందనము లనేక
ములను మెట్ట తామరలు నంబుజము లింక 18.

తే.గీ. అక్షతలు పసిడి ప్రియంగు లాజ్యము మధు
వును బెరుఁగు పులిచర్మము పోత్రి పాదు
కలును మెయిపూతలను మనశ్శిలయు నింక
శుద్ధ గోరోచనమ్మును నిద్ధ తనులు 19.

ఉ. కాల విధమ్ము శాస్త్ర విధిఁ గమ్మని యన్నము వస్త్ర రత్నముల్
మేలుగ బ్రాహ్మణోత్తములు బ్రీతినిఁ దృప్తిల నిచ్చి యంత వే
ప్రేలిచి మంత్ర యుక్తముగ వేద మెఱింగిన వారు నేతినిం
గ్రాలఁగఁ జేసి యగ్నిఁ గుశలం దగఁ జుట్టును బేర్చి మిన్నగన్ 20.

సీ. సుగ్రీవు నా విపులగ్రీవు హేమ భద్రాసన మందు వరాస్తరణము
నందుఁ బ్రాసాద రమ్య శిఖర తల మందుఁ జిత్ర మాల్య సువిరాజితము నందు
మంత్రోచ్చరణముల మర్కటాధిపుఁ బ్రాఙ్ముఖునిగ నాసీనునిఁ గూర్మిఁ జేసి
చని నదీ నదములు జలములఁ గొనితెచ్చి సాగర సంచయ జల యుతమ్ము

తే.గీ. వానరర్షభు లభ్ర కుంభముల నింపి
గజ గవాక్ష సహ శరభ గవయ గంధ
మాదన ద్వివిద సమైంద మారుతి సహ
జాంబవంత నల ముఖులు సమ్మదమున 21.

తే.గీ. శుభ వృషభ శృంగములను వసు కలశమ్ము
లను మహర్షి విహితము శాస్త్ర విధిని నభి
షిక్తుఁ జేసి రంత సుగంధ యుక్త వారి
నా వసువులు వాసవుఁ జేసి నట్లు తనరి 22.

కం. అభిషేకించి పురందర
నిభు సుగ్రీవుని ముదమ్ము నెగడ నెడఁదలం
దభయమున నఱవఁ జాగిరి
విభవమ్మున వేలు వేలు వృక్షచరమ్ముల్ 23.

తే.గీ. నిజము సేయఁగ రాఘువుని వచనమ్ము
లంత సుగ్రీవుఁడు హరీంద్రుఁ డంగదునిఁ గ
వుగిలి యభిషిక్తుఁ జేసె నపుడు తనయుని
యౌవ రాజ్యము నందు మహాత్ముఁ డలరి 24.

ఆ.వె. బాగు బా గనిరి ప్లవగ పుంగవు లరసి
యంగ దాభిషేక మట్లు జరుప
సూర్య నందనుండు సుగ్రీవుఁ బొగడిరి
యమ్మహాత్మునిఁ గడు సమ్మతించి 25.

కం. జరుగఁగ నవ్విధిఁ బ్రీతు ల
యిరి సర్వులు వానరులు నరేంద్ర తనయులం
దిరిగి తిరిగి పొగడం జా
గిరి రాముని లక్ష్మణునిఁ దగిన రీతి నటన్ 26.

తే.గీ. హృష్ట పుష్ట మహా జను లెల్లఁ దిరుగు
చుండ ధ్వజము లెల్ల వెలుఁగు చుండ భృశము
రమ్య గిరి గుహా కిష్కింధ కామ్య సిద్ధి
సుందరతరమై కన్పట్టె శోభ లడర 27.

కం. తనదు సుమహాభిషేకము
నిన కుల నాథునకుఁ దెలిపి యింతి రుమం గై
కొని రాజ్యము సుగ్రీవుఁడు
ఘనుఁడు గ్రహించె బలభేది కరణి ముదమునన్ 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది యాఱవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 27.

సుగ్రీ వాభిషే కానంతరము రామ లక్ష్మణులు ప్రస్రవణ మను గిరిని నివాసము చేయుట, పర్వత ప్రాంతముల రమ్యతఁ గాంచి రాముఁడు సీతను దలఁచి విచారమున మునుఁగ లక్ష్మణుఁ డంత నాశ్వాసించుట.

కం. హరివరుఁ డభిషే కానం
తర మా సుగ్రీవుఁడు ముదిత మదిఁ జన గుహాం
తరమునకుం బ్రస్రవణము
గిరిఁ జేరెను రాముఁ డుండ కెడ ననుజుండే 1.

సీ. శార్దూల మృగ చయ సంఘుష్టమై భీమ రవ సింహగణ సంకులమ్ము  ఋక్ష
వానర గోపుచ్ఛ వన్య మార్జాల నిషేవితం బయి లతా శ్రేష్ఠ గుల్మ
నానా మహీరుహ నంద నోపమ శోభితం బయి నిర్మ లోదక జలాశ
య పరిపూర్ణం బగు నభ్రరాజ నిభ గిరీంద్రముఁ బరికించి యెలమి నందు
ఆ.వె. శిఖర మందు నున్న శ్రేష్ఠ మాయత మైన
నొక్క గుహను గాంచి యుత్తముండు
రాముఁ డనుజ వరుని లక్ష్మణునిం గూడి
వాస ముండ నెంచి పలికె నిట్లు 2.

చం. సమయ మొనర్చి  యుంటి మిట సఖ్యత భాస్కర సూను తోడుతన్
రమణను లక్ష్మి వర్ధనుని లక్ష్మణ తోడ వినీతు తోడ ర
మ్యముగ వచించె నీ గిరల నంచితముల్ సమయోచితమ్ము లుం
దుమ యిట వర్షకాల మది తూర్ణముగాఁ జను దాఁక లక్ష్మణా! 3.

సీ. పార్థివాత్మజ! గిరివర శృంగ మిది రమ్యమున్నతమును శిల లుండె శ్వేత 4.

తామ్ర గృష్ణ విలసితములు నానా ధాతు సంకీర్ణము  దరీ నిచయ స నిర్ఘ
రాభి శోభితము మహా వృక్ష షండ చారు లతా విచిత్ర గురుతర సంవృ
తమ్ము నానా ద్విజ తండ మయూర రవ నినాదితమ్మును భవ్య మాల

తే.గీ. తీ లతా కుంద వర గుల్మ జాల సింధు
వార సశిరీషక కదంబ పాద పార్జు
న వర పుష్పాకలిత సర్జ నగ నికాయ
మరయు మిచ్చట నుండ సుందరము లెల్ల

కం. విరిసిన పంకజములతో
డ రమ్యపు సరోవరం బడరు చుండె నిటన్
ధరణీశ నందనా! గుహ
దరి నున్నది మనకు నెంచఁ దథ్యము గనుమా 5.

తే.గీ. పల్ల మీశాన్యమున గుహఁ బరఁగు చుండె
సాధు వౌ నిది తలపోయ సత్యముగను
బడమటఁ దనరె యెత్తది వాయు వేగ
మెల్ల నాపును లక్ష్మణ! యెల్ల వేళ 6.

కం. కలదు గుహా ద్వారమ్మున
శిల శుభముగ  సమతల విలసిత మాయతమున్
లలితం బంజన నిచయము
వలె వెలయుచు మిక్కుటముగ భ్రాతా! కనుమా 7.

ఆ.వె. ఉత్తర దిశఁ గనుమ యుత్థిత పర్వత
శృంగ మంజన నిభ  చిత్ర తమము
తోయద సదృశమ్ము తోరంపు శుభదంబు
సుమ్ము లక్ష్మణా నిజమ్ము నెంచ 8.

కం. మేలుగ దక్షిణ దిక్కునఁ
గైలాస శిఖర నిభము సకల ధాతు మయం
బై లలిత ధవళ మపరము
శైలోన్నతము గను మయ్య సౌమిత్రి యటన్ 9.

తే.గీ. నదినిఁ బ్రాచీన వాహినిఁ బదిలమును న 10.

కర్దమమ్మును గుహకుండఁగఁ దగఁ బూర్వ
దిక్కు నందు వీక్షింపుమ చక్కగాఁ ద్రి
కూట మందున్న జాహ్నవి పాటి యనఁగ

తే.గీ. చందన తిలక స తమాల సాల సరళ
పద్మ కాతిముక్తక ఘన పాదపములు
భాసిల నశోకములఁ గూడి పర్వతప్ర
దేశములు వెలయఁగ నదీ తీర మందు 11.

తే.గీ. ప్రబ్బ తిమిశ పొగడ లెల్లఁ బరఁగ మొగలి
యుమ్మెతలును గిఱక తాళ్లు నుండ తినిశ
నీప వేత్రక కృతమాల నిచయ ముండ
నది యలంకృత భామ పగిది కనఁబడు 12.

ఉ. వందల పక్షి పంక్తుల రవమ్ము లనేకములం జెలంగఁగా
సుందర చక్రవాకములు సూడఁగ నొండొరులన్ సరక్తి యా
యంద మొసంగు సైకతము లంచలు బెగ్గురు లుండ వెల్గుచున్
విందు నొసంగె నవ్వ కొమ వీఁకను భూషల నేలు మిక్కిలిన్ 13.

కం. ఒకచో నల్లని కలువలు
నొకచో నెఱ్ఱని కలువలు నొకచో సితముల్
వికసింప దివ్య కుముదము
లొకచోఁ గుట్మలము లుండె నొప్పుగఁ గనుమా 14.

ఆ.వె. నీటి పక్షు లుండ నెగడి వందలు కొంగ
ల నెమళుల రవము లలరఁ గడు రమ
ణీయముగను మునులు నిత్యము సేవింపఁ
దనరు నదిని సౌమ్య! కనుమ యిచట 15.

తే.గీ. చందన తరువు లిచ్చట నందముగ న
మరెను చక్కని పంక్తి సమముగ మనము
నఁ దలఁచిన యట్ల మద్దెలు నగ వరములు
కూడ భాసిలు చున్నవి తోడఁ గనుమ 16.

కం. రమణీయ మైన దిది రిపు
దమనా! హర్షింతు వీవు తప్పక మది వా
సము చేయుద మిచ్చోట సు
ఖముగ సుమిత్రా కుమార! కమనీయముగన్ 17.

కం. అతి దూరము కా దిటకు మ
హతీ పురము చిత్ర కాన నాకలితం బా
వితతపుఁ గిష్కింధయు ర
మ్య తరము సుగ్రీవు నగర మవలోకింపన్ 18.

చం. వినఁబడు గీత వాద్యములు పెల్లుగ జిత్వర వర్య వీటినిన్
వనచర సంచయమ్ముల యవారిత నర్దము లా మృదంగముల్
ఘనముగ మ్రోగ రాజ్యమును గాంతను బొంది సు మిత్ర వర్గముం
గని సిరి నంది వానరుల కాంతుఁడు హర్షము నందు నింపుగన్ 19.

ఆ.వె. పలికి యిట్లు వచనములు లక్ష్మణునిఁ గూడి
రాముఁ డచటఁ గందరములు కుంజ
ము లధికముగ నున్న పుణ్యంపుఁ దటిలోనఁ
బ్రస్రవణ గిరిని నివాస ముండె 20.

కం. సకల సమృద్ధపు గిరి సే
ని కలుగదు ముదమ్ము సుంత నృవరుని మదిలో
నకటా వసింప రాఘువు
నకు నత్యధికము సుఖము దనరు దేశమునన్ 21.

కం. కని యుదయించెడు చంద్రుని
మనమున నపహృతను దార మైథిలి దయితా
యని స్మరియించును గలఁతం
దన ప్రాణమ్ములకు మిన్నఁ దరుణిని సతమున్ 22.

తే.గీ. ఎగసి నట్టి దుఃఖమ్ముచే నింత యేని
నిద్రకు వశుఁడు గాఁడు కన్నీరు నిండి 23.

నట్టి ముఖమునఁ జేర శయనము తప్త
చిత్తుఁడై భృశముగ నర శేఖరుండు

తే.గీ. నిత్య శోక పరాయణు సత్య సంధు
నంతఁ గాకుత్స్థు రాముని నరసి తుల్య
శోక తప్తుండు సౌమిత్రి సోదరుండు
పలికె ననునయ పూరిత వచనములను 24.

ఆ.వె. వగచు టింకఁ జాలుఁ బరవీర దారక!
శోక మందఁ దగవు శూర నీవు
కార్యము లవి యెల్లఁ గలఁత వలనఁ జెడు
నెఱుఁగు దీవు దీని నెల్ల భృశము 25.

ఉ. నీవు క్రియా పరుండ విఁక నీ విల దేవ పరాయణుండవే
నీవు నవశ్య మాస్తిక వినీతుఁడవున్ వ్యవసాయి వౌదువే
నీ వతి ధర్మ శీలుఁడవు నీ రిపు రక్కసుఁ గ్రూరు రావణున్
నీ విటు లుద్యమింపమిని నేరుదు పెట్లు వధింపఁ గల్లరిన్ 26.

ఉ. త్రుంచు సమూల మింపుగను దుఃఖము రాఘవ! యుద్యమింపుమా
యంచిత రీతి రాక్షసుల నందఱినిన్ సపరిగ్రహమ్ముగా
మించి వధింపఁ ద్రిప్పగ స మీర వనాచల భూమి నెల్లనున్
మించిన శక్తిమంతుఁడవు మీఱి దశానను జెప్పనేలనో 27.

ఆ.వె. వర్షకాల మిపుడు వచ్చినది శర దా
గమనమునకుఁ బన్నుగ మన మెదురు
చూడ వలయు నంత శూర! సరాష్ట్ర స
గణము చంపుదు దశకంఠు నీవు 28.

తే.గీ. నివుఱు గప్పి నిల్చిన యట్టి నిప్పు నాహు
తి సమయమ్మున వెలిఁగించు తీరు నేను
నీ నిదుర నున్న వీర్యమ్ము నెమ్మి లేపు
చుంటి నింతియ ప్రీతిని నుచిత రీతి 29.

చం. విని వచియింప లక్ష్మణుఁడు ప్రీతి హితంబు నొసంగు వాక్యముల్
ఘనముగ గౌరవించి పలుకంగఁ దొడంగెను రాముఁ డివ్విధిం
జనవున యుక్త వాక్యములు సక్కఁగఁ బల్కితి సత్యవిక్రమా!
తనర హితమ్ము నాకు నిటఁ దద్దయుఁ బ్రీతిని స్నేహ యుక్తముల్ 30.

తే.గీ. పనుల కాటంకము నొసంగు వగపు నెల్ల
నేను ద్యజియింతుఁ దప్పక నెమ్మి తోడ
వీరు లందు నెదురు లేని బెట్టిదంపు
తేజ మేను వహింతును దివిరి యింక 31.

కం. శరదృతువునకై చేయుదు
నిరీక్షణము నాలకింతు నీ వచనములన్
హరి సుగ్రీవు మఱి నదీ
వరమ్ముల ప్రసాదములకుఁ బన్నుగ నిలుతున్ 32.

కం. ఉపకారికి వీరుఁడు ప్ర
త్యుపకారముఁ జేయఁ దల్చు నుచిత విధముగా
నుపకారమ్మును బడసిన
నుపకార మొనర్ప కున్న నోర్వరు విబుధుల్ 33.

కం. అన విని తలంచి యించుక
యనుజుఁడు లక్ష్మణుఁడు నిల్చి యంజలిఁ దాఁ బ
ల్కెను సుందర రూపుని తోఁ
దనదు మతమ్ము నెఱిఁగింపఁ దద్దయుఁ బ్రీతిన్ 34.

తే.గీ. అచిర మీడేర్చును నరేంద్ర! రుచిర వాంఛి
తమ్ము వానరేశుఁడు శరత్కాల మింక
వచ్చు దనుక నిరీక్షింప వలయు దృఢుఁడు
శత్రు వధము నందు క్షమింపు జల పతనము 35.

తే.గీ. కోపమును వీడి సైచి నాల్గు నెలలను శ
రత్తునకు వేచి యీ యచలమ్ము నందు
సింహ మృగ సేవితమున వసింపు నన్ను 36.

గూడి తివురుచు రిపు వధకు నధికముగ

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది యేడవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 28.

రామ లక్ష్మణులు వర్షకాలమున మాల్యవంత పర్వతమున (ప్రస్రవణము) నివసించు చుండ
రాముఁడు వర్ష కాలమును వర్ణించుచు లక్ష్మణునితో సంభాషించుట.

తే.గీ. వాలిఁ జంపి సుగ్రీవుని మేలుగ నభి
షిక్తుఁ జేసి లక్ష్మణుతో వచించెఁ బుడమి
మగఁడు ప్రస్రవ ణోపేత మాల్యవంత
గిరిని వసియించి రాముఁడు గిరల నిట్లు 1.

ఉ. వచ్చెను గాల మిప్పు డిట వర్షపు రాకకుఁ జూడు లక్ష్మణా!
మెచ్చగ నద్రి తుల్యములు మేఘము లెల్లెడఁ గ్రమ్మె రోదసిన్
హెచ్చుగఁ బీల్చి వార్ధి జల మెల్ల గభస్తి తతిం బ్రియమ్ముగా
నచ్చము మూడు మూళ్లు నెల లాని నభమ్ము గనున్ రసమ్మునున్ 2.

ఆ.వె. మబ్బు మెట్లు లెక్కి యబ్బురముగ నింగిఁ
జేరి మల్లె మద్ది చెట్ల పూల
దండల దినకరునిఁ దగిన రీతి నలంక
రింప శక్య మగును నొంపు మీఱ 3.

తే.గీ. సంధ్య యందలి యెఱ్ఱని ఛాయ తోడఁ
జివర లందుఁ దెల్లని రంగు సెలఁగ మబ్బు
లనెడు బట్టలు వ్రణముల యందుఁ జుట్టి 4.

నట్టు లగపడు నంబర మరయ మనకు

తే.గీ. నెమ్మదిగ వీచు పవనమ్ము నిశ్వసనము
కాఁగ సంధ్యారుణ రుచి సుగంధ రంజి
తమ్ము కాఁగ ధవళ తోయదమ్ము వఱలఁ
గామ తప్తగఁ గన్పట్టు గగన మిపుడు 5.

ఆ.వె. రగిలి వేఁడి కవని రమణి భృశమ్ముగఁ
గ్రొత్త నీట మునిఁగి యిత్తఱి కడు
దుఃఖ తప్త చిత్త తోరంపుఁ గన్నీరు
రాల్చు చుండెఁ గను ధరణిజ భంగి 6.

ఆ.వె. మబ్బు కడుపు లందు మసలి పెడలు గాలిఁ
గలువ చల్లఁదనము కదుర మొగలి
పూవు వాసనలను మోద మొసఁగ నంజ
లిఁ గొన శక్య మగును లీల నిచట 7.

కం. కనుమీ విరిసిన తరు ల
ర్జునముల నింపు నొసఁగు మొగళుల వాసనలం
దనరెడు శైలము స్నాన
మ్ము నాడె సుగ్రీవు నిజ రిపు విహీను వలెన్ 8.

తే.గీ. మబ్బు లడరంగ జింక చర్మముల పగిది
నీటి ధారలు పరఁగ జన్నిదము లనఁగ
గుహల నిండిన వాయువు కూఁత లిడఁగ
బ్రహ్మచారుల భంగిఁ బర్వతము లుండె 9.

ఆ.వె. మెఱపు గుంపు లనెడు మిసిమి పసిఁడి చబు
కులను గొట్టఁ బడుచు ఘోర రీతి
నుఱుములు సెలగంగ నఱపుల వలెఁ జద
లేడ్చు విధము తోఁచె నేఁపు తోడ 10.

తే.గీ. నల్ల మబ్బుల మెదలు చున్న మెఱపులను 11.

బోలి కన్పట్టు చున్నది ముదిత సీత
దీనముగఁ గదలాడుచుఁ దీవ్ర తాప
మున నిశాచరు ఘోరాంకమున నడలుచు

కం. ప్రకటముగఁ బ్రేయసీ ప్రియు
లకు మే లొనగూరును బదిలమ్ముగఁ దగ న
డ్డుకొనఁ బడ దిక్కులు కనఁబ
డకున్న చంద్రగ్రహము లడర మేఘమ్ముల్ 12.

తే.గీ. చూడుమీ మల్లెల నెదురు చూచు చుండి
నీటి రాకకు నింపుగ నింపఁ బడఁగఁ
గొండ నెత్తములం బూయు చుండి యనుజ!
రేఁపు చున్నవి నా కోర్కె లేపు గాను 13.

చం. అనుజ! రజస్సడంగును హి మాకలితం బగు వాయు వెల్లెడం
గన మిఁక నెండ వేఁడిమి నృకాంతులు యాత్రల నాపి నిల్తురే
యనువుగ నింక నింపుగఁ బురాంతర వాసులు మోద చిత్తులై
కనుదు రిఁకన్ స్వదేశములు గ్రన్ననఁ బూరుషు లెల్ల రిత్తజిన్ 14.

తే.గీ. అలరి మానస వాస లుబ్ధులు వెడలి ర
చటకుఁ బ్రియులఁ గలిసె నేఁడు చక్రవాక
పక్షు లెల్ల వర్షోదక ధ్వంసిత గతు
లందుఁ జన నేర విప్పుడు యాన తతులు 15.

తే.గీ. గగన మగపడు నొక చోటఁ గాన రా ద
ది మఱి యొక్కచోటఁ జెదర దిక్కు లందు
తోయదము లక్క డక్కడఁ దుంగ రాజి
యడ్డుపడఁ దోఁచు శాంతపు టబ్ధి భంగి 16.

తే.గీ. నెమళుల గముల తియ్యని నిస్వనములఁ
గలసి సర్జ కదంబ తరుల సుమముల
శైల ధాతు చయముల కెంజాయఁ గూడి
గిరి నదులు పాఱు వేగ మడర భృశమ్ము 17.

తే.గీ. రసము నిండిన నేరెడు రమ్య ఫలము
భృంగ సన్నిభమ్మును గోరి ప్రీతిఁ దినఁగ
గాలికిఁ బడును బుడమిఁ బక్వ మయి మావి
పం డనేక వర్ణములను బడసి వేగ 18.

తే.గీ. కొంగల గములు మాలల భంగి నుండ
మెఱపులు పతాకములు కాఁగ మేటి కొండ
కొనలఁ బోలు మబ్బు లిడె గర్జనము లాజి
మత్త గజముల భంగి సంభ్రమమున నిట 19.

చం. పదునుగ వాన నీరు గొని పచ్చిక బైలులు తృప్తి నందఁగా
రొదల నొసంగు చుండ నెమలుల్ దమి నృత్య వినోద కేళులన్
వదలిన నీటితోఁ గదల వారిద పంక్తులు మేఘ వీథిలో
నిది రుచి రాపరాహ్ణ మిట నియ్యటవుల్ గడు వెల్గఁ గాంచుమా 20.

ఆ.వె. భార మయిన నీటిఁ బన్నుగ మోయుచుఁ
గొంగ లనుగమింపఁ గొండ కొనల
పై ధ్వనించు చుండి వారిధర వ్రాత
మాఁగి యాఁగి తిరిగి యడరి వెడలు 21.

ఆ.వె. కోరుచు మొగుళులను గొంగలు సంతస
మంది యెగురు చుండఁ జింది గాలి
చేతఁ దామర లెగసి దివికి ప్రేలాడు
దండ లనఁగ వింతఁ దనరెఁ గనుమ 22.

ఆ.వె. పచ్చ నైన గడ్డిపై నెఱ్ఱని పురుగు
లలరి తిర్గు చుండ నవని భామ
చిలుక రంగు నడరు చీర నెఱ్ఱని చుక్క
లద్దఁ గట్టి నట్టు లగపడె నిట 23.

తే.గీ. నీరజాక్షు హరునిఁ జేరు నిద్ర యిపుడు
చక్కఁగ నదులు సేరును సాగరమ్ముఁ 24.

గోరి మబ్బులను గదియుఁ గొంగ లిపుడు
కాంత కోరికతోఁ దన కాంతుఁ జేరు

తే.గీ. నాట్య మాడు బర్హిణము లానందముగను
బూయును గదంబ శాఖలు పూల నిపుడు
కూర్మిఁ జేరు వృషభములు గోవుల నిఁక
నందగించు సస్యమ్ముల నవని యిపుడు 25.

ఆ.వె. పాఱుఁ గురియుఁ జేయు ధ్వనిని వెలుంగును
దలఁతురు నటనమునఁ దనరుఁ దేఱు
నదులు వారిదములు మదకరులు వనులు
విరహిణులు నెమళులు హరులు సెలఁగి 26.

కం. మొగలి విరులవాసన లా
ని గజమ్ములు మత్తిలి వన నిర్ఝరములలోఁ
దగ వారి ధ్వనుల నెమళు
లఁ గూడి రహి ఘీంకరింప రావము లడరెన్ 27.

ఆ.వె. కడిమి కొమ్మల పయి జడియక ప్రేలాడు
పుష్ప రసము గ్రోలి మురిసి క్షణము
తేఁటు లంత నీటి దెబ్బల వీడుచు
న్నవి మదమును మెల్లనఁ బడ వాన 28.

కం. రస పూరిత ఫల రాశి వి
లసిల్ల నేరెడు విటపముల నరయ నంగా
ర సుచూర్ణ సన్నిభమ్ముగఁ
బ్రసిద్ధ భృంగముల భంగి రాజిలె నచటన్ 29.

కం. మబ్బులు కన్పడె మెఱపుల
నబ్బురముగ నుఱుము లిడు మహా రవములతో
నిబ్బరముగఁ బోరాడెడు
నబ్బల దర్పిత కరి నిచయమ్ముగ నిచటన్ 30.

కం. విని మేఘ గర్జనమ్మును
జనుచు గిరి వన పథ మందు శంకించి మదిన్
ఘన శత్రు ప్రతి నాదం
బని సంగర కాంక్ష తోడ నా కరి మరలెన్ 31.

తే.గీ. పెక్కులకు నాశ్రయం బగు నిక్కడి వన
మందు నొక్కచోఁ బాడెడు నళులు దనర
నొక్కచో నాడెడు నెమళ్లు నొక్క చోట
వెలయు మత్తకుంజరములు విరివి గాను 32.

ఆ.వె. క్రొత్త నీట నిండి యుత్తమ కడిమి స
ర్జార్జున నవ కందళాఢ్యములను
నెమళు లఱచి యాడఁ గమనీయ వనభూమి
పాన భూమి భంగి వఱలు చుండె 33.

ఆ.వె. ఈయ నీటి కణము లింద్రుఁడు వోల ము
త్యములను నిలువంగ దళము లందు
నచ్చపు టుదకమ్ము నలరి వివర్ణ చ్ఛ
ద విహగములు గనుమ త్రాగుచుండ 34.

తే.గీ. తుమ్మెదల రొద మీఱఁ దంతుల రవ మనఁ
దనరు చుండఁ గప్పల కంఠ తాల మటఁ బ
యోద రవ మడర మృదంగ నాద సరణి
వనము నందు సంగీతము దనరు చుండె 35.

చం. ఒక తటి నాట్య మాడునవి యొక్కటఁ బెద్దగఁ గూయు నట్టిపై
యొకట మయూర మండలము లుండఁగ శాఖల పైన నింపుగా
వికసిత రమ్య పింఛములు వెల్గ విభూషణ సన్నిభమ్ములై
యొకట విలాస రీతి వని నొప్పె మయూర సభా వినోదమై 36.

కం. చిర కాల నిద్ర వీడి వి
ని రౌద్ర నీరద రవములు నినదించెను లే
చి రహి బహు రూప వర్ణ రు 37.

చిరములు కప్పలు నవాప్పు చేత హతములై

తే.గీ. కలుపు కొని రమ్య చక్రవాక విహగముల
నిజ తటులను నుల్లంఘించి నిండఁ గ్రొత్త
కానుకలు పూర్ణ కాంక్షలు గర్వ మడరఁ
గదలె నదులు తమ పతినిఁ గడలిఁ జేర 38.

తే.గీ. నీలి మేఘ పంక్తులఁ గ్రొత్త నీటి నీలి
మేఘములు సేరి వెల్గెను మిక్కుటముగఁ
గారు చిచ్చునఁ గాలిన గ్రావ మూల
మున దవాగ్ని దగ్ధ గ్రావము వెలుఁగు గతి 39.

తే.గీ. మురిసి నెమళులు నిస్వనమ్ము లొనరింప
శక్రగోపములు సెలంగు శాద్వలములఁ
గదలు చుండె నీ పార్జున గంధ యుక్త
వన తలమ్ముల నలరుచు వారణములు 40.

కం. నవ జల ధారా హతముల
ను విడిచి వెసఁ గేసరములను బిసరుహములన్
నవ కేసర యుక్త కదం
బ వర కుసుమములను జేరె భ్రమర గణమ్ముల్ 41.

తే.గీ. మత్తిలెఁ గరు లుక్షములు సమ్మదము నందె
నెలమి సెలఁగె విశ్రాంతిని మృగ రిపువులు
నిలిచిరి నరేంద్రు లద్రులు సలలితములు
వారిదములతోఁ గ్రీడించు వాసవుండు 42.

తే.గీ. మూర జల రాశి సెలఁగె సముద్ర ఘోష
దివిని ప్రేలాడు మేఘముల వలనన ని
ఖిల నదులును నూతులు సరస్సులు కొలఁకులు
ధరణి కృత్స్నమ్ము నుండు నుదక మయ మయి 43.

ఆ.వె. వర్ష ధార లడరుఁ బరమ వేగమ్మున 44.

వీచు గాలు లింక వింత ధ్వనులఁ
గూలఁ గూలములు సుఘోరముగ నదులు
పాఱఁ దొడఁగు వివిధ పథము లందు

తే.గీ. ఇంద్రుఁ డీయఁగఁ గొనితేర సెలమి గాలి
మబ్బు లను నీటి కుండల నబ్బురముగ
స్నాన మాడి గిరీంద్రుఁడు స్వామి యగును
నర గణం బభిషేకింప నరపతి వలె 45.

ఆ.వె. చూడ నలవి గాదు సూర్యునిఁ దారల
మూయ మేఘములు నభోతలమ్ము
దిశ లిటఁ గన రావు భృశము చీఁకటి నిండ
నవ జలౌఘము ధరణి పెలయంగ 46.

ఆ.వె. గిరి ఘన శిఖరమ్ము లురువుగ ధారలఁ
గడుగఁ బడి యట నధికముగ వెలుఁగు
చున్నవి సెలయేఱు లన్నగమునఁ బాఱ
ప్రేలు ముత్తియముల పెన్సరు లన 47.

ఆ.వె. కొండ ఱాళ్ల పైన మెండుగఁ బాఱు ని
ర్ఝరములు కదిసి గుహలను మయూర
ము లొసఁగఁగ నినాదము లడరి చెదరిన
హారముల విధముగ నగపడు నట 48.

తే.గీ. కొండ కాలువలు స్రవించి ఘోర వేగ
ముగను గడిగి కొనల సెల్ల ముత్తియముల
పగిది గుహల యంకమ్ములఁ బన్నుగ ధరి
యింపఁ బడి నట్లు వెసఁ జేరు నింపు గొలుప 49.

ఆ.వె. నీటి ధార లెల్ల నిఖిల దిశల యందుఁ
బాఱు చున్నవి దివి భామ లూను
ముత్యములు తెగి రతమున నేలఁ గూలిన
విధము తోఁచు చుండ వేగముగను 50.

తే.గీ. విహగములు సేర నింపుగ వీడులకును
ముడిచి కొని యుండఁ బంకజము లవి యెల్ల
మాలతులు వికసింపఁగ మనకుఁ దెలియు
సూర్యుఁ డస్తాద్రి కేఁగె నంచు విశదముగ 51.

తే.గీ. ఆఁగినవి భూపతుల దండ యాత్ర లెల్ల
శీఘ్రముగ నివర్తిలినవి సేన లెల్ల
వైరములు మార్గములు సెల్ల వారి రాశి
చేతఁ జక్కఁబడినవి రుచిరపు రీతి 52.

ఆ.వె. వేదముఁ బఠియించు వేళ భాద్రపద మా
సమ్ము భూతలమున సమ్మదముగ
సామ వేద గాన సమయము సేర్వఁగ
బ్రాహ్మణులకు సెల్ల రమ్యముగను 53.

తే.గీ. పనుల నెల్లఁ బూరించి యబ్బరతుఁ డడరి
ప్రోఁగు సేసి సంచితములఁ బురము నందు
భూతలేశ్వరుఁ డాషాఢ పూర్ణిమఁ బరి
కించి తప్పకుండ ననుసరించు నతఁడు 54.

కం. నన్నరసి రా నయోధ్యకు
మిన్నగ జను లెల్ల ముదము మీఱ స్వనములన్
గ్రన్నన నొనర్చు పగిదిన్
సన్నది వర్ధిల్లు నిండి సరయూ నదియే 55.

మ. కన సుగ్రీవుఁడు వర్ష కాలమున సౌఖ్యవ్రాతముల్ వొందుఁ దా
ఘనుఁడై రాజ్యము నందు దార యుతుఁడై ఖండింప స్వీయారులం
గనుమీ రాజ్య విహీను లక్ష్మణ! ననుం గాంతా విహీనున్ వగన్
వనరం బెల్లుగ భగ్నకూల నది నా భగ్నాత్ము నీ యగ్రజున్ 56.

చం. విపులము నాదు శోక మెద వృష్టియు దుర్గమ మెంచ లక్ష్మణా!
రిపు వగు రావణుండు విపరీత బలుండు జయింప కష్టుఁడే 57.

కపివరు తోడ యాత్ర కయి కాలము దుర్గమ మార్గముల్ దలం
చి పలుక నైతి నెద్దియును స్నేహమునన్ వినయుండు నైననున్

తే.గీ. ఇడుమలు వడసె భృశముగఁ బడసె దారఁ
దాను జిరకాలమున కని తలఁచి స్వీయ
కార్య గరిమను వానరగణ విభునకు
నుడువ జాలక యుంటిని యడర శంక 58.

కం. తఱచుగ విశ్రాంతి వడసి
యెఱింగి కాలాగమనము నింపుగఁ దానే
వెఱవక యుపకారము దా
నెఱుఁగును నిశ్శంక మనకు నెల్లను జేయన్ 59.

కం. అరయఁగఁ గాలము చేయుదు
నిరీక్షణము నంచి తాంక! నే నిట నింకన్
హరి సుగ్రీవు మఱి నదీ
వరమ్ముల ప్రసాదములకుఁ బన్నుగ నిలుతున్ 60.

కం. ఉపకారికి వీరుఁడు ప్ర
త్యుపకారముఁ జేయఁ దల్చు నుచిత విధముగా
నుపకారమ్మును బడసిన
నుపకార మొనర్ప కున్న నోర్వరు విబుధుల్ 61.

కం. అన విని తలంచి యించుక
యనుజుఁడు లక్ష్మణుఁడు నిల్చి యంజలిఁ దాఁ బ
ల్కెను సుందర రూపుని తోఁ
దనదు మతమ్ము నెఱిఁగింపఁ దద్దయుఁ బ్రీతిన్ 62.

తే.గీ. అచిర మీడేర్చును నరేంద్ర! రుచిర వాంఛి
తమ్ము వానరేశుఁడు శరత్కాల మింక
వచ్చు దనుక నిరీక్షింప వలయు దృఢుఁడు
శత్రు వధము నందు క్షమింపు జల పతనము 63.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది యెనిమిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 29.

హనుమంతుఁడు రాజ్య భారమును మంత్రులపై విడిచి తన భార్యలతోను దారతో నహోరాత్రములు వినోదములఁ దేలుచు భోగ లాలసుఁడై కర్తవ్యమును మఱచిన సుగ్రీవునిఁ జేరి మృదు మధుర వాక్యముల సీతాన్వేషణ ప్రయత్నములు సేయ వలె నని కర్తవ్య బోధ సేయ సుగ్రీవుఁడు నలునితో సకల వానర సేనను సమకూర్పు మని పల్కి నిజగృహము లోని కేఁగుట.

కం. కని హనుమంతుండు నభ
మ్మును విమల తరమ్మును మెఱుములు మేఘమ్ముల్
సన సారస గణ సంకుల
మును బఱచిన వెన్నెల కరము వెలుఁగు చుండన్ 1.

సీ. కదిసి సుగ్రీవునిఁ గపివరు నర్థ లబ్ధుని నిజ ధర్మార్థములను సంగ్ర
హింపని వానిని హీనుల గతులఁ జరించెడు నేకాంత సంచరిష్ణు
నిజ కార్య వర్జితు నిత్యాంగనా రతు లబ్ధ మనోరథుఁ బ్రాప్త భార్యుఁ
దారా సమీప్సితు మూరి యహోరాత్రులు రమించు వానిని జ్వరవిహీను
తే.గీ. నందనమ్మున నప్సరో నారుల సహి
తమ్ము క్రీడించు నింద్రు నిభమ్ము క్రీడ
సల్పు  వాని మంత్రుల యందు సకల కార్య
ముల నునుచు వాని నెన్నఁడు గలయ కుండ 2.

తే.గీ. నష్ట రాజ్య సందేశు ననవర తాత్మ
కామ వశుని వాక్యజ్ఞునిఁ గాంచి యర్థ
విదుఁడు నిశ్చితార్థ మతి వివేకుఁ డనిల
సుతుఁడు మధుర హేతు వచన తతుల నిట్లు 3.

తే.గీ. కాల ధర్మ యుక్తమ్ములు మేలు నొసఁగు
నట్టి హిత మొనర్పఁ దలంచి యంచితములు
సామ ధర్మార్థ నీతి వచనము లాద
రమున వచియించె నివ్విధిఁ బ్రత్యయమున 4.

చం. దొరకెను రాజ్యమున్ యశము దొడ్డగ నీ కుల మందె వృద్ధినిన్
దొరకిరి మంచి మిత్రులును దూర్ణము నీ వొనరింప శేషమున్
హరివర! నొప్పు నింక సమయమ్ము నెఱింగి చరింప మిత్రు లం
దురువుగఁ గీర్తి రాజ్యములు నొప్పుగఁ బెర్గును నిశ్చయమ్ముగన్ 5.

కం. ఎవ్వని భాండాగారము
నెవ్వని దండంబు మిత్రు లెల్లరు దానున్
నివ్వటిలును సమ రీతిని
నవ్వాని కపీశ! రాజ్య మలరారు ధరన్ 6.

చం. నిలువ నిరత్య యాధ్వమున నీవు సమంచిత వృత్త వర్తనా!
చెలిమరికై యొనర్పఁగ రుచించెడు కర్జముఁ జేయఁ బూనుమా
చెలఁగిన మిత్ర కార్యముల శీఘ్రము వీడి స్వ కార్య కోటినిం
గలుగవు వాని కడ్డు లిలఁ గ్రమ్మిన యోజను సంభ్రమమ్ములన్ 7.

తే.గీ. తనరి కాల మతిక్రమింప నొనరింప
మిత్ర కార్యములు హిత మమేయ మెంచి
యవి ఫలింప నేరవు నిశ్చయమ్ము సుమ్ము
సేయ నొప్పు నరిందమ! శీఘ్రముగను 8.

ఆ.వె. సఖుని కార్య మింకఁ జలుప వలయు మన
కంచితముగఁ గడచె నరయ వేళ
సీత కొఱకు వెదక నీ తఱిఁ గర్తవ్య
మగును మించ కుండ నడరి నీకు 9.

తే.గీ. కాల మెఱిఁగిన రాముఁడు కపిగణేశ!
ప్రాజ్ఞుఁ డున్నను ద్వర యందు రాజ వశము 10.

నందు నున్న కారణమున నిందు ముఖుఁడు
దా నివేదింప నేరఁడు తడ వయినను

ఉ. నీ కుల ముద్ధరించెఁ దగ నీ కగు రాముఁడు దీర్ఘ బంధువే
నీ కెఱిఁగింపగా వలయు నెమ్మిని నాతని ప్రాభవమ్ము దా
నాకరుఁడౌ గుణమ్ములకు నప్రతిమమ్ముగ వాని కార్యమున్
వీఁక నొనర్పఁగాఁ దగును విక్రమ! వానర కోటిఁ బంపుమా 11.

తే.గీ. మనలఁ దొండాడ కున్నంత దనుక రాముఁ
డలుకఁ గాదు కాలాతీత మని తలంప
నగును దొందర పెట్టిన నగును నిశ్చ
యముగఁ గాలవ్యతిక్రమ మార్య! వినుమ 12.

కం. చేయని వానికి నైనను
జేయం గల వాఁడవే వచింపఁగ నేలా
యీయఁగ రాజ్యము విత్తము
నా యుత్తమున కిఁకఁ జేయు మని హరినాథా! 13.

కం. బలవంతుండవు కపులకు
నెలుంగులకు నీశ్వరుఁడ వయి వెలుంగుదు వి
ట్టుల దాశరథి కొఱకు నా
జ్ఞల నీయ వదేల నీవు సంసిద్ధుఁడవై 14.

ఆ.వె. నిర్జ రాసుర ఫణి నిచయము లాతని
వశము నందుఁ దనరు భృశముగాను
రాఘవుండు నీదు ప్రతినఁ దలంచి తా
వేచి యుండును సమయోచితముగ 15.

ఆ.వె. ప్రాణమునకును వెఱవక నీకుఁ బ్రియ మొన
రించె రాముఁ డచట నంచితముగ
నతని సతిని సీత వెతకెద మవని నై
న గగనమ్మున నయినను హరీంద్ర! 16.

తే.గీ. దానవులు దేవతలును గంధర్వు లసురు
లును మరుత్తులు యక్షవరు లొనరింప
లేరు కీ డన రాక్షస వీరుల నుడు
వంగ నేల చెప్పుమ యింక వానరేంద్ర! 17.

తే.గీ. అట్టి శక్తిమంతు మును సాయమ్ము సేసి
నట్టి రాఘువుని హిత కార్యమ్ము హరి వ
రేణ్య! ప్రియముగ నీ వడరి యొనరింప
యుక్త మగు నవశ్య మిపుడు రక్తి తోడ 18.

చం. ఒసఁగిన యాజ్ఞ వానర గణోత్తమ! మాకిట మేము వూని సా
హసమును గ్రిందు నైన జల మందును పైనను నింక మీఱి యా
కసమున నైన నెందయినఁ గ్రన్నన యత్నము సేయ సిద్ధమే
విసువక కోటి మించి కపి వీరులు నీ కడ నుండఁ బంపుమా 19.

ఆ.వె. మారుతాత్మజుఁ డన మాటలఁ జక్కఁగ
నాలకించి సత్త్వ మందు ఘనుఁడు
శుభములు హితములును సుగ్రీవుఁడు దలంచి
యుత్తమముగ నెడఁద నూని యంత 20.

తే.గీ. నిత్య సన్నిద్ధు నిష్టుని నీలు నంతఁ
గాంచి యాదేశము నొసంగె మించి వెడలి
కూర్ప వానర సేన దిక్కులఁ జెలంగు
వాని నెల్ల సత్వర మట వాని కపుడు 21.

తే.గీ. ఎల్లెడల నున్న నా సేన యెల్ల యూధ
పులును సేనాగ్రణులు కపి పుంగవులు వి
డి విడిగఁ గదియంగ వడి వడిగ నొనర్పు
మవ్విధిని సత్వరమ్ముగ హరివరుండ! 22.

తే.గీ. అంతపాలురు కడు శీఘ్ర మరుగు ప్లవగ
వరులు వ్యవసాయు లెల్లరు త్వరితముగను
జేర నిమ్ము నా యానతి మీరి నీవు 23.

గాంచుమ తదుపరిఁ దగెడిఁ గార్య మెల్ల

కం. దినములు మూ డేనులు గడ
చిన వచ్చిన వానరునకుఁ జిక్కును బ్రాణ
మ్ము‌ను దీయు దండనము గాం
చ నిందు నే సెట్టి పర విచారణ నెడఁదన్ 24.

తే.గీ. పూని నాయాజ్ఞ నిశ్చయముఁ జను మింక
నంగదునిఁ గూడి వృద్ధు లా హరి వరులను
గదియు మని పల్కి వానర కాంతుఁ డరిగె
నిజ గృహము లోని కంత సూర్యజుఁడు వేగ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నిరువది తొమ్మిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 30.

రాముఁడు శరదృతువు రాఁగ విరహమ్మునఁ దపించుచుఁ గాలాతీతమును గాంచి సుగ్రీవుని యత్నములు దెలియ రాక లక్ష్మణునిఁ గిష్కింధకుఁ బోయి సుగ్రీవునితోఁ దన కోప రూపము నెఱిఁగించి పరుషములైన తన పలుకులను జెప్పుమన లక్ష్మణుఁ డా సుగ్రీవునిపై నత్యుగ్ర భావమును బూనుట.

మ. గుహ సుగ్రీవుఁడు సేర ముక్తములు కా ఘోరాభ్రముల్ నింగి ని
స్స్పృహతో నుండఁగ వర్ష రాత్రముల నుద్విగ్నుండునై రాముఁ డిం
క హరింపం బడ సీత తప్పుఁ డగుచుం గామమ్మునన్ మోహ మం
దు హరీశుండు సెలంగ నిర్మలపుఁ జంద్రుం గాంచి శుద్ధాభ్రమున్ 1.

తే.గీ. వెన్నెలలు విరియం గాంచి మిన్నగ నట 2.

శారద నిశలఁ గడవంగ సమయ మింక
నాతురుఁడునై విచారమ్ము నంది మూర్ఛ
వడసె రాముఁ డా క్షణ మందు భారముసను

తే.గీ. తేఱికొని ముహూర్తమ్మునఁ దెలివి నంది
దిరిగి మన మందు నున్నట్టి తరుణి సీతఁ
దలఁచె రాఘువుం డా పర్వతమ్ము నందు
నిలిచి హేమ ధాతునిచయ నిలయ మందు 3.

తే.గీ. శార దాభ్రము గని సీతఁ జేరె నెడఁదఁ
గాంచి విగత నీరదమును గగన తలము
సార సారవ సంఘుష్ట చారుతరము
రాఘవేంద్రుఁడు విలపించె రగుల వగపు 4.

తే.గీ. ఆశ్రమము నందు నా సార సారవముల
హర్ష మందు నబల సార సారవ నిభ
నాదిని యకట యిప్పు డానంద మందు
నెట్లు బాల వైదేహి సహించి బాధ 5.

చం. విమలము లైన యా పసిఁడి పేఁగిస పూవులఁ గాంచి నెమ్మదిన్
రమణి రమించు నన్ను గన రాకయె యెట్టుల బాల యిప్పు డా
యమ మును పాలకించి కలహంసల రావము లెల్ల లేచు చుం
డ మగువ లేచుఁ దా వినబడంగ నహో యట నెట్టి రావముల్ 6.

కం. విని చక్రవాకముల ని
స్వనమ్ములను బుండరీక చారు విశా లా
క్షి నిజ సహచారిణుల ర
మ్య నాదముల నెట్టు లింక మన నేర్చు నిలన్ 7.

కం. సరసుల నూతుల నేఱులఁ
జరియించినఁ గానల వన చయముల నైనన్
ధరణిజ మృగశాబాక్షిని
నరయక నే నెట్టి సుఖము నందక యుంటిన్ 8.

కం. సుకుమారిని భామిని స్వీ
యకాంత విరహార్తిని శర దఖిల గుణ నికా
య కలిత దుస్సహ కాముఁ డ
ధికముగ బాధించి పడయుఁ దృష్టి నెడందన్ 9.

చం. సలిలము గోరి చాతకము శక్రుని నుండి తపించు భంగినిం
గలవర మంది మిక్కిలి నృకాంత కుమారుఁడు చింత నందఁగన్
ఫలముల కేఁగి సానువులఁ బన్నుగఁ దా నరుదెంచి దిగ్గి యా
సలలిత లక్ష్మణుండు గనె సంప దమేయుఁడు సేరి యగ్రజున్ 10.

తే.గీ. తెలివి సెడ నొంటరిగ నుండి పలవరించు
చున్న యన్నను వీక్షించి విన్నఁ బోయి
యా మనస్వి లక్ష్మణుఁడు నయ్యగ్రజుని వి
షాదమున దీనుఁడై యీ వచనము లనియె 11.

ఆ.వె. కామ వశుఁడ వీవు కా నేల యో యార్య!
యాత్మ ధృతిని వీడి తకట యేల
యీ సమాధి విడువ నేల యిబ్బంగిని
యోగ మేల యిట్టు లూడె నీకు 12.

ఆ.వె. యత్నము నొనరింపు మాత్మ నుంచఁ దగుఁ బ్ర
సన్నముగ సమాధి సమయము లను
కూల రీతి నింకఁ గూడ నిమ్ము సఖుల
సాయ మడరఁ బనులఁ జేయు మయ్య 13.

తే.గీ. మనుజ కులనాథ! నీ వుండ మగువ సీత
రక్షిత యగు నసాధ్య పర జనుల కిల
మండు టగ్నిఁ గదియ మఱి మండ కున్నె
యేరి కైన నేని వరార్హ! వీరవర్య! 14.

తే.గీ. లక్షణ సమన్వితునిఁ గాంచి లక్ష్మణుని మ
హాప్రధృష్యుని రఘురాముఁ డనియె నిట్లు 15.

హితము లర్థ వంతమ్ములు నింక యుక్త
లు నయములు సామములు నీ పలుకులు వీర!

తే.గీ. కార్య మింపుగఁ బరికింప నర్థ మగును
సంశయము లేదు పనులను సకలములను
ననుసరించుచుఁ గష్ట సాధ్యముల ఫలము
లరయ వలయు కుమార! సమంచితముగ 16.

చం. నళినదళాక్షి సీతను మనమ్మునఁ దల్చుచు రాముఁ డంతటం
బలికెను గాంచి లక్ష్మణుని వక్త్రము శుష్కము గాఁగ నివ్విధిన్
జలములఁ దృప్తి ధాత్రికి నొసంగి సహస్ర విలోచనుండు పం
టల విలసిల్లఁ జేసి ప్రకటమ్ముగ వెల్గెను దాఁ గృతార్థుఁడై 17.

తే.గీ. తరు గణమ్ముల ఘన పర్వతమ్ము లందు
గర్జనములు గంభీరముగ నొనరించి
ఘనము లెల్ల శాంతించినవి నృపతనయ!
కనుమ వర్షించి వర్షించి తనివి తీర 18.

తే.గీ. నల్లని కలువలను బోలు నల్ల మబ్బు
లెల్ల దిక్కుల నొనరించి నల్లగను మ
ద ముడిగిన కుంజరముల విధము పయోధ
రములు శాంతించినవి యంబరమ్ము నందు 19.

ఆ.వె. కొండ మల్లె లింక మెండుగ తెల్ల గ
న్నేరు వాసనలను మూరి జలము
తోడ నిండి నట్టి తోయదములు నీటి
గాలి కెగిరి నిలిచెఁ గదలి యింక 20.

కం. ఏనుంగుల మబ్బుల యను
జా! నెమళుల నిర్ఝరముల యా నాదమ్ముల్
గానంగ నింక నిచ్చట
మానిన వెల్లఁ ద్వరితముగ మనుజ వరేణ్యా! 21.

ఆ.వె. నిర్మలముగఁ గడుగ నీరదమ్ము లవి వ
ర్షించి మిక్కుటముగఁ జిత్ర శైల
సానువులను గూడి శైలము లలమిన
భంగి వెలిగెఁ జిత్ర భాతు లడర 22.

తే.గీ. విమల సప్తచ్ఛద ద్రుమ విటపములను
రవి నిశాకర తారల ప్రభల యందు
మేలి మద కుంజరమ్ముల లీల లందు
సిరిని విభజించి వచ్చెను శరదృతు విఁక 23.

కం. ఇల నేఁ డనేకముల నుం
డు లలిత శోభా కళలు కడు వెలుఁగు చుండెన్
నలినాకరమ్ముల శర
ల్లలిత గుణప్రభల లేచి రవి కిరణములన్ 24.

తే.గీ. అరఁటి పూవుల వాసన లడరి పూని
తేనెటీఁగ గముల ప్రోఁతఁ దా నెలమిని
ననుసరించుచుఁ బవనమ్ము వనము నందుఁ
బెంచు మత్త కరుల దర్ప మంచితముగ 25.

తే.గీ. సుందర విశాల పక్ష సుశోభితములు
పద్మినీ హితములు చక్రవాకము లల
ముకొనఁ బద్మ రజమ్ములు పులినములను
జేర హంస లాడె నలరి చేరి వాని 26.

తే.గీ. మద మహాగర్వ గర్జిత మత్త కరుల
వితత దర్పిత సంభ్రమ వృషభ తతుల
సదమ లోదక సంపూర్ణ నదుల యందు
వివిధ రీతుల విభజించి వెలుఁగు లక్ష్మి 27.

తే.గీ. మబ్బు లవి కాన రామి నంబరము నందు
వీడి బర్హాభరణములు విడిచి ప్రియుల
వనము నందు శోభ లుడుగ వనరు చుండి 28.

ధ్యాన మగ్నము లయినవి యా నెమళులు

కం. సుమ భార నతప్రియక
ద్రుమము లనేకములు స్వర్ణ రుచు లడరఁగ ర
మ్యములు నయ నాభిరామము
లు మంచి వాసనల వని వెలుంగుల నింపెన్ 29.

ఆ.వె. మంద గాము లయ్యె మత్త గజమ్ములు
పద్మినీ ప్రియములు వన రతములు
కుసుమ మత్తములు సుఘోర మద విలాస
ములు ప్రియలను గూడి వలపు లడర 30.

తే.గీ. ధౌత శస్త్ర వర్ణము నింగి వీత ఘనము
సన్నగిల్లెఁ బ్రవాహము లన్నదులకుఁ
గలువల చలితో వీచెఁ జక్కఁగను గాలి
వెలిఁగెను దిశలు చీఁకటి వీడ భృశము 31.

ఉ. పంకము సూర్య వేడిమికిఁ బాసెను భూమిని సాంద్ర రేణువుల్
సంకలితమ్ము లయ్యెను భృశమ్ముగఁ గాలము మీఱ మిక్కిలిం
బొంకము తోడ వైరములు మూర నరేశ్వరు లుత్సహింత్రు వా
రంక మొనర్పఁ జేయుదురు యాత్రల నీ సమయమ్మునన్ ధృతిన్ 32.

తే.గీ. ఆల మధ్య చరించుచు మేలి యెద్దు
దుమ్ము చెలరేఁగ నెల్ల యంగమ్ము లందు
మదము రేఁగఁ గరమ్ము శరదృతు వేళ
సిద్ధ పడును ఱంకె లిడుచు యుద్ధమునకు 33.

ఆ.వె. కరిణు లెల్ల మంద గతిని మంచి కులమ్ము
న జనియించి నట్టి నాగ రాజ్ఞు
లెల్ల ననుగ మింతు రెలమి మత్త గజ రా
జునకుఁ జుట్టు నడచి వనము నందు 34.

ఆ.వె. వీడి భూషలు తమ పింఛములను నదీ 35.

తీరమును గదిసి మయూరము లతి
దీనముగ నదలిచె వాని బెగ్గురు లనఁ
గదలు చున్న వవి విగత మదమున

కం. భయపెట్టి చక్రవాక ని
చయములఁ గారండవముల సమద గజమ్ముల్
రయమున మహా రవమ్ములఁ
జెయువుల క్షోభించి నీరు చెఱువులఁ ద్రాగున్ 36.

ఆ.వె. బురద లేని యిసుక పరఁగు విమల వారి
గోవు లడరు చుండఁ గూడ బెగ్గు
రుల రవమ్ము హంసలు నదుల హర్షమ్ము
న దిగుచున్న వడరి పదిలముగను 37.

ఆ.వె. నష్ట మైన విపుడు నదుల మబ్బుల సెల
యూట లందు నీళ్ల మేటి గాలు
లందుఁ జెలఁగు శిఖుల యార్భటులు గతోత్స
వప్లవగ తతుల రవమ్ము లెల్ల 38.

తే.గీ. రంగు రంగుల పాములు రంధ్రముల వ
సించి చిర కాలము కృశించి చేరఁ గ్రొత్త
నీ రలమటించి యాఁకట నిబిడ విష ఫ
ణులు వెడలు చున్నవి బయట కలరి యెదల 39.

తే.గీ. తార లుప్పొంగె హర్షమ్ము మూర శశి క
రముల తాఁకుడు సోకఁగ రమ్యముగను
రాగవతి సంధ్య స్వయ మంబరమ్ము వీడె
నక్కజమ్ముగఁ దత్క్షణ మనుజ! వింటె! 40.

తే.గీ. ఉదిత చంద్ర సన్నిభ సౌమ్య వదన మడర
విరిసి నట్టి తారలఁ బోలి పరఁగు కనుల
వెన్నెల లను బట్టలఁ బరివృతము గాఁగ
రాత్రి తెల్ల బట్టల నారి రమణఁ దోఁచె 41.

కం. మేలుగఁ బండిన గింజలు
వ్రాలి కతికి సారసాళి రయమున నా తా
రాలయము నాక్రమించెన్
గాలి కెగిరి నట్టి మాల కరణిని నింగిన్ 42.

కం. ఏకైక హంస కలువ ల
నేకములఁ దటాక వారి యింపుగఁ వెలిఁగెన్
నాక మన రాత్రి శశి తా
రాకీర్ణ విలాసితము మహాశ్చర్యముగన్ 43.

కం. చెదరిన యంచలు వెలుఁగఁగ
నొడిదారమ్ము లనఁగఁ దగ నుద జోత్పలముల్
గదలఁగ దండ లన వెలిం
గె దిగుడు బావుల కళలు సకియ లన నగలన్ 44.

ఆ.వె. పెదురు గడల ధ్వనులు వీవ నుదయపు గా
లులు పెరింగి గోవులు వృషభమ్ము
లు నఱవంగఁ గలసి స్వనము లన్యోన్యము
సెలఁగు రీతి నుండెఁ జిత్రముగను 45.

తే.గీ. నదుల యొడ్డు లందు విరిసిన విరులు మృదు
మారు తమ్మునఁ గ్రొత్తవి మరులు గొల్ప
తెల్లుగడ్డి ప్రకాశించెఁ దెల్లని యుతి
కిన మెఱయు పట్టు బట్టల క్రియ భృశముగ 46.

తే.గీ. వన విహారము సల్పుచు తనివి తీరఁ
దేనెఁ గ్రోలుచు మత్తిల్లి మేన సెజ్జ
నైన పుప్పొడు లంటగ ననిల గతినిఁ
జను భ్రమరములు ప్రియలతోఁ దనరి ప్రీతి 47.

తే.గీ. విమల నీరము, కలువలు విరిసి యుంట,
క్రౌంచ రవములు, వరి పంట, గాలి వీఁచు 48.

ట మృదువుగ, శీత కిరణుండు విమలుఁ డగుట
తెలుపు వర్షావసానము తెల్లముగను

కం. మదన క్రీడా శ్రమ గత
సుదతుల భంగి యుదయమునఁ జూపట్టె నదుల్
విదితముగ మంద గతి నా
యుదర త్రాణమ్ము లన ఝషోత్తమ పంక్తుల్ 49.

కం. వదలని కవ పిట్టల నిసు
క దిబ్బలను దెల్ల ఔల్లు కాఁగ వసనముల్
నదుల ముఖము లడరు  వధూ
వదనములుగ సతిలకమ్ము పత్రాంకములన్ 50.

తే.గీ. విరియ బాణాసన కుసుమ వితతి వనినిఁ
గూయ షట్పాద నిచయ మమేయముగను
బూని సంధించి చాపము మూరి చండ
దండుఁ డటవిఁ నేఁడు దిరుగు చుండు మరుఁడు 51.

తే.గీ. విశ్వమును దృప్తిలం జేసి వృష్టి చేత
నింపి నదుల సరస్సుల నొంపు గాను
బంట లింపుగఁ బండించి వసుధ యందు
మాయ మైనవి నింగిని మబ్బు లెల్ల 52.

ఆ.వె. సిగ్గు తోడ మొదటి చేరిక శ్రోణులఁ
జూపు పద్మ ముఖుల చొప్పు శార
దాపగలు పులినము లగపడఁ జేయు చు
న్న విఁక మెల్ల మెల్లన జల మందు 53.

కం. సలిలాశయములు నిర్మల
జలములఁ గురరీ రవములఁ జక్రాంగ చయ
మ్ములు విహరించుచు నుండఁగ
వెలుఁగుచు నున్న విట సౌమ్య! విస్తారముగన్ 54.

చం. అసనలు సప్తపర్ణములు నంచిత పుష్పిత కోవిదారముల్
దెసలను బంధుజీవములు దృశ్యము లౌ గిరి నీలి వృక్షముల్
మసలును జక్రవాకములు మానుగ హంసలు సారసమ్ము లీ
యిసుక తలమ్ము లందుఁ గను మింపుగ లక్ష్మణ! యీ స్రవంతులన్ 55.

చం. సమయము బద్ధ వైరముల శత్రు జయమ్ము తలంచి యత్నముల్
సమదము సేయ రాజులకు చక్కఁగ నుందురు పార్థు లా క్రియన్
సమయము యాత్రనుం దొలుతఁ జల్ప నరేశుల కిప్డు కాని కాం
చము కపి నాథు నవ్విధము సల్పఁగ యత్నమునున్ నృపాత్మజా! 56.

చం. కడచెను నాల్గు మాసములు కన్పడ నిచ్చట వంద యేండ్లునై
పడతినిఁ గాంచ లేమి కడు బాధ వహించితి వర్షకాల మం
దడవికి చక్రవాకి యనఁ దా నరుదెంచెను సీత భర్తతో
నడరుచు నాట తోట వలె నంగన దండక కక్కటా ధృతిన్ 57.

ఉ. ఈ వనితా విహీనుని నహీన విచారుని రాజ్యహీను సు
గ్రీవుఁడు గాంచఁడే కృపను గేళి మునుంగుచు నీ వివాసితున్
రావణ ధర్షి తార్తుఁ డని లక్ష్మణ! దూర గృహార్తుఁ డంచునుం
గావఁగ వేడినాఁ డనుచుఁ గారణముల్ గని పెక్కు లివ్విధిన్ 58.

తే.గీ. నన్నిటు లవమానించె వానర విభుండు
భృశము సుగ్రీవుఁ డిప్పుడు రిపు గణఘ్న!
కడు దురాత్ముఁడు తలఁపక కాలమును గృ
తార్థుఁ డయి మాట నొసఁగి తా నరయఁ డబల 59.

మ. చని కిష్కింధకు నీవు గ్రామ్యసుఖ సంసక్తుండు సుగ్రీవునిం
గని సౌమిత్రి! వచింపు నా గిరలు మూర్ఖస్వాంతుతో నిట్టులం
బనికై రాఁగ నిజోపకారులను సంభావించి యాశాళి వా
రి నిరాశావళిఁ జేయ నౌదు రధముల్ పృథ్విన్ నరౌఘమ్ముననన్ 60.

ఆ.వె. అన్న వాక్య మెవ్వ రనుసరింతురు మంచి
యైనఁ బాప మైన నన్నృత మాడ
కుండ వారు వీరు లుత్తములు పురుషు 61.

లందు నెంచి చూడ నవని లోన

తే.గీ. తనదు కార్యము సిద్ధింపఁ బనులు పూర్తి
కాని వారికి మిత్రుల కేని సాయ
ము నొనరింప నట్టి కృతఘ్ను ముట్టవు మృతుఁ
డయినఁ గ్రవ్యాదు లైన నిశ్చయముగాను 62.

కం. చాపమును గనక పృష్ఠపు
రూపమును తటిన్నిభము నురు రణం బందుం
గోపమున నెక్కిడఁగ నే
నేపునఁ జూడంగ నెంచు నీ హరి విభుఁడే 63.

తే.గీ. ఘోర రవము జ్యా నాదము మూరి చేయ
నేను యుద్ధ తలమ్మునఁ బూని కోప
మెడఁద వజ్ర నాదము భంగి నెసక మెసఁగఁ
దిరిగి వినఁదల్చు చున్నాఁడు హరి వరుండు 64.

ఆ.వె. నా పరాక్రమము మనమ్మునఁ దా నెఱిం
గియుఁ గపీశ్వరుండు కెరలి యట్టు
లుండ నీవు చెంత నుండ నాకు నృప కు
మార! చింత లేదు మనము నందు 65.

తే.గీ. ఏమి యాశించి యారంభ మియ్య దయ్యె
నది పరపురంజయ! ప్రతిజ్ఞ నతఁడు మఱచెఁ
బ్లవగ వరుఁడు సుగ్రీవుఁడు వడసి తనదు
కార్య మెల్లను గడచినఁ గాల మెల్ల 66.

కం. ప్రతిన నొనరించి వానలు
గతించు కాలమును గాంచి కార్యము సేయన్
గతము లయిన నాలుగు నెల
లు తలఁపడు నిజాత్మ నకట లోలాత్ముండై 67.

కం. నిజ మంత్రి మండలినిఁ దా 68.

నజస్రముం బొన మాట లందు నలరి సూ
ర్యజుఁ డా సుగ్రీవుఁడు మన
లఁ జూచి గరుణింపఁడు కపి రాడ్వరుఁ డకటా

తే.గీ. వెడలుమ మహాబలా! వత్స! వేగ మా హ
రీశ్వరునకు సుగ్రీవున కీవు నాదు
కోప రూపము నెఱిఁగించి యీ పలుకుల
నెల్ల వచియింపు మింపుగ నేఁగి యింక 69.

ఉ. వాలి హతుండు చన్న గతి వానర నాథుఁడ మూసి లేదు సూ
మేలుగ నీ ప్రతిజ్ఞను సమీక్షణ మీ వొనరించి చల్పుమీ
వాలి చరించి నట్టి గతిఁ బాఱకుమీ శర మొక్క దానిచే
వాలినిఁ గూల్చి నట్లు నిను బంధులఁ గూడి యసత్యుఁ గూల్పనే 70.

ఆ.వె. కార్య మిట్టు లుండఁ గాంచి యేది హితంబొ
దాని నరసి చేయ వానికిఁ జెపు
మ నరపుంగవ! వడిఁ జనుచు నున్నది కాల
మతి త్వరిత గతిఁ గను మా హరివరు 71.

తే.గీ. శాశ్వతంపు ధర్మ మరసి సత్య వాక్కు
వగుమ నా కొసఁగిన సమయమ్ము పూర్తి
సేసి చూడకు వాలిని శీఘ్ర మేఁగి
కాలు నిలు నాదు శరమునఁ గూలి నీవు 72.

కం. కని విలపించెడు దీనుని
ఘను నగ్రజుఁ గ్రుద్ధు నంతఁ గపి నాథునిపై
మనుజ కుల నాథుఁ డుగ్ర మ
యిన మతి నా లక్ష్మణుఁడు వహించెం గినుకన్ 73.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 31.

లక్ష్మణుఁడు రాముని యాజ్ఞఁ గొని కోపోద్రిక్తుఁ డయి కిష్కింధకుఁ జేరి యంగదునితోఁ దనదు రాకను సుగ్రీవున కెఱిఁగింపు మన నతఁ డట్లు సేయ మత్తులో నున్న సుగ్రీవుఁడు తొలుత గ్రహింప కున్న నలజడులకుఁ దెలి వొంద నంగదునితో వచ్చిన యమాత్యు లిద్దఱు లక్ష్మణుని రాక నెఱిఁగించి యాతనిఁ జూడ మనుట.

కం. నరదేవ పుత్రు దీనుని
నురు శోక సమావృతు విరహుని బల్లిదు సో
దరుఁ గని రామానుజుఁ డా
నరేంద్ర సూనుఁడు వలికెను నయముగ నిట్లున్ 1.

తే.గీ. నడవ నేరఁడు సద్వృత్తి నగచరుండు
తలఁపఁ డెదఁ గర్మ ఫలములు తగులఁ దన్ను
ననుభవింపడు ప్లవగ రాజ్యమ్ము నింక
బుద్ధి నూనఁ డందులకె సముచిత రీతి 2.

ఉ. వీర! మతిక్షయమ్మునఁ గపిప్రవరుం డట గ్రామ్య భోగముల్
పేరిమి మీఱఁ దా ననుభవించెడు నీ దయనుం గృతఘ్నుఁడై
నేరఁ డొనర్ప సాయమును నీ కిటఁ గాంచఁగ నిమ్ము నగ్రజుం
బోరునఁ జంపి రాజ్యమును బొంద ననర్హుఁడు దుర్గుణుం డిఁకన్ 3.

తే.గీ. పెల్లుబికెడు కోపమ్మును వీడ నేను
సత్య దూరు సుగ్రీవునిఁ జంపు వాఁడ
హరులఁ గూడి వాలి తనయుఁ డంగదుండు
వెదకును నరేంద్ర పత్నినిఁ గదలి వేగ 4.

మ. పర వీరఘ్నుఁడు గాంచి లక్ష్మణుని నప్పార్థుండు రాముండు సో
దరు బాణాసన ధారియై చెలఁగి క్రుద్ధస్వాంతుఁడై పల్కఁగన్
గిరలన్ సానునయమ్ములై తనరఁ బల్కెన్ భండనోద్దాముతోఁ
బరికింపం బడఁ జక్క స్వీయ హృదినిన్ భావ్యమ్ము లిబ్బంగినిన్ 5.

చం. అవరజ! యిట్టి పాపము నిహమ్ముసఁ జేయరు నిన్ను బోలు మా
నవ వరు లెవ్వ రేని తగ నాశ మొనర్చినఁ గిన్క వార లీ
నృవరుల యందు నుత్తములె నిక్కము సూర్యజు పూర్వ వృత్త మీ
యవసర మందు నెంచి మది నా కపి వీరునిఁ బ్రీతిఁ గాంచుమా 6.

తే.గీ. సాధువృత్త! కొనకు మన్య సరణి దీని
వీడి కోపము సుగ్రీవుఁ బాడిగఁ గని
సానునయ వచనమ్ముల వానికి నెఱిఁ
గింపు కాల మరుగు టెల్ల నింపుగాను 7.

సీ. అగ్రజుఁ డవ్విధి నాదేశ మీయ యుక్తముగ వీరుండు లక్ష్మణుఁడు శత్రు
దమనుండు సేరెఁ బురము శుభమతి ప్రాజ్ఞుఁ డన్న హితమ్ము నిత్యమ్ము కోరు
వాఁడు సంరబ్ధుండు వానరు భవనమ్ము కదిసె నింద్ర ధనుర్నికాశ ధనువు
గిరి శృంగ నిభ మూని కరమునఁ గాలాంతక నిభుఁడు మంద రేద్ధ నగ సముఁడు
తే.గీ. బుద్ధిని బృహస్పతి కయి సముండు చెప్పి
న దొనరించు నవరజుఁ డన్న విరహమ్ము
కినుక ప్రేరేప సౌమిత్రి చనెఁ దలఁచుచు
నుత్తరము లెదఁ బెనుగాలియో యనంగ 8.

చం. బలమునఁ గూల్చి బాహువులఁ బాదప రాశిని శైల శృంగ పం
క్తులఁ బగిలించి వేగముగ ఘోర శిలావలిఁ జేసి చిన్న ము
క్కలుగఁ బదమ్ములన్ మదినిఁ గార్యము నెంచి రయమ్ము పెంచి తా
నలుకను దూర మొక్క పద మానుచు నేఁగెను గుంజ రాభుఁడై 9.

తే.గీ. ఆ హరీశ్వరు పురవర మంత బల స
మేతమును గాంచెఁ గిష్కింధ మేటి వీరుఁ
డచట నిక్ష్వాకు శార్దూలుఁ డద్రి సంక
టముల సుగ్రీవుపైఁ గినుక మది సెలఁగ 10.

ఆ.వె. పెదవు లదరఁ గరము భీమ వానరులను
గాంచెఁ గదలు చుండఁ గపి వరేణ్యు
గృహ వరమున కెదురు నృప నందనుండు ల 11.

క్ష్మణుని గాంచి రంతఁ గపి వరులును

తే.గీ. చూచి పురుషర్షభునిఁ గపి శూరు లంతఁ
గుంజ రాభులు పర్వత పుంజములను
శైల శృంగములు ధరించి శతము లింక
భూజముల నూని నిల్చిరి తేజ మడర 12.

ఆ.వె. అట్టు లేఁగి కాంచ రెట్టింపు రోషం బ
డరెను లక్ష్మణునకు హరి వరులు గ్ర
హించి యాయుధములు మించి నిలువ నట్టు
లింధ నాధికంపు టింగల మన 13.

తే.గీ. ప్రళయ కాల మృత్యువు భంగిఁ బరఁగు దేహ
మడరు గృద్ధు లక్ష్మణుఁ గాంచి హరులు వంద
లడలి బాఱిరి దిశలకు హరి విభునకుఁ
దెలిపి రల లక్ష్మణుని రాక నలుక నంత 14.

ఉ. తారను గూడి కామమునఁ దద్దయు మత్తిలి యుండ నక్కటా
వీరుని వాన రేశ్వరుని వీనులఁ జేరవు వారి మాట లిం
కారవముల్ విలోలునకు నంత నమాత్యు లొసంగ నాజ్ఞలన్
వారలు కుంజ రాద్రి ఘన వారిద తుల్యులు వీడి రప్పురిన్ 15.

సీ. నఖ దంష్ట్ర నిచయ విన్యస్తాయుధులు ఘోరు లెల్లరు గాంచుట కేహ్యా మైన
వారు శార్దూల దర్ప బలాన్వితులు వికృ తాస్యులు దశ కుంజ రాభ బలులు
కొందఱు పదిరెట్లు కొందఱు వేయి కరుల బలు లుండ హరులు సమాన
తేజు లందఱు నట్టి దిట్టలై నట్టి వానరులు హస్తమ్ముల నగము లమర
ఆ.వె. నిండి నట్టి పురము గండఁడు లక్ష్మణుం
డరసెఁ గ్రుద్ధుఁడు కదియంగ రాని
దాని నార్కి పాలితమ్ము కిష్కింధను
వెడలఁ బ్రహరుల నగపడఁగ హరులు 16.

ఉ. వావిరి యైన సోదరుని వంతయు వానర కోటి నాథు సు
గ్రీవుని సుప్రమత్తతయు రేఁచిన కిన్కకు లోనుగాఁ బొగం 17.

బావను భంగిఁ గన్పడెను మానవ వర్యుఁడు నిశ్వసించుచుం
గేవల కార్య మగ్నుఁ డయి కెంపుఁ దనమ్ము సెలంగ నక్షులన్

తే.గీ. మేకుల ములికి నాల్కయై మీఱ విల్లు
బిలశయము గాఁగఁ దన కాంతి విషము గాఁగఁ
బంచముఖ సర్పము పగిది వఱలు చుండి
లక్ష్మణుం డేఁగఁగా నమర్షమ్ము తోడ 18.

కం. కాలాగ్ని భంగి వెలిఁగెడు
కాల ఫణి నిభ కుపితాత్ముఁ గాకుత్స్థుని నా
భీలుని నంగదుఁడు కదిసి
చాల భయము డెందమున విచారము నందెన్ 19.

చం. కని యట రక్త లోచనుఁడు గ్రన్నన లక్ష్మణుఁ డంగదుం గపిన్
ఘనుఁడు యశస్వి వత్స! పలుకం జను మిప్డు కపీంద్రు తోడ వ
చ్చెను రఘురాము సోదరుఁడు చెంతకు నన్న మహా విచారముం
గని కడు తప్త చిత్తతను గాంచఁగ నిన్ను నటంచు శీఘ్రమే 20.

తే.గీ. నిల్చె ద్వారము చెంతను నెమ్మిఁ దగఁ జ
రింపుమ రుచియించిన వానరేంద్ర యని య
రిందమ! వచనమ్ములను పల్కి తగ నింక
రమ్ము శీఘ్రముగా వానరప్రవీర! 21.

చం. మనము భయమ్ము నందఁ గడు మ్లానము కాఁగ ముఖమ్ము రాఘవేం
ద్రుని గిర లాలకింప హరి తూర్ణము నంగదుఁ డంతఁ జేరి తం
డ్రినిఁ జరణ ద్వయమ్మునఁ బడెన్ మును ముందుగఁ బిమ్మటన్ రుమా
జనని పదమ్ము లంటెను భృశమ్ముగ నొత్తి యనంతరమ్మునన్ 22.

తే.గీ. తల్లి తార పదమ్ములు తండ్రి కాళ్ల
నంటి యంటి శోకమ్మున వెంట వెంట
లక్ష్మణుని రాక నింక గిరలను దండ్రి
కంత నెఱిఁగించె నెల్లను నార్తి తోడ 23.

తే.గీ. మేల్కొనండు సుగ్రీవుఁడు మించ మత్తు
మదన తాపమ్ము తన నిద్ర మత్తు వదల
కింత యేని మోహమ్మున వింతఁగఁ బడి
యుండె నచ్చట ప్లవగ నాథుండు వినక 24.

తే.గీ. అంత వానరులు ఘన భీతాత్ము లరసి
క్రుద్ధు లక్ష్మణు వీరు సురుచిర రీతి
ఘనుని శాంతింపఁ జేయఁ జక్కఁగఁ గిలకిల
శబ్దములు సేసిరి నగుచు చాల యపుడు 25.

కం. కని యమ్మహా ప్రవాహ స
ముని లక్ష్మణుఁ జేసి రా గపులు మూరి మహా
శని వజ్ర సింహ తుల్య
స్వనమ్ములు సమీప మందు సంరంభమునన్ 26.

కం. విని యా శబ్దమ్ములు మ
త్తును వీడి నగలు స్రజములు తొలఁగ నదరి లే
చెను సుగ్రీవుఁడు తామ్ర న
యనుండు మద విహ్వాలుండు హరివరుఁ డంతన్ 27.

ఉ. అంగదు తోడ వచ్చిన మహా సచివ ద్వయి  సమ్మతుల్ ప్లవం
గాంగనలం గనంగ హరి కంతి పురమ్మునఁ బ్లక్షుఁ డింక భీ
మాంగుఁడు నా ప్రభావుఁ డట నంగదు మాటల నాలకించి స
ద్భంగిని లక్ష్మ ణాగమము పల్కఁ దలంచుటఁ జెప్పి రంతటన్ 28.

తే.గీ. పలుక ధర్మార్థ వాక్కులు వానరేంద్ర!
యేఁగు దెంచెను సౌమిత్రి యిచట కనుచు
శక్రు భంగి నాసీనుని సరస వారు
కూరుచుండిరి ముదితు వాక్కుల నొనర్చి 29.

తే.గీ. సత్య సంధులు భ్రాతలు సద్యశస్వు
లు నిరువురు రామ లక్ష్మణులు చెలికాండ్రు
రాజ్య దాతలు  నర్హులు రాజ్యమునకు 30.

మున్ను వచ్చి యున్నట్టి యప్పురుషు లందు

తే.గీ. ఒక్కఁడు ధనుర్ధరుఁడు వచ్చి యుండె ద్వార
మందు లక్ష్మణుం డాతని నరసి హరులు
భీతి వణకుచుఁ బెద్దగ విడుచు చుండి
రచట ఘోర నాదమ్ములు హరి వరేణ్య! 31.

ఆ.వె. రామ శాసనమున లక్ష్మణుండు పలుకు
సారథిగను బనియె స్యందనముగ
వచ్చి నీదు దరికిఁ బంపె నంగదునిఁ దా
రా తనయుని సత్వరముగ ననఘ! 32.

చం. నిలిచెను ద్వారమం దతఁడు నిప్పులు చెర్గుచుఁ గాల్చు భంగిఁ గో
తులఁ గని వీర్యవంతుఁ డతి దుస్సహ రీతిని రోష చిత్తుఁడై
వెలి చని మ్రొక్కి మూర్ధమున వేగ సపుత్ర సబాంధవమ్ము నా
యలుకను దీర్పు మయ్య ప్లవగాధిప! యంచిత రీతి లెమ్మిఁకన్ 33.

ఆ.వె. రాముఁ డెద్ది చెప్పె రాజ! ధర్మాత్ముఁడు
దాని చేయు మింక నూని ధృతిని
నిలుపు కొనుమ ప్రతిన నీవు చేసిన దింక
సత్య సంధుఁడ వయి నిత్య ముండు 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది యొకటవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 32.

సుగ్రీవుఁడు లక్ష్మణుని కోపము నెఱింగి శంకతోఁ జింతాక్రాంతుఁడై మంత్రులను దానికిఁ గారణం బడుగ

హనుమంతుఁడు రామ కార్యమున కాలస్యము సేయుటయే కారణ మని లక్ష్మణుని వేఁడికొని శాంతింపఁ జేయు మనుట.

కం. విని మంత్రుల గూడి పలుకు
ల నంగదుఁడు వల్క నంత రయమున నయ్యా
సనమును సుగ్రీవుఁడు వద
లెను లక్ష్మణు కోప మెఱిఁగి రేఁగిన శంకన్ 1.

తే.గీ. మంత్ర కుశలుఁడు చింతించి మంచి చెడులఁ
బలికె సుగ్రీవుఁ డంత మంత్రులను మంత్ర
ముల నిపుణులను మంత్ర వేదులను గాంచి
వాక్యముల నిట్లు వానర వర్యుఁ డడలి 2.

చం. పలికి యెఱుంగ దోష యుత వాక్యము లెన్నఁడు నెంచి చూడఁగాఁ
దలఁప నొనర్ప లే దకట తప్పిద మింతయు నేను లక్ష్మణుం
డలుగుట కేమి కారణమొ యాత్మఁ దలంచిన నేరకుంటినే
చలమునఁ దప్పు లెన్నుచును శత్రువు లవ్విధిఁ జెప్పియుండిరో 3.

ఆ.వె. ఇందు యుక్త రీతి నెల్లరు మీ తలం
పుల కనుగుణముగ నిపుణము లయిన
భావముల నెడఁదలఁ బరికించి చక్కఁగఁ
దెల్పుఁ డార్యులార! తెల్లముగను 4.

కం. సువిదతమ రామలక్ష్మణు
ల వలన భయ మంద నేను రవ్వం తైనన్
నృవరుని యస్థా నాగ్రహ
ము వలన సంభ్రమము మదినిఁ బుట్టు భృశముగన్ 5.

చం. పడయుట స్వీయ మిత్రు సులభం బగు నెల్లర కెంచ ధాత్రినిం
బడసిన యట్టి స్నేహమును బన్నుగ నిల్పుట దుష్కరంబ యీ
యెడఁదలు చంచలమ్ము లగు టెంతటి యల్పపుఁ గారణమ్మునం
దడయక ముక్కలై చెలఁగు దారుణ రీతిని స్నేహ మెల్లయున్ 6.

తే.గీ. అమ్మహాత్ముఁడౌ రాముని కందుల కెద
భయ పడుదు నే నుపకృతినిఁ బడసి తిరిగి
యక్కట యుపకార మొనర్ప నతని కిటు ల
శక్తుఁడ నయితి నంచు విచార మొదవ 7.

కం. పలుకఁగ సుగ్రీవుఁ డపు డ
నిల పుత్త్రుం డాలకించి నిజ తర్కమునం
బలికె నమాత్యుల మధ్యను
లలితమ్ముగ హరి వరుఁడు గిరల నిబ్బంగిన్ 8.

తే.గీ. అబ్బురము కాదు చింతింప హరిగణేంద్ర!
మఱువ వుపకారి నిట నీవు మనుజ వర్యు
రాఘవుని శుభ ప్రదుని మిత్రత్వ మెన్ని
యుత్తమముగ డెందమ్మున నుంచ నిట్లు 9.

ఆ.వె. ఇంద్ర విక్రమ నిభుఁ డీ వాలి హతుఁ డయ్యె
రాఘ వేంద్రు చేత రణము నందు
భయము దూరమునకుఁ బఱవఁ బడంగ ప్రి
యమ్ము నొసఁగె రాముఁ డంచితముగ 10.

తే.గీ. ఎల్ల వేళల రాఘవుఁ డుల్ల మందు
నున్న ప్రేమచేఁ గ్రోధము నూను నందు
లేదు సంశయ మంపెను సోదర వరు
లక్ష్మణుని లక్ష్మి వర్ధను రాముఁ డిపుడు 11.

కం. అరుదెంచె నెఱుఁగ కుంటివి
శరత్సమయ మిప్పు డరఁటి సాలము లెల్లన్
విరిసె నడరెఁ బచ్చఁ దనము
హరివిభు! మత్తుఁడ వయితివి యత్యధికముగా 12.

ఆ.వె. తొలఁగె మేఘ రాశి తోరము వెలిఁగె న
క్షత్ర పంక్తి నింక గ్రహముల దివి
దిక్కులు కొలనులు నదీ తతు లెల్ల ని 13.

ర్మలము లయ్యె నిపుడు రమ్యముగను

తే.గీ. కాల మరుదెంచె హరినాథ! కార్యము లొన
రింప నింపుగ నది గమనింప కుండ
మత్తు నందుంటి వంచు లక్ష్మణుఁడు వచ్చె
నిచ్చటకు రోష మడరంగ నెడఁదఁ గరము 14.

తే.గీ. ఆర్యుని కపహృతార్థాంగి కా రఘూత్త
ముని కితరుఁ డైన యట్టి యీ పురుష వరుని
వాక్యములు పరుషము లోర్వ వలయు నీవు
రాఘవుఁడు మహాత్ముఁ డనఁగ రాజ యిపుడు 15.

కం. తగ నంజలి ఘటియించి యిఁ
కఁ గపీశ్వర! లక్ష్మణు దయ కాంక్షించుటయే
తగు నన్య మెఱుఁగ దీనికి
నగచర నాథ! యపరాధి వయిన కతమునన్ 16.

కం. నియమింపఁ బడఁగ మంత్రిగ
నయమ్ము లింపుగ హిత వచనమ్ములు ప్లవగేం
ద్ర! యవశ్యము పలుక వలయు
భయ మొందక పలుకు చుంటిఁ బన్నుగ నెల్లన్ 17.

తే.గీ. నిర్జ రాసుర గంధర్వ నిచయము వశ
మందు నుంచఁ గలఁడు కోప మందఁ జాప
మూని రాఘవుండు జగతిఁ బురుష పుంగ
వుండు నిస్సంశయమ్ముగఁ జండ రుషను 18.

ఆ.వె. మును గొన నుపకారము కృతజ్ఞునకు నెంచఁ
దగదు తలఁచి దాని దయ నొసంగ
సతము సాలు వాని శాఖామృగేశ్వర!
కుపితుని నొనరింప నెపుడు వినుమ 19.

ఆ.వె. శిరము వంచి నీవు సేయుమ వందన 20.

ములు స్వ పుత్ర బాంధవులను గూడి
నిలిచి మాట పైన నిరతమ్ము రాజేంద్ర!
పతికి దార వోలె వశుఁడ వగుము

కం. అతులము రాఘవుల పనుపు
నతిక్రమింపఁ దగ దెపుడు హరిఋక్షేంద్రా!
వితతంపు మానుష బలుని
నతని నెఱుఁగు దీవు నిర్జ రాధిప నిభునిన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది రెండవ సర్గము.

# కిష్కింధా కాండము

# సర్గము 33.

లక్ష్మణుఁడు పిలుపు నంది రాజ గుహ లోని కేఁగి యచటి స్త్రీలను గాంచి లజ్జించి జ్యా శబ్దము సేయ సుగ్రీవుఁడు లక్ష్మణుఁ డేతెంచె నని యెంచి భయపడి యాతనిని శాంతింపఁ జేయఁ దారను బంపఁ దార లక్ష్మణునిఁ గాంచి కోపమునకుఁ గారణ మడుగ నాతఁడు నుడువ మంచి మాటలతో నాతని శాంతింపఁ జేసి రామ కార్యమునకై సకల దేశముల నుండి సుగ్రీవుఁ డాజ్ఞాపింప వానరులు వచ్చియుంటి రని తెలిపి లోనికిఁ గొని పోవ లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ జూచుట.

కం. పిలుపుం బడసి పరంతపుఁ
డు లక్ష్మణుఁడు కందరము కడు వడిం జేరెన్
లలితమ్మును కిష్కింధను
నలినాక్షుని రాము నాజ్ఞ నరవరుఁ డంతన్ 1.

ఉ. ద్వారము నందు నున్న పరివారము వానరు లా మహాబలుల్
ఘోర శరీరు లారసి సుకోపిని లక్ష్మణు భీత చిత్తులై
వారలు నిల్చి రంజలులఁ బార్థివ సూనుఁడు నిశ్వసించుచుం 2.

జేరఁగ భీతి వాని దరి సేర మనమ్మున నెంచఁ డొక్కఁడున్

ఆ.వె. లక్ష్మణుండు గాంచె రత్న మయము శ్రీ యు
తమ్ము పుష్పిత వన సమ్మతమ్ము
రమ్య తరము గుహను రామానుజుండు వా
నర వరేణ్య వేశ్మ వరము ఘనము 3.

సీ. మిద్దెలు మేడలు మేలుగ నిజికి వెల్గఁగ విలసిల్ల నంగళులు విరివి
సర్వ కామ ఫల వృక్షమ్ములు పుష్పితమ్ము లలరారఁగ నెల్లెడల భృశమ్ము
కామ రూపులు దేవ గంధర్వ పుత్రులు వానరు లుండ దివ్య వసనములు
మాలలు ధరియించి మేలి దర్శనులు శోభిల్లుచుఁ గాంతుల నెల్ల రచట
తే.గీ. చంద నాగరు పద్మ వాసనల నడరు
మధు స మైరేయ సమ్మోద మార్గ తతులు
వింధ్య మేరు సన్నిభములు విరివి తలము
లడరు నిండ్లు విమల నదు లరసె గిరుల 4.

సీ. అంగదు వేశ్మమ్ము నతి రమ్యమును మైందుని ద్వివిదు నుత్తమ నివసనములు
గవయు గవాక్షుని గజుని శరభుని విద్యున్మాలి వేశ్మము లున్నతములు
సంపాతి సూర్యాక్షు సౌధములు హనుమంతుని వీరబాహు సదనము లింక
నల సుబాహుల మహాత్ముల కుముద సుషేణ తారల జాంబవంత దధివక్త్ర
తే.గీ. నీలుల సుపాటలు మఱి సునేత్రు మఱి య
నేకుల ప్లవగ ముఖ్యుల యిండ్లు గాంచె
నమ్మహాత్ముల సారవం తాలయములు
లక్ష్మణుండు దివ్యంపు టా రాజ వీథి 5.

తే.గీ. తెల్ల మబ్బుల వెల్గుల తీరు తనరు
మాల లుండ దివ్యమ్ములు మేలుగాను
గూడ ధన ధాన్యము లట పెక్కులు రమా మ
ణు లిడ శోభ లిండ్లను లక్ష్మణుండు గాంచె 6.

సీ. వెల్ల ప్రాకారము వెలయఁ జుట్టు దురాసదము మహేంద్ర సదన సమము వాన
రేంద్ర నివాసము హిమగిరి శిఖరాభ పాండుర ప్రాసాద భవ్య శిఖల
సర్వ కామ ఫల వృక్షమ్ములఁ బుష్పితమ్ముల వెల్గు లీనుచు మూరి యొసఁగ

నింద్రుఁడు ఫల పుష్ప సాంద్ర తరులు శీతలచ్ఛాయ నొసగంగ రమ్యముగను

తే.గీ. నీల జీమూతముల భంగి నెగడి బల్లి
దులు కపులు గుమ్మములు కావ దొడ్డ శస్త్ర
ములు ధరించి దండల నూని వెలుఁగఁ గనక
తోరణముల సుగ్రీవు నపార గృహము 7.

ఆ.వె. ఎవ్వ రాప కున్న టివ్వన సౌమిత్రి
ఘన బలుండు నొచ్చెఁ గదలి యంత
వీఁక సెలఁగ భృశము గాకుత్స్థుఁడు మహాభ్ర
మందుఁ దూఱు భాస్క రాభుఁ డగుచు 8.

మ. కనె నంతఃపుర మంతఁ దాఁ గదిసి పే కాకుత్స్థ సంజాతుఁ డా
జన సంవీతము గుప్త దేశము నటన్ జాంబూన దాకుప్య త
ల్ప నికాయమ్ములు నాసనమ్ములు ననల్పమ్ముల్ ప్రకాశింపఁగం
గన దంచద్ఘన సంస్తరమ్ము సత కక్ష్యాశ్రేణినిం దాఁటఁగన్ 9.

ఆ.వె. కదిసి నంతట వినెఁ గమ్మని సంగీత
ము నట మీటఁ తంత్రులను మధుర స
మ పద సంయుతము రమణుల ననేక రూ
ప యువతులను గనెను బల్లిదుండు 10.

తే.గీ. కని కులీ నాంగనల దండలను ధరింపఁ
జిత్రములను విభూషణ శ్రేష్ఠములను
బండ్లు దండ లమర్పఁగ వ్యగ్ర లయిన
తృప్తల వరాంబరల నుండఁ దీఱుబడిని 11.

ఆ.వె. చూచె నింక నచట సుగ్రీవు ననుచర
సంచయమును వినెను స్వనము లంత
నూపురములు మఱియు నా పసిడి మొలనూ
ళు లొనరింప సిగ్గు సెలఁగ భృశము 12.

కం. విని యాభరణ స్వనములు
కినుక సెలఁగ మిక్కుటముగఁ గెరలి కరము జ్యా 13.

నినదమ్ము సేసె దిశలె
ల్ల నిండఁ గంపింప గృహము లక్ష్మణుఁ డంతన్

ఉ. రామ నిమిత్త కోపము కరమ్ము సెలంగి దహింప నొక్కెడన్
సేమము నెంచి యొంటరిగ నిల్వ మహాభుజ లక్ష్మణుం డటన్
భీమపుఁ జాప ఘోష విని భీతిలి సేరెను లక్ష్మణాగమం
బేమఱ కంత సారి చలియించె భృశమ్ముగ నాసనమ్మునన్ 14.

ఉ. చెప్పెను బూర్వ మంగదుఁడు చెన్నుగ నా కరుదెంచె లక్ష్మణుం
డిప్పుడు నిశ్చయమ్ముగ నహీన పరాక్రమ భాతృ వత్సలుం
డెప్పుడు చాప శబ్దమున నింకను నంగదు భాషణమ్ములం
దప్పక సేరె నిట్లు కపి దద్దయు నెండెను వక్త్ర మెల్లయున్ 15.

చం. కని హరి పుంగవుండు కపి కాంతుఁడు సుందరిఁ దార నచ్చటన్
వనట వచించె భ్రాంత హృదిఁ బన్నుగ నివ్విధి లక్ష్మణుం డిటుల్
గినుక వహించి వచ్చెఁ బరికింపుమ సుభ్రుకుటీ! కతమ్మునుం
గన మృదు మానసుండు నధికమ్ముగ నైజము నెంచి చూచినన్ 16.

తే.గీ. రోష మూల మెయ్యది కుమారునకు నిట న
నిందిత! పరికింతువు నీవు సుందరాక్షి!
నర వరేణ్యుఁ డకారణ మరయఁ డాగ్ర
హమ్ము మదిలోన నివ్విధి నబ్జవదన! 17.

కం. మనచే నప్రియ మించుక
యొనరింపఁ బడిన విధమ్ము నూహించిన బు
ద్ధిని నిశ్చయించి వడి నా
కు నుడువ నర్హ వగు దీవు కోమలి! వినుమా 18.

చం. స్వయముగ నన్యపక్షమున భామిని! యాతని నొప్పు గాంచఁగా
రయమున నేఁగి నీ కిపుడు రాఘవు నింకఁ బ్రసన్నుఁ జేయఁగన్
నయముగఁ బల్కి వాక్యములు నారులఁ గాంచ మహాత్ము లెన్నఁడే
ని యలుగ రెల్లరుం జెడును నేర్వరు సేయఁగ నించు కేనియున్ 19.

తే.గీ. ఉపశమింపఁ జేయఁ బలికి యుక్త వాక్య
ముల నుదరి నీవు నిర్మలంపు మన మంద
నతఁడు కమలపత్రాక్షుని నరి దమనునిఁ
గాంతు లక్ష్మణు నే నంత సంతసమున 20.

ఆ.వె. అంతట మద విహ్వలాక్షి ప్రలంబ కాం
చీ గుణాభ్ర సూత్ర శీఘ్ర గతిని
లక్షణాన్విత చనె లక్ష్మణు సన్నిధి
కి విన తాంగి తొడరి యువిద తార 21.

కం. ప్లవగేశ పత్ని వీక్షిం
చి వనితఁ దార నెడఁద విడిచి కినుక సౌమి
త్రి వదన మావలి వైపున
నృవరుఁ డుదాసమున నునిచి నిలిచిన నంతన్ 22.

తే.గీ. త్రాగిన కతనఁ దొలఁగంగఁ దనకు సిగ్గు
రాజ పుత్రు దయా దృష్టి ప్రబలి యుండఁ
దార వలికె వాక్యములు మిత్రత్వ మడర
సాంత్వ నార్థ యుతములు లక్ష్మణుని తోడ 23.

తే.గీ. ఏల కోప మిట్లో మనుజేంద్ర పుత్ర!
దాఁటి రెవ్వరు నీ యాన దర్ప మూని
యెండి నట్టి చెట్టు లడరు చుండు వనిని
నెగడ దావాగ్ని నిశ్శంక నిలుచు నెవఁడు 24.

కం. విని తార వలుక వచనము
లనునయము లశంకితములు నతి స్నేహమునన్
వనితా మణితో లక్ష్మణుఁ
డనె బదులుగ భాషణముల నంతట నిట్లున్ 25.

చం. తలఁపక స్వీయ డెందమున ధర్మము నర్థము నుంత యేనియున్
నిలువఁగఁ బానమం దతఁడు నిత్యము భర్తృ హితమ్ము కోరినం
దెలియ వదేల కామమునఁ దేలుచు నున్న కపీంద్రు రాజ్య ము 26.

మ్మలమున నున్న మమ్ములను మన్ననఁ గాంచఁడు కూడి మంత్రులన్

చం. ప్రతినను నాల్గు మాసములు పన్నుగఁ జేసి యతిక్రమింపఁగన్
సతతము నుండ మత్తునను జక్కఁగ నేరఁడు పాన మందుఁ దా
మతి నిడ ధర్మ మర్థములు మాయములౌ యవి యింకఁ గామముం
బతనము లౌను ముగ్గ రహిఁ బాన సుఖమ్మున నెల్ల వారికిన్ 27.

తే.గీ. చెలఁగుఁ బ్రత్యుపకారము సేయ కున్నఁ
బడసి యుపకృతి ధర్మ లోపమ్ము కరము
సుగుణ వంతుని మిత్రునిఁ జోద్యముగను
దూర ముంచినఁ దా నర్థ దూరుఁ డగును 28.

తే.గీ. అర్థ గుణములకు నధికుఁ డగును దలఁప
సత్య ధర్మపరాయణ సత్సఖుండు
విడువఁబడ నుభయమ్ములు నడువఁడు హరి
వరుఁడు ధర్మ మార్గమ్మున నరయ నిపుడు 29.

తే.గీ. అట్టు లుండ నిపుడు కార్య మంట! తార!
కార్య వేత్త వీ వుత్తర కార్య మెంచి
మాకుఁ దగినది వచియింప వీక నీవ
యర్హ వగుదువు సురుచిర మైన రీతి 30.

కం. విని ధర్మార్థ సమాధి వ
చనము లనఁగ లక్ష్మణుండు సమధుర రీతిన్
మనుజేంద్ర కార్యమునకై
యొనరఁగ నమ్మకము తిరిగి యువిద వచించెన్ 31.

ఉ. కాదిది యాగ్రహమ్మునకుఁ గాలము భూప కుమార! నీ కిటన్
రాదు వహింప స్వీయ జన రాసులఁ గోపము రక్తి నుంచఁగా
నీదు పనిం గరమ్ము మది నేరక చేసిన తప్పు సుంత నీ
వాదర మూని నోర్వఁ దగు నంచిత రీతిని వీరపుంగవా! 32.

తే.గీ. గుణముల నధికుం డల్పుని తృణ సమాన 33.

సత్త్వుని పయిఁ జూపించు రోషమ్ము నెట్లు
సత్త్వ గుణ బద్ధుఁడ వయి రోష వశ మందుఁ
జనుదు వెట్టు లరయ తపస్సంభవుఁడవు

చం. ఎఱుఁగుదు రామ కోపము నహీనము సూర్యజు బంధు వూనఁగా
నెఱుఁగుదుఁ గాల మెల్ల గతియింపఁగఁ గార్యపుఁ గాల సంగ మే
నెఱుఁగుదు మీరు సేసినది యింపుగ మాకుఁ బ్రియమ్ముఁ గూర్పఁగా
నెఱుఁగుదు భావి కార్య మెద నింకను జేయఁగ మాకు నర్హమున్ 34.

తే.గీ. సేరుదు శరీరజముఁ దృష్ణ నిగ్రహింప
రాని దాని నరశ్రేష్ఠ! మానసమున
సేరుదు సెవరి యందుంచి నిరతము నతి
రక్తి పతి యశక్తుండొ యా రమణులఁ దగ 35.

తే.గీ. లేదు కామ తంత్రము లందు నీదు బుద్ధి
కోపమునకు వశుఁడ వైతి భూప పుత్ర!
కామ రతులు సేరరు దేశ కాలములను
నింక నర్థ ధర్మముల నిశ్శంక సేరు 36.

తే.గీ. మోహ మందు నా చెంతను మునిఁగి యున్న
చెలఁగి నట్టి కామమ్మున సిగ్గు వీడ
వాని క్షమియింపు వాన రాన్వయ పతిఁ బర
వీర దమన! సోదరు భంగి పరమ వీర! 37.

చం. తపమున ధర్మ మందుఁ దమి తద్ద చెలంగు మునీంద్రు లైన నే
ని పరఁగఁ గామ మాత్మలను నెమ్మిని మున్గఁగ మోహ మందహో
కపి ప్రకృతిం గనంగ నధికమ్ముగ నౌ చపలుండు రాజు నా
ర్య! పడడె తా సుఖౌఘమున నందఁగ నివ్విధి సౌమ్య! లక్ష్మణా! 38.

కం. మద విహ్వల వానరి యి
ట్లు దగిన రీతిం బలికి పలుకు లర్థోక్తుల్
పదపడి లీలఁ బతి హితము
లఁ దిరిగి వచియించె నిట్లు లక్ష్మణు తోడన్ 39.

చం. తగిలినఁ గాము మందుఁ గడుఁ దా నిడె నానతిఁ బూర్వ మింపుగా
నగచర కోటి నాథుఁడు ఘనమ్ముగఁ జేయఁ ద్వదీయ కార్యమున్
మగఁటిమి మించు వానరులు మానుగ వచ్చిరి కామరూపులే
యగణిత శైల వాసులు సహస్ర శతాధిక కోటి సంఖ్యలన్ 40.

ఆ.వె. రమ్ము సచ్చరిత్ర! లెమ్ము దీర్ఘ భుజ! మి
త్రత్వ భావ మడర దారలఁ గన
బుద్ధి మంతుల కిటఁ బొసఁగు దోషము కాదు
నిన్ను బోలు వారి కెన్నఁ డేని 41.

కం. పిలువంగఁ దార త్రోలఁగఁ
జెలఁగి త్వరయు లక్ష్మణుండు జేరెం దగ లో
పలి యంతఃపురమును శ
త్రుల నాశము సేయు వాఁడు తూర్ణం బంతన్ 42.

ఆ.వె. పఱుపు పఱచి నట్టి పసిడి యాసనమున
నున్న దినకరాభు పన్నుగఁ గనె
దివ్యభూషణ తను దివ్యరూప యశస్వి
వానరేంద్రు దివ్య వసన ధరుని 43.

తే.గీ. దివ్య మాలా ధరుని ధీరు దేవ తాధి
నేత్ర సన్నిభుఁ గాంచిన నెలఁతు లుండ
నగల దండలఁ జుట్టును నర వరుండు
యముని భంగిఁ గన్పడె నెఱ్ఱ నయిన కనుల 44.

కం. వర వసు తను సుగ్రీవుఁడు
వరాసనస్థ కపి విభుఁడు పత్నిని రుమనుం
బరిరంభించి రఘూత్తము
నరసె విశాల నయనుఁ డట నాయత నేత్రున్ 45.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది మూడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 34.

లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ గాంచి పరుష వాక్యములతో నాతని యలసత్వమునకుఁ గోపించి రాముని తీక్ష్ణ బాణములకు లోను గాకు మని హెచ్చరించుట.

కం. వచ్చిన క్రుద్ధుని లక్ష్మణు
నచ్చట సుగ్రీవుఁ డమ్మహా నరవృషభుం
జెచ్చెర నప్రతిహతునిన్
హెచ్చుగఁ ద్రాసాత్ముఁ డయ్యె నీక్షింపంగన్ 1.

చం. కుపితుని నిశ్వసించుచు సుఘోరము తేజమునన్ వెలుంగు నా
నృపవర పుత్రు రామ ఘన కృచ్ఛ్ర సుతప్తునిఁ గాంచి లక్ష్మణుం
గపి వరుఁ డుర్కొ వేగముగఁ గాంచన పీఠము నుండి భీతి స్వ
ర్గపతి యలంకృతంపుఁ బడగం బురుడింపఁగ సంభ్రమంబునన్ 2.

కం. ఎగసిన సుగ్రీవు నరసి
మృగాక్షులు రుమాదు లెల్ల మెల్తుక లంతన్
గగన తలమ్మునఁ జంద్రు గు
మిగొనెడు తారకల వలె దుమికిరి భయమునన్ 3.

కం. చలియించి రక్త నేత్రుఁడు
నిలిచెను సుగ్రీవుఁ డెదుట నృవరునకుఁ గృతాం
జలియై కల్ప మహీజము
వలె నంత వినయము దోఁప వానర పతియే 4.

కం. నారుల మధ్య రుమా సతి 5.

చేరువ సుగ్రీవుఁ డుండ శీతాంశుం డా
తారం గూడిన భంగిని
నారసి లక్ష్మణుఁడు వలికె నంతట నిట్లున్

తే.గీ మంచి కులమునం దుదయించి మించి తనదు
నింద్రియమ్ములను జయించి యిమ్మహీ త
లమ్మునఁ గృతజ్ఞుఁ డైనట్టి రాజు సత్య
వాది దయ నూని వర్ధిల్లుఁ బడసి యశము 6.

చం. నిలిచి యధర్మ మందు ననునిత్యము దా నుపకార మంది మి
త్రుల కొనరింపఁగాఁ బ్రతినఁ దీరపు మోసపు బుద్ధి తోడుతన్
ఖలు నిఁక నెందు నా నృపుని కన్నను మిన్నగఁ గాంచ నేర మీ
యిలఁ బరికించి చూచినఁ గపీశ్వర సందియ మిందు శూన్యమే 7.

ఉ. ఆడ నసత్య మశ్వమునకై కొను వందలఁ జంపు పాతకం
బాడ నసత్య మావునకు నందు సహస్రముఁ జంపు పాతకం
బాడ నసత్యమే నరున కయ్యది తుల్యమ యాత్మ హత్యకుం
దోడుత బంధు హత్యలకు దుస్సహమై తను నొంచుఁ బాపమే 8.

ఆ.వె. ధరణిఁ బూర్వ మంది తా నుపకారము
మిత్ర తతికిఁ జేయమినిఁ దిరిగి కృ
తఘ్నుఁ డగు నతండు తప్పక వధ్యుఁడౌఁ
బ్రాణి రాశి కెల్ల వానరేంద్ర! 9.

ఆ.వె. లోక వంద్యుఁ డొకఁ డురు గుణ విప్ర వరుండు
శ్లోక మొకటి నుడివెఁ జూచి యొక కృ
తఘ్నుఁ గినుక తోడ దాని విను మొకింత
యిపుడు నుడువ నేను గపివరేణ్య! 10.

తే.గీ. కలదు బ్రహ్మ ఘాతకునకుఁ గల్లు త్రాగు
వాని కింకఁ జోరునకును వ్రతము చెడిన
వాని కైన నపచితి యివ్వసుధ లేదు
నిష్కృతి కృతఘ్ననకు నెందు నిక్కముగను 11.

కం. ఖలుఁడవు మిథ్యావాదివి
తలఁపవు మేలు నెద లోన ధరణీపుఁడు నీ
కల చేయ మేలు వడసియు
నిలఁ బ్రత్యుపకృతి నొనర్ప వేల కపీశా! 12.

తే.గీ. ఫలముఁ గొంటివి రాముని వలన నీవు
రాముఁ డాశించు నిన్నుఁ గార్యమ్ముఁ జేయ
జానకీ మార్గణమ్మును సత్వరమ్ము
నీకుఁ గాకున్నె కర్తవ్య మో కపీంద్ర! 13.

తే.గీ. చేసి కపటంపు శపథమ్ము చిత్రముగను
గ్రామ్య భోగముల నిట మగ్న మయి యుంటి
వకట రాముఁ డెఱుఁగఁడు సర్ప మని కప్ప
యఱపులఁ జెలఁగు నిన్నుఁ గట్టా యెడంద 14.

కం. కరుణాంతరంగుని మహా
పురుషుని రాముని రఘుకుల పుంగవు చేతన్
హరి రాజ్యమ్మును బడసితి
దురాత్ముఁడవు వానరేశ! దురిత చరిత్రా! 15.

కం. మఱచినఁ బనులం దలయుట
సెఱుఁగని రాఘువుని పనిని నీ పెద నిట్లుం
బఱుపఁగ నిశి తాస్త్రము ల
త్తఱిఁ గాంతువు సమసి వాలిఁ దథ్యముగ హరీ! 16.

ఆ.వె. వాలి యగ్రజుండు కూలి యేఁగిన దారి
మూసి యుండ లేదు నీ సమయము
నందు నిలిచి యుండు హరివీర! సుగ్రీవ!
చనకు మయ్య వాలి చనిన గతిని 17.

తే.గీ. అకట యిక్ష్వాకు వీరుని యద్భుతంపు
వింటి నుండి వచ్చిన యమ్ము కంటఁ గనవు 18.

దలఁప సుఖ ముంటి వీ వక్కతమునఁ జేయ
కుంటి విట రామ కార్యము వింటివె హరి!

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది నాల్గవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 35.

తార లక్ష్మణుని తో సుగ్రీవుఁడు కోపమ్మున కర్హుఁడు కాఁడని రామ కార్యమును మఱవ లేదని వానర కోటిని రప్పింప యూథపులను బంపె నని స్వభావ సిద్ధ మైన కామమున మునిఁగెనే కాని కృతఘ్నుఁడు కాఁ డని పలికి సౌమిత్రిని శాంతింపఁ జేయుట.

కం. విని లక్ష్మణు పలుకులు హరి
వనితా మణి తార శశి నిభ వదన యంతన్
మనుజేంద్ర పుత్రుఁ గని ప
ల్కె నిజప్రభ వెలుఁగు నతనికి బదులు పలుకుల్ 1.

చం. అలుకను వానరేశ్వరుని నర్హము కా దదలింప లక్ష్మణా!
పలుకుల నిష్ఠురమ్ములను భావ్యమె నున్నఁగ నీకు మిక్కిలిం
దలఁపఁ గృతజ్ఞుఁడే యితఁడు దారుణ కర్ముఁడు కాఁడు ధూర్తుఁడుం
బలుకఁ డసత్యముం గుటిల భావుఁడు కాఁడు హరీంద్రుఁ డెన్నడున్ 2.

తే.గీ. మఱవ లేదు సుగ్రీవుఁడు మనుజ వర్య!
రాముఁ డొనరించిన యుపకారమ్ము నన్యు
లకు నసాధ్య మైన పనిని రణము నందుఁ
జేసి నట్టి దానిని హరి శేఖరుండు 3.

కం. కనెఁ గీర్తినిఁ గపి రాజ్య 4.

మ్ముని శాశ్వత మింక నన్ను ముదిత రుమా దే
విని రాఘవేంద్రు దయచే
తను సుగ్రీవుండు శత్రు దమన! ముదమునన్

ఆ.వె. దుఃఖ మంది మున్ను దోరముగఁ బడసె
నుత్తమంపు సుఖము నిత్తఱి హరి
పతి సమయము నెఱుఁగఁ డితఁడు విశ్వామిత్రు
భంగిని గతియింప సంగమమున 5.

కం. పది యేండ్లు గడువ నెఱుఁగఁడు
గద విశ్వామిత్రుఁడు సురకాంత ఘృతాచిన్
మది నుంచి యమ్మహా ముని
సదమల ధర్మాత్ముఁ డకట సంయమి యైనన్ 6.

కం. కాల మెఱింగిన జనులన్
మేలి విదుఁడు కౌశికుండు మీఱంగ నటం
గాలము గుర్తింపనిచో
నేల వలుక నన్య జనుల నిట సౌమిత్రీ 7.

తే.గీ. మేని నైజము నందున్న వాని యలసి
నట్టి వాని కోరిక లందు నాత్మఁ దృప్తి
వడయ నేరని వానర పతి మదిఁ గల
కామము క్షమింపఁ దగుదు లక్ష్మణ! తలంచి 8.

కం. నేరక లక్ష్మణ! వానర
వీరుని నిశ్చయపు బుద్ధి వీరవరేణ్యా!
తోరపు రీతిని రోషా
కారము ప్రాకృతు పగిదిఁ దగ దకట తండ్రీ! 9.

తే.గీ. సత్త్వయుక్తులు నినుబోలు సజ్జను లిలఁ
బురుష పుంగవ! యోచింపక రుష కౌదు
రే వశులు శీఘ్రముగ మది నెన్న నెన్నఁ
డేని రఘుకులాంబుధి సోమ! యెందు నైన 10.

తే.గీ. సుగుణ! సుగ్రీవుని కొఱకై సుప్రసన్నుఁ
డ వగుమ త్యజించి రోషము నృవర! సంభ్ర
మమ్ము సెందక ధర్మజ్ఞ! నెమ్మి నూని
కరుణఁ గాంచుమ లక్ష్మణ! కపివరేణ్యు 11.

కం. ధన ధాన్య వసువులను రుమ
ను నన్ను గపి రాజ్య మెల్లను విడుచువాఁ డం
చును నేఁ దలంతు నీ రా
ముని కయి సుగ్రీవుఁడు ముదమున సౌమిత్రీ! 12.

మ. తనరన్ వీర్యము కూర్చు నొక్కటిగ సీతారాములన్ శీఘ్రమే
కన సుగ్రీవుఁడు రోహిణీ శశుల సంకాశమ్ము నా రావణున్
ఘన రక్షః పతిఁ జంపి యుద్ధమున శంకా హీన మింపారఁగన్
వినుమా లక్ష్మణ నాదు మాటలు మహా వీరా! సుమిత్రా సుతా! 13.

తే.గీ. లక్ష కోట్లు నింకఁ బదివేల ధ్వజ తతులు
ముప్పదాఱులు పేలుండ మూరి యింక
పేలు వందల సంఖ్యల వీరు లుండ్రు
పురము లంకలో రాక్షస మూర్తు లడరి 14.

ఆ.వె. చంప కుండ రాక్షస గణముఁ గామ రూ
ప ధరులను మఱి దశవక్త్రుఁ జంపఁ
దరము కాదు సుమ్ము ధరణిజఁ గైకొని
యరిగి నట్టి వాని నరవరేణ్య! 15.

తే.గీ. అన్య సాహాయ్య మొకయింత యడర కున్న
రావణునిఁ గ్రూర కర్ముని రణము నందుఁ
జంప సుగ్రీవునకు కాదు శక్య మెంచ
నొంటరి నిలిచి లక్ష్మణ! యుత్సహించి 16.

కం. హరినాథుఁడు వాలి పలుకఁ
గ రాక్షసుల సంఖ్య నెఱిఁగి కన మూలమ్మున్ 17.

గిరలకు విన్నది చెప్పితిఁ
బురుషర్షభ! యెల్ల వచనముల నిబ్బంగిన్

ఉ. పంపెను దేర వానరుల వానర యూధపులన్ హరీశ్వరుం
డింపుగ యుద్ధమం దొసఁగ నెల్లరు సాయము మీకు లక్ష్మణా!
పెంపు వహింత్రు వీర్యమున వీరులు సూచుచు వారి రాకకై
నింపి దృఢంపు ధైర్య మెద నిల్పెఁ గపీశ్వరుఁ డింక నిచ్చటన్ 18.

ఆ.వె. ఇంపుగ నొనరించె నేర్పాటు సుగ్రీవుఁ
డిందుల కయి మున్న యెల్ల రింక
నేఁడు నేరఁ గలరు నెమ్మి వానర వరు
లా మహా బలులు రయమున నిటకు 19.

ఆ.వె. ఎలుఁగుబంట్లు కోటి యింక గోలాంగూల
ము లవి లక్షలును గపు లతి దీప్త
తేజము లిఁక కోట్లు తెరలి కదియు నిన్ను
వీడు కోప మింక వీరవర్య! 20.

కం. వీరు హరి సతులు నీ కో
పారుణ నేత్రములు నింక నాస్యము గాంచన్
నేరరు శాంతి వహింపఁగ
వీర! ప్రథమ భయపు శంక వెల్లిగొనంగన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది యేనవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 36.

తార పలుకులను గ్రహించి శాంతింప లక్ష్మణుఁడు సుగ్రీవుఁ డంతఁ దాను రామ కార్యము సేయ నాసక్తుఁడ నని క్షమింపు మని వేఁడ సౌమిత్రి తన పరుష వాక్యములను క్షమింపు మని రాముని చెంతకు సత్వర మేఁగెద మని పలుకుట.

కం. పలుకంగ ధర్మ సంహిత
ములు తార సవినయ వచనముల నబ్బంగిన్
లలితస్వభావుఁడు ముదము
న లక్ష్మణుఁడు సమ్మతించె నరవరుఁ డెడఁదన్ 1.

తే.గీ. లక్ష్మణుఁడు గ్రహింపఁగ సర్వ లక్షణుండు
తార వాక్యములను హరి తతి విభుండు
త్రాస మెల్లను వీడెను దడిసి నట్టి
వస్త్రమును వేగ త్యజియించు పగిది నంత 2.

ఉ. వావిరి స్వీయ కంఠమున బద్ధము వెల్గెడు మాల నంత సు
గ్రీవుఁడు చించి వైచి యెడలించి మదమ్ము హరీంద్రుఁ డంతటన్
క్ష్మావర సూను లక్ష్మణునిఁ గాంచి మహాబలు నీయ హర్షముం
దా వచియించె నివ్విధము తద్ద వినమ్రత తోడఁ బల్కులన్ 3.

చం. తొలఁగిన శ్రీయుఁ గీర్తి కడుదొడ్డది యౌ కపి రాజ్య మెల్లయుం
గలిగెను నా కిటం దిరిగి క్రన్నన రామ కృపన్ స్థిరమ్ము సూ
యెలమిని స్వీయ కర్మమున నిట్టి యశస్వికి నేరు సేయఁగాఁ
గల రుపకారముం దిరిగి కాంచిన వీరవరేణ్య! యెందునున్ 4.

తే.గీ. సీత నందు ధర్మాత్ముఁడు శీఘ్రముగను
జంపు రావణునిఁ గడింది తెంపు మీఱ
నల్ప మైనట్టి నా సాయ మందు కొనఁగ
స్వీయ తేజమ్ము సెలగంగ నాయతముగ 5.

కం. ఒక యమ్మున నేడు ద్రుమము
లు కొండ వసుధా తలమ్ములును జీల్పఁ బడన్
సుకరముగ సాయము నొసఁగు
ట కాతనికిఁ జాలుద మనుట విచిత్రంబే 6.

ఆ.వె. మూరి వింటి నారి సారింప నా ధ్వని
కెల్ల గిరులఁ గూడి తల్లడిల్లు
భూమి యట్టి దిట్ట రాముని కేల సా
యమ్ము లక్ష్మణా! కరమ్ము వింత 7.

తే.గీ. వైరి సపురస్సరమ్ము రావణునిఁ జంప
నేఁగు రాముని కా మాన వేంద్రుని కటఁ
దోడు నగుదు యాత్ర సలుపఁ దూర్ణ మింక
నుత్సహించి సౌమిత్రి నే నొప్పిదముగ 8.

కం. దాసుఁ డతిక్రమణము వి
శ్వాసమ్మున యేని సుంత ప్రణయము చేతం
జేసిన క్షమింప నర్హుఁడు
దోసము సేయని నరుండు దుర్లభుఁడు సుమీ 9.

కం. అన సుగ్రీవుం డవ్విధి
ఘనుఁడు మహాత్ముఁడు భృశమ్ముగం బ్రీతుండై
మనమున లక్ష్మణుఁడు వచిం
చెను బ్రేమ సెలఁగఁ బలుకులు శీఘ్రము యిట్లున్ 10.

ఆ.వె. నాథవంతుఁ డయ్యె నా సోదరుం డన్ని
విధము లందు నేఁడు వీరు వాన
రేంద్ర! నిన్ను బడసి యిట్టి వినీతు వి
శేషముగను గపుల శ్రేష్ఠతరుని 11.

ఆ.వె. అర్హుఁడవు కపీంద్ర! యఖిల సంపదలకు
నింకను గపి రాజ్య మేల నీవు
నీ ప్రభావ మింక నీ శుచిత్వము ఋజు
త్వముల వలన వీర! తథ్యముగను 12.

కం. తనరంగ నీదు సాయం
బని సుగ్రీవ! ఘనుఁ డీ మహా వీరుఁడు చం 13.

పు నచిర మరులను  రాముం
డనుమానము లేదు సుంత హరిగణ నాథా!

ఆ.వె. తద్దయు నుచితములు ధర్మజ్ఞుని కృతజ్ఞు
నని మరలని వాని మినుకు లెల్ల
సురుచిరములు సుమ్ము సుగ్రీవ! నీ భాష
ణములు కడు ముదావహము లరిఘ్న! 14.

కం. తమ దోషమ్ముల నేరఁగ
సమర్థు లందుఁ బరికింపఁ  జక్కంగను వా
క్యము లిట్లెంచఁగ నీవును
మమాగ్రజుఁడు దక్క పలుకు మాన్యులు గలరే 15.

కం. సరి వీవు రామునకు నో
హరి సత్తమ విక్రమమున నా వీర్యమునం
జిరమున దత్తుండ వయితి
సురల వలన సాయ మీయ సురుచిర రీతిన్ 16.

ఆ.వె. అయిన నింక హరిగణాధిప! చను మయ్య
నన్ను గూడి వేగ పన్నుగ రఘు
రాము నూఱడింప భా మాపహరణ సం
తప్తు నుచిత రీతి నాప్త సఖుని 17.

ఆ.వె. వగపు నందు మునిఁగి పలికిన రాముని
మాట లాలకించి మదినిఁ గినుక
సెలఁగఁ బరుష వాక్యములను బలికితి క్ష
మింపు మయ్య నన్ను మిత్రు నింక 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది యాఱవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 37.

సుగ్రీవుఁ డంత హనుమంతునితో నానా దేశము లందున్న వానరులను దోడ్తేర యూధపులను బంపమని మున్ను తా నాజ్ఞాపించిన వారినిఁ ద్వరపఱుపఁ గొందఱిని పంప మని యానతీయ నతఁ డట్లు సేయ సమస్త వానరులు సేరుకొని తాము తెచ్చిన బహుమానములను సుగ్రీవున కీయ నతఁడు ముదమున గ్రహించుట.

కం. పలికిన మహాత్ముఁ డా విధ
ము లక్ష్మణుఁడు వానరోత్తముఁడు సుగ్రీవుం
డలరి తన సమీపమ్మున
నిలిచిన మారుతిని సచివునిఁ గని యనె నిటుల్ 1.

తే.గీ. గిరి మహేంద్రము కైలాస గిరియు మంద
రాద్రి హిమగిరి వింధ్య పంచాద్రు లందుఁ
బశ్చిమ దిశ నుదయ రవి వర్ణ భాసి
తములు సాగరాంత గిరులఁ దనరు కపుల 2.

సీ. ఉదయాద్రి సంధ్యా ఘనోపమ గిరి వాస పద్మ తా లారణ్య వాన రాలి
నంజన గిరి లోని యంజ నాభ్ర సదృశ కరి నిభ ఘన వీర్య హరి గణము మ
నశ్శిలా కుహర ఘన నివాసులను మేరు గత ధూమ్ర పర్వత కపి చయము మ
హారుణ పర్వత మందు మైరేయము ద్రావు మహావేగ రమ్య కపుల
తే.గీ. రమ్య తర సుగంధ వనముల విహరించు
ముని వర వన వాసుల నెల్లర నిటకుఁ గొని
రా వలయు సామ దా నాది భావములను
వసుధ నున్న హరుల నెల్ల వానరేంద్ర! 3.

తే.గీ. మున్ను పంపిన హరియూధపులను ద్వరిత
పఱప బల్లిదులను దిర్గి పంపు మీవు
హరివరేణ్యుల నన్యుల నాంజనేయ!
వేగ రప్పింపు మెల్లర వీడ కేరి 4.

ఉ. కామ విలగ్ను లైన మఱి కర్మము లందిఁక మందు లైననుం
దా మిట కేఁగుదెంచ వలెఁ దప్పక యెల్లరు నాదు పంపునన్
భూమిపు నాజ్ఞ మీఱి దివముల్ పది దాఁటఁగ రాక యున్నచో
వే మరణింత్రు దండనము వేయఁగ నిక్కము రాజదూషకుల్ 5.

ఆ.వె. వంద లింక వేలు వానర సింహులు
కోట్లు వేగ నాదు ఘోర శాస
నమ్ము నూని మదిని నల్దిక్కు లభ్రాద్రి
నిభులు యేఁగ వలయు నిండ నింగి 6.

ఆ.వె. పృథ్వి నున్న ప్లవగ వీర వర్యుల దారి
నేరి నట్టి వారు వారి గతుల
నెఱిఁగి వానర వరు లెల్ల యేఁగి కొని తే
వలయు నా యనుజ్ఞ వారి వేగ 7.

కం. విని వానరేంద్రు సుగ్రీ
వుని యాజ్ఞను వాయు సుతుఁడు బోరనఁ బంపెన్
ఘన విక్రాంతుల హరివరు
లను సకల దిశలకు వానర వరులఁ దేరన్ 8.

మ. గిరులం దోయధులన్ సరస్సులను వ్యాకీర్ణాటవీ వీధులన్
హరి వీరుల్ సని యెల్ల వానరుల రామార్థంబు ప్రేరేపఁగన్
వర సుగ్రీవుని మృత్యు కాలనిభు దుర్వారాజ్ఞనున్ వచ్చి రె
ల్లరు దాఁటంగ నశక్యులై చెలఁగ సంత్రాసమ్ము డెందమ్ములన్ 9.

తే.గీ. అంత నంజన సన్నిభ హరి వరులు మ
హా బలులు మూడు కోట్ల సంఖ్యలఁ జెలంగి
యంజ నాద్రి నుండి వెడలి రా రఘూత్త
ముండు రాముఁ డున్న యెడకు ముదము మీఱ 10.

ఆ.వె. అర్కుఁ డస్తమించు నద్రి వరము నందు
నున్న యట్టి వాన రోత్తములు వె
లుఁగుచుఁ దప్త వసువు పగిది నొక్క పది కో 11.

టులు కదిసిరి యంతఁ జలము మీఱ

కం. కైలాస శిఖర వాసులు
కేలీ గతి వేయి కోట్లు కేసరి గళపుం
జులును వర్చస్సులలోఁ
బోలు హరులు వచ్చి రెల్ల మూరుచు నంతన్ 12.

కం. ఫల మూలశ్రిత హిమగిరి
తల వాసులు వేయి కోట్లు తనరఁగ నొక వే
యి లలిం జేరిరి కపి వీ
రు లంత సమ్మోదమున సురుచిర శరీరుల్ 13.

ఆ.వె. వింధ్య గిరిని వీడి భీమ కర్ములు భీక
రులు ననల నిభులు హరు లరుదెంచి
రంత వేల కోట్లు రయమున నచ్చోటి
కెలమి నిండ వారి యెడఁద లందు 14.

తే.గీ. పాల సంద్రంపు టొడ్డున వాస మున్న
వారలు తమాల వన మందు వాస మున్న
నారికే లాశనులు రాఁగ వారి సంఖ్య
తెలియ రా దెరికి గణింప నలవి కాదు 15.

ఆ.వె. వడిని నరుగు వారు వనముల సేఱుల
కందరముల నుండి కపుల సేన
వచ్చి యున్నయది దివాకరుఁ ద్రాగెడు
భంగి వేగముగను బర్వు లిడుచు 16.

కం. కపులఁ ద్వరితపఱపఁ జనిన
కపి వీరులు చనిచని యట గాంచిరి కడు ర
మ్యపు హిమవన్నగము ద్రుమము
లు పన్నుగ వెలయఁగఁ గన్నులు చెదరు రీతిన్ 17.

ఉ. ఆ గిరి యందుఁ బూర్వము మహాద్రిని శంభు నిమిత్తమై మహా 18.

యాగము హర్షమీయ నమరాళికిఁ జేయఁబడెన్ ఘనమ్ముగన్
బాగుగ హవ్య జాతములు పండ్లను పేరుల నచ్చటన్ సుధా
భోగ సమమ్ము లం గనిరి పుణ్య మనస్కులు వానరుల్ తమిన్

తే.గీ. తినిన నా యన్నమున జనించిన పలముల
మూలముల నింపుగా దివ్యములను మనము
దోఁచు వాని సెవ్వ రయినఁ దోరముగను
దృష్టి నుంద్రు వా రొక నెల దినము లైన 19.

చం. ఫలముల నింక మూలముల వానరు లచ్చట నౌషధమ్ము లన్
ఫలముల నాహరించి మను వారలు దివ్యములన్ గ్రహించి యా
స్థలమున యజ్ఞ వాటిక భృశమ్ముగ వాసన లీను పూవులన్
వలపున నీయ నాథునకుఁ బన్నుగఁ గైకొని రెల్ల రింపుగన్ 20.

కం. ఆ వానర వరులు వసుధ
లోపఱలు హరి వరులను గలుపుకొని వెంటన్
వేవేగ గుంపునకు మును
బోవం దొడఁగిరి కడింది ముదమున నంతన్ 21.

కం. సుగ్రీవుఁ డున్న యెడ క
త్యుగ్రులు కిష్కింధ లోనఁ దూర్ణమ్ము ప్లవం
గాగ్రులు శీఘ్రము చేరిరి
సుగ్రీవున కవి యొసంగుచు ఫలౌషధముల్ 22.

తే.గీ. మూలముల నిడి పల్కిరి శైలములను
సాగర తటమ్ముల వసుధ సకల కాన
నములఁ కేఁగితి మిటకు వానరులు నీదు
శాసనమ్మున వత్తురు సర్వు లనుచు 23.

కం. విని యా మాటలు సంతస
ము నంది సుగ్రీవుఁడు గొనె ముదమున వానిన్
ఘనము లుపాయనముల నె
ల్లను బ్లవగ గణేశ్వరుండు రాగం బడరన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది యేడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 38.

సుగ్రీవుఁడు వానరులు తెచ్చి యిచ్చిన కానుకలను గ్రహించి దారల వీడ్కొని లక్ష్మణునితోఁ గూడ బల్లకి నధిరోహించి రాముని చెంతకు నేఁగి పాదాభివందనము సేయ రాముఁడు లేవ నెత్తి రాజుల గుణగణములు వివరింప సుగ్రీవుఁడు వానర వీరులు కోట్ల కొలది నానా దేశముల నుండి రావణ వధార్థము తరలి వచ్చు చున్న వారని తెలుప రాముఁడు సంతసించుట.

కం. కానుకల నెల్లఁ గైకొని
వానరులను సత్కరించి పన్నుగ నంతన్
మానుగ సుగ్రీవుఁడు చన
నానతి నిడె వారి కెల్ల నానందమునన్ 1.

కం. విడిచి కృతకర్ముల హరులఁ
గడింది శూరులఁ దలంచె కపివర నాథుం
డెడఁదం దానును రఘు రా
ముఁడుం గృతార్థు లనుచుఁ గడు ముద మేపారన్ 2.

ఆ.వె. అంత లక్ష్మణుఁడు మహా బలు సుగ్రీవు
సర్వ వానరగణ సత్తముఁ గని
హర్షము నొసఁగ వినయమున నిట్టు లనెఁ గి
ష్కింధ విడిచెదమ రుచింప సౌమ్య! 3.

చం. పలుకఁగ నట్లు లక్ష్మణుఁడు వాక్యము లా హరి యాలకించి ప్రీ
తిలి మన మందు  సూర్యజుఁ డతీతము  పల్కెను నీదు శాసనం 4.

బిల శిరసావహింప నగు నింపుగ నాకు సతమ్ము నేఁగు వా
రలమ యవశ్య మంచు ఘను లక్ష్మణుతో ముదమార నంతటన్

తే.గీ. వీడుకొలిపెఁ దారాదుల నాడు వార
లను నిజాంతః పురమ్ము సేరంగ నంతఁ
బెద్ద యెలుఁగున వానర బృందముఁ గని
పిలువ రండని వచ్చిరి వేగ వారు 5.

తే.గీ. ఆడు వారిఁ జూడఁగ నోపు నట్టి వారు
వానరులుఁ రాగ నంజలి బద్ధు లయి ర
యమున సుగ్రీవుఁడు పలికె నర్క నిభుఁడు
శిబికను దనకుఁ దెమ్మని శీఘ్రముగను 6.

కం. విని నంత శీఘ్ర గాములు
వనచరు లెల్లఁ జనుదెంచి పల్లకి రమ్య
మ్మును తెచ్చి వేగముగ దా
ని నిల్పి రట వానరేంద్రుని యెదుటఁ బ్రీతిన్ 7.

తే.గీ. కాంచి యుంచిన నా శిబికను హరీశ్వ
రుండు లక్ష్మణ! యో బల్లిదుండ! యెక్కు
మంచు సౌమిత్రితోఁ బల్కె నంచితముగఁ
జూపి యప్పల్లకి నమిత సుందరమును 8.

ఆ.వె. పలికి యిట్లు ప్రీతి బంగరు పల్లకి
సూర్య సన్నిభమ్ము సూర్య పుత్రుఁ
డెక్కె లక్ష్మణుండు నెక్క ననేకులు
హరులు మోయు దానిఁ ద్వరితముగను 9.

ఉ. తెల్లని ఛత్ర రాజము ద్యుతిం దల పైన వెలుంగు చుండఁగా
నెల్లెడ చామరమ్ము లెద కింపు నొసంగ హరీశుఁ డంతటం
బెల్లున వాద్య ఘోషములు ప్రీతి నొసంగ నమస్కరింపఁగా
నెల్ల కపివ్రజం బలరి యేఁగఁ దొడంగెను రాచ వీవినిన్ 10.

చం కరములఁ దీక్ష్ణ శస్త్రములు గన్పడ వానరు లుండఁ జుట్టునున్
హరి వరుఁ డేఁగె రాముఁడు మహాత్ముఁడు నిల్చిన యట్టి టెంకికిం
ద్వరితము సేరి లక్ష్మణుని భ్రాతను గూడి మహాత్మ సేవితం
బరసి స భక్తి డిగ్గెను రయమ్మునఁ బల్లకి నుండి యంతటన్ 11.

కం. కని రాముని సుగ్రీవుఁడు
వినయమ్మున నంజలించి వీరుఁడు నిల్వం
గని వానరు లెల్లరు రా
మునికి మొగిడ్చిరి తమ కరములు నమ్రతతో 12.

కం. వానర సైన్యము కన్పడ
నా నృవరునకున్ సరోవ రాకృతి నిండన్
పే నలిన కుడ్మ లావలిఁ
దా నా సుగ్రీవు నరసెఁ దద్దయుఁ బ్రీతిన్ 13.

ఉ. పాద యుగమ్ముపైఁ బడిన వానర నాథునిఁ బ్రేమ మీఱఁగా
నాదర మొప్ప లేపుచు మహాత్ముఁడు రాముఁడు కౌఁగిలించి త
త్సోదర తుల్యుఁ సూర్యజుని తోడ వచించెను గూరుచుండుమా
నా దయఁ గూరుచుండఁగను నమ్రత సేలను గాంచి యిట్లనెన్ 14.

తే.గీ. రాజ! ధర్మార్థ కామముల సమయమ్ము
నెఱిఁగి విభజించి యెవ్వఁడు వఱలు చుండు
నతఁడు సుగ్రీవ! వీర వర్య! ఘనుఁ డైన
రాజగు నిజము పరికింపఁ బ్రాభవమున 15.

కం. ఇల ధర్మార్థముల విడిచి
చెలరేఁగం గామ మందుఁ జెట్టు పయిన ని
ద్రిలి తూలిన నేరిన నరు
వలె వర్తిల్లును విభుండు వానర వర్యా! 16.

తే.గీ. తగిన పగవారి వధ యందుఁ దగిలి యుండ
సతము మిత్ర సంగ్రహ మందు రతిని నిల్ప
రాజు వడయుఁ ద్రివర్గ ఫలములు నిలువ 17.

ధర్మ మందు నింపుగ నిరంతరము వీర!

తే.గీ. వచ్చె నుద్యోగ సమయమ్ము వానరేంద్ర!
సకల శత్రు వినాశన! యిఁక నమాత్య
వరుల హరిపుంగవుల తోడఁ బన్నుగ నొన
రింపు మాలోచనము లెల్ల నింపు గొలుప 18.

ఉ. ఆ వచనమ్ము లెల్ల విని యార్యుఁడు రాముఁడు వల్కినంత సు
గ్రీవుఁ డొసంగె నుత్తరము కీర్తియు శాశ్వత రాజ్య మర్థముల్
బోవఁగ మున్ను నీ కరుణ మూర లభించిన వెల్ల నిత్తఱిన్ !
భూవర! తిర్గి నాకు గుణ భూషణ! దీర్ఘ భుజా! యరిందమా! 19.

తే.గీ. దేవ! విజయాగ్ర గణ్య! త్వదీయ నోద
రుండు నీవును జేయఁగ మెం డగు నుప
కార మివ్విధిఁ బ్రత్యుపకారము నొన
రింప కున్న నింద్యుఁడు కల్లరి యగు వాఁడు 20.

చం. ఇలఁ గల వాన రావలిని  నీ కపి ముఖ్యులు చూడు మింపుగం
గలిసి సెలంగి తెచ్చిరి యఖండ బలాన్వితులం బరఘ్న! వీ
రుల వడి ఋక్ష రాజ వరులుం గపి ముఖ్యులు నింక కొండము
చ్చులు కల రిందు నెల్లరును శూరులు కానన మార్గ వేదులున్ 21.

ఆ.వె. కపులు బలులు దేవ గంధర్వ పుత్రులు
కామ రూపు లెల్లఁ గదలి వచ్చు
చున్న వార లిపుడు శూరులు స్వీయ సై
న్యములఁ గూడి రఘుకులాబ్ధి చంద్ర! 22.

సీ. వందలు లక్షలు కొందఱు కోట్ల ప్లవంగమములు తనరంగ నింక
నయుత సంఖ్యల వీరు లావృతములు కాఁగ శంకు సంఖ్యల హరి సత్తము లరు
దేర నర్బుదములు వారక యర్బుద శత హరి వీరుల సంఖ్య లడర
మధ్యము లంతముల్ మర్కటములు సముద్ర పరార్ధ సంఖ్యలు తద్ద బలులు
తే.గీ. హరులు హరి యూధపులు నమ రాధి పాభ
విక్రములు రమ్యతర మేరు వింధ్య వాస 23.

మేరు మందర సంకాశ దారు ణాంగు
లెల్ల వచ్చు చుంటిరి వేగ వెల్లువ లయి
[ అయుతము = పదివేలు; అర్బుదము = పది కోట్లు; శంకువు = లక్ష అర్బుదములు; సముద్రము = పది శంకువులు;
అంతము = 10 సముద్రములు; మధ్యము = వంద సముద్రములు; పరార్థము = పది మధ్యములు]

కం. వారలు రాఘవ నిన్నిఁకఁ
జేరి సబాంధవము నాజిఁ జెండాడి మహా
క్రూరుని రావణుఁ దెత్తురు
మూరి ధరా సుతను నమ్ము బుణ్య చరిత్రన్ 24.

కం. నృప నందనుండు రాముఁడు
విపుల మతి తన ముదల నెఱవేర్చెడు ఘును నా
కపినాథు యత్న మరయఁ గ
నిపించెను విరిసిన నీలి నీరజము వలెన్ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది యెనిమిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 39.

సుగ్రీవుని మాటలకు సంతసిల్లి రాముఁ డాతనిఁ గౌఁగిలించి రావణునితో యుద్ధమునకుఁ బూనుకొన వలెనని పలుక సుగ్రీవుఁడు కోట్లాది వానర యూధపులు వానరలు వచ్చి నీ యాజ్ఞకు లోఁబడి యున్నవారని పలుకు చున్నంత నా ప్రదేశ మెల్ల కోఁతుల మూఁకలతో నిండి పోయెను.

కం. అన సుగ్రీవుఁడు తగ మో
డ్చిన చేతుల నాలకించి చెన్నుగ ధర్మ
మ్మును నూను వారి ముఖ్యుం
డనె రాముఁడు కౌఁగిలించి హరివరు నిట్లున్ 1.

చం. ఇలకు నొసంగ వర్షమును నింద్రుఁడు కాదు విచిత్ర మెన్నఁగాఁ
దొలఁగఁగఁ జేయ భాస్కరుఁడు తోరపుఁ జీఁకటి యంబరమ్ము నన్
లలిత మయూఖ పుంజముల రా జిలఁ జేయఁడె నిర్మలమ్ము మి
త్రుల కుపకారముం దిరిగి తూర్ణము సేయరె త్వద్విధుల్ సఖా! 2.

ఆ.వె. నే నెఱుఁగుదు సౌమ్య నిన్ను నిత్య ప్రియ
వాది వంచు వింత కాదు సేయ
నీవు ప్రత్యుపకృతి నో వానరేశ్వర!
యిట్లు నాకు సఖున కెలమి సుంత 3.

ఆ.వె. అండ నుండ నాకు మెండుగ నీవు శ
త్రువుల నెల్ల నాజిని వధియింతుఁ
జేయఁ దగుదు వీవు సేరి సాహాయ్యము
మంచి సఖుఁడ వీవు మర్కటేంద్ర! 4.

మ. తన నాశార్థమ సంగ్రహించె వని సీతా దేవి వంచించి బో
రన రక్షఃపతి నా శచీ సతి ననుహ్లాదుండు పౌలోమినిం
గొను చందమ్మున నే వధింతు ననిలో ఘోరమ్ముగా రావణున్
ఘనుఁ డింద్రుండు శచీ సతీ జనకునిన్ ఖండించి నట్లున్ వెసన్ 5.

ఆ.వె. ఇంత లోన లేచె వింతగఁ గప్పుచు
నంబరంపు వేడి నంబర మణి
కిరణ పుంజములను విరివియై దుమ్మెల్ల
దిక్కు లందు నణఁగ తీవ్ర ప్రభలు 6.

కం. దిశలన్ వ్యాపింప నటుల
భృశమ్ముగ దుమార మెల్లఁ బృధ్వీతలమే
వశమై కంపించెను వన
స శైల సంచయము గూడి సకలం బంతన్ 7.

సీ. అంత నిమిష మాత్ర మంద ధరాధర సన్నిభ తీక్ష్ణ దంష్ట్ర చయ వీర్య
వంత ప్లవగము లనంత సంఖ్య లవని నిండిరి యూథపు లుండఁగ శత

కోటి శాఖామృగ ఘోరాంగులు పరివృతు లగుచుఁ గామ రూపులు నదీ ని
వాసులు పర్వత వాసులు వార్ధి నివాసు లతి బలులు వారిద రవ
తే.గీ. నాదు లన్య వనచరులు నలిన కేస
ర తరు ణాదిత్య చంద్ర గౌర సమ వర్ణ
ధవళ వర్ణులు మేరు నగ వర నిలయ
వానర వరులు వెలయంగ వచ్చి రటకు 8.

కం. పదివేల కోట్ల కోఁతులు
బదిలమ్ముగ గూడఁగ శతవలి నాముం డా
యదనునఁ గన్పడె వీరుఁడు
సదమల చిత్తుండు ప్లవగ సత్తముఁ డచటన్ 9.

కం. తారా జనకుండు మహా
వీరుఁడు కాంచన గిరి నిభ విలసిత తనుఁడున్
వీర కపి దశ సహస్రా
పార కలిత కోటుల నగ పడె ముద మారన్ 10.

కం. ఒక వేయి కోట్ల కోతులు
ప్రకటిత బలు లుండ వెనుక వచ్చెను బ్రీతిన్
సు కపి వరేణ్యుఁడు సూర్యజు
నకు మామ రుమా జనకుఁడు నయకోవిదుఁడున్ 11.

తే.గీ. పద్మ కేసర సన్నిభ వానరుండు
నుదిత సూర్య నిభాననుఁ డుత్తముండు
కపుల సుమతి యనేక సంఖ్యా సహస్ర
హరులతో వచ్చెఁ గేసరి హనుమ తండ్రి 12.

కం. గోలాంగూ లాధిపుఁ డా
భీల పరాక్రముఁడు వచ్చె వృతుఁడై తగ వే
వేలా కోట్ల ప్లవగ వీ
రాలి గవాక్షుం డచటకు నానందముగన్ 13.

ఆ.వె. రెండు వేల కోట్ల ఋక్ష వరుల భీమ 14.

వేగ ఘనుల గూడి వీర వరుఁడు
ధూమ్ర నాముఁ డంతఁ దూర్ణము రిపు వీర
దమనుఁ డరుగుదెంచె ధైర్యశాలి

కం. ఘన గిరి సన్నిభ వానరు
లను ఘోరుల మూడు కోటులం బరివృతుడై
పనసుండు వచ్చె యూథపుఁ
డనఘుండు పరాక్రముండు నత్యంత తమిన్ 15.

కం. నీలాంజన నిభ రూపుఁడు
నీలుం డను వానరుండు నెమ్మిని సుమహా
భీల శరీరుఁడు ముదమున
వ్రాలెను వేగ పదికోట్ల వానర తతితోన్ 16.

ఆ.వె. ఏను కోట్ల మంది వానరులను గూడి
వీర్యవంతుఁ డడరి కార్య నైపు
ణుండు ధీరుఁడు గవయుండు కాంచన శైల
నిభుఁడు యూథపుండు నెమ్మి వచ్చె 17.

కం. బలవంతుండు దరీముఖుఁ
డలరి మహా యూథపుండు నడరుచుఁ దనతోఁ
గలియంగ వేయి కోట్ల హ
రులు సుగ్రీవు దరి హరి వరుఁ డరిగి నిలిచెన్ 18.

కం. బలు లగు మైంద ద్వివిదులు
లలితాశ్వులు వానర వరులం గొని తమతో
నల వేల కోట్ల కోటుల
బలవంతుల వీర వరుల వచ్చిరి ప్రీతిన్ 19.

ఆ.వె. మూడు కోట్ల కోఁతి మూఁకలు తన వెంట
నుండ వీర వరుల నిండి బలుఁడు
గజుఁడు తేజు మీఱఁ గపినాథు సుగ్రీవు
చెంత కంత వచ్చె శీఘ్రముగను 20.

తే.గీ. జాంబవంతుఁడు తేజస్వి సంబరమున
ఋక్ష గణ రాజు పదికోట్ల యిద్ధ సేన
నూని సుగ్రీవ వశ్యుఁడు వానరేంద్రు
చెంత కరుదెంచి వడి నిల్చె నంత ఘనుఁడు 21.

కం. హరి వరుఁడు రుమణ్వంతుఁడు
గురు వీర్యుఁడు వంద కోట్ల కోఁతుల తోడన్
హరినాథు సమీపమ్మున
కరుదెంచెను దూర్ణ మమ్మహా విక్రముఁడే 22.

ఆ.వె. లక్ష వేల కోట్ల యక్షయంపుఁ గపి సే
న తన వెంట నుండ నగచరుండు
గంధమాదనుండు కపి నాథు చెంతకు
వేగ వచ్చి నిలిచె వీర వరుఁడు 23.

తే.గీ. వేయి పద్మము లింకను వెలయ వంద
శంకువుల ఘోర వానర సైన్యము తన
చెంత నంగదుం డరుదెంచె నంతట యువ
రాజు సుగ్రీవు చెంతకుఁ బ్రాభవమున
[పద్మము =లక్ష కోట్లు; శంకువు = పది పద్మములు] 24.

కం. తారా ద్యుతితో వెల్గెడు
తారుఁడు హరి విక్రముండు తరలుచు నుండన్
దూరమునం గన్పట్టెను
వీర కపులు పంచ కోట్లు వెంబడి నుండన్ 25.

ఆ.వె. ఇంద్రజాను వను కపీశ్వరుఁడు హరి యూ
థపుఁడు దృశ్యుఁ డయ్యెఁ దనదు వెంట
పదునొకండు కోట్ల వానర వీరులు
వచ్చుచుండ నంత నచ్చముగను 26.

ఆ.వె. అంత వచ్చె రంభుఁ డను తరుణాదిత్య
సన్నిభుండు ప్లవగ సత్తముండు 27.

వంద కోట్ల ప్లవగ వరులు తనదు వెంట
నుండ వానరేంద్రు నండ కడరి

కం. కనిపించె నంత దుర్ముఖుఁ
డను వీరుఁడు వానరుండు హరి యూథపుఁడే
తన వెంట రెండు కోటుల
ఘన వానర వీరు లుండఁ గమనీయముగన్ 28.

కం. హనుమంతుఁడు కన్పట్టెను
జని రాఁ గైలాస శిఖర సదృశాకారుల్
ఘనభీమ విక్రమ హరులు
తన వెంటను వేయి కోట్లు తనరుచు నుండన్ 29.

కం. నలుఁ డరుదెంచెను ద్రుమ వా
సు లా హరులు కోటి కోట్ల శూరులు వెనుకన్
బలవంతు లుండ హరి వీ
రు లందు శ్రేష్ఠుండు దోర్బలుండు రయమునన్ 30.

కం. దధిముఖుఁ డేతెంచె దయితుఁ
డధిపున కడరి పదికోట్ల హరులు బలము నం
దధికులు తనతో నుండఁగ
నధినాయకు చెంత కంత నానందముగన్ 31.

చం. శరభుఁడు వహ్ని రంహుఁడును సన్నుతుఁడౌ కుముదుండు నింక వా
నర వరు లెందఱో గిరి వనమ్ములు భూతల మందు నుండి యా
హరి వరు లేఁగుదెంచిరి మహా కపి యూథప వర్యు లుండఁగాఁ
దరమె గణింప సంఖ్యలను దద్ద బలాఢ్యులు కామరూపులున్ 32.

కం. మునుఁగుచు గెంతుచుఁ జేయుచు
నినదమ్ములు ప్లవగ వరులు నెమ్మి సెలంగన్
ఘను సుగ్రీవునిఁ జుట్టిరి
ఘనములు మార్తాండుఁ జుట్టు కరణిని నంతన్ 33.

కం.	ముదితులు సుదీర్ఘ భుజులు ని
నదించుచుఁ బ్లవగ వరులు ఘనమ్ముగ వా రె
ల్లఁ దలల నూపుచుఁ దెల్పిరి
పదిలపుఁ దమ రాక నంత వానర పతికిన్	34.

తే.గీ.	వానరోత్తము లన్యులు ప్రాంజలిఁ గలి
సి తగ నెల్లరు సుగ్రీవు చెంత నిల్వ
ధర్మవిదుఁడు సుగ్రీవుఁడు తనిసి వారిఁ
ని సెఱఁగించె నంజలి  రామునికి వచించె	35.

తే.గీ.	యూథపులఁ గాంచి యివ్విధి నొప్ప సుఖము
వనములను గిరి నిర్ఝర ప్రాంతముల ని
లుపఁగ నెల్లెడఁ దగురీతి నృపవరుండు
బల మెఱుఁగఁ దలఁచె బలజ్ఞుఁ డలరి యపుడు	36.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు ముప్పది తొమ్మిదవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 40.

వచ్చిన వానర వాహినిని రామునకుఁ జూపి యాజ్ఞ నొసఁగు మనిన రాముఁడు నీవ యాజ్ఞాపింప నర్హుఁడ వని సీత ప్రాణములతో నున్నదో లేదో తెలుసుకొని తదుపరి కార్యము సేయ నగు ననిన సుగ్రీవుఁడు వినతుఁ డను వానర నాయకుని సీతను రావణు నాలయమును శోధింప ననేక వానర సైన్యముతోఁ దూర్పు దిక్కున కేఁగ వలె నని వివరములను దెలిపి యొక్క నెల లోపలఁ గనుఁగొని తిరిగి రావలె నని యాజ్ఞాపించుట. నెల లోపున రాకున్న మరణ దండన మని తెలుపుట.

కం.	ప్లవగ పతి సమృద్ధార్థుం
డవనీశుండు వచియించె నా సుగ్రీవుం	1.

డు వచనము లిప్పగిది మా
నవర్షభుని రామునిఁ గని నయముగ నంతన్

ఉ. వచ్చిరి నిల్చి రిచ్చటను వానర వీరులు వార ణాభులుం
జెచ్చెరఁ గామరూపులు వసింతురు మద్విషయమ్ము నందుసే
హెచ్చిన వీర్య వంతులు నహీన పరాక్రమ వంతు లెల్లరున్
మెచ్చరు దైత్య దానవుల మేటి బలమ్ము నఁ బెక్కు రిత్తజిన్ 2.

చం. కడచిన యట్టి కర్మముల ఖ్యాతు లెఱుంగరు గ్లానినిన్ బలుల్
గడుసరులే ప్రతాపు లధికమ్ముగ నుత్తము లుద్యమమ్ములం
బుడమిని నీటి నింపుగను బోవ సమర్థులు శైలవాసులున్
వడి నిట నీకు సేవకులు వచ్చిరి వీరలు కోట్ల సంఖ్యలన్ 3.

మ. పను లెల్లం దగ నీ వొసంగఁ ద్రుటినిం బాటించు వా రిందఱుం
గనినం గూర్తు హితమ్ము పెద్దలకు నీ కాంక్షాలిఁ బూరింపఁగా
ఘన సామర్థ్యులు నిర్జి తారిగణ! విక్రాంతుల్ మహా వీర్యులుం
గనుమా నిల్చిరి దైత్య దానవ నిభుల్ కాకుత్స్థ! సద్బాహుసుల్ 4.

చం. తలఁచిన యుక్త కాల మని తప్పక పంపు నొసంగు మింక నౌ
దల ధరియించు నీ ధ్వజిని తద్దయు నర్హుఁడ వీ వనుజ్ఞ నీ
య లలిఁ దలంతుఁ గార్య మిది యంచు మనమ్మున నేను రామ! నీ
దలఁచిన దెద్ది యట్టి గతిఁ దత్క్షణ మార్య! యొసంగు మాజ్ఞనున్ 5.

కం. పలుకఁగ సుగ్రీవుఁడు కౌఁ
గిలించి దశరథ సుతుండు కేళుల నతనిన్
లలితమ్ముగ ముదమారఁగఁ
బలికెను వాక్యజ్ఞుఁ డిట్లు వచనము లంతన్ 6.

కం. మునుముందు నేర వలయు సు
మి నా యవనిజ బ్రతికి పుడమినిఁ గలదో లే
దొ నృశంసుఁడు రావణుఁ డుం
డు నెట మహాప్రాజ్ఞ! యెఱుఁగుఁడు నిజం బెల్లన్ 7.

తే.గీ. సేర వైదేహి యునికియుఁ గ్రూరు రావ
ణుని నిలయ మా సమయ మందుఁ బనిని యుక్త
మైన దాని నేఁ బూనుదు వానరేంద్ర!
నీదు సాహాయ్య మలవడ నేర్పుతోడ 8.

కం. ప్లవగేశ్వర! యిక్కార్యము
న విభుఁడ నేఁ గాను గాడు నా భ్రాతయు మా
నవ వృషభుఁడు లక్ష్మణుఁడు ప్ర
భు వగుదు విప్పనికి నీవ మూలము తలఁపన్ 9.

చం. తెలియును నాదు కార్య మది తెల్లముగా హరి నాథ! నీ కిటం
గలుగదు సందియంబు మదిఁ గన్నన నాజ్ఞ నొసంగు మీవ నా
కిల వగుదే ద్వితీయ సఖి వింపుగఁ గాల మెఱుంగు వాఁడవే
లలితపు టర్థ వేదుఁడవు ప్రాజ్ఞుఁడ వింక హితంబు నెంతువే 10.

చం. అన విని యంత వానర గణాధిపుఁ డా విన తాఖ్య వానరున్
విన నట రామ లక్ష్మణులు భీకర మేఘ నినాదుఁ బర్వతా
భునిఁ గని పల్కు లిట్లనియెఁ బూర్వపు దిక్కున కేఁగి చాగుమా
యిన శశి సూనులం గలసి యింకను వానర సంచయమ్ముతో 11.

తే.గీ. దేశ కాలము లెఱిఁగిన ధీర వరుల
నిపుణ హరులఁ గా ర్యాకార్య నిశ్చయమ్ము
నందు వేల సంఖ్యలఁ గూడి యద్రి వన న
దులను సీతను దశకంఠు నిలు వెదకుఁడు 12.

సీ. భాగీరథీ నదీ ప్రాంతములన్ రమ్య సరయూ నదీ తటస్థలము లందు
కౌశికిఁ గాళిందిఁ గన్పట్టు సుందర యమునా తటిని యాము నాద్రి యందు
సింధు సరస్వతి చేరువల విమల శోణ నదీ తటి సుజల యుత మ
హీ నదీ కాలమహీ నదీ తటు లందు విపిన శైల నిచయ విలసితముల
తే.గీ. బ్రహ్మమాల విదేహముల వర కాశి
కోస లాదుల మాగధ గురు పురములఁ
బుండ్ర వంగ భూముల పురములను కోశ
కారముల మఱియు రజ తాకరము లందు 13.

తే.గీ. వీని యందెల్ల నింపుగ వెదక వలయు
చూచుచు నచట నిచ్చట సుదతి సీత
నా రఘువరు భార్యను వసుధాధి నేత
దశరథుని కోడలిని మీరు ధరణి నెల్ల 14.

తే.గీ. కడలి మున్గిన కొండ లింక నగరముల
మందర గిరి శిఖరముల మసలు వారు
కలరు కప్పఁబడిన యట్టి కర్ణముల పె
దవులఁ జెవుల వా రేక పాదంపు నరులు 15.

చం. ఇనుప ముఖమ్ము వారలు నహీన జవమ్ముల వారు బల్లిదుల్
జనులు నరాశనుల్ పసిడి ఛాయ వెలుంగు తనుల్ కిరాతులుం
దనరఁగ జుట్టు కర్ణముల దాఁక ఝుషమ్ముల వండ కుండఁగాఁ
దినెడు జనాలి సుందరులు ద్వీప నివాసులు ఘోర కర్ములున్ 16.

తే.గీ. నీటి లోపలఁ జరియించు మేటి మగలు
విదితు లెల్ల నరవ్యాఘ్ర పదము చేత
వీరి యిండ్ల గిరుల లోన వెదకుఁడు నడ
క నయినను గెంతుచు మఱి నౌకల నయినను 17.

చం. వెలుఁగును సప్త రాజ్యముల వెండి పసిండి మయమ్ము కాఁగ న
న్నలుగడ సుందరంపు యవ నామపు ద్వీపము రత్నవంతమై
నిలయము స్వర్ణ రాసులకు నెమ్మది దీని నతిక్రమింపఁగా
నల శిశిరం బనంగ గిరి యంబర మంటెడు శృంగ పంక్తినిన్ 18.

చం. చెలఁగును దేవ దానవ నిషేవిత మీ గిరి దుర్గ కానన
మ్ముల సెలయేఱు లందు సతి భూమిజ నెల్లెడ లందు నింపుగాఁ
గలసి కపీంద్రు లార! వెదకం దగుఁ గాంతను రామ పత్నినిన్
లలిత యశస్వి నా జనక రాజ కుమారిని నుద్యమించుచున్ 19.

తే.గీ. అంత నెఱ్ఱని నది శోణ మనెడు దానిఁ
జేరి వేగవంతము సిద్ధ చారణ గణ 20.

సేవి తాబ్ధి దాటి తటులఁ జిత్ర వనము
లందు రావణు నవనిజ నరయ వలయు

తే.గీ. నగముల జనింపఁ గన్పడు నదులు పాఱఁ
దనరు చున్నవి యుద్యాన వనము లచట
వెతక వలయు మీ రెల్లఁ బర్వత గుహల వ
నముల యం దెల్లెడలను భృశముగఁ దిరిగి 21.

చం. కడలిని నున్న ద్వీపములఁ గాంచుఁడు భీమము లందు నెల్లెడం
గడలిని నూర్మి మంతమును గాలికి లేచి ధ్వనించు దాని న
క్కడ నిరతమ్ము భీమతర కాయులు రక్కసు లుంద్రు ఛాయనుం
బడసి సెలంగి లాగుదురు బ్రహ్మ యిడంగ ననుజ్ఞ నాఁకటిన్ 22.

ఉ. నల్లని మబ్బుఁ బోలు ఘన నాగ నిషేవిత వార్ధి తీర్థ మం
దెల్లరు నేఁగ ఘోష యుత మింపుగఁ గాంతురు రక్త వర్ణపుం
బెల్లగు లోహితం బనెడు పేరున వెల్గెడు నబ్ధి నేఁగగన్
మెల్లగఁ గొండ బూరుగును మేటి కుజమ్మును గాంతు రచ్చటన్ 23.

ఆ.వె. వైనతేయు నిల్లు నానా మణి విభూషి
తమ్ముఁ గాంతు రచట నెమ్మి విశ్వ
కర్మ చేయ నడరి కైలాస సంకాశ
ము హరి వర్యులార! మూరి యేఁగ 24.

ఆ.వె. ఇంక నచట గాంతు రేఁగ మందేహ నా
ము లసురులను వివిధము లగు రూప
ముల భయ మిడు వారి మూరి వ్రేలాడు చుం
డఁగ గిరుల శిఖరముల గిరి నిభులు 25.

తే.గీ. వారు సూర్యోదయము నందుఁ బ్రతి దినమ్ము
బ్రహ్మ మంత్రమ్ముల రవి తాపమ్ము మీఱ
జలము నందుఁ గూలి తిరిగి చలము నూని
లేచి వ్రేలాడు చుంద్రు తిరిగి చెలంగ 26.

కం. తెల్లని మబ్బుల బోలెడు
చల్లని క్షీరోద మేరు చనరానిది యై
యల్ల యల లెల్ల నట విల
సిల్లఁగ ముత్యాల దండ చెన్నుఁ గనఁబడున్ 27.

తే.గీ. అట్టి క్షీరార్ణవము మధ్య యద్రి ఋషభ
నామమున నుండు దివ్య గంధ యుత కుసుమ
రాజిత నగావృతమునై సరస్సొకటి సు
దర్శన మన రాయంచల దనరు నచట 28.

తే.గీ. అందు రజతంపుఁ బద్మము లడరు చుండి
హేమ వర్ణ కేసరముల నింపు గొలుపు
చుండు నా తటాకము నందు మెండుగను సు
దర్శనము నందు విరిసి సుందరతరముగ 29.

ఆ.వె. అందు జలకమాడ నచ్చరలు సురలు
యక్షు లింక కిన్నరాలి చార
ణులు ముదమ్ము వడసి నలినిలోన నరు దెం
తురు నిరంతరమ్ము తరలి యెల్ల 30.

తే.గీ. పాల సంద్ర మతిక్రమింపంగ నంత
శీఘ్రముగ నట వానర శ్రేష్ఠులు! కనఁ
బడును సర్వ భూతములకు భయ మొసంగు
నట్టి జలసాగరమ్ము మహాత్ములార! 31.

తే.గీ. అచటఁ గోప సంజనితపు టగ్ని గుఱ్ఱ
పుముఖ మూని పుట్టంగ సముద్ర మందు
నున్న సచరాచరము లన్ని మిన్నగ నగు
నన్న మంచు దానికి నందు రంద అవని 32.

కం. కని యా బడబాముఖ మఱ
చిన నసమర్థులు కడలి వసించెడు జీవుల్
వినఁబడు భూత నికాయము 33.

ల నాదములు నిత్యము జలరాశిని( దఱచై

ఆ.వె. స్వాదుజల వనధికిఁ బదుమూడు యోజన
ముల నుదీచి యందుఁ గలదు కనక
పర్వతమ్ము పేరు వడయంగ జాతరూ
పశిల యని మహాద్రి వరము కనుఁడు 34.

మ. చనినం గందురు పన్నగేంద్రు నచటం జంద్రాభ దీప్తాంశునిన్
ఘనునిన్ భూధరుఁ బద్మపత్రనయనున్ గ్రావస్థి తానంతునిన్
జన సందోహ నమస్కృతున్ ఘన ఫణిస్వామిన్ సహస్రాస్యునిన్
వన సంచార విలాసు లార! విమలస్వాం తేద్ధ నీలాంబరున్ 35.

కం. మూడు తలల తాలద్రుమ
మాడ వెలుఁగు స్థాపిత మయి యందము చిందం
బాడిగ వేదిక పైనను
గాడుపు మేపరి సిడమ్ము కాంచన మయమై 36.

ఉ. చేసిరి దేవతావరులు చెన్నుగ దానినిఁ దూర్పు దిక్కునన్
భాసిలు దాటఁగా నుదయ పర్వత మంతట హేమవంతమై
వాసిగఁ దాఁకుఁ గొండకొన వర్ధిలగన్ శతయోజనమ్ములన్
వేసర కాకసమ్మును స వేదిక స్వర్ణమయమ్ము వెల్గుచున్ 37.

ఆ.వె. వెలుఁగు బంగరు మయము లయి సూర్య నిభమ్ము
లు నయి దివ్యములు విరుల నడరుచు
సాలములు తమాల తాల తరులు కర్ణి
కార పాద పాది గణము లచట 38.

చం. పరఁగును జాతరూప మయ పర్వత శృంగ వరం బొకండు వి
స్తర మయి యొక్క యోజనము సౌమనసం బను శృంగ రాజమే
వర దశ యోజనమ్ముల యపారపు టెత్తును గల్గి యచ్చటన్
హరివరు లార! హర్ష మరయంగ నొసంగును మిక్కుటమ్ముగన్ 39.

తే.గీ. మున్ను పాద మొండు త్రివిక్రముండు విష్ణు 40.

వుంచి దీని పైన ద్వితీయ ముంచె మేరు
పర్వత శిఖరమ్ము పయినఁ బన్నుగఁ బురు
షోత్తముఁడు హరి వరులార! యుత్సహించి

తే.గీ. మూరి చుట్టి జంబూ ద్వీపమును దరలుచు
నుత్తరముగ దివాకరుఁ డత్తఱి నరు
దెంచి శిఖరమ్ము నింపుగ మించి తా న
గపడు నత్యధికమ్ముగఁ దపనుఁ డవని 41.

ఆ.వె. వాలఖిల్యు లింక వైఖాన సాఖ్య మ
హర్షు లగపడుదు రహ రహ మచట
సూర్య వర్ణ తనులు సుప్రకాశులు తప
స్వులు మహోన్నతులు విబుధులు ఘనులు 42.

ఆ.వె. దీనిముందు నున్న ద్వీప మది సుదర్శ
న మను పేరున విశదము భృశమ్ము
సకల జీవరాశి చక్షువులును దేజ
మయి ప్రకాశ మొసఁగు నా యినుఁ డిట 43.

కం. వెదకుఁడు రావణు తోడుత
సుదతి జనక నందనను విశుద్ధ చరిత్రం
బదిలముగ గిరుల శిఖరము
ల దరుల వన రాజు లందు రమణీ మణినిన్ 44.

కం. తొలి సంధ్య యరుణ కాంతుల
వెలుంగు నధికముగఁ బసిడి పృథ్వీధర కాం
తులను మహాత్ముని రవి కాం
తుల చేత నిరంతరమ్ము తూరుపు దిశలో 45.

ఆ.వె. మున్ను భూమి కింక భువనములకు ద్వార
ముగ నొనర్పఁ బడియెఁ దగ నిట నుద
యింప భాస్కరుండు నిద్దాని పిల్తురు
తూర్పు దిక్కనంగ నేర్పు తోడ 46.

ఆ.వె. దీని గిరుల వెనుక తిరిగి గుహల నిర్ఘ
రముల నెల్లయెడల రమణి సీత
నెల్లరు వెదకవలె నింపుగ రావణు
నా దశాస్యుఁ గూడ నార్యులార! 47.

ఆ.వె. దీని పైనఁ దూర్పు దిశ చొర రానిది
యమర వరుల చేత నాక్రమింపఁ
బడును దిమిర మెల్లఁ బరఁగు నెల్లెడ లందు
సూర్య చంద్రు లిచటఁ జూడ రారు 48.

ఆ.వె. పర్వతమ్ము లందు వను లందు నింకను
గందరమ్ము లందు నంద అడరి
వెదక వలయు మీ రనుదిత దేశము లందుఁ
గూడ సీతను సతిఁ దోడుగఁ జని 49.

కం. చన శక్యం బింత దనుక
నినుఁ డుండఁడు పార ముండ దిది దాటంగన్
వనచర పుంగవులారా!
మన కింక నగోచరములు మహి విషయంబుల్ 50.

కం. పరికించి జానకీ సతి
ని రావణుని యాస్పదమ్ము నెల నిండంగాఁ
నరుదెంచ వలయు నిట కె
ల్ల రుదయ గిరి చేరి యంత రయమున వినుఁడీ 51.

కం. నెల దాఁటిన నిలువ వలదు
నిలిచితి రేని మరణమ్ము నిక్కము సుండీ
ఫల మంది రండు కని మై
థిలి హరివరులార! వేగ తిరిగి యిచటకున్ 52.

తే.గీ. ఇంద్రునకుఁ బ్రీతి కరమైన యీ వన చయ
విలసితంపు దిక్కున మీరు వేగ తిరిగి 53.

నైపుణమ్మున నరసి జానకిని రామ
దయిత రండు సుఖమ్ముఁ బొంద నగు భృశము

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువదవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 41.

తూర్పు దిక్కునకు వానర బలమును బంపి యంత సుగ్రీవుఁడు హనుమంతుని జాంబవంతుని నీలుని మున్నగు వానర పుంగవుల నొసఁగి యంగదుని దక్షిణ దిక్కున సీతను వెదకుటకుఁ బంపుట. వీరికిని నెల దినముల గడువు నొసఁగుట.

కం. అనిపి మహా వానర బల
మును దక్షిణ దిశకు ననిపె భూరి బలుం డా
యినజుండు సుప్రసిద్ధ క
పి నాయకుల నెల్ల నంత వెదకఁగ సీతన్ 1.

ఉ. నీలుని యగ్నిహోత్రు సుతునిం గపి వీరుని నాంజనేయుఁ దో
ర్వేలుపు పుత్ర రత్న మగు వీర వరేణ్యుని జాంబవంతు నా
భీల బలున్ సుహోత్రుని వివేకుఁడు నా శరగుల్మ నామునిం
జాల బలుండు నగ్గజునిఁ జారు గవాక్షు సుషేణు నింకనున్ 2.

తే.గీ. గవ వృషభ శరారి విజయ గంధమాద
నులను మైందుని ద్వివిదు ననల కుమారు
లిరువు రుల్కాము ఖాసంగు లిద్ధ బలుల
నంగద ముఖ వీర వరుల ననిపె ఘనుల 3.

తే.గీ. వీర విక్రమ సంపన్న విలసితులకు 4.

నంగదునిఁ జేసి సుగ్రీవుఁ డగ్రతస్స
రునిగ నాదేశ మొసఁగెను జనఁగ దక్షి
ణ దిశ కెల్లరకుఁ బ్లవగ నాథుఁ డపుడు

కం. కపి నాథుఁడు వివరించెను
గపి వీరుల కా వలనునఁ గల దుర్గమముల్
విపులమ్ముగ నెల్లరకుఁ దె
లుపంగఁ దలపోసి యంత రుచిరముగ నిటుల్ 5.

ఉ. వేయి కడింది శృంగముల వింధ్యను సాల లతావృతమ్ము నా
యాయత తీర నర్మదను నాపగఁ బన్నగ రాజ సేవితం
దీయని నీటి గౌతమిని దివ్య మహానదిఁ గృష్ణవేణినిం
దోయ విశుద్ధమౌ వరదఁ దోరము సర్పము లాక్రమింపఁగన్ 6.

తే.గీ. మేఖ లోత్కల పురముల మేటి నగర
మా దశార్ణము పిమ్మట నశ్వ యుక్త
పుర మవంతినిఁ జూడుఁడు మూరి యెల్ల
రింపుగను హరి వరులార! యింక నేఁగి 7.

తే.గీ. వర విదర్భ ఋషిక లందుఁ దరలి మాహి
షకము లందు వంగ కళింగ నికటములను
గౌశికప్రదేశముల నగ సనదీ గు
హా సహిత దండకా వని నరయ వలయు 8.

తే.గీ. మఱియు గోదావరీ తటిఁ దఱచుగఁ గన
వలయు నాంధ్ర పుండ్ర తటుల వఱలి చోల
పాండ్య కేరల దేశ విభాగములను
వానరేంద్రులార! వెదక వలయు నెల్ల 9.

చం. కపివరులార యేఁగఁగను గాంతు రయోముఖ పర్వతమ్ము నె
ల్లపుడును ధాతు మండితము రమ్య శిఖావృత చిత్ర పుష్పిత
మ్ము పరఁగి కాననమ్ము లట మోద మొసంగును జందనాట వీ
ర్ధ పరిసరమ్ములం వెదకఁ దద్దయు నొప్పును మీకు నింపుగన్ 10.

ఆ.వె. కన నగు నట నంతఁ గావేరిఁ బన్నుగ
విమల జల యుతము పవిత్ర నదిని
సంతసమ్ము మీఱ సంచరింతు రచట
నప్సరసలు నిత్య మడరు చుండి 11.

కం. రవి సన్నిభుం డగస్త్యుఁడు
ఛవిఁ దేజస్వి మలయ గిరిఁ జక్కగ నిలువం
గ విబుధు మహర్షి సత్తము
సవినయముం గని నతు లిడి సంయమి కంతన్ 12.

ఆ.వె. అమ్మహాత్ము నాజ్ఞ నెమ్మిఁ బడసి ప్రస
న్నుని హరీంద్రులార! ఘన నదీ మ
తల్లి తామ్రపర్ణిఁ దరియింప వలయు గ్రా
హగణ సేవితమ్ము నంద అంత 13.

తే.గీ. దివ్య చందన తరువుల భవ్యముగ వె
లుంగ ద్వీప వంతపు టీ తరంగిణి తమిఁ
జేరు సాగరమ్మును గాంత మూరి తనదు
కాంతుఁ జేరు విధము దోఁప సంతసమున 14.

ఆ.వె. దాఁట నదినిఁ గాంత్రు మేటి పాండ్య నృపుల
ద్వార రాజము నటఁ బసిడి మయము
ముత్యముల మణుల విభూషితమును దివ్య
మైన దాని వాన రాగ్ర్యులార! 15.

ఉ. చేరి సముద్ర మంత నెదఁ జింత యొనర్పుఁడు యుక్త కార్యమున్
మూరి యగస్త్యుఁ డుంచె ఘన భూజ విరాజిత శైల రాజమున్
వారిధి జాతరూప మయ పర్వత మందు మునుంగి నిల్వఁగన్
భూరి మహేంద్ర పర్వతము మున్ను మహోన్నతమున్ స్థిరమ్ముగన్ 16.

శా. నానా వృక్ష ల తాభిశోభితము నానా దేవ మౌనీంద్ర సం
తా నారాధ్యము నప్సరో రమలు నిత్యం బుంద్రు యక్షాళితో 17.

దానిం గందురు సిద్ధ చారణులు హృద్యంబున్ సు రమ్యాద్రినిం
దా నింద్రుం డట పర్వ పర్వములఁ జెంతం జేరు వీక్షింపఁగన్

తే.గీ. దాని కావలి యొడ్డునఁ దనరు నొక్క
దీవపము శత యోజనముల విరివి మనుజు
లకు నగమ్యమ యెల్లెడల వెదకుండు
మీర లెల్ల రింపుగ హరులార! మించి 18.

తే.గీ. మైథిలిని విశేషించి సమంచితముగ
వెదకుఁ డచట వధ్యుం డవివేకి కడు దు
రాత్ముఁ డింద్ర సన్నిభుఁడు దశాననుండు
రావణుం డుండు నచ్చట రాక్షస పతి 19.

ఆ.వె. దక్షిణ జలరాశి తన్మధ్యమున నొక్క
రక్కసి వసియించి యుక్కునఁ దగ
ఛాయ నొడిసి పట్టి సయ్యన నంగార
క తిను చుండు జీవ కాయములను 20.

కం. శంకల నెల్లం దగ ని
శ్శంకలుగ నొనర్చి వీత శంకల నింకం
బంకజ లోచను పత్నినిఁ
బంకజ నేత్రను వెదకుఁడు పావని సీతన్ 21.

ఆ.వె. లంక దాటి యేఁగ నింకను వంద యో
జనములు కడలి సిరిఁ జాల వెలుఁగు
సిద్ధ చారణులు వసించు పుష్పితకం బ
ను గిరి వర మొసఁగుఁ గనులకు విందు 22.

చం. సమ మయి చంద్ర సూర్యులకు సాగర తోయము నిండియుండఁగా
భ్రమ కలిగించు నంబరముఁ బన్నుగఁ దాఁకు ననంగ మీటి శృం
గములను సూర్యుఁ డుండ నొక కాంచన శృంగము నందు రిక్కతోఁ
డమరి వెలుంగు వెండి కొన యం దపరమ్మునఁ బాండురమ్మునన్ 23.

ఉ. దానిఁ గనంగఁ జాలరు కృతఘ్ను లు క్రూరులు నాస్తికుల్ మహిన్
దాని కొసంగి వందన శతమ్ములు వానరులార! రోయుఁడీ
పే నడవం జతుర్దశ సుభీకర యోజనముల్ గనంబడున్
మానుగ సూర్యవంత మను మాన్య నగమ్ము దురాసదం బటన్ 24.

ఉ. దాని నతిక్రమింపఁ దగ దర్శన మిచ్చును వైద్యుతంబు నా
మానిత పర్వతేంద్రము సమంచిత నిత్య ఫలావృతమ్ము నై
యాని ఫలాలి మూలముల నచ్చటఁ దియ్యని తేనె లింపుగం
బానము సేసి చాగ వలెఁ బన్నుగ ముందుకు మీర లెల్లరున్ 25.

ఆ.వె. కనుల కింపు నొసఁగఁ దనరు నచటఁ గుంజ
రం బను గిరి వరము రమ్యముగను
విశ్వకర్మ కృతము వేశ్మ మగస్త్యున
కట వెలుంగు చుండు నందముగను 26.

తే.గీ. యోజనము వెడలుపు పది యోజనములు
దనర నెత్తున దివ్య కాంచన మణి మయ
మైన దా యగస్త్య మునీంద్రు నాలయమ్ము
పొదగఁ బడెను నానా రత్న ములు భృశమ్ము 27.

చం. చనఁ జనఁ గంద్రు భోగవతి సర్ప గృహమ్ముల పట్టణమ్మునున్
ఘనముగ రక్షితమ్ము ఫణి కాయము చేత మహావి షాహులం
జనుటకు వీలు కానిది విశాల కవాటము లుండఁ దీక్ష్ణ దం
ష్ట్ర నిచయ సర్పరక్ష ఫణి రా జగు వాసుకి యుండుఁ బ్రాజ్ఞుఁడే 28.

తే.గీ. వెడలి భోగవతి కచట వెదక వలయు
ను దదనంతర దేశములఁ దనరి ధృతి
నెల్ల యెడ లందు హరులార! యింకఁ దరలి
ఋషభ గిరి వృషభ నిభము నెలమిఁ గనుఁడు 29.

తే.గీ. రత్న మయపు టా గిరి యందు రమ్య చంద
న తరులు సముద్భవించును వితత వర్ణ
ములను గోరోచన హరితము లీకఁ బద్మ 30.

కములు నన లారుణములు దివ్యములఁ దనరి

కం. కనరా దంటఁ దగదు చం
దన ద్రుమమ్ములను మీరు తద్వన రాజ
మ్మును రోహితు లను గంధ
ర్వ నిచయ మతి ఘోర బలులు రక్షింత్రు తమిన్ 31.

తే.గీ. నిలిచి శైలూషుఁడును గ్రామణి మఱి శిగ్రు
వింక శుభ్రుఁడు  బభ్రువు సేవు రుంద్రు
ఘనులు గంధర్వ వరులు  భాస్కర సితకర
వహ్ని తను పుణ్యకర్ములు వాసి కెక్కి 32.

ఆ.వె. అంతఁ బుడమి కెల్ల నంతము దుర్ధర్షు
లైన స్వర్గ జితుల యాలయమ్ము
మీకు నేఁగఁ దగదు మించి యింక నతి దా
రుణ మయిన పితరుల లోక ముండు 33.

ఆ.వె. యముని రాజధాని యగు నిది చొరరాని
చీఁక టలమి యుండుఁ జేర రాదు
మీకు వెదక రాదు మించి చరించు వా
రికి గతి యిఁక లేదు సుకపు లార! 34.

కం. సకల ప్రదేశములను వె
దకి కనఁబడు నితర చోట్లఁ దప్పక సతి జా
నకి శోధించి యెఱిఁగి యిచ
టకు రా నర్హులు దిరిగి తడయక రయమునన్ 35.

కం. కంటిని నే సీత ననుచు
నింటికి నెలలోన వచ్చి యే రను దా ని
ష్కంటక సుఖమ్ములఁ జెలఁగు
వింటిరె మత్సమ విభుఁ డయి వెను భోగములన్ 36.

ఆ.వె. అతని మించి ప్రియుని నరయ నతండు ప్రా 37.

ణమున కెక్కు ఁ డగును నాకుఁ దప్పు
లెన్ని చేసిన నతఁ డెలమి బంధు వగును
సంతతమ్ము లేదు సందియమ్ము

తే.గీ. బల్లిదులు పరాక్రములు మీ రెల్లరు గుణ
వంతు లుత్త మాన్వయ సముద్భవులు మించి
రాజ కన్య దొరకు భంగి నోజ పెదకఁ
బురుష కార్యము మొదలిడ మూర వలయు 38.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది యొకటవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 42.

దక్షిణ దిక్కున పెదక వానరుల నాదేశించి సుగ్రీవుఁడు కపి ముఖ్యుని సుషేణుని తారా సతి తండ్రిని వానర సమూహముతోఁ బడమటి దిశకు సీతాన్వేషణమునకై పంపుట. వీరికిని నెల దినముల గడువు నొసఁగుట.

కం. హరివీరుల దక్షిణ దిశ
కరుగ ననిపి మేఘ సదృశు నరసి సుషేణున్
హరి యూథపు సుగ్రీవుఁడు
స్థిరముగ వచియించె నిట్లు ధీనిధి యంతన్ 1.

కం. తన మామను దారా జన
కునిఁ జేరి నమస్కరించి గురు విక్రమునిన్
వినయాంజలుఁ డయి తాఁ బ
ల్కెను వాక్యజ్ఞుండు ఱేఁడు గిర లిట్బంగిన్ 2.

మ. రిపు వీరఘ్ను మరీచి నందనుని నర్చిష్మంతు మారీచునిం
గపి సంఘావృతు నింద్ర సన్నిభుని మే కాంతిప్రభా రాసులన్
విపులజ్ఞాన పరాక్ర మోత్తము మహా వీరున్ గరుత్మంతుఁతో
నుపమా నార్హునిఁ దేజ మందుఁ గని యన్యోద్దండ మారీచులన్ 3.

తే.గీ. ఋషి మరీచి కుమారుల నెల్లరను మ
హా బలులను నర్చిర్మాల లనఁగఁ బరఁగు
వారిఁ గాంచి యాదేశించెఁ బడమటి దిశ
కేఁగ వలయు నంచు వచించి యివ్విధముగ 4.

తే.గీ. రెండు వందల వే లుండ నండ వాన
రులు సుషేణుతో మీరు కదలి రయమ్ము
న జనకాత్మజఁ గాంచఁ జనఁ ద్వరపడుఁడు
వాన రోత్తములార! సత్వరమ యిపుడు 5.

తే.గీ. రమ్య బాహ్లీకముల సురాష్ట్రమ్ము లందుఁ
జంద్ర చిత్రముల విశాల జనపద పుర
తతులఁ గేత కోద్దాలక వితత వకుల
సహిత పున్నాగ వృతముల రహి వెదకుఁడు 6.

చం. తనరును శీత వారుల నదమ్ములు పశ్చిమ మెంచి పాఱుచున్
మునివరు లుండు కానలను భూజయు తాద్రుల బీడుభూములం
జనఁ గడు దుర్గమమ్ము లగు శైల చయమ్ముల నుండ శృంగముల్
వినుఁ దగ నంటుచుండు గతి వే పరికింపుడు పశ్చిమమ్మునన్ 7.

ఉ. కాంచుఁడు పశ్చి మాంబుధినిఁ గ్రన్నన నా తిమి నక్ర సేవ్యమున్
మించి చరించి యంత నట మేటి జలమ్ము నకంపితమ్మునుం
గాంచుడు సంచరించుచు సుఖమ్ముగఁ గేతక సత్తమాల భూ
జాంచిత కాననమ్ములను నారయుఁ డింపుగ నారికేలముల్ 8.

ఉ. వారిధి తీర దేశములఁ బర్వత పంక్తులఁ గాననమ్ములం
జేరి జటీ పురమ్ము మురచీ నగరమ్ము నవంతి లోపలన్
మూరుచు నంగలోప యను భూతల మందు నగోచరమ్ములన్ 9.

నారిని సీత నారయుఁడు నైపుణి నెల్లరు రావణౌకమున్

తే.గీ. సింధు సాగర సంగమ చిత్ర తటిని
హేమగిరి నా బరఁగి కూడి యింపుగ శత
శృంగములను వృక్షమ్ములు సెలఁగఁ బెక్కు
పర్వ తేంద్ర మొండు కల దఖర్వ మరయ 10.

ఆ.వె. పక్షము లడరంగఁ బంచాస్యములు రమ్య
శైల సానువులను సంచరించి
నక్ర మత్స్య కరుల విక్రమమునఁ దెచ్చి
గుహల నిల్పు చుండుఁ గోరి యెల్ల 11.

ఆ.వె. తనిసి మత్త కరులు ఘన నిస్వ నాభ స్వ
నములఁ దిరుగు చుండును మృగరాజ
గుహల భీతి లేక యహరహము జల స
మృద్ధ జగము లందు మించి యచట 12.

కం. దివి నంటు పసిడి కొనఁ జి
త్ర వృక్ష విలసితము నందుఁ దనరుచు వెదకుం
డు వడి వడిఁ గామ రూపులు!
ప్లవగ వరులు! సర్వ దిశల వైదేహిఁ దమిన్ 13.

కం. శత యోజన విస్తృత మా
తత శృంగము పారియాత్ర ధాత్రీధరమున్
వితతము దుర్దర్శము జల
ధి తోయములఁ గాంతురు చన దివ్యము నచటన్ 14.

కం. ఇరువది నాలుగు కోటుల
వర గంధర్వు లన లాభ పరమ తపస్వుల్
గురు ఘోర కామరూపులు
హరివరు లార! వసియింతు రచ్చట నిరతిన్ 15.

కం. దరి చేర రాదు సుమి వా 16.

నరు లతి విక్రము లయిన ననల తుల్యుల మీ
రరసిన సహస్ర సంఖ్యల
నరుసమ్మునఁ గలిసి యుండ హరి వరు లారా!

తే.గీ. అచట నున్న ఫలము లించు కయినఁ బ్లవగ
పుంగవులు! మీర లెవ్వరు ముట్ట రాదు
సత్త్వవంతులు వీరులు చాల బలులు
విక్రములు దురాసదు లట పేచి యుంద్రు 17.

ఆ.వె. వారి వలన భయము వానరుల పగిది
నున్నఁ గొంచె మయిన నుండ దచట
నుద్యమించి వెదక నొప్పు సీతను మీరు
హరి వరేణ్యులార! యంచితముగ 18.

తే.గీ. అచట వైడూర్య వర్ణము నందు వజ్ర
సన్నిభము వజ్ర నామపు శైల ముండు
ద్రుమ లతా యుత శత యోజనముల గుహలఁ
దివిరి వెదక వలయు మీరు ధృతిని నచట 19.

చం. పరఁగును జక్రవంత మనఁ బర్వత మబ్ధి చతుర్థ భాగమం
దరయఁగ వేయి యంచుల మహా శిత చక్రము విశ్వకర్మ తా
నురువుగఁ జేసెఁ బ్రీతిఁ బురుషోత్తముఁ డా హరి దానవేంద్రు లి
ర్వుర హయకంఠుఁ బంచ జనుఁ ద్రుంచి గ్రహించెను చక్ర శంఖముల్ 20.

కం. ఆ గిరి సానువుల విచి
త్రాగముల విశాల గుహల నా రావణునిన్
వేగమ వైదేహిని నటఁ
జాగుచు వెదక వలయు హరి సత్తములారా! 21.

తే.గీ. కాంచన శిఖల శ్రీమంత మంచితం బ
రువది నాల్గు యోజనముల రుచిర మగు వ
రాహ నామ పర్వతము గల దచట వరు
ణాలయ మగాధ మందు మహాద్భుతముగ 22.

ఆ.వె. బంగరు మయ మైన ప్రాగ్జ్యోతిష పురము
వెలయు చుండు శైల తలము నందు
నరక నామ దుష్టతర దానవుండు వ
సించు చుండు నందుఁ బించ మడర 23.

కం. ఆ గిరి సానువులను ర
మ్యాగముల విరివి గుహల దశానను నింకన్
వేగమ వైదేహిని నటఁ
జాగుచు వెదక వలయు హరి సత్తములారా! 24.

ఆ.వె. పసిడి తోడ కరము వఱలెడు గుహ లుండు
నా నగమ్ము దాట నగపడు సెల
యేఱులు ప్రవహింప నెల్లెడల వెలుంగు
పర్వతమ్ము పరము స్వర్ణ మయము 25.

ఆ.వె. అచట నా ధ్వని విని యఱచు దర్పమ్మున
గర్జ లిడి వరాహ గజము లింక
సింహ రాజములు నశేష సంఖ్యల వ్యాఘ్ర
ములు నిరంతరమ్ము మూరి గిరిని 26.

కం. హరిహయ విభవుం డా పా
క రిపుండు మహేంద్రుఁ డచట కమనీయముగా
సుర లభిషిక్తునిఁ జేయఁ ద
నర నా గిరి మేఘవంత నగ మన వెలిఁగెన్ 27.

చం. అఱువది వేల కాంచన మయాద్రులు, వాసవ పాలి తాద్రినిన్,
వఱలఁగ బాలభాను నిభ వర్ణములం దగ భ్రాజమానముల్
తఱచుగ స్వర్ణ వర్ణములఁ, దాఁటిన నంతటఁ, బుష్పితమ్ములై
మెఱసెడు వృక్ష రాజములు మీఱఁగ నింపుగ నంతఁ గన్పడున్ 28.

ఆ.వె. వాని మధ్య నిలిచి కానఁబడును మేరు
వుత్తరమున శైల సత్తమమ్ము 29.

సుప్రసన్నుఁ డైన సూర్యుఁ డొసంగె వ
రమ్ము మున్ను నగ వరమున కిట్లు

తే.గీ. నా కరుణ శైలరాజమ! నీ కడ నిలి
చినవి యెల్ల సతము విలసిల్లు పసిడి
చాయ దేవ గంధర్వ దైతేయు లెల్ల
రక్త కాంచన ప్రభల వెల్గఁ గల వారు 30.

చం. వసువులు విశ్వదేవతలు వచ్చి మరుత్తులు నాదితేయులున్
వెస మలు సంజ భాస్కరునిఁ బ్రీతి నుతింతురు మేరు శృంగికిన్
దిస కిఁక పశ్చిమమ్మునకు దేవ గణాదుల పూజ లంది వే
గ సని యదృశ్యుఁడౌఁ గదిసి కంజహితుండు మ హాస్త శైలమున్ 31.

కం. పది వేల యోజనమ్ముల
నుదరి ముహూ ర్తార్ధ మందు నుత్సాహమునం
గదలి రయమ్మునఁ జేరికొ
ను దివాకరుఁడు నగ తతులను ప్లవగు లారా! 32.

తే.గీ. దివ్య భవనము సూర్య సదృశము విశ్వ
కర్మ నిర్మింప మేటి శృంగమున వెలయు
చుండుఁ బ్రాసాద గణ పంక్తి శోభితమ్ము
నై యచట నమ్మహా గిరి యందు భృశము 33.

ఆ.వె. పాశ హస్తుఁ డైన వరుణుండు వసియించు
నా గృహ వర మందు నది విచిత్ర
నగములు దనరంగ నానా విహగ సమా
కులమునై వెలుంగు లలితముగను 34.

కం. అడరును మేర్వస్త గిరుల
నడుమను గాంచన మయంపు నగ రత్నంబే
పడసి పది తలలు వేదికఁ
గడు రమ్యము తాల తరువు కపివరు లారా! 35.

కం. నదుల సరస్సుల నన్నిం
ట దుర్గమములం దివిరి పడతి వైదేహిన్
వెదక వలయు రావణు వెత
త దురాత్ముని తోడ నింకఁ దడయక తమినిన్ 36.

కం. వసియించును ధర్మజ్ఞుం
డసమాన తపో ధనుండు నజ తుల్యుండున్
దెస లందు మేరు సావ
ర్ణి సుప్రసిద్ధుఁడు కడింది నిజ తేజమునన్ 37.

ఆ.వె. ఆ రవి నిభ తేజు మేరుసావర్ణినిఁ
గని నమస్కరించి వినతి శిరసు
వంచి సీత జాడ నంచితముగ నడు
గ వలయును మొగిడ్చి కరము లెలమి 38.

కం. జనులకు నింత దనుక రవి
దినమున తిమిరమ్ముఁ బాపి దిశలను నెల్లం
జను నస్తాద్రికి నిత్య
మ్ము నిర్వ్యధము భాస్కరుండు పుణ్యాత్ముండై 39.

కం. చన శక్యం బింత దనుక
నినుఁ డుండఁ డపార మెల్ల నిట మీ దింకన్
వనచర పుంగవులారా!
మన కింక నగోచరములు మహి విషయంబుల్ 40.

కం. పరికించి జానకీ సతి
ని రావణుని యాస్పదమ్ము నెల నిండంగా
నరుదెంచ వలయు నిట కె
ల్ల రస్త గిరి చేరి యంత రయమున వినుఁడీ 41.

కం. నెల దాఁటిన నిలువ వలదు
నిలిచితి రేని మరణమ్ము నిక్కము మీతోఁ
గలసి మహా శూరుండు త 42.

రలు నా మామ హరి వరుఁడు రయమున నింకన్

చం. ఉదిత సమస్త కార్య కరు లుత్తమ వీరులు తాను చెప్పి న
ట్టిది తగఁ జేయ నర్హులు కడింది బలుం డగు నాదు మామ మీ
రుదరి పరాక్రమోత్తముల రుర్వి మహాభుజు నిష్టు కార్య శ్రే
ణిఁ దనరి వీని నాథునిగ నిల్పి ప్రతీచినిఁ గాంచుఁ డెల్లెడన్ 43.

చం. కన ఘన తేజు భార్య నుపకారికిఁ బ్రత్యుపకార మింపుగా
నొనరిచి నట్టి వారలమె యోడక వానర వర్యు లార! యిం
కను నితరంపుఁ గార్యమును గాలము దేశము సెన్నుచున్ హిత
మ్ము నొసఁగు నట్టి దెల్లరును బూని యొనర్పఁగ నుద్యమింపుఁడీ 44.

కం. విని సుగ్రీవు నిపుణ గిర
ల నా సుషేణ ప్రముఖులు ప్లవగ వరేణ్యుల్
గొని ప్లవ గాధిపతి యనుమ
తి నేఁగి రా వరుణ గుప్త దిశ కంత వెసన్ 45.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది రెండవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 43.

శ్వశురుని సుగ్రీవుఁడు పశ్చిమ దిక్కనకుఁ బంపి శతవలి యను వాన రోత్తముని శత సహస్రాధిక వానర సత్తములతో నేఁగి యుత్తర దిక్కున సీతాన్వేషణము సేయు మని పంపుట.

తే.గీ. తనదు మామ నాదేశించి తగఁ బ్రతీచి
కేఁగ మంచు సుగ్రీవుఁ డహీన సత్త్వుఁ
డరసి శతవలి నాముని హరివరేణ్యు 1.

నిజ హితమ్ము రామ హితము సెగడ ననియె

చం. అరుగుమ త్వద్విధుల్ శతసహస్ర వనౌకసు లుండ, దోడుగా
హరివర! స్వీయ మంత్రులు సహాయులు గాఁగ యమాత్మజాలితోఁ
దిరిగి యుదీచి నం దడరి దివ్య హిమాద్రి సమీప భూములన్
ధరణిజ రామ పత్నినటఁ దప్పక శోధన సేయుఁ డెల్లరున్ 2.

ఉ. వచ్చినఁ గాంచి జానకినిఁ బన్నుగఁ జేయఁ బ్రియమ్ము నివ్విధిం
జెచ్చెర రాఘవేంద్రునకుఁ జెన్నుగఁ దీరు ఋణమ్ము లెల్లఁ దా
నెచ్చెలి ప్రీతినిన్ మనకు నిల్పి స్వవాక్య మొసంగె మిక్కిలిం
గ్రచ్చఱ సేయ రామునకుఁ బ్రత్యుపకారము పండు జన్మముల్ 3.

తే.గీ. వేఁడి నట్టి వారికిఁ జేయఁ బ్రియము మున్ను
వారు సేయ కుండినను సఫల మగు నన
జన్మ మింకఁ జెప్పగ నేల సాయము నొన
రించి నట్టి వారికిఁ జేయుఁ డంచు నెందు 4.

కం. నివ్వటిలఁ జేసి మతి మీ
రవ్విధి నాహితము గోరు హరివరు లారా!
యెవ్విధి వైదేహి దొరకు
నవ్విధముగ వెదక వలయు నవనిజఁ బ్రీతిన్ 5.

కం. భూతముల కెల్ల మాన్యుం
డాతత భుజుఁడు నృవరుండు నఖిలారి జన
వ్రాత పురంజయుఁడు దనరఁ
బ్రీతి భృశముగ మన యందు వెస నరుదెంచెన్ 6.

కం. పరికింపుడు దుర్గమ్ముల
నరణ్యముల గిరుల నడుమ నడరుచు మీ రె
ల్లరు బుద్ధి విక్రమమ్ముల
ధరలో సంపన్నులరు నుత బలోపేతుల్ 7.

సీ. అందు మ్లేచ్ఛులును బులిందులు శూరసేనులు ప్రస్థలులు భరతులు కురులును

గలయ మద్రకులును గాంభోజులు యవనులు శకులు బాహ్లికులు ఋషికులును
బౌరవు లింకను శూర టంకణు లిక౯ జీనులును బరమ చీనులు మఱి
నీహార దరదులు నిలుచు జగమ్ముల హిమవంతముల యందు  నెలమి మీరు
తే.గీ. లోధ్ర పద్మక దేవదారు ఘన షండ
ములను మఱియు సెల్ల యెడల మూరి వెదక
వలయు హరివరు లార! రావణుని తోడ
రామపత్ని జానకి నవిరామముగను 8.

తే.గీ. దేవ గంధర్వ సంచయ సేవితమ్ము
సోము నాశ్రమమ్మును జేరి చూచి కాల
మను గిరి నట గుహల సెల లందు సాను
వుల నవనిజను బరికింప వలయు ధృతిని 9.

ఆ.వె. హేమ గర్భ పర్వ తేంద్ర మతిక్రమిం
చి హరులార! యింక౯ జేర నగు సు
దర్శన గిరివరము  దా౯టి కాంచు౯డు దేవ
సఖు౯డు నా౯గ౯ దనరు శైల వరము 10.

తే.గీ. విహగములు పాదపమ్ములు పెక్కు విధము
లున్న యచ్చటి వను లందు నుదక రాసు
లందు గుహ లందు౯ బరికింపు౯ డసురు తోడ
రామపత్ని జానకి నవిరామముగను 11.

తే.గీ. దా౯ట దానిని వచ్చు రిక్త ప్రదేశ
మొండు వంద యోజనముల కొండలు నదు
లు తరువులు లేని దేశము రోమ హర్ష
ణమ్ము దాని దా౯ట వలె శీఘ్రమ్ముగాను 12.

కం. అంతం గైలాసమ్మును
గాంతురు పాండుర మయము నగ వరేణ్యంబున్
సంతస ముప్పొంగును గని
నంతనె హృదయమ్ము లందు హరివరు లారా! 13.

ఉ. తెల్లని మబ్బు నా దనరు తీరున బంగరు పూఁతతోడుతన్
సల్లలితమ్ము నిర్మితము సద్మ వరేణ్యము విశ్వకర్మచే
నల్ల కుబేరు సౌధమును నారయ వచ్చు సరోవ రావృతం
బెల్లెడ నుండఁ బద్మములు నింకను హంసలు నప్సరో రమల్ 14.

ఆ.వె. అచ్చట నివసించు యక్ష రాడ్వరుఁడు కు
బేరుఁడు ధనదుండు వెలయ గుహ్యా
కులు సమీప మందు నలరి వైశ్రవణుండు
జన నమస్కృతుండు సద్గుణుండు 15.

తే.గీ. అచటఁ జంద్ర నికాశము లద్రు లందు
నింక గుహ లందు నింపుగ నెల్లెడలను
హరి వరేణ్యులు! పరికింపుఁ డసురు తోడ
రామపత్ని జానకి నవిరామముగను 16.

చం. చని చని చేరి క్రౌంచ మను శైలము దాని బిలమ్ము నింపుగం
గని తగ నప్రమత్తులయి కష్ట తరం బది సేర నంచునున్
జనులు వచింతు రేఁగఁ దగుఁ జక్కఁగ నందు ని నాభ కాంతులన్
మునులు వసింత్రు దేవ సమ మూర్తు లమర్త్య గ ణార్చితుల్ ఘనుల్ 17.

తే.గీ. క్రౌంచ శిఖరముల గుహల రమ్య సాను
వుల నితర శృంగములను గిరుల నడుమను
నిర్దరముల నచ్చ టచట నిఖిల దేశ
ములను వెదక వలయు మీరు మూరి భృశము 18.

చం. తరువులు లేని కామ గిరి తాలిశ రత్నము మానసమ్మునుం
బరఁగు ఖగమ్ము లెందుఁ దమి వాని దరిం గదియంగ లేరు ని
ర్జరులును దాన వాసురులు సర్వజ నావలి యెన్నఁ డేనియున్
గిరి తటు లందుఁ జూడుఁ డటఁ గృత్స్న ము దాఁటఁగఁ గ్రౌంచ శైలమున్ 19.

తే.గీ. కాంతు రచట మైనాక నగ వర మందు
మయుని దానవు భవనం బరయ నగును స్వ
యంకృతమ్మును సానువు లందు గుహలఁ 20.

గిన్నరుల నిండ్లఁ బరికింపుఁ డన్ని దిశల

ఉ. ఆ నగ ముత్త రింపఁగ వరాశ్రమ మచ్చట సిద్ధ సేవ్యమై
కానఁగ నౌను దాపస నికాయము సిద్ధులు వాస ముంద్రు పై
ఖానస వాలఖిల్యులు నకల్మషు లెల్లరు సర్వ వంద్యులున్
మానుగ సీత వృత్తమును మాన్యుల నడ్గుఁడు మ్రొక్కి నమ్రతన్ 21.

ఆ.వె. వఱలు చుండు నచట వైఖానస సరస్సు
కాంచన మయ పద్మగణ వృతమ్ము
సతత మట శుభమ్ములు తరుణాదిత్య ని
భములు హంస లుండు భద్రముగను 22.

ఆ.వె. ఔపవాహ్యమైన యట్టి గజేంద్రము
సార్వభౌమ మనఁగ సన్నుతము కు
బేరు కుంజరమ్ము విహరించును గరేణు
సంయుతమ్ము నచట సంతతమ్ము 23.

ఉ. అక్కొల నుత్తరింప నట నర్కనిశాకరు లుండ రభ్రముల్
చిక్కవు తార లుండవు విచిత్రము నాకము నాద హీనమౌ
యక్కడ సిద్ధ తాపస నిజాంగ వరప్రభలన్ వెలుంగు నా
చక్కటి చోటు సూర్య కర సంచయ కాంతు లనంగఁ దోఁచుచున్ 24.

తే.గీ. చనిన నింక శైలోద నది నటఁ గాంచ
వచ్చు నుభయ తీరము లందు వంశ నిచయ
ముండుఁ గీచకము లనంగ నుదరి సిద్ధు
లఁ గొని పోవు నటులు నిటుల నవి నదికి 25.

తే.గీ. ఉత్తర కురు దేశమ్ముల నత్తఱిఁ గన
నగును నవి పుణ్యజనులకు నాలయములు
స్వర్ణ పద్మ పద్మిను లట వఱలు చుండు
నుదక పూరితమ్ములు నయి యుల్లసిలిచు 26.

కం. నీల విదూరజ దళముల 27.

మేలి నదు లనేకము లట మిన్నగఁ బాఱున్
మూలము లెఱ్ఱ కలువలకు
నాలయములు రమ్య కాంచ నాంబుజములకున్

చం. వెలుఁగు జలాశయమ్ము లట వింతగ బాల దినేశు భంగినిన్
లలిత మహార్హ దివ్య మణి రత్ననికాయము లబ్జ కేసర
మ్ములు వసు కాంతి దీప్తు లయి పొల్వఁగ నీల వరోత్పలప్రభా
వలులు సెలంగ ముత్యము లపార ధనమ్ములు మూరు నిత్యమున్ 28.

చం. స్థిరముగఁ దేలు నా యిసుక దిబ్బలు కాంచన కాంతి నేఱులన్
గిరు లటఁ జిత్ర రత్నములఁ గీలి నిభమ్ముగఁ దోఁచు చుండ బం
గరు మయముల్ ఘనమ్ము లవగాఢము లౌను నదీ జలమ్ములం
దరు లటఁ బుష్పితమ్ములు సతమ్ము విహంగ సమాకులమ్ములున్ 29.

తే.గీ. ఫలములు సుగంధ రస యుతమ్ములు స్రవించు
సర్వ కామముల నవని సంతతమ్ము
పాదపము లన్యము లొసంగు వస్త్ర సంచ
యములు నానా రకమ్ముల ననవరతము 30.

తే.గీ. ముత్యముల నింక వైడూర్యములను బోలు
నగలు పుం స్త్రీల కనువులు నగము లన్య
ము లిడ సెల్ల ఋతువు లందుఁ బొసఁగు వాని
గొప్ప చిత్ర హేమములను గొన్ని యొసఁగు 31.

కం. మనముల నలరించు పడక
లను బఱుపులఁ గూడి రంగులను వర మాల్యా
లి నొసంగు నింపుగ నితర
ఘన వృక్షము లచట జన నికాయమ్మునకున్ 32.

కం. వర పానీయము లింకఁ బ
లు రకమ్ముల భక్ష్యములను రుచిరమ్ముల నా
తరువు లితరమ్ము లొసఁగును
మురియఁగ జనులు రమణీయముగ నచ్చోటన్ 33.

తే.గీ. చేరి గంధర్వ కిన్నర సిద్ధ నాగ
దేవ విధ్యాధ రాంగనా తృప్త చిత్త
లచటకు గుణ రూపవతు లహ రహమును ర
విప్రభా సమలు రమింత్రు పెక్కు రెలమి 34.

ఉ. అందఱు పుణ్య కర్మ లట నందఱు సంగమ సత్పరాయణుల్
సుందరు లందఱం గలసి శోభిలు చుంద్రు సకామ విత్తముల్
వొంది నిరంతరమ్ము పరిపూర్ణము విన్పడు గీత వాద్యముల్
డెందము లంద విచ్చలవిడిన్ రహి నవ్వులు చిందువందఁగన్ 35.

తే.గీ. లేరు సంతస మందని వార లేరు
లేరు దురిత ప్రియు లయిన వార లేరు
దిన దినము వర్థిలుచు నుండుఁ దేట గణము
లెల్ల నట మనోహరములు కల్ల కాదు 36.

చం. చని చని దాఁట శైలమును జక్కఁగఁ జూచెద రుత్త రాంబుధిం
గనఁబడు దాని మధ్యఁ బెను క్ష్మాధర మభ్ర మయమ్ము సోమ మన్
ఘన గిరి యింద్ర లోక జన కాయము దేవత లింక బ్రహ్మ లో
క నివసనుల్ దివంగతులు గాంచఁగ వత్తురు శైల రాజమున్ 37.

చం. సురుచిర మైన యగ్గిరి విసూర్యమ యైనను స్వీయ కాంతులం
బరఁగును సూర్య రశ్మి యుత భంగిని మండెడు సూర్య తుల్యమై
హరి జగదాత్ముఁ డింకను దశైక హ్ర దాత్ముఁడు పద్మ గర్భుఁడున్
స్థిరముగ నుంద్రు బ్రహ్మ ఋషి సేవిత హృష్ట తరాత్ములై యటన్ 38.

చం. అరుగఁగ రాదు ముందునకు నా కురు దేశ చయమ్ము దాఁటి యే
నరులకు నైన జీవులకు నాగము సోమ గిరీంద్ర మెన్నఁగా
సురలకు దుర్గమం బగును జూచి రయమ్మున మీర లెల్లరున్
మరలుఁడు వెన్క కింపుగఁ గ్రమమ్మున వానరు లార! వింటిరే 39.

కం. చన శక్యం బింత దనుక
నినుఁ డుండఁ డపార మెల్ల నిట మీ దింకన్ 40.

వనచర పుంగవులారా!
మన కింక నగోచరములు మహి విషయంబుల్

కం. పెదక వలయు నీ చోటుల
నుదరి నుడివి నట్టి దెసల నుత్తమ రీతిన్
వదలక యెవ్వియు నింకను
బదిలమ్ముగ నే నుడువని ప్రాంతము లందున్ 41.

ఆ.వె. కన విదేహ రాజ కన్యను దాశర
రథికి నింక నాకు రమ్యముగఁ బ్రి
య మొనరించి నట్టు లగు నెంచఁగ ననలో
పమ హరివరు లార! వఱలు ముదము 42.

కం. పని సాధింపఁగఁ జక్కం
గను నా సత్కారముఁ గొని ఘనముగ విహరిం
త్రు నెగడ ముదం బణఁప రిపు
లను భార్యా బంధు యుత మిలా తల మందున్ 43.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది మూడవ సర్గము.

# కిష్కింధా కాండము

# సర్గము 44.

సుగ్రీవుఁడు హనుమంతునిపైఁ గార్యసాధకుఁ డని విశ్వాసముంచి యాతని శక్తి సామర్థ్యములను బొగడి విశేషముగా నాతనితోఁ జేయ వలసిన కార్యమును రాముని సమక్షమున వచింప రాముఁడు హనుమంతునకుఁ దన యుంగరమును సీత కానవాలుగ నొసఁగి సీత దొరకు నట్టి విధమున పెదకమని పలుకుట.

కం. హనుమంతు నెంచి కార్య
మ్మును సాధింపఁ గల ప్లవగ పుంగవుఁ డని వా
నిని( జేరి విశేషమ్ముగ
ననె సుగ్రీవుఁడు నిజోచితార్థము నిట్లున్ 1.

కం. సకల వనౌకసులకుఁ బ్రభు
వు కపి వరుఁడు ప్రీతిలి యురువుగ సుగ్రీవుం
డు కని హనుమంతు నిట్లు ప
లికె నా విక్రాంతు కరువలి కొడుకు తోడన్ 2.

కం. హరి పుంగవ! నీ గతి నం
బరమునను బుడమిని దివిని వనముల యందున్
వర మంతరిక్ష మందును
దరమ్ము కా దేరి కాపఁ దథ్యము గాంచన్ 3.

తే.గీ. అసుర గంధర్వ నాగ న రామర గణ
ఘనులు నుండు సమస్త లోకమ్ము లింక
సాగరమ్ములు కొండలు చక్క నున్న
చోటు లెల్ల హనుమ! నీకు సువిదితములు 4.

ఆ.వె. పితృ సముండ వీవు గతిని వేగమునఁ దే
జమున లాఘవమున సత్కపి వర!
తేజు నందు సముల నేఁ జూడ నీకు సీ
త కనిపించు విధి వెదకుమ తివిరి 5.

కం. బలము పరాక్రమము సమయ
ములు దేశము లెఱుఁగు వృత్తి బుద్ధియు హనుమా!
యలవడె నీ యందు భృశము
విలసిల్లుచు నయ విదుండ వీర వరేణ్యా! 6.

చం. అనుమని కార్య నైపుణము నంచిత రీతి నెఱింగి వీరు హ
న్మను దలపం దొడంగె నెద మానవ వర్యుఁడు రాముఁ డివ్విధిన్
ఘనముగ నమ్మి యుండె నిటఁ గార్య సు సాధకుఁ డంచుఁ బావనిన్ 7.

మనమున సూర్య నందనుఁడు మారుతి సేయ సమర్థుఁడే చుమీ

తే.గీ. కార్య మెల్ల నింపుగ నేరి కదలు వాని
పన్నుగ విభుని చే నెన్నఁ బడిన వాని
చేతఁ జేయఁ బడిన యట్టి చెయ్వు లెల్ల
ఫలముల నొసంగ నేర్చు ధ్రువమ్ము గాను 8.

తే.గీ. అమ్మహాతేజుఁ డారసి హరి వరేణ్యు
నుత్త మోద్యమునిఁ దలఁచె నత్తఱిం గృ
తార్థుఁడ నయితి నంచు నరాధిపాత్మ
జుండు రాముఁడు హర్షేంద్రియుండు మదిని 9.

ఉ. అంత నొసంగె నుంగరము నందుఁ దగం దన నామముండఁగా
నింతికిఁ గుర్తుగాఁ దనర నింపుగ మైథిలి కత్తఱిం గనం
జెంతకు నేఁగి యీయ హరి శేఖర! నేరును వచ్చి తీవు దా
స్వాంతము నందు నిచ్చటకుఁ జక్కఁగ నా దరి నుండి యంచునున్ 10.

తే.గీ. వీర! నీ యుద్యమము సత్త్వ విక్రమములు
నింక సుగ్రీవు సందేశ మెల్లఁ గాంచ
నాకుఁ దెల్ల మగుచు నుండె వీఁక నీదు
కార్య మెల్లను సఫలమ్ము కాఁ గల దని 11.

కం. కొని దాని హరిశ్రేష్ఠుఁడు
తన తలపైన నిడికొని పదము లంటుచు భ
క్తి నమస్కరించి యంజలి
నొనరించి చనంగఁ జాగె నుత్సాహమునన్ 12.

కం. కపివర సైన్యము తా నడ
పి పవన తనయుం డగపడె వీర వరుండే
యపగత మే ఘాభ్రమ్మున
విపు లోడు గణావృత శశి విధముగఁ గాంచన్ 13.

ఆ.వె. అతి బలుండ హనుమ! యాశ్రయించితి నీ బ 14.

లమ్ము నేను విక్రమమ్ము నందు
ఘనుఁడ! ప్లవగ వీర! కాంచ నగును సీత
నెట్లు చేయు మింక నట్లు మీఱి

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది నాలుగవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 45.

సుగ్రీవుఁడు వానరుల నెల్లరను దిరిగి పిలిచి తా చెప్పిన రీతి నెల్లరు వెదక వలయు నని నాదేశింప వా రెల్ల రుత్సాహమున సీతను వెదకెదము రావణుని జంపెద మని పలుకుచుఁ జనంగ రామ లక్ష్మణులు ప్రస్రవణ గిరిని నిల్చి నిరీక్షించుట.

కం. తిరిగి పిలిచి సుగ్రీవుఁడు
హరి వృషభుఁడు రామ కార్య మలవడ నంతన్
హరు లెల్లర ననెఁ దా నని
న రీతి వెదకంగ వే చన వలయు నంచున్ 1.

చం. విని పతి యుగ్ర శాసనము వేగమ వానరు లెల్ల రంతటన్
ఘనముగ భూమినిన్ శలభ కాయము భంగిని రేఁగి యేఁగు చుం
డ నరసి రామ లక్ష్మణు లెడందల హర్షము నంది నిల్చి రం
త నగ వరమ్ము ప్రస్రవణ దంతిని మాస నిరీక్ష ణార్థమై 2.

కం. హరి శతవలి శీఘ్రుమ యు
త్తర దిక్కునకు గిరి రాజు దనరెడు దిశకుం
దరలెను వీరుం డత్యం
త రమ్య దేశమునకు వినుత యశుం డంతన్ 3.

తే.గీ. పూర్వ దిశ కేఁగె హరి యూథపుఁడు వినతుఁడు
మారుతాత్మజుఁ డంగద తార ముఖ హ
రి వరు లుండ నగస్త్య చరితము దక్షి
ణ దిశకు హరి యూథపుఁ డేఁగె నుదరి యంత 4.

కం. హరి శార్దూలుండు హరీ
శ్వరుఁడు సుషేణుఁడు తరలెను బడమర తటికిన్
వరుణ పరిపాలిత దిశకు
గురు ఘోర ప్రాంతములకుఁ గుందక యంతన్ 5.

తే.గీ. ప్లవగ సేనాపతుల నట్లు పంపి ముఖ్యు
లను దిశల కెల్ల సుగ్రీవ రాడ్వరుండు
తగిన రీతిఁ దేటి మది మోదమ్ము వడసె
నంత మిక్కుటముగను గృతార్థుఁ డనఁగ 6.

కం. పనిచిన రా జిబ్బంగిని
ఘన వానర యూథపు లరుగఁ దొడఁగిరి రయ
మ్మున నీఁకఁ దమ తమ దిక్కుల
కు నసదృ శోత్సాహ మడర ఘోరాకృతులై 7.

తే.గీ. బల్లిదు లెగురుచున్ వడిఁ బర్వులిడుచుఁ
బ్లవగ వరులు గర్జించుచు ధ్వను లొసఁగుచు
బిగ్గరగ గెంతుచు మురిసి యగ్గలముగ
వాఁగుచు గిరలు పెక్కులు పయన మైరి 8.

తే.గీ. పంపఁ బడ రాజు చేత నా వానరప్ర
వరులు పలుకఁ దొడఁగి రిట్లు పంతముునను
దెచ్చెదము సీతఁ దప్పక మచ్చెకంటిఁ
జంపుదుము రావణునిఁ గ్రూరు శంక వీడి 9.

కం. సేన వధింతు రణమున ద
శానను రావణునిఁ జంపి యానందముగా
జానకినిఁ దెత్తు శంకా 10.

హీన మడరి విక్రమమున నెలమిం గనుఁడీ

ఆ.వె. నిల్చి యుండుఁ డిచట నెమ్మి మీరు శ్రమించి
తెత్తు వణఁకు చున్న దేవి నిటకు
సీత దుర్గమమ్ము పాతాల మందున్న
నొక్కఁడఁ జని వేగ యుత్సహించి 11.

ఆ.వె. కూల్తుఁ దరుల గిరులఁ గోయుదు నిశ్శంకఁ
బెల్లగింతు నేల తల్లడిల్ల
నెల్ల సాగరముల నెండింతు రోషమ్ము
నూని యొక్క త్రుటిని నుక్కు మీఱ 12.

తే.గీ. వంద యోజనమ్ములు దాఁటఁ బరఁగు శక్తి
నా కనంగ నొకం డట వీఁక తోడ
వంద కధికమ్ము దాఁటుదు డెంద మలర
నే నని మఱి యొకం డనె నెమ్మి తోడ 13.

కం. పుడమిని శైలముల వనులఁ
గడలినిఁ బాతాల మందు గతి కుండదు నే
నడరంగ నడ్డొకింతయు
నడుముల నైనను బ్లవగ గణ పతులు! వినుఁడీ 14.

కం. హరి రాజు సన్నిధి బలులు
హరు లిట్లొక్కొక్క రచట నానందమునన్
గురు వచనమ్ము లడరి ప
ల్కిరి దర్పం బతిశయిల్లఁ గేలీ లీలన్ 15.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది యేనవ సర్గము.

## కిష్కింధా కాండము

# సర్గము 46.

రాముఁడు సుగ్రీవుని భూమండలము నెల్ల నెట్టు లెఱుఁగుదు వని యడుగ నతఁడు తన యన్న వాలి భయమున దేశ దేశములు పరిభ్రమింపంగ భూభాగములను స్వయముగఁ జూడఁ దెలిసిన వని వివరించుట.

కం. చన వానరేంద్రు లెల్లరు
కని సుగ్రీవుని నడిగె సకల ధరణీ రా
శిని నెట్లెఱుంగు దీ వం
చును రాముం డచ్చెరు వెదఁ జొప్పడ మిగులన్ 1.

ఆ.వె. అంత రామునిఁ గని యనియె సుగ్రీవుఁడు
వందనమ్ము లొసఁగి వానరేంద్రుఁ
డిట్లు విస్తరముగ నెల్ల వచింతు వి
నుమ నరర్షభుండ! విమల చరిత! 2.

ఉ. మానక వాలి వెంటఁ జన మాయ కుమారుఁడు దున్న రూపుఁడున్
పే నగ రాజ మా మలయ విస్తృత కందర మందుఁ దూఱఁగాఁ
దానును జంప నిష్టుఁ డయి తద్దయు కోపము నూని శీఘ్రమే
వానిని నద్దురాత్ము యము పాలికిఁ బంపఁ దలంచి చొచ్చినన్ 3.

ఆ.వె. అంత నిలిచితి వినయమ్మున నా గుహ
ద్వారము కడ నేను వత్సరం బొ
కటి గడచిన వాలి కపి నాథుఁ డేతెంచ
కుండెను వెలుపలకు మండితుండు 4.

ఆ.వె. అప్పుడు కనిపించె నా బిల ద్వారము
నుండి కాఱ నెత్తు రుద్భటముగ
నన్న మరణ మెంచి మిన్నగ విస్మయ
మంది నేను దుఃఖ మందు మునిఁగి 5.

తే.గీ. నిశ్చయించి యన్న మృతిని నేను గొండఁ 6.

బోలు ఱాతితో నాబిలమును రయమున
నంత మూసితి రా౯ జాల కా మహిషుఁడు
లోన మరణించు నని యెంచి మానవేంద్ర!

ఆ.వె. సన్నగిల్ల నాశ యన్నపైఁ గిష్కింధ
కు నరుదెంచి రాజ్యమును రుమ సహి
తమ్ము తార నంది నెమ్మి వగపు లేక
సఖులఁ గూడి యుంటిఁ జక్క నంత 7.

ఉ. వచ్చెను జంపి దానవుని వాలి యొసంగితి గౌరవమ్ము నం
జెచ్చెర రాజ్య మాతనికిఁ జెంది భయమ్మును నాగ్రహించి దా
హెచ్చుగఁ జంప నెంచ మది నీర్ష్యను బాఱఁగఁ గూడి మంత్రుల
న్మెచ్చక వెంబడింపఁగను నిర్దయఁ ద్రిమ్మరు చుంటి దిక్కులన్ 8.

తే.గీ. అవ్విధిఁ దఱుమఁ బడ భృశ మన్న చేతఁ
బరువిడి వడి నేను వివిధ పట్టణమ్ము
లను నదులు కాననమ్ములు గనుచుఁ దిరుగు
చుంటిఁ బృథ్వీ తలమ్మున నుఱుకు చుండి 9.

కం. అద్దము వలె నున్న పుడమి
నద్దరికొను నగ్ని భంగి నడరెడు దానిన్
గ్రద్దన గోష్పద భంగిని
నద్దఁగ వీక్షించితిని భయభ్రాంతుఁడనై 10.

ఉ. కాంచితిఁ బూర్వ దిక్కు నట క్ష్మాజములన్ వివిధమ్ములం దమిం
గాంచితిఁ బర్వతమ్ములను గాంచితి రమ్య నదీ తటాకముల్
గాంచితిఁ బూర్వ శైలముఁ బ్రకాశిత ధాతు సమావృతమ్మునుం
గాంచితి క్షీరసాగర మఖండము నచ్చర లుండ నిత్యమున్ 11.

ఆ.వె. వాలి తిరిగి తఱుమ భయమున మరలి శీ
ఘ్రముగఁ తిరిగి నేను రామ! యేఁగఁ
దొడఁగితి నయినఁ గపి దోర్బలుండు వదల
క వెను వెంట రాఁగఁ గరము భీతి 12.

కం. తరలితి దక్షిణ దిశకుం
దరు సంకీర్ణమ్ము గంధ తరు విలసితమున్
గిరి వరము వింధ్య కత్తఱి
నర పుంగవ! నే రయమ్మున రఘువరేణ్యా! 13.

ఆ.వె. తరు గిరుల నరయుచు దక్షిణ దిశ నుండి
తఱుము చుండ వాలి తద్ద భీతిఁ
బశ్చిమంపు దిశకు వచ్చి దేశము లనే
కములు నస్త గిరిని గాంచి యంత 14.

తే.గీ. ఉత్తర దిశకుఁ బాఱి నగోత్తమమ్ము
హిమ గిరిని మేరు నగ వర మింకఁ గడలిఁ
గాంచ వాలి శరణ మేను గాన కున్న
బుద్ధిమంతుఁడు హనుమ యపు డనె నిట్లు 15.

తే.గీ. చేరిన మతంగు నాశ్రమ శ్రేష్ఠమును హ
రి పతి వాలి యతని శిరము పగులు శత
ఖండములగ నని ముని యాగ్రహమున శపి
యించె నయ్యది స్మృతి నాకు నంచితముగ 16.

తే.గీ. వాస మున్న నచట సుంత భయము గనము
మన మనంగ సమ్మదమున మానవేంద్ర!
ఋష్యమూక పర్వత మందు నింపుగ వసి
యింపఁగ మతంగు భీతి రాఁ డిటకు వాలి 17.

కం. స్వయ మీక్షించితి నివ్విధి
రయమున భూమండలమ్ము రాఘువ వర్యా!
భయ హీనం బీ గుహకుం
బ్రియ మారం జేరితిమి మురియుచు నెడఁదలన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది యాఱవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 47.

సీతాన్వేష ణార్థ మేఁగిన శతవలి, వినతుఁడు, సుషేణుఁడు తిరిగి వచ్చి యెందును సీతా దేవినిఁ గాంచ లేదని తెలియఁ జేయుట, సుషేణుఁడు సీతను గొని పోయిన దిక్కున కేఁగి నట్టి హనుమంతుఁడు తప్పక సీతను జూచునని వచించుట.

కం. వెడలిరి కపి యూథపు ల
ట్లడరి కనుఁగొనంగ సీత నందఱు సుగ్రీఁ
వుఁ డొసంగ నాజ్ఞ నారడ
మెడఁదల నుప్పొంగ భృశ మహీన బలాఢ్యుల్ 1.

తే.గీ. కొలను లందు నదీ తటమ్ములను శూన్య
దేశముల నగరమ్ములఁ దిరుగ రాని
చోటు లందు గిరుల యందు సురుచిరముగ
హరులు గాలించి రెల్లెడఁ దిరిగి తిరిగి 2.

కం. పనిచి నటుల సుగ్రీవుఁడు
వన గిరి ఘోరాటవీ భువనముల యందున్
ఘను లా వానరు లెల్లరు
చని చని వెదకిరి సమస్త సానువు లందున్ 3.

చం. దినముల లోన జానకిని దేవినిఁ గాంచఁగఁ జాగు చుండుచున్
వనచరు లెల్ల రాత్రులను బన్నుగ నొక్కెడఁ గూడి చక్క ధా
త్రినిఁ గని యెల్ల కాలములఁ దీయని పండ్లు గలట్టి వృక్షముల్
తిని నిదురించు చుండి యటఁ దిర్గి దివమ్ముల గాంత్రు దేశముల్ 4.

ఆ.వె. తొలి దినమ్ము నుండి నెల పూర్తి కాఁగ ని
రాశ తోడ వచ్చి రా హరి వరు
లంతఁ బ్రస్రవణ మహా గిరీంద్రమునకుఁ
గపి గణాధినాథుఁ గలసి రపుడు 5.

కం. వెదకి వినతుండు పూర్వం
పు దిశను గూడి తనదు సచివులతో సీతన్
సుదతిని గాంచక మరలి య
రుదెంచెను బ్లవగ వరుం డురు బలుం డటకున్ 6.

ఆ.వె. ఉత్తర దిశ నెల్ల నుత్తమముగఁ గాంచి
వీరుఁ డా శతవలి సేరెఁ బ్రస్ర
వణ గిరీంద్రము హరి గణ సైన్యమును గూడి
జానకిఁ గనకుండ వానరుండు 7.

ఆ.వె. పశ్చిమ దిశ వెదకి వానరులను గూడి
హరి వరుఁడు సుషేణుఁ డరుగుదెంచె
నిండ మాస మెల్ల గండని సుగ్రీవుఁ
జేరెఁ గాంచ కుండ సీత నతఁడు 8.

తే.గీ. చేరి రామునితో నున్న వీరు వాన
రేంద్రు సుగ్రీవుని నమస్కరించి ప్రస్ర
వణము నందుండఁ దా నిట్లు వలికె నా సు
షేణుఁడు వినయం బేపారఁ జింత తోడ 9.

చం. వెదకితి మెల్ల కొండలను బృథ్వి నరణ్యము లందు నగ్గుహా
పదముల సాగ రాంతములఁ బట్టణ జానపదమ్ము లందునుం
బదపడి యెల్ల యాపగలఁ బన్నుగ నీ వచియించి నట్టి చో
ట్లఁ దడయ కుండ గుల్మముల రమ్య లతా వితతమ్ము లందునున్ 10.

తే.గీ. దుర్గమము లైన దేశ తతులను విషమ
దేశముల వెదకితిమి వధించితిమి మ
హా మృగమ్ముల గహనమ్ము లందు మరల 11.

మరల తిరిగి వెదకితిమి హరివరేణ్య!

తే.గీ. బల్లిదుం డుత్తమ కులుండు వానరేంద్ర!
హనుమ గాంచును జానకి నతఁడు సీతఁ
గొనిన దిక్కునకు నరిగె ఘనుఁడు మారు
తాత్మజుండు మహాత్ముఁడు హరివరుండు 12.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది యేడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 48.

తా రాంగ దాదులతో మారుతాత్మజుఁడు దక్షిణ దిశలో గిరి కానన దేశములలోఁ జరింప నచట నొక రక్కసుఁ డగపడ రావణునిగా నెంచి యంగదుఁడు వధించి వెదకఁగ సీతను గాన కున్న నెల్లరు విచారములో మునుంగుట.

కం. తా రాంగదుల సహిత మా
మారుతి హరి వీరుఁ డేఁగె మైథిలిఁ గాంచన్
ధీరత సుగ్రీవుం డే
పారం జెప్పిన దిశకు నపార ముదమునన్ 1.

చం. కపి వరు లెల్ల రేఁగి కడఁకం గడు దూరము వేగ వింధ్య శై
ల పరిసరమ్ము లందు గుహలం బరిశోధన మింపుగా నొన
ర్చి పలు నదీ తటమ్ముల విశేషముగా గిరి దుర్గమమ్ములన్
విపుల లతా ద్రుమమ్ముల నభీతి తటాక తటీ స్థలమ్ములన్ 2.

ఆ.వె. హరి వరేణ్యు లట్టు లన్వేష ణా పరు
లై వెదకఁగ నెల్ల రవని యందు 3.

నెందుఁ గాంచ నోప రిందుముఖిని సీత
మైథిలిని జనక కుమారి నకట

కం. తినుచు వివిధ మూల ఫలము
లను నన్వేషించు చుండి ప్రాంతమ్ముల యం
దనవరతము ప్లవ గేంద్రులు
చన రాని గుహాంతరముల జన శూన్యములన్ 4.

ఆ.వె. నిర్జల గహనముల నెగడి రోమాంచ దే
శముల నన్య వనులఁ జక్క వెదకి
మూరి దుష్ప్రవేశపు టపర ఘన దేశ
మపు డభీతిఁ జేరె హరి గణమ్ము 5.

తే.గీ. అచటఁ దరువులఁ బుష్పము లాకులు ఫల
ములు కనఁ బడవు మఱి మూలములను గనము
నదు లజలములె మృగగణ నాగ మహిష
విహగ శార్దూల వనచర రహితమ యది 6.

తే.గీ. ఔషధ తరులు లే వట నగపడవు ల
తా వితానము లరయము ధరణిఁ బ్రాకు
తీవ లేని సుగంధముతో వఱలెడు
మెట్ట తామర లుండుఁ దుమ్మెదలు లేక 7.

ఉ. కండు వనంగ గొప్పఋషి కష్టపు నిష్ఠ వహించు తాప సో
గ్రుండును సత్య వాదియును గొడ్కు పదాఱు సమావృతుండు బా
లుండు హతుండు కాఁగ నెద రోషము నూని శపించెఁ గాన ను
ద్దండ మృగాది హీనముగఁ దప్పక యుండఁగ నెల్ల వేళలన్ 8.

ఆ.వె. కాన నాంతరములఁ గందరములఁ బర్వ
తావళుల నదీ భవావనులను
గూడి యెల్ల హరులు తోడుగ వెదకి రె
ల్లెడల నలయ నేర రడరి యడరి 9.

తే.గీ. అక్క డైన మహాత్ములు హరి వరేణ్యు
లక్కట కన నేరరు జన కాత్మజ నప
హర్త రావణు నేని ప్రియమ్ము సేయు
వారు సుగ్రీవునకు ధీర వరులు ఘనులు 10.

కం. కని యచ్చోట లతల పొద
ల నొక్క క్రూ రాసురుని సురలకు భయం బం
దని వానిఁ గొండ వలె నిలి
చిన వాని స్థిరమ్ముగ నిలిచిరి యెల్ల కపుల్ 11.

కం. గిరి సన్నిభుండు నగు వాఁ
డరసి ప్లవగ వరులఁ జచ్చి రంచుఁ బలుకుచుం
గర మలిగి ముష్టిని బిగిం
చి రయమ్మునఁ బాఱి యంతఁ జేరెను హరులన్ 12.

కం. వచ్చెడు నసురుం గని తా
నిచ్చఁ దలఁచి రావణుఁ డని యెలమిని నంతం
జెచ్చెర వాలి సుతుం డపు
డిచ్చెను దెబ్బఁ దల మీద హెచ్చుగఁ జేతన్ 13.

ఆ.వె. వాలి సుతుఁడు కొట్ట వక్త్రము నుండి ర
క్తమ్ము కాఱ నసుర ధరణిఁ గూలెఁ
బాద తలము తెగిన పర్వతమ్ము పగిది
నంత నొక్క తృటిని నక్కజముగ 14.

ఆ.వె. అట్లసురుఁడు కూల హరులు విజయ మంది
శైల గహ్వరమ్ము చక్కఁగఁ బరి
కించి సర్వ మపుడు గాంచక జానకి
నపర గుహను వెదక నడరి రంత 15.

కం. వెదకి యచట వానరు లం
త దుఃఖ మెద లందు రేఁగఁ దరుణిని వీక్షిం
పఁ దరము గాక యొక తరువు 16.

మొదలం గూలం బడిరి యపుడు దీనముగన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది యెనిమిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 49.

అంగదుఁడు వానరు లందఱితో సుగ్రీ వాజ్ఞ పాటింప కున్న నతని కోపమునకు లోనగుదు మని పలికి తిరిగి యెల్లెడల సీతా దేవికై యన్వేషింపుఁ డని పలుక వారెల్లరు నపు డచటి వెండి కొండ నెక్కి తిరిగి తిరిగి వెదకి క్రిందికి దిగి యలసి యూఱడిల్లి తిరిగి వెదకుట.

కం. తగ ననునయించి యలసిన
మగఁ డంగదుఁడు హరులను సముంచిత విధి మె
ల్లగఁ బలికెఁ బ్రాజ్ఞుఁ డిట్లం
గిఁ గపి వరేణ్యుఁడు సముచిత గిరలు హరులతో 1.

చం. వనముల నాపగా తటులఁ బర్వత దుర్గమ కందరమ్ములన్
వన దరు లందు నెల్లెడల వారక శోధన మంద జేంపుగా
నొనరిచి కాన కుంటిమి యయోనిజ నా సుర నంద నోపమన్
జనక సు తాపహర్తను విచారము మూఱఁగ నెల్ల వారికిన్ 2.

కం. బహు కాలమ్ము గతించెను
మహోగ్ర శాసనుఁడు గాంచ మన నాయకుఁ డై
న హరీశ్వరుండు వెదకుఁడు
విహరించి సమస్త తటుల విస్తృత రీతిన్ 3.

ఆ.వె. రేఁగిన వగపు బడలిక నిద్ర నెల్లరు
వీడి సీత నెట్లు చూడ నగునొ 4.

యవ్విధి మన మెల్ల నడరి కరము పరి
కింప వలయు నింక నింపు గాను

తే.గీ. ఖేదము వడయ కుంట మిక్కిలిగ నేర్పు
కలిగి యుంటయు నోటమిఁ దలఁప కుంట
యెదను గార్య సఫలతకు నివియె  కతము
లండ్రు గానఁ బలుకు చుంటి నడరి నేను 5.

చం. వగపును వీడి యెల్లరును వానర వర్యులు! కాననమ్మునం
దగఁ కడు దుర్గమమ్ము లగు తావులఁ దిర్గి సమీక్ష వీఁకఁ జ
ల్పఁగ వలయుం జలమ్మున ఫలమ్ము లభించును జేయు వారికే
తగ దికఁ గున్కు డెందమునఁ దద్ద విరక్తి వహించు టేనియున్ 6.

తే.గీ. చాల కోపి సుగ్రీవుఁడు చండ తరము
లైన దండనము లొసంగు వానరేంద్రు
నకు మహాత్ముఁడు రాఘవునకును నెల్ల
రము భయంపడ వలయుఁ గరమ్ము సతము 7.

ఆ.వె. ఎల్లరకు హితమ్ము నెంచి వచించితి
నివ్విధమ్ము మీకు నిష్ట మయినఁ
జేయ వలయు నిట్లు చింతించి కాదేని
తగిన దానిఁ బలుకఁ దగుదు రొండు 8.

కం. విని యంగదు మాటలు ప
ల్కెను  దాహమ్ము నలసటయుఁ గెరలఁగ నంతన్
వినయమున గంధమాదనుఁ
డను హరి వరుఁడు వచనముల నతి విశదముగన్ 9.

ఉ. చక్కఁగఁ జెప్పె నంగదుఁడు సల్ప హితం బనుకూల మింపుగా
నక్కపికే తగుం బలుక నట్టులఁ జేయుద మవ్విధమ్ముగా
నుక్కున శోధనమ్ముఁ బ్లవ గోత్తము లార! యొనర్ప నొప్పు నిం
కొక్క పరిన్ వనమ్ముల సమున్నత శైల దరీ ఝరమ్ములన్ 10.

తే.గీ. శూన్య కాననముల నెల్ల చోటు లందు
నమ్మహోత్ముఁడు సుగ్రీవుఁ డపుడు చెప్పి
నట్లు దుర్గమ దేశము లందుఁ దిరిగి
యెల్లరము పరికింతము తల్లడిలక 11.

ఆ.వె. అంత లేచి తిరిగి హరిపుంగవులు మహా
బలులు వేగ వింధ్య పర్వత విల
సితము దక్షిణాశఁ జెలఁగి వనమ్ముల
నెల్ల వెదకఁ జాగి రింపు గాను 12.

తే.గీ. పెక్కు దరులు శృంగమ్ములు వెలయు నట్టి
వెండి కొండ శరత్తున వెల్గు మబ్బు
వోలెఁ గన్పట్టు దానినిఁ బూని యెక్కి
రెల్ల రుత్సహించి ప్లవగు లుల్లసిల్లి 13.

ఆ.వె. అచట లోధ్ర వనము నరఁటి తోటను గాంచి
వెదక దొడఁగిరి హరి వీరు లెల్ల
సీతఁ గాంచు నట్టి ప్రీతి యతిశయింప
నెల్లరకు భృశముగ నెడఁద లందు 14.

కం. గిరి పైకి నెక్కి యలసిరి
హరులు విపుల విక్రములు బలాఢ్యులు వైదే
హి రమణిని రామ పత్నిని
ధరణిజఁ గన నోప రకట తద్దేశములన్ 15.

తే.గీ. చూచి యా బహు కందర శోభితమ్ము
శైల రాజము చూచుచు సకల దిశలు
దిగి హరు లలసి కడు విరక్తి వడసి నిలి
చి యొక యింత చెట్టు మొదలు సేరి రంత 16.

ఆ.వె. ఒక ముహూర్త మందు నూఱడిల్లి హరులు
రిత్త వోవ శ్రమ తిరిగి వహించి
పట్టుదల నెడఁదలఁ బరికింపఁ జాగిరి 17.

దక్షిణ దిశ నెల్ల దట్టముగను

కం. హనుమత్ప్రముఖులు హరు లా
దినుండి తిరిగి గిరి వింధ్య దిశ లందెల్లం
జని చని పెదకఁ దొడంగిరి
జనకాత్మజఁ గాంచ నెంచి సమ్మద లీలన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది తొమ్మిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 50.

తారాంగదులఁ గూడి హనుమంతుఁడు వింధ్య పర్వత గుహల వనముల పెదకుచు ఋక్షబిల యను గుహలోఁ బ్రవేశించి చీఁకటి ప్రాంతముల నన్ని దాఁటి ప్రకాశించు సౌధములు వృక్షములు సరోవరము లున్న చోటును గాంచి యచట స్వయంప్రభ యను తపస్విని జూచుట.

కం. తా రాంగదుల సహితముగ
మారుత సూనుండు వింధ్య మలయ వనములన్
ఘోర గుహా సంచయముల
నారయఁ జాగెను తిరిగి మహా గహనములన్ 1.

చం. స్థిరముగ సింహముల్ పులులు దిర్గెడు చోటుల నిర్ఝరమ్ములన్
గిరి విషమంపుఁ జోటులను గృత్స్న ము శైలము లున్న చోటులన్
హరు లటఁ జూచు చుండగ మహా గిరి యంతము సేరి నైరృతిన్
హరి విభుఁ డిచ్చినట్టి సమయంబు గతించెను నిల్వ నచ్చటన్ 2.

కం. చొరరాని గుహల పర్వత
వరములఁ గాననము లందుఁ బన్నుగ నెల్లన్ 3.

హరి వరుఁడు మారుతాత్మజుఁ
డరసె దురన్వేష మందు నడరి భృశముగన్

తే.గీ. ఒకరి కొక్కరి కెడలేక యొక్కొకరును
హనుమ గజ గవాక్షులు గవయ శరభులును
మైందుఁడు ద్వివిదుఁడును గంధమాదనుఁడు సు
షేణ జాంబవంత నలులు సెలఁగు చుండ 4.

తే.గీ. తారుఁడు హరులు యువరాజు వీరుఁ డంగ
దుండు గిరి పంక్తి వెదకుచు నుండి యట న
వాచి యందు ఋక్షబిలము వారు కంద
రమును జూచిరి దానవ రక్షితమును 5.

ఆ.వె. ఆఁక లింక దప్పి యడరంగ యలసట
చెలఁగు చుండఁ ద్రాగ జలము కోరి
లతలు తరువులు దనరంగఁ గరము చుట్టు
నట్టి బిలము గనిరి హరివరు లట 6.

ఉ. కాంచిరి హంస సారస నికాయముఁ గ్రౌంచ విహంగ పంక్తులన్
మించిన యెఱ్ఱ ఱెక్కలను మేనున నుండగ పద్మ రేణులే
యంచిత చక్రవాకముల నచ్చటఁ జక్కఁగ నిర్గమింపఁగాఁ
బంచకుఁ జేరి రా కపులు వాసన లీను బిలంపు టొద్దకున్ 7.

కం. భయ విస్మయమ్ములు తమ హృ
దయములఁ గదురం దలఁచి యుదక మచ్చట నా
రయ నగుఁ దప్పక యంచును
రయమున పర్విడిరి హరులు ప్రమదం బెసఁగన్ 8.

తే.గీ. అరసి భయ మిడు చన రాని యఖిల సత్త్వ
సంచరితము దైత్యేంద్ర వేశ్మ సదృశమ్ము
శైల కూటాభుఁడు హనుమ సకల వన వి
శారదుండు పలికెను వచనము లిట్లు 9.

చం. అలసితి మీ న గావృత మహాటవులం బరికించి దక్షిణా
శ లలిత రీతి నెల్లరము చాల ధరా సుతఁ గాన కుంటిమే
బిలమును వీడి వచ్చినవి వేగమ క్రౌంచ సహంస సారస
మ్ములు మఱి చక్రవాకములు మున్గి జలమ్మున నింకఁ గాంచఁగా 10.

తే.గీ. బిలము చెంత నున్నని వృక్షము లగపడుచు
నున్న వింపుగఁ గన్పడు నుదక రాశి
నూతుల నయిన మఱి గొలనుల నయినను
గాంచ వచ్చును దప్పక యంచు నెంతు 11.

కం. అని పలుక నెల్లరు బిల
మ్మునఁ దూఱిరి కనిరి తిమిరమును సూర్యునిఁ జం
ద్రునిఁ గాన కుంటి రచ్చటఁ
దనువుల గగురు లొడమె కపి తతికి భృశముగా 12.

చం. మృగముల సింహ రాజముల మేటి స్వనమ్ములు వించు నచ్చటం
బగలును చీఁక టున్న గుహఁ బన్నుగఁ దూఱిరి వానరేంద్రు లం
త గరిమ వారి కన్నులును దద్ద పరాక్రమ మేని తేజముం
సుగతిఁ జరింప కున్న నటఁ జొచ్చిరి గాలి విధమ్ము చీఁకటిన్ 13.

ఆ.వె. వేగ చొచ్చి వారు బిలము ప్లవగ పుంగ
వులు వెలుంగు చున్న లలిత మైన
దేశ ముత్తమమును దెల్లముగఁ గనిరి
చనిరి యోజనమ్ము చక్కఁ దరిని 14.

తే.గీ. దుర్గమమున నానా విధ ద్రుమ సమాకు
లమ్మున నొకరి నొకరి కరమ్ములు గొని
తెలివి చెడఁగ దాహార్తులై తిరిగి రుత్స
హించి కొంత తఱి బిలమం దంచితముగ 15.

ఆ.వె. అలసియును గృశించి హరులు దీన వదను
లపుడు గాంచి రంత నచట వెలుఁగు
బ్రదుకు నన్నిరాశ వడసి నట్టి సమయ 16.

మందు వితిమిరంపు టడవి సెలమి

చం. కని రట కాంచనంపుఁ దరు కాయము వెల్గఁగ దీప్త వహ్ని భం
గిని వర సాల వంజుల వికీర్ణ ధవద్రుమ కోటిఁ జంపకా
లిని ఘన తాల పాదప పరీవృత తుంగ స కర్ణికార వృ
క్ష నిచయ మింక నాగముల క్ష్మాజము లింపుగఁ బుష్పితమ్ములన్ 17.

తే.గీ. పసిడి పూగుత్తు లెట్టిని మిసిమి మొగ్గ
లు పెనవేసి కొనిన లతలు దనరంగ
స్వర్ణ మండితములు రవి సన్నిభచ్ఛ
వుల సవైడూర్య వేదికా లలిత తరుల 18.

ఆ.వె. నీల వర్ణములను మేలిమి పిల్లికన్
రత్నముల విహంగ రాజములును
బాల సూర్య సన్నిభ కనక మయ పద్మ
ములు నడరు తటాకములను గనిరి 19.

తే.గీ. జాత రూప మయమ్ములు ఝష వరములు
తనరఁ బెద్దవి తాబేలు లనవరతము
జలములు ప్రసన్నములు పాఱఁ జక్కని వయి
నట్టి పద్మాకరములను హరులు కనిరి 20.

ఉ. బంగరు వెండి పేశ్మముల భర్మ గవాక్షము లద్ద ముత్యముల్
బంగరు వెండి మన్నులను బన్నుగఁ గూర్చ విదూర రత్నముల్
నింగిని నంటు చందమున నివ్వెఱ నెల్లర కీయ నింపుగా
నంగద ముఖ్య వానర చయం బట గాంచెను సౌధ పంక్తినిన్ 21.

ఆ.వె. ఫలము లింకఁ బుష్పములు నిండిన తరులు
పగడము లన వెలయఁ బసిడి తుమ్మె
దలు చరింప నెల్లెడలఁ దేనియలు లభి
యించు చుండ మిగుల నెలమిఁ గనిరి 22.

ఆ.వె. మణి సువర్ణ చిత్ర మండి తాసనములు 23.

పడక లింక గొప్పవాహనములు
పసిడి వెండి కంచు పాత్రలు నచ్చటఁ
గనిరి యెల్లెడలను గపులు ప్రీతి

కం. కని రగరు లింపయిన చం
దనములు దివ్యమ్ములు దినఁ దగు చక్కని పం
డ్లను మూలములను శుచిగాఁ
దనరెడి వానిని హరులు ముదం బేపారన్ 24.

తే.గీ. అర్ఘ పానీయముల మహార్ఘ రస వంత
మధువులను దివ్యము లగు నంబర చయములఁ
గంబళుల నజినమ్ముల సంబరమున
సంచయములఁ గనిరి కపి సత్తము లట 25.

కం. అచ్చ టచట నుంచఁ బ్రభల
మెచ్చనివి యనలము సుంత మేలి వసువులం
జెచ్చెఱ గాంచిరి వెలుఁగఁగ
హెచ్చుగ వానర వరేణ్యు లెల్లరు తమినిన్ 26.

కం. బిలమున నచ్చ టచటఁ బ్లవ
గు లెల్ల రవ్యగ్రము వెదకుచు నెల్లెడలం
గొలఁది యగు దూర మందు న
బల నొకతెను గాంచి రంతఁ బరమ ముదమునన్ 27.

ఆ.వె. నల్ల జింక తోలు నాతికి వస్త్రము
కాఁగ నియతిఁ దనరఁ గరము భోజ
నమ్ము తనదు తేజున వెలుంగు చుండఁ దా
పసినిఁ గన హరులకు భయము వొడమె 28.

కం. హరు లెల్లరు విస్మయమున
నరసి నిలిచి రెల్లెడలను హనుమంతుం డా
తురత సెలంగ నడిగె నె
వ్వరీవు బిల మెవ్వరి దని పన్నుగ నంతన్ 29.

తే.గీ. శైల సన్నిభుం డంజలిఁ జక్కఁగ ఘటి
యించి వృద్ధ కంత నమస్కరించి యడిగె
నెవ్వరవు నీవు భవనము లీ బిలమ్ము
రత్నము లెవరివి చెపు మార్య! యని వినతి 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 51.

స్వయంప్రభ హనుమంతుఁ డడుగ ఋక్షబిల వృత్తాంత మెఱింగించి వానరుల కెల్లర కాతిథ్య మొసంగి రాకకుఁ గారణము నడుగుట.

కం. విమల మతి మారుతి యరసి
శ్రమణను గృష్ణాజి నాంబర మహాభాగన్
సముచిత నిజ ధర్మ చరిత
నమస్కరించి పలికె వచనము లిట్లంగిన్ 1.

ఉ. ఈ బిల మందుఁ జొచ్చితిమి యెల్లర మాఁకలి దప్పు లేఁపఁగ
న్మా బెద రగ్గలం బయి ఘనమ్ముగ డస్సి చరించు చుండఁగా
నీ బిల మందు నచ్చెరువు లెల్లను జూడఁగఁ గల్గె మూర్ఛయే
యీ బల వన్న గాటముల కెల్లఁ జెలంగెను భ్రాంతి బాధయున్ 2.

ఆ.వె. బాల సూర్యుఁ బోలు పసిడి మయమ్ములు
పాదపమ్ము లివి యెవరి ధనములు
శుచి కరములు నింక రుచి వంతములు భక్ష్య
మూల ఫలములు గొను పురుషఁ డెవరు 3.

తే.గీ. బంగరు విమానములు వెండి భవన పంక్తి
యుఁ దపనీయ గవాక్షములు దనరంగ
మణుల వలలను గూడి సమంచితముగ
వెలుఁగు చున్న వెవ్వరి సొత్తు వింత వొడమె 4.

తే.గీ. పుష్పితమ్ములు ఫలవంతములు సువాస
నలఁ జెలంగు చున్నవి మహా నగము లెవరి
తేజము వలనఁ గాంచన దివ్య రుచుల
తోడ నిచ్చట వీక్షింప వేడు కయ్యె 5.

ఆ.వె. విమల జలము లందు విరియు చున్నవి తమ్మి
గములు పసిడి రంగు లమర మిగుల
మచ్ఛెములు సతమ్ము నిచ్చఁ దాబేళుల
తోడుతఁ జరియించు వేడుకగను 6.

తే.గీ. అగునె యిది యెల్ల నీ శక్తి యంబ! లేక
యిం కెవరి తపశ్శక్తిని నిట్టు లుండె
నెఱుఁగ కుంటిమి మేమెల్ల నింత యేని
యర్హ వీవు వచింపఁగ నంతయుఁ గృప 7.

కం. అన హనుమంతుం డివ్విధ
ము నిత్య ధర్మ రత సర్వ భూత హిత తప
స్విని బదులుగ నంత వచిం
చె నిట్లు మారుతిఁ గని సురుచిర వచనములన్ 8.

తే.గీ. వాన రర్షభ! మయుఁ డను వాఁడు తేజ
మందు మిన్న మాయావియు నాత్మ మాయ
చేత నిర్మించె దీనిఁ బసిఁడి మయంపుఁ
గాననమ్మును నింపుగఁ గాంతు లీన 9.

తే.గీ. మున్ను దానవ వరు లందు మిన్న యైన
విశ్వకర్మ కలఁ డతఁడీ వేశ్మ రాజ 10.

మును హిరణ్య మయము దివ్యమును నిపుణత
మీఱ నిర్మించె నింపుగ మేటి యసుర

ఆ.వె. అతఁడు గొప్ప తపము నాచరించి సహస్ర
వర్షములు వరమును బ్రహ్మ వలనఁ
బడసె నసుర వరుఁడు వడయంగ శుక్రుని
విత్తము లఖిలముల నుత్తమముగ 11.

తే.గీ. వనము నొనరించి వసియించె బల్లిదుండు
కొంత కాలము సుఖముగ నంత హేమ
యనెడు నచ్చర తో నుండ నలిగి వజ్ర
మూని వధియించె నింద్రుఁడు వాని నంత 12.

తే.గీ. బ్రహ్మ యొసఁగె హేమ కిఁక శాశ్వతముగ వల
యు విధి ననుభవింప వనము నుత్తమమును
స్వర్ణ గృహముఁ గాతును స్వయంప్రభను నేను
మేరు సావర్ణి తనయను మించి దీని 13.

ఆ.వె. నాదు సఖియె వరము నాకు నీయఁగ హేమ
నృత్త గీతములను నిపుణ యీమె
రమ్య భవన మేను రక్షింతుఁ జక్కఁగ
సంతతము కపి వర! సంతసమున 14.

తే.గీ. ఏల వనముల వెదకెద రిట్టు లేమి
కారణమ్ము దుర్గమములఁ గాంతు రెద్ది
తిని రుచిర ఫల మూలములను వచింపుఁ
డింక నీరములను గ్రోలి శంక లేక 15.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది యొకటవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 52.

హనుమంతుఁడు తాపసి స్వయంప్రభతోఁ దమ వృత్తాంతము, బిల ప్రవేశ కారణము చెప్పి యాతిథ్యమునకుఁ దృప్తి సెందితిమి ప్రత్యుపకార మేమి సేయఁ గల మని యడుగ స్వయంప్రభ మీ వలన సంతసించితి నని యేమియు వలదనుట.

కం. హరు లెల్ల రుపశమిల్లఁగ
దరుమముగ నడచెడు నట్టి తాపసి యంతం
గరు ణార్ద్ర మానసమ్మున
స్థిర బుద్ధి వచించె నిట్లు తియ్యని పలుకుల్ 1.

తే.గీ. ఆరగింపఁ బండ్లను మీకు నలపు తీరె
నేని వానరువరు లార! యేను వినఁ ద
గినది యైనచోఁ బల్కుఁడు వినఁ దలంతు
మీ రిటఁ జరించుటకుఁ గల కారణమ్ము 2.

కం. విని యా పల్కుల నట్లన
హనుమంతుఁడు ప్రీతి మారుతాత్మజుఁ డంతన్
వినయమ్మున ఋజువుగ నె
ల్లను జెప్పం దొడఁగె నిట్లు రాముని కథనున్ 3.

ఉ. లోకుల కెల్ల రాడ్వరుఁడు లోక నుతుండును భ్రాత లక్ష్మణున్
వీఁకను భార్య జానకిని వెన్కఁ జరింపఁగఁ జేసి రాముఁ డా
ప్రాకట ధన్వి దాశరథి పన్నుగఁ జేరెను దండకావనిన్
పే కలికిన్ దశాననుఁడు వేఁగి హరించె జనస్థలిం దమిన్ 4.

తే.గీ. రాజు సుగ్రీవుఁడు సఖుఁడు రామునకుఁ గ
పీంద్రుఁ డతఁడు పంపెను మ మ్మహీన బలుఁ డ
గస్త్య చరిత దక్షిణ దిశఁ గాంచఁగ యమ
పాలితం బగు దిక్కున వానరులను 5.

ఉ. అంగద ముఖ్య వానరుల నంపెను మమ్ముల రావణాసురున్
వెంగలిఁ గామ రూపుని సవిస్తర మెల్లెడ జానకీ సతిన్
భంగము లేక మార్గణము పన్నుగఁ జేయుఁడు నా వచించి చ
క్కంగ వహించి యానతినిఁ గ్రన్ననఁ గాంచఁగ దక్షిణాశలో 6.

తే.గీ. వచ్చి శోధన మింపుగ వానరులము
సేసి యెల్లెడల నలసి సేరి వృక్ష
మూల మాఁకటఁ దపియించి చాల చింత
లోన మునిఁగితి మే దరిఁ గాన మకట 7.

ఆ.వె. ముఖము లెండెను భృశముగ ధ్యాన మగ్నుల
మయితిమి చరియింప నంత నగప
డఁగ బిలము కనులకు విగత ప్రకాశము
తరు లతా వృతమ్ము గురు తరమ్ము 8.

తే.గీ. తడియ ఱెక్కలు హంస లుదకము నందు
మునుఁగఁ గురర సారస గణములు ద్విజములు
బిలము నుండి వెడలఁ గాంచి యలరి పలికి
తినిఁ బ్రవేశింత మని సేన వినఁగ హరులు 9.

తే.గీ. సమ్మతింప నెల్లరును హస్తమ్ముల నొక
రి నొకరు గొని గాఢముగ మురిసి హరిపతి
కార్య తత్పరత నెలంగఁ గ్రన్నన బిల
మందుఁ జొచ్చితిమి తిమిర మందు నంత 10.

కం. ఇది మా కార్యం బీ పని
నిఁ దలఁచి వచ్చితి మిచటకు నెగడంగన్ డ
ప్పి దరికొన నాకఁలి భృశము
కదిసితి మెల్లరము నిన్ను గదలి బిలమునన్ 11.

ఆ.వె. ఆఁకటం దపింప నాతిథ్య మొసఁగ ఫ
లముల మూలములను రస యుతములఁ
దింటి మెల్లరము నతివ! తృప్తిఁ జెందితి 12.

మిప్పుడు కరుణింప నిచట నీవు

కం. ఆఁకలిచేఁ గృశియింపఁగ
వీఁకను రక్షించి తీవు ప్రియమున మమ్మున్
నీ కుపకారము నెయ్యది
యీ కపు లొనరింప వలయు నింపుగఁ జెపుమా 13.

తే.గీ. వానరు లన ధర్మజ్ఞులు వార లెల్ల
రం గని స్వయంప్రభ బదు లొసంగె నిట్లు
మీ యెడఁ బ్రసన్నత కలిగె మేటి ధర్మ
మునఁ జరింప లే దొక కార్యము నిట నాకు 14.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది రెండవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 53.

హనుమంతుఁడు వేఁడి కొనఁగ స్వయంప్రభ వానరుల నెల్లరను బిలము నుండి నిర్గమింపఁ జేయ వారు సుగ్రీవుఁ డొసఁగిన సమయము దాఁటఁగ నంగదాదులు వింధ్యగిరి చెంత వృక్ష మూలమున నాశీనులై ప్రాయోపవేశమునకై చింతించుట.

కం. పలుక శుభ భాషణముల ని
టుల ధర్మ యుతమ్ములను బటుతర శ్రమణీ
లలితాంగి యనింద్య చరిత
పలికె విని మరుత్సుతుండు వాక్యము లిట్లున్ 1.

తే.గీ. శరణు వేఁడు చుంటి మిట నెల్లరము నిన్ను
ధర్మ చారిణి! బిల మందుఁ దనరి తిరుగు 2.

చుండ సుగ్రీవుఁ డా మహాత్ముం డొసఁగిన
కాల మెల్లయు నక్కట కడచి పోయె

తే.గీ. కాన నీవు సుగ్రీవు వాక్యముల దాఁటి
నట్టి మమ్మెల్లరను విగ తాయువులను
బిలము దాఁటింప నర్హవు లలితముగను
గావుమ ప్లవగేశ్వర భయ కంపితులను 3.

చం. కల దొనరింప నొక్క గురు కార్యము ధర్మవిహార! యుండఁగా
బిలమునఁ జేయ కుంటి మది వేదన తోడ వచింప నిట్లు దాఁ
బలికె స్వయంప్ర భాఖ్య సతి వారక చేర నివర్తిలంగఁ బ్రా
ణుల కిఁక దుష్కరం బగు గనుంగొన రంధ్రము నుండి మారుతీ 4.

చం. అయినను నా తపో మహిమ నార్జిత మా నియమమ్ములం దగన్
రయమున నుద్ధరింతును బిలమ్మున నుండి హరీంద్ర! యెల్లరన్
నయముగ మూసికొండు నయనమ్ములు వానర వర్యు లెల్లరున్
నయనము లుండ మూయక ఘనమ్ముగ శక్యము కాదు దాఁటగన్ 5.

ఉ. అంత నిమీలి తాక్షులుగ నైరి హరీశ్వరు లెల్ల రింపుగన్
స్వాంతము లందు నిస్తరణ భావ మెలర్పఁగఁ గన్ను దోయి హ
స్తాంతములం దగిల్చి వెసఁ జక్కఁగ నొక్క నిమేష మాత్ర కా
లాంతర మందు నుంచె హరు లందఱ నామె బిలంపు వెల్పలన్ 6.

తే.గీ. ధర్మ చారిణి తాపసి తద్బిలమ్ము
నుండి నిష్క్రమింపఁగఁ జేసి మెండుగను ని
రాశ జెందిన వారిని ననునయించి
హరి వరుల నెల్ల వాక్రచ్చె నంత నిట్లు 7.

ఆ.వె. వింధ్య పర్వత మిది వివిధ తరు లతా వృ
తమ్ము ప్రస్రవణ నగమ్మ యది మ
హాంబుధి యది స్వస్తి యగు మీకు నే నేఁగె
ద గృహమున కని బిలముఁ గదిసె వడి 8.

కం. కనిరి వరుణాలయమ్మును
ఘన సాగరమును దరంగ కలితమ్మును ని
స్వనముల గర్జించెడు దా
నినిఁ బ్లవగులు ఘోరము నట నివ్వెఱ సెలఁగన్ 9.

ఆ.వె. మయుని మాయ చేత మలపఁ బడిన గిరి
దుర్గమముల వెదకఁ దోరముగను
రా జొసఁగిన నెలయు రయమున నెల్లయుఁ
గడచి పోయె నంచు నెడలఁ దలఁచి 10.

ఆ.వె. వింధ్య గిరికి మొదల విరివిగఁ బూసిన
యట్టి చెట్లు వెలయ నచటఁ గూరు
చుండి యమ్మహాత్ము లుదరి చింతింపఁ దొ
డంగి రెల్ల రపు డభంగముగను 11.

తే.గీ. పుష్పభార నతములను మూర లత ల
నేకములు పెనఁగి తరు లనేక ములను
గని వసం తాగమ మెఱిఁగి కాలము సన
నెల్లరు పడిరి భీతిని నిల పయి వెస 12.

ఉ. ఆ కపి వృద్ధ ముఖ్యుల వనౌకసులన్ వర శిష్ట వర్తులం
పే కని యంగదుండు కడు పెద్ద భుజుండు మృగేంద్ర విగ్రహుం
డా కపి సత్తముండు ఘనుఁడౌ యువరాజు వచించెఁ దియ్యనౌ
వాకుల నమ్మహా విదుఁడు పన్నుగ మన్నన సేసి వారినిన్ 13.

మ. కపి రాజేఁద్రుని శాసనమ్మున బృహత్కా ర్యార్థ మేతెంచి యీ
విపరీతంపు బిలమ్మునం దకట వేవేగంబ మాసం బహో
కపి వర్యుల్! చరియింప మీఱఁగ నెఱుంగం జాల రాశ్చర్యమే
యిపు డింకే మిటఁ జేయ నుత్తమము మీ రింపారఁ జింతింపుఁడీ 14.

కం. మన మెల్లర మాశ్వయుజం
పు నెల వెడలితి మటఁ గాలము నొసంగ వెసన్
ఘన విశ్వా సార్హులు మీ 15.

రు నీతి మార్గ ప్రవీణులు పతి హితార్థుల్

తే.గీ. పనుల నప్రతిములు నుత పౌరుషులు ప
నుపఁగఁ బింగాక్షుఁడు వడి నన్ను నిడి ముందు
మీర లెల్ల రేతెంచిరి మీఱ సమయ
మకృత కర్మల మైతిమి యందఱ మిట 16.

తే.గీ. పనినిఁ జేయని వారి కగును దలంపఁ
జావు కర్తవ్య మింక నిశ్చయముగ హరి
రాజు నాజ్ఞను బాటింప కే జనుండు
నుండు సుఖముగ జీవించి యుర్వి లోన 17.

ఆ.వె. స్వయము సమయ మీయఁ బ్రభువు సుగ్రీవుఁ డ
తిక్రమింప దాని స్థిరముగ నిఁక
వన చరులకు నెల్లఁ బ్రాయోపవేశన
మగును యుక్త మంచు నందు నేను 18.

కం. ఘన తీక్ష్ణుఁ డతఁడు సైజ
మ్మున సుగ్రీవుఁడు విభుం డిపు డకృతుఁ డగు వా
నిని క్షమియింపం డపరా
ధినిఁ జేరిన శిక్షల నిడు దీవ్ర తరముగన్ 19.

చం. తెలియదు జాడ జానకిది దీని కతం దొనరించుఁ బాపముం
గలవర మంద కుండ నిజ కాంతలఁ బుత్రుల నిండ్ల దుడ్డులం
దలఁగి విరక్తిఁ బ్రాణములఁ దప్పక నేఁడ త్యజింప మే లగుం
దలఁపఁ నెడంద నన్యమును దారుణ మైనను జేయ నొప్పగున్ 20.

చం. ధ్రువముగ నాతఁ డెల్లరకుఁ దీవ్రపు హింస లొసంగు నేఁగఁగన్
వివిధము లప్రమేయములఁ బృథ్విని దుర్భర రీతి వాని క
న్న వరము మృత్యు విచ్చట యనంగ నిజం బగు నిశ్చయమ్ము సుం
డు వనవిహార వీరులు! కఠోరుఁడు నాథుఁడు దండనమ్ములన్ 21.

తే.గీ. నేను మఱి యభిషిక్తుఁడఁ గాను యౌవ 22.

రాజ్య మందు సుగ్రీవుచే రాఘవుం డొ
నర్చె నభిషిక్తునిగఁ బ్రీతి నన్ను బుడమి
కాంతుఁ డింపుగ నక్లిష్ట కర్మి ఘనుఁడు

కం. మును సెలకొన్న పగ వలన
ననుం గని వ్యతిక్రముని ఘనమ్ముగ శిక్షిం
చు నతఁడు తీక్ష్ణ తరముగఁ గృ
త నిశ్చయుఁ డయి ప్లవగ పతి తప్పక యచటన్ 23.

తే.గీ. జీవి తాంత వ్యసనుని వీక్షింప నేల
నన్ను నా మిత్ర వర్గము మిన్నగ నిటఁ
బుణ్య సాగర తటిఁ బ్రాణములను విడువ
నెంతు బోజనమ్ములు మాని సంతతమ్ము 24.

కం. పలుక కుమా రాంగదుఁ డి
ట్టుల యువరాజు వగపున నుడువులు హరిశ్రే
ష్ఠులు విని దీన వదనులై
పలికిరి యెల్ల రుచితముగ వాక్యము లిట్లున్ 25.

ఉ. దేవర యెన్నఁగాఁ బ్రకృతిఁ దీక్ష్ణుఁడు రామ సఖుం డతండు సు
గ్రీవుఁడు వానిఁ జేరినను గెంతుచు నక్కట కాంచి యెల్లరన్
దేవిని జానకీ సతిని దృష్టులఁ గాంచక రాఘ వార్థమై
తా వధియింపఁడే మనలఁ దథ్యమ చూడుఁడి లేదు శంకయే 26.

చం. తగ దపరాధ భృత్యులకుఁ దల్పఁగ స్వామి సమీప మేఁగఁగన్
మగువను జానకీ సతిని మానక యిక్కడ రోసి చక్కఁగం
దగిన విధమ్ము కన్పడినఁ దత్పతి కాంతుము వానరేంద్రు నిం
కఁ గనక యున్న యేఁగెదము కాలుని వీటికి నిశ్చయమ్ముగన్ 27.

ఆ.వె. భీత తప్త కపుల వీక్షించి వచనము
లాలకించి తారుఁ డంత నిట్లు
పలికె నేల వగవ బిలము ప్రవేశించి
యుంద మిష్ట మైన నందటి కిది 28.

తే.గీ. యిమ్మహి నిది మాయా నిర్మితమ్ము దుర్గ
మమ్ము తరు జల పేయ భక్ష్యమ్ములు భృశ
మడరె భయము లేదు పురంద రాదుల నిఁక
వానరేంద్ర నరేంద్రుల వలన నిచట 29.

కం. విని యవి యంగదు పల్కులు
ననుకూలమ్ముగఁ బ్రతీతి నందఱు నపు డి
ట్లనిరి మనకు హింస యలవ
డని విధ మొనరింత మిట నడరి యని ప్రీతిన్ 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది మూడవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 54.

హరివరుఁ డగు తారుని పల్కులు విని యంగదుఁడు రాజ్యము గ్రహింప నున్న వాఁ డని తలంచి నివర్తింప నంగదునితో మారుతి భీతి కరముగ లక్ష్మణుని శరముల తీవ్రతను, సుగ్రీవుని గుణములను వర్ణించుచుఁ బల్కుట.

కం. తారాధిప నిభ తేజుఁడు
తారుఁడు హరివరుడు వల్కఁ దద్వాక్యములన్
మారుతి విని మది నంగదుఁ
డా రాజ్యమ్ముఁ గొన నెంచె నంచుఁ దలంచెన్ 1.

తే.గీ. అంగము లెనిమిది బలము లంగదునకు
నాల్గు గుణము లున్న వి పదునాలు గంచు
వాలి పుత్రునకుఁ దలంచె వానరప్ర 2.

వరుఁడు హనుమంతుఁ డత్తఱి స్వాంత మందు

సీ. రమణీయ తేజోబలపరాక్రమములు నిత్యమ్ము నిండిన వాని నాది శుక్ల
పక్ష శశి పగిది వర్ధిల్లు వాని సిరుల బుద్ధి లోన గురు నిభుఁ డయిన
వాని విక్రమమున వాలిఁ దండ్రిని బోలు వాని శుక్రుని నింద్రు భంగి నిపుడు
తారు సేవింపగఁ దనరెడు వాని రాజార్థము బడలిన యట్టి వాని

ఆ.వె. నంగదు యువరాజు నఖిల శాస్త్ర విదుల
శ్రేష్ఠు నంత హరి వరిష్ఠుఁడు హను
మంతుఁ డిట్టు లర్థ వంత వాక్యమ్ములఁ
గూర్పఁ దొడఁగె నట నకుంఠితముగ 3.

కం. నుత చతు రుపాయములఁ గొని
తృతీయ మింపుగను మారుతి తనదు వర వా
క్తతి వానరులం జేసెను
మతి భేదులుగ నడరి యసమాన ప్రతిభన్ 4.

ఆ.వె. వారి యందుఁ జెలఁగ మూరి భేదమ్ములు
మారుతాత్మజుఁడు కుమారు నంగ
దు నపుడు భయపెట్టె ఘన భీషణ గిరల
వెరవు నింకఁ గినుక పరఁగ నిట్లు 5.

ఆ.వె. అతి సమర్థుఁడ వని నంగద! తారేయ!
తండ్రి కన్న నీవు తగిన వాఁడ
వు ధరియింపఁ గపుల భూరిరాజ్యమ్మును
దృఢము గాను దండ్రి తీరు నిజము 6.

చం. అరయఁగ నిత్య మస్థిర హృ దార్తులు వానర వర్య! కోఁతులే
యరయక దార నందనుల నాజ్ఞ సహింపఁగ నోప రెల్లరున్
హరు లనుగాములై నిలువ రక్కట నిత్యము పల్కు చుంటి నే
స్థిరముగ జాంబవంతుఁడును ధీరులు నీల సుహోత్రు లేనునున్ 7.

తే.గీ. వీర లెవ్వరు లొంగరు వీర! సామ
దాన దండాది గుణములఁ దరము గాదు 8.

వీరి సెవ్వరి నైనను  వీఁకఁ గైకొ
నంగ సుగ్రీవు నుండి యెన్నండు నీకు

తే.గీ. బల్లిదుండు మార్కొనిన దుర్బలున కాస
నమ్ము మేలగు నందురు నమ్మకముగ
నాత్మ రక్షణ మూహించి యబలుఁ డెన్నఁ
డేని మార్కొనఁ జన రాదు వాని కెదురు 9.

కం. ఏ బిలము ధాత్రి వింటివొ
యా బిలమును జీల్పఁగ నగు నల్పపుఁ గార్యం
బే బాణములకు లక్ష్మణుఁ
డా బాహు బలుండు వేయ నత్యుగ్రముగా 10.

ఆ.వె. ఇంచుక యొనరించె మించి మున్నింద్రుఁడు
వజ్రము విసరి నిజ బలమున నిట
నిశిత బాణ రాశి నెమ్మి సౌమిత్రి ప
త్రమ్ము భంగిఁ జీల్చు దారుణముగ 11.

కం. అమరెను వజ్రాశని తు
ల్యములు నగమ్ములను జీల్చు నట్టివి సౌమి
త్రి మహాత్ము చెంతఁ బెక్కులు
సమ రాప్రతిహతు సెదిర్ప శక్యం బగునే 12.

కం ఎప్పుడు నీ వుంటకు నిట
మెప్పున నాశింతువో యమిత్రగణఘ్నా!
యప్పుడె వానరు లెల్లరు
తప్పక నిను వీడుదు రెడఁదల నిశ్చయులై 13.

కం. స్మరియించుచు దారా సుత
పరివారము సంతతమ్ము పరమోద్విగ్నుల్
హరివరు లయి దుఃఖ ప్ర
స్తరణు లయి వెనుకన యుంత్రు తప్పక నిన్నున్ 14.

ఆ.వె. చెలులు హితులు నింక స్వీయ బంధువులు లే
క యిచట భృశము భయ కంపితుండ
పై వ్యథార్తుఁడ వయి వానరేంద్ర! కదలా
డు తృణమునకు భయపడుదువు సుమ్ము 15.

కం. ఘోరము లగు నా లక్ష్మణు
నారాచము లెట్టు లుండు నాశం బరులన్
దూరము పాఱెడు వారిని
వారక చేయక భృశం బవార్యము లెల్లన్ 16.

కం. వినయ మడరంగ మా తో
డ నడచి కదిసిన గత కపటత్వమ్మున నా
ఘనుఁడు విభుఁడు సుగ్రీవుం
డనుక్రమమున నిడు నీకు హరి రాజ్యమ్మున్ 17.

తే.గీ. నీదు పినతండ్రి ధర్మము నెమ్మిఁ గోరు
వాఁడు ప్రీతి కాముఁడు ధృఢవ్రతుఁడు సత్య
వచనుఁడు శుచియు నంగద! వాలి తనయ!
యతఁడు సంపఁ దలఁపఁ డెన్నఁ డైన నిన్ను 18.

ఆ.వె. నీ జనని ప్రియము ననిశము గోరెడు వాఁడు
దాను బ్రదుకు నీదు తల్లి కొఱకు
సుతులు లేరు పరులు మతి వీడి శంకను
జనుమ యంగద యిఁక సత్వరముగ 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది నాలుగవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 55.

హనుమంతుని పల్కుల నంగీకరింపక సుగ్రీవుని నమ్మక తా నచటనే ప్రాయోపవేశము చేసెద నని
వానరుల నెల్లరను గృహముల కేఁగ మనిన వారును బ్రాయోపవేశమున కుద్యుక్తు లయి యచటనే
యుండఁ దలంచి  రాముని వన గమనము సీతాపహరణము జటాయు మరణాది విషయముల
నుచ్చరించుచు భయ మందుట.

కం. విని ధర్మ యుక్త వాక్కులు
హనుమంతుఁడు గౌరవించి యధిపునిఁ బలుకన్
వినయాతిశయమ్ముగఁ బ
ల్కె నంగదుఁ డసమ్మతమున గిర లిట్భంగిన్ 1.

తే.గీ. స్థైర్య మాత్మ శుచిత్వ మార్జవము విక్ర
మ మన్నృశంస్యము ధైర్యము విమలచిత్త!
కనము సుగ్రీవు నందు నక్కపి గణేంద్రు
నందు నిక్కముగను మారుతాత్మజ! విను 2.

ఉ. అన్న ధరింపఁ బ్రాణముల నన్న సతీ మణి మాతృ తుల్యఁ గై
కొన్న నతం డెఱుంగునె జుగుప్సితుఁ డక్కట ధర్మ మాజికై
చన్న నిజాగ్రజుం డకట సైఁపక మూయ బిలంపు ద్వారముం
గ్రన్నన న్యాయ మెట్లెఱుగుఁ గాతరుఁ డాత్మఁ దలంచి చూచినన్ 3.

ఆ.వె. పాణిని స్పృశియించి  పన్నుగ సాయము
సేయ ఘన యశస్వి యా యి నాన్వ
యుండు రాముఁ డా చెయువును దా మఱచె నిం
కెవరి కృతము నాతఁ డెడఁద నుంచు 4.

తే.గీ. లక్ష్మణుని భీతి చేతన రామ సతిని
సీత వెదకంగఁ బంపెను భీతిచే న
ధర్మము నెదఁ దలఁచి కాదు ధర్మ మకట
యతని యం దెట్టు లుండును వెతకి చూడ 5.

కం. స్మృతి హీనునిఁ బాపాత్ముఁ జ 6.

లిత చిత్తుఁ గృతఘ్నుని నడరి పుడమిలో నే
మతిమంతుఁడు నమ్మఁ గలం
డతని కులమున నుదయింప నార్యుం డరయన్

తే.గీ. దుర్గుణుం డైనఁ గాంచఁ బుత్రుండు సుగుణుఁ
డైన నిల్ప నెంతురు రాజ్య మందు నెట్లు
నన్ను శత్రు కులీనుని నెన్ని యుంచు
వాఁడు సుగ్రీవుఁ డకట జీవముల తోడ 7.

చం. తెలియ మదీయ మంత్ర మిట దీనుఁడ హీన బలుండ నింక ని
ట్టుల నపరాధి నైతినిఁ గడుంగడు దుర్బలు రీతి నుండఁగాఁ
గలనె యనాథు భంగిఁ గపి కాంతుని చెంతకు నేఁగి యక్కటా
ఖలుఁడు శఠుండు క్రూరుఁ డిడు గ్రన్నన రాజ్య నిమిత్త శిక్షనున్ 8.

తే.గీ. గోప్య శిక్ష నొసంగును గోరి కార
నుంచు బంధనమున కెంచ నంచితముగ
నిచటఁ బ్రాయోపవేశమే యింపు కొలుపు
ననుమతించి నన్నిట మీరు చనుఁ డచటకు 9.

తే.గీ. ఆన మీ పైన నేఁగను నేను బురికి
శ్రేయ మగు నాకు మరణమ్ము చింత సేయ
విడుతుఁ బ్రాణము లిచ్చట వెడలుఁ డింకఁ
బ్లవగ వరులార! యిండ్లకు వనము వీడి 10.

ఉ. ఆ వర రాఘ వేంద్రులకు నచ్చ టొసంగుఁడు వందనమ్ములన్
నావి యనంగ క్షేమము ఘనమ్ముగ నడ్గుఁడు పిన్నతండ్రి సు
గ్రీవున కిండు నా నతులు క్షేమము నడ్గితి నంచుఁ బల్కుఁడీ
నా వర మాత యా రుమకు నా జననీ మణి తారకున్ నతుల్ 11.

ఆ.వె. పల్కి కుశల మడుగ వలయు నారోగ్యము
నంత నూఱడింపుఁ డంబఁ దార
నింపుగ నటఁ బ్రకృతి నింతికి దయ మెండు
కనక నన్ను వీడు తనదు బ్రతుకు 12.

కం. ఇంత వలికి వృద్ధ కపుల
కంత నమస్కృతు లొసంగి నంగదుఁ డెడఁదన్
వంత సెలఁగ భువిపై ధ
ర్భాంతరములఁ గూలఁ బడెను హరు లరయంగన్ 13.

తే.గీ. కూరుచుండ నతండు వా రారసి వన
రుచును వెచ్చని కన్నీరు నచటఁ దుడిచి
కొంచు సుగ్రీవుఁ దిట్టుచు నంచితముగ
వాలిఁ బొగడుచుఁ జేరిరి వాలి సుతుని 14.

ఉ. వాలి కుమారు నంగదుని భావ మెఱింగి ప్లవంగు లంతటం
గాలునిఁ గాంచఁ గోరు చుదకమ్ము స్పృశించి ప్రతీచిఁ గాంచు ద
ర్భాలినిఁ గూరు చుండి రిఁకఁ బ్రాగ్దిశ నుండఁగ వారి వక్త్రముల్
మే లిది యంచుఁ బల్కుచును మీరపు టుత్తర తీరమం దటన్ 15.

తే.గీ. రామ వనవాస మా దశరథు మరణము
వధ జనస్థలిని జటాయు వధయు సీత
యపహరణము వాలి వధయు నాజి రాము
కినుకఁ బల్కుచుఁ భయ మందిరి నగ చరులు 16.

తే.గీ. అద్రి శృంగ నిభులు పెక్కు హరులు నిలిచి
యఱవ ధ్వను లెల్ల వ్యాపింప నా గుహాంత
రమున ఘోషంచు వారిద రావ నిభము
దనరె ఘోషల నమ్మహీధరము భృశము 17.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది యేనవ సర్గము.

## కిష్కింధా కాండము

# సర్గము 56.

వానరు లట్లు ప్రాయోపవేశము నెంచి కూరుచుండ నచటకు సంపాతి యను గృధ్రము జటాయువున
కన్న వచ్చి భక్ష్యములు దొరకె నని సంతసింప నంగదుఁడు సీతా రక్ష ణార్థము రావణుని చేత
జటాయువు మరణ మంది సుఖ ముండెను మన కట్లు లేదని పలుకు చుండ విని సంపాతి
యంగదునితోఁ బల్కఁ దొడఁగుట.

తే.గీ. గిరి తటి హరు లుండఁ దలంచి మరణ మెదల
నచట కరుదెంచె సంపాతి యనెడు గృధ్ర
రాజము బల పౌరుష గుణ ప్రవరుఁడు చిర
జీవి యా జటాయు భ్రాత చిత్రముగను 1.

ఆ.వె. గొప్ప దైన వింధ్య కుధర కందరము నుం
డి వెడలి వెలికిఁ బ్లవగ వరుల నుప
విష్టులఁ గని మిగుల హృష్టుఁడై సంపాతి
పలుకఁ జాగె నిట్లు వచనములను 2.

చం. నరులకు లోక మందుఁ గతనం గన నా విధియే యగుం గదా
విరివి విధానముల్ దనరుఁ బృథ్విని వింతగ నిట్లు భక్ష్యముల్
కరము లభించె నౌర చిర కాలము సాగగ నాకు నిచ్చటన్
హరులను నొక్కరొక్కరిని నంతము కాఁగ భుజింతు నింపుగన్ 3.

కం. విని భక్ష్య లుబ్ధు పల్కులు
హనుమంతుని తోడ నిట్టు లంగదుఁ డంతన్
ఘనముగ నిరాశ డెంద
మ్మునఁ దనరఁగఁ బలికె వచనములు వగ మీఱన్ 4.

కం. కనుమా సీతా కారణ
మున సాక్షా ద్యముఁ డిటకుఁ గపుల యాపదకై
చనుదెంచె గృధ్ర రూప
మ్ము నూని యిటు లాంజనేయ! బోరన నకటా 5.

తే.గీ. చేయ లేదు రాముని పని చెన్నుగాను
జేరి సుగ్రీవు నానతిఁ జేయ లేదు
వచ్చె నజ్ఞాత కృచ్ఛ్రము వానరులకు
మూరి యాకస్మికముగ విబుధ వరేణ్య! 6.

ఉ. వింటిమి గృధ్ర రాజు కడుఁ బ్రీతిని సీత కొనర్ప సాయమే
యొంటరిఁ జేయఁ గృత్యము మహోన్నత బుద్ధి జటాయు వత్తఱిన్
గంటిమి యిట్లు రాఘవుని కార్యము సేయఁగ జంతు జాలమే
యొంటిని వీడఁ బ్రాణము లహో హిత మింపుగఁ గూర్ప నెంచుచున్ 7.

తే.గీ. స్నేహ కారుణ్యము లడర నోహటిల్ల
కొకరి కొక రుపకారము లుర్విఁ జల్పు
చుందు రవ్విధి నా జటాయువు త్యజించె
రామ కార్యార్థియై తన ప్రాణములను 8.

చం. హిత మొనగూర్చె రామునకు నీ విహగమ్ము జటాయు వింపుగన్
వితతపు ధర్మవేత్త కడు వేదన సెంది తదర్థమై సమం
చితముగఁ జేరి కానలను సీతను గన్గొన కుంటి మక్కటా
పతగ వరుండు గాంచ సుఖి పన్నడ మృత్యు వెదిర్ప రావణున్ 9.

తే.గీ. ముక్తుఁ డయ్యె సుగ్రీవు సమున్నతంపు
భయము నుండి జటాయువు స్వర్గ మరసి
దశరథు జటాయు లయమున ధరణి జాప
హరణమున సంశయు లయిరి హరులు భృశము 10.

చం. వసనము రామ లక్ష్మణుల భామను సీతను గూడి కానలన్
విసరిన రామ బాణమున వేగమ వాలి విదారణమ్మునున్
వెస నలుగంగ రాఘవుఁడు వీరులు రక్కసు లెల్లఁ జచ్చుటల్
ముసిరెను గైక కిచ్చిన యపూర్వ వరమ్ముల నెంచి చూడఁగన్ 11.

కం. విని యసుఖమ్ములు వచియిం
చిన వట్లు భువి పతిత కపి శేఖరులం గాం
చిన చలిత మానసుఁడు వ 12.

ల్కె నా మహామతి ఘనుండు గృధ్రర్షభుఁడే

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది యాఱవ  సర్గము.

# కిష్కింధా కాండము

# సర్గము 57.

అంగదుఁడు సంపాతికి రాముని వృత్తాంతము సీతాపహరణము జటాయువు మరణము సీతా న్వేషణమునకై తా మిక్కడ కేతెంచి యెంత వెతకిన సీతను గాన రాకుంటను దాము సుగ్రీవాజ్ఞ నతిక్రమించి నందునఁ గిష్కింధకుఁ జన నెంచక ప్రాయోపవేశము సంకల్పించుట నెల్లఁ జెప్పుట.

కం. విని యంగద ముఖ గళితము
లను వాక్యమ్ములను గృధ్ర రాజు మహా ని
స్వన తీక్ష్ణ చంచు వంత వ
చనముల నిట్బంగిఁ బలికె సంరంభమునన్ 1.

తే.గీ. ఎవ్వరీ జటాయువు వధ నొవ్వి కలుగ
నాకు డెందము కంపింప నాదు ప్రియత
మంపు సోదరు వధ గూర్చి మాట లాడు
చుంటి రిచ్చట నేఁ గోరు చుంటిఁ దెలుప 2.

ఆ.వె. సమర మెవ్విధమ్ము జరిగె జనస్థాన
మందు రాక్షసునకు నా జటాయు
వునకు భ్రాత పేరు వినఁబడెను జిర కా
లమున కిచట వానర వర! నాకు 3.

చం. గిరి వర మందు నుండి నను గ్రిందకు మిమ్ముల దింప వేఁడెదన్
వర సుగుణుండు విక్రముఁడు వంద్యుఁడు తమ్ముడు వాని కీర్తనన్ 4.

హరివరు లార చాల సమయమ్మున కేను వినంగ నిచ్చటన్
గురు తర హర్ష మందితిని కోరిక దీర్పుఁడు సత్వరమ్ముగన్

కం. విన నెంతు జనస్థాన
మ్ము నందు వసియించు వాని పుణ్యాత్ము లయ
మ్మును సోదరుని జటాయువు
ఘను నిర్మూలమ్ము సెల్లఁ గపివరు లారా! 5.

ఆ.వె. తమ్మునకు సఖుండు దశరథుం డెట్లయ్యె
నెవ్వనికిఁ బ్రియంపు జ్యేష్ఠ సుతుఁడు
రాముఁడు గురుజన పరమ హితుండు వచింపుఁ
డెల్ల విశదముగఁ గపీంద్రు లార! 6.

తే.గీ. సూర్య కిరణమ్ముల వలన నార్యు లార!
నాదు రెండు ఱెక్కలు మండిన కతమునను
బర్వతము నుండి కదల నా వశము కాదు
శత్రు వీర మర్దనులార! సాయ మిండు 7.

చం. తడఁబడ మాట శోకమునఁ దద్దయు నైనను నమ్మ లేక వా
రెడఁదల వానరప్రవరు లెల్లఁ దలంపఁ దొడంగి రివ్విధిన్
బెడిదపు శంక తోడ ద్విజ వీరుని కర్మము లందు చావ సెం
చెడి గతి నున్న వా రితఁడు శీఘ్రముగాఁ దిను వాఁడు మమ్ములన్ 8.

తే.గీ. చావ సెంచిన వారము గావునఁ దిని
న మనల నితండు కృతకృత్యుల మగుదు మిఁక
సిద్ధి లభియించు క్షిప్రము బుద్ధి నుంచి
యివ్విధముగ వారెల్లరు సెలమి ద్విజుని 9.

తే.గీ. దింపి రా పర్వతము నుండి ధీరుఁ డంగ
దుండు సెప్ప దొడంగెను దూర్ణ మిట్లు
ఋక్షరజుఁడు రాజేంద్రుఁడు రక్షకుండు
గలఁడు నా కార్యుఁ డో విహగ కుల రాజ! 10.

ఉ. పావనుఁ డింక ధార్మికుఁడు పార్థున కిద్దఱు వాలి యింక సు
గ్రీవుఁ డనంగ సూనులు సుకీర్తిత వీర్యులు లోక విశ్రుతుం
డౌ వర వానరేంద్రునకు నౌదు సుతుండను నేను వాలికిన్
భూవరుఁ డైన రాముఁడు రిపుఘ్నుఁడు భార్యయు భ్రాత వెంట రాన్ 11.

ఉ. సీతయు లక్ష్మణుండు తగ సేవల నీయఁగ దండకా వనిం
బ్రీతి వసించు చుండ నట వీరుఁడు రాముఁడు తండ్రి యాజ్ఞతో
నాతత ధర్మముం గొని దశాననుఁ డంతట దొంగిలించె నా
నాతిని జానకీ సతిని నారుల నుత్తమ మైన నారినిన్ 12.

ఉ. రాముని తండ్రి మిత్త్ర ఖగ రాజు జటాయువు గాంచి సీతనున్
భూమిజ రావణుండు గొని పోవఁగఁ ద్రోసి రథమ్ము నుండి తా
నా మనుజాశనున్ ధృతిని నంగన జానకి నుంచి ప్రక్కనన్
స్థామ మణంగ వృద్ధుఁ డనిఁ దద్దయుఁ బోరి నశించె వానిచే 13.

తే.గీ. బల్లిదుం డగు రావణు వలనఁ జంపఁ
బడ విహంగమ వీరుఁడు భండనమున
సంస్కరింపఁ గాకుత్స్థుఁడు సద్గతులను
బడసె నింపుగ నచ్చట పక్షిరాజ! 14.

ఆ.వె. శుభముగఁ బిన తండ్రి సుగ్రీవు తోడుత
సఖ్యము నొనరించి చంపె వాలి
నాదు తండ్రి నంత నర వరేణ్యుఁడు రాఘు
వుండు సమర కోవిదుండు ఘనుఁడు 15.

తే.గీ. నాదు జనకు విరోధి యిన కుల సంభ
వుండు రాముఁడు వధియించి బోరనఁ బిన
తండ్రి రాజ్య మందు నిలిపెఁ దద్ద ప్రీతి
రాడ్వరునిగ నీ వానర వ్రాతమునకు 16.

కం. తా నభిషిక్తుండై వడి
వానర విభుఁ డనిపె మమ్ము వైదేహిఁ గనన్
మానవ నాథుండు ననుపఁ 17.

గానము నిసి సూర్యు వెలుఁగు కరణిని సీతన్

తే.గీ. అట్టి మే మెల్లరము దండ కాటవీ త
టి వెదకుచుఁ గలసి జొరఁ బడితిమి యొక్క
బిలము నందు నెఱుక లేక యలసి యుండి
తాపసోత్తమ మాయా విధాన మందు 18.

కం. మయ మాయా నిర్మిత మక
ట యందు వెదకంగ నలమటఁ గడచి పోయెన్
నయముగఁ గపి రా జిడిన స
మయంబు మాస మది యెల్ల మాకు ద్విజేంద్రా! 19.

ఆ.వె. కడు విధేయుల మిలఁ గపివరు సుగ్రీవు
నకుఁ గృత సమయమ్ము విక్రృత మై చ
నంగ నసువులను విడంగ నెంచితి మెల్ల
ర మిట భీతి నెంచి రాజు వలన 20.

కం. కినుక వహించిన సుగ్రీ
వ నృవర కాకుత్స్థులు చన వానరులము మే
మనుమాన మొకింతఁ గనము
సునిశ్చయముగ బ్రతుక మట సువ్రత వినుమా 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది యేడవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 58.

సంపాతి యంగదుఁ డడుగఁగ సీతను రావణుఁడు గొని పోవుచుండఁ దాను జూచె నని పలికి రావణు

నునికిని వివరించుట.

కం. దీనముగ నిట్లు పలుకఁగ
వానరులు బ్రతుకున నాశ వదలిన వారల్
తా నాలకించి కన్నీ
రే నిండ వచించె గ్రద్ధ యిట్లు హరులతో 1.

ఉ. రావణుచే వధింపఁబడి వ్రాలిన వాడని పల్కు చుంటిరే
యా విహగుండు నాకు నకటా యనుజుండు జటాయువే యగున్
రావణు భ్రాతృ శత్రువును రాల్పఁగ వృద్ధుఁడ నే నశక్తుఁడన్
నా వగు దగ్ధ పక్షముల నైరృతుఁ జంపఁగ నెట్లు నేర్తునే 2.

ఉ. మున్ను జయార్థు లిర్వురను బోరఁగ వృత్ర వధాంతరమ్మునన్
మిన్నగ నన్న దమ్ములము మిత్రునిఁ జేరగ రశ్మి మాలినిన్
మిన్నున మండు చుండగను మేటి జవమ్మున మార్గ మధ్య మం
దున్న తఱిన్ జటాయువు మహోగ్రముగా నట డస్సి నంతటన్ 3.

చం. అనుజునిఁ గాంచి సూర్య కిర ణార్దితు స్నేహము మీఱ ఱెక్కలం
దనువును గప్పి యుంచితిని తద్దయు విహ్వల మానసుండనై
ఘనముగ నాదు పక్షములు గాలఁగఁ గూలితి వింధ్య పర్వత
మ్మున వడి నిల్వ నచ్చటను మూల్గుచు తమ్ముని నేర జాడనే 4.

కం. పలికిన జటాయు భ్రాత యి
టుల సంపాతి విని యా నుడుల నంగదుఁ డా
లలిత ప్రాజ్ఞుఁడు యువ రా
జల బదులుగ పలికె నిట్టు లాత్రము మీఱన్ 5.

తే.గీ. నా పలికిన జటాయువున కగు దేని
నన్న వెఱఁగినఁ జెప్పుమ యయ్యసురు ని
లయము చేరువ యైన దూరము నయినను
నా యదీర్ఘ దర్శను నిలయమ్ము నిప్డు 6.

ఉ. అంత జటాయు నగ్రజుఁడు హర్ష మొసంగు విధమ్ము యుక్తముల్ 7.

వంత తొలంగు భంగి మృదు వాక్యములన్ వచియించె నివ్విధిన్
సుంత బలమ్ము లేదు మెయిఁ జూడఁగ దగ్ధము లయ్యె ఱెక్కలే
కొంత యొనర్తు నింపుగను గూరిమి మీఱఁగ వాక్య సాహ్యమున్

తే.గీ. వారుణ జగమ్ము లెఱుఁగుదు వామనుని త్రి
విక్రము జగమ్ము లెఱుఁగుదు వేల్పుల యసు
రుల సమర మెఱుఁగుదు నమృత లలిత మథ
నం బెఱుంగుదు నేను దధ్యంబు సుండి 8.

కం. రాముని దగు నీ కార్యము
నే మును మున్న యొనరింప నీతియ చుమ్మీ
నే ముదిమి నుండ భృశముగ
నా మేన నసువు లలసెను నగచరు లారా 9.

మ. కొని పోవం బడ రావణాసురునిచే ఘోషింప రామా యహో
కను సౌమిత్రి యటంచు రూపవతి తత్కాంతా లలామంబు యౌ
వన రత్నంబు విభూషలన్ విడుచుచున్ వైదేహి కంపించుచున్
వనరం గాంచితి నేను భూషితను నా భామా మణిన్ దేవినిన్ 10.

ఆ.వె. పర్వ తాగ్ర మందు భాను ప్రభను బోలెఁ
బడతి కట్టి నట్టి పట్టు బట్ట
మేఘ మందు వెలుఁగు మెఱపు పగిది నుండె
నీలి యసురు చెంత నీలవేణి 11.

ఆ.వె. రామ పలుకు చుండ రామ నామము నార్తి
సీత యంచు నేను నాతి నెంచి
తి నెద నసురు గృహము తెలిపెద హరివర్యు
లార వినుఁ డిఁక వివరమ్ము గాను 12.

ఉ. శూర వరుండు విశ్రవసు సూనుఁడు నింకఁ గుబేరు తమ్ముఁడున్
మూరి వసించు లంక యను భూరి పురమ్మున విశ్వ కర్మచే
నా రమణీయ పట్టణమె యంబుధి నిర్మిత మయ్యె నింపుగా
నారయ వందయోజనము లావల ద్వీపము నందు నైపుణిన్ 13.

ఉ. ద్వారము లుండ చిత్రములు స్వర్ణ మయమ్ములు నభ్ర వేదికల్
మూరఁగ వేశ్మ రాజములు ముట్టుచు నింగిని వెల్గు చుండఁ బ్రా
కారము లర్క వర్ణమునఁ గన్నుల కింపు నొసంగుచుండ నా
కారము లందు సామ్యములుగా గృహ రాజినిఁ జూడ నింపగున్ 14.

తే.గీ. రావ ణాంతఃపురమ్మున రాక్ష సాంగ
నా సురక్షిత యై యుండ నలఁగు చుండి
సీతఁ జెఱ యందుఁ గందురు భీత చిత్త
నతివఁ గౌశేయ వాసిని నచటి కేఁగ 15.

చం. చని శత యోజనమ్ములు వెసన్ జల రాశికిఁ బూర్ణ మంతముం
గని యట దక్షిణంపుఁ దటిఁ గ్రన్నన లంకను వార్ధి గుప్తముం
గనుఁ డసురేంద్రు రావణునిఁ గాంతను గొన్న దురాత్ము నచ్చటన్
ఘనముగ విక్రమింపుఁ డిఁకఁ గార్య నిమిత్తము సత్వరమ్ముగన్ 16.

సీ. వత్తరు గాంచి తప్పక తిర్గి జ్ఞాన దృష్టి నరయఁ గల్గితి వినుఁడు కపులు!
తొలి గతియగు పిచ్చుకల కింక గింజ తిండ్లకు రెండవది కాకులకును బండ్ల
తిండ్లకుఁ గాఁగఁ దృతీయంపు మార్గము కోళ్లకు నగుఁ గ్రౌంచ కురరములకు
డేగలు నాల్గున నేఁగ గృధ్రము లెల్లఁ బాఱంగ నేర్చును బంచమమున
తే.గీ. బల పరాక్రమ ధైర్య సంపన్న హంస
లాఱవ గతినిఁ బయనించి యడర పైన
తేయుఁ డా పైనఁ జన నేర్చు నాయన వల
న జనియించిన వారమ నిజము మేము 17.

కం. నిలిచి కన నేర్తు నిచ్చట
సలలితముగ రాక్షసుని దశగ్రీవుని నా
లలితాంగి జానకీ సతిఁ
గల వా దివ్య నయనములు కపివరు లారా! 18.

తే.గీ. వంద యోజనముల దూర మందు నున్న
వానిఁ గాంచ నేర్తుము మేము వాన రేంద్రు
లార! యాహార బలమున నారయ సహ 19.

జత్వమునను స్పష్టముగును సంతతమ్ము

తే.గీ. నైజమున మాకు దూరమున నొనరింపఁ
బడియె వృత్తి పా దాయుధ వర్గమునకుఁ
బాద మూలము లంద నివ్వటిలు వృత్తు
లెల్లఁ బరికించి చూడఁగఁ గల్ల కాదు 20.

కం. మనుజాశనుఁ డొనరించెను
ఘన గర్హిత మైన యట్టి కార్యం బకటా
యనుజాంతకునకుఁ జేయ న
గు నిటఁ బ్రతీకార మిట్లు కోతులు! వినరే 21.

ఆ.వె. లవణ జలధి దాఁట నవసరం బగు నుపా
యమ్ము దలఁప వలయు హరి వరేణ్యు
లార! చేరి సీత నారసి మరలి రా
గలరు వడయఁ గలరు కార్య సిద్ధి 22.

తే.గీ. కోరుకొందును వనధికిఁ గొని చనంగ
నన్ను స్వర్గస్థునకు నిత్తు నన్న లార!
యుదక మే నమ్మహాత్మున కుత్తమునకుఁ
బ్రీతి వరుణాలయమ్మునఁ బేర్మి తోడ 23.

తే.గీ. అంతఁ గొనిపోయి సంపాతి నబ్ధి కడకుఁ
బ్లవగ వరులు తిరిగి దగ్ధ పక్ష యుగ్మ
నుంచి గిరి చెంత వృత్తమ్ము నంచితముగ
నేర హర్ష యుక్తు లయిరి నెమ్మనముల 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది యెనిమిదవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 59.

సంపాతి పల్కు లమృత తుల్యములు గాఁగ జాంబవంత ప్రముఖులు సీతకై వివరము లడుగ
సంపాతి తన సుతుఁడు సుపార్శ్వుని వలన వినిన వృత్తాంతము సెప్పి కాలాతిక్రమణమునకు
వగవక యుద్యమింపుఁ డని ప్రబోధించుట.

తే.గీ. ఆ సుధా పాన తుల్యము లాలకించి
గృధ్ర రాడ్వచనములను గృత్స్న ములను
నెల్ల వానరేంద్రు లెదల నుల్ల సిల్లి
రత్యధికముగ నుప్పొంగి రంత మురిసి 1.

కం. భువినుండి యుఱికి త్రుటి జాం
బవంతుఁడు ఘనుండు కూడి వానర వరులన్
వివరమ్ముల నెఱుఁగఁ దలం
చి విహగ రాజేశ్వరు నరసి యడిగె నిట్లున్ 2.

ఉ. ఎక్కడ సీత యున్న యది యెవ్వరు గాంచిరి దొంగిలింపఁగా
నక్కట యేరు జెప్పఁ దగు దంతయు మాకిట రక్షకుండపై
యుక్కు శరమ్ము లక్కట రఘూత్తముఁ డేయఁగ వజ్ర తుల్యముల్
మిక్కిలి కోపి లక్ష్మణుని మేటి పరాక్రము నెన్నఁ డెవ్వఁడో 3.

చం. అన విని ప్రీతి సీత కథ నంత నెఱుంగఁ దలంచు వారు దా
ననునయ పూర్వకమ్ముగ మహాత్ముఁడు కొన్ని వచించి పల్కులన్
వినుఁడు కపీంద్రులార! త్వదభీష్టము లెల్ల వచింతు నింపుగా
నని వచియింపఁ జాగెఁ గథనంత పతంగ వరేణ్యుఁ డివ్విధిన్ 4.

తే.గీ. వినుఁడు సీతా హరణము నాకు నుడివి రెవ
రొ యిపు డామె యున్నది యెక్కడో వచియింతు
నెల్ల వివరముగను మీకు నుల్లము లల
రంగ నేఁ జిర ముండఁ బర్వతము నందు 5.

తే.గీ. పక్ష హీనము సుక్షీణ బలుఁడ నలసి 6.

న యసువుల బహు యోజన నగము నందు
వృద్ధుఁడ వసింప నట్టి నా కెలమి మీఱ
నా సుతుఁడు సుపార్శ్వుం డశనము నొసంగు

ఆ.వె. తీక్ష్ణ కాములు జగతిఁ గన గంధర్వులు
తీక్ష్ణ కోపు లహులు తీక్ష్ణ భయులు
మృగము లెల్ల నకట మేము తీక్ష్ణ క్షుధా
ర్తుల మగుదుము భువి గురు తర రీతి 7.

చం. ఒక తఱి నాకు నాకఁలిని నుండి తపించెడి వాని కీయ సెం
చి కుడుపు నస్తమింప రవి చేరెను మాంస విహీనుఁడై కటా
వికట మనోరథుండు నయి ప్రీతి నొసంగుచు గౌరవించి నా
దు కొడుకు పల్కె వాక్యములు తూర్ణము తెల్పుచుఁ గారణమ్మునున్ 8.

ఉ. ఎప్పటి యట్ల కాలమున నేఁగి పలార్థము నిల్వ నడ్డుగా
నొప్పి మహేంద్ర పర్వతపు టొడ్డున ద్వారము నందు నింపుగా
నప్పుల నుండు జంతువుల కడ్డముగాఁగ నధో ముఖుండనై
యప్పుడు తండ్రి! చూచితిని యన్యుని నొక్కని వచ్చుచుండఁగా 9.

తే.గీ. ఉదయ సూర్య సమప్రభ నొడిని నుంచి
వెలఁది భిన్నాంజన నిభుఁడు వెడల తోడఁ
గాంచి యాహార మని యెంచి కరము మురియ
వినయమున దారిఁ గోరెను నను నతండు 10.

కం. విన యాంచిత సంపన్నుల
ను నీచు లందు నొకఁ డయిననుం బ్రహరింపం
గ నెడఁదఁ దలంప నేరం
డన నను బోటులఁ బలుకఁగ నకటా యేలా 11.

తే.గీ. తేజమున నాతఁ డేఁగెను దివిఁ గుదించి
నట్టి రీతిని నను దాఁటి యంత ఖేచ
రాదు లెల్ల రింపుగ నన్ను నాతతముగ
గౌరవించిరి యత్తఱిఁ జేరి దరికి 12.

తే.గీ. బ్రతికి తీ విప్పు డివ్విధి భాగ్య మహిమ
నాతి తోఁడ నేఁగుచు వీడె నాతఁడు నిను
స్వస్తి యగు నీకు నిశ్శంకఁ బల్కిరిట్లు
మౌని వర్యులు దరి సేరి మాననీయ! 13.

చం. అని వచనమ్ము లిప్పగిది నాతఁడె రావణుఁ డంచు తెల్పిరా
మునులును సిద్ధ వర్యులును భూజను రాముని దార నాతఁడే
కొని చను చుండె రాల భువి కోమలి భూషలు శోక తప్తయై
వనరుచు రామ లక్ష్మణులఁ బల్కుచు నుండఁగ వీడఁ గేశముల్ 14.

ఆ.వె. కారణంబు తండ్రి కాలాత్యయమున కి
ది యని నన్నరసి తనయుఁడు వల్కె
నా సుపార్శ్వుఁ డప్ప డంతయు నా తోడ
వివరముగను బ్లవగ వీరు లార! 15.

కం. వినినను గిర లవి కలుగదు
మనమున వడి నుద్యమించు మతి సుంతయినం
దన కుండకున్న ఱెక్కలు
పనులకుఁ దొడరఁ దగు నెట్లు పక్షి తలంపన్ 16.

తే.గీ. తనర వాగ్బుద్ధు లింపుగఁ దప్పక వచి
యింతుఁ బౌరుష వంతులు పంత మూని
చేయఁ దగు కార్య మెల్లను శీఘ్ర గాము
లార! వినుఁడు ప్లవగ వరు లార! ధృతిని 17.

ఆ.వె. వాక్కులఁ దలపులఁ బ్లవగవరు లార! మీ
కు నొనరింతుఁ బ్రియము వినుఁడు రామ
కార్య మగును నాదు కార్యము సంశయ
మందు లేదు సుంత యైన నరయ 18.

ఉ. వానరు లార! మీరు బల వంతులు ధీయుతు లెల్లరుం గనన్
వానర రాజు మిమ్ములను బంపె నజేయులు నిర్జరాలికిం 19.

గానఁగ మీరు సాయక నికాయము వేయఁగ రామ లక్ష్మణుల్
పూనుచు మూడు లోకములఁ బోర సమర్థులు కావఁ గట్టఁగన్

కం. బల తేజముల దశాననుఁ
డిల మిన్నయయినను వాన రేశ్వరు లారా!
కలదే దుష్కర మించుక
దలఁప సమర్థులరు మీకు ధరలో నెల్లన్ 20.

కం. కాలాతిక్రమణమునకు
నేలా చింతింపఁ బూనుఁ డింక నెడఁదలన్
మేలుగ నిర్ణయమును మిము
బోలెడు తెలివరులు కర్మముల జంకుదురే 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నేఁబది తొమ్మిదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 60.

సంపాతి తన వృత్తాంతమును వానరులకు వివరించుట.

కం. స్నాన మొనరించి తా నా
శీనుఁడు గా గృధ్ర మపుడు చేరిరి చుట్టున్
వానరు లెల్లరు మూరిన
యానందమ్మున గిరివర మందుఁ గ్రమమునన్ 1.

కం. పరివృతులై యుండఁగ హరి
వరు లంగదునిం గని హరుఁ బక్షీంద్రుఁ డెదం
బరఁగగ నమ్మకము భృశము 2.

మురిసి పలికె నిట్లు వాక్యములు దగ నంతన్

తే.గీ. జానకిని నే నెఱిఁగి నట్టి చంద మెల్లఁ
దెలిపెదను సావధానులై ధీరు లార!
కపి వరేణ్యు లార! వినుఁడు కాలి ఱెక్క
లు పడ వింధ్య శిఖరమున నపుడు సోలి 3.

ఆ.వె. సూర్య తాప మెల్లఁ జుట్టుకొన మెయిని
మంట పుట్ట నాకు నొంటి నిండ
విహ్వలుండ నైతి వీక్షించి తెలి వొంద
నాఱు రాత్రు లరుగ నకట దిశలు 4.

ఆ.వె. నేర కుంటి నెద్ది నేను గాంచి కడలి
వనులు నదులు గిరులు పన్నుగ మది
నెఱిఁగితిని విహగము లింక గుహలతోడ
వింధ్య గిరి యిది యని విశదముగను 5.

తే.గీ. దక్షిణ సముద్ర తీరము దగ్గఱ గిరి
వింధ్యకు సమీప మందుండె విబుధ పూజి
తమ్ము తాపసాశ్రమ ముగ్ర తాపసుఁడు ని
శాక రాఖ్యుఁడు వసియించుఁ జక్కగ నట 6.

కం. ముని స్వర్గస్థుఁడు కా నట
వినుండు ధర్మజ్ఞులార! పే లెనిమిది యేం
డ్లు నివాస ముంటి సంయము
ని నిశాకరు నాశ్రమ తటిని నిరామయమే 7.

చం. అలయుచు వింధ్య పర్వత మహాగ్రము నుండి కపీంద్రు లార! డి
గ్గి లలిత రీతి దర్భ తృణ కీర్ణ ధరాతల మందు నిల్చితిన్
సొలయుచు నా ఋషిప్రవరుఁ జూడఁ దలంచితి భక్తి తోడ ము
న్నిలఁ బలుమార్లు చూచితిని యింపుగఁ దమ్ముని తోడ నమ్మునిన్ 8.

ఉ. ఆ ముని యాశ్ర మాంతికము నందు సుగంధ సుపూర్ణ మారుతం 9.

బేమఱ కుండ వీచు సత మింపుగ వృక్షము లుండుఁ జక్కగం
గామిత పుష్ప సత్ఫల నికాయ యుతమ్ముగ నెల్ల వేళలన్
నే మఱి చేరి యాశ్రమము నిల్చితి పాదప మూలమం దటన్

ఉ. చూడఁగ నెంచి నచ్చటను శుద్ధ మునీంద్రు నిశాక రాఖ్యునిన్
వేడుక నుండ దూరమున వెల్గెడు తేజము తోడ స్నాతునిం
బాడిగఁ జూడ శక్య మనఁ బల్క నశక్యునిఁ గంటి సంయమిన్
వాడని యుత్త రాభిముఖు బ్రహ్మ నిభ ప్రభు దేవ సన్నిభున్ 10.

తే.గీ. ఋక్ష సృమర కరి ఫణి మృగేంద్ర సంచ
య భయద వ్యాఘ్ర రాజము లారసి ముని
ననుసరించినవి కలసి యఖిల జీవు
లంబుజ భవు వెనుక చేరి నట్టి విధము 11.

కం. నరపతిఁ గాంచిన మంత్రులు
వర సైన్య పటలము భంగిఁ బరమర్షిఁ గనన్
మరలిన వా సత్వమ్ములు
త్వరితమ్ముగ నెల్ల నంత వానరు లారా! 12.

తే.గీ. ముని వరుం డాశ్రమము లోనికి నరిగి తిరి
గి వెడలి ముహూర్తమున నడిగెను నను గని
రాకకుఁ గల కారణ మేమి నాకుఁ జెపుమ
సౌమ్య! యనుచు గారవమున రమ్యముగను 13.

తే.గీ. కేశ వైకల్యముఁ గనఁ బక్షి కుల వర్య!
పక్ష యుగ్మము లక్కట వహ్ని దగ్ధ
ము లని  నెఱుక యయ్యె విశదముగను మేను
గూడ నిండె వ్రణమ్ముల ఘోరముగను 14.

ఆ.వె. పూర్వ  మరసితి నిరువుర నేను వాయు వే
గ సముల విహగముల గ్రద్ద లందు
శ్రేష్ఠ గృధ్ర వరులఁ జెన్నుగఁ గామ రూ
పులను సోదరులను ముచ్చటగను 15.

ఆ.వె. పెద్ద వాఁడ వీవు పేరు సంపాతి జ
టాయు వగును నీకు ననుజ వరుఁడు
మాను షాకృతిఁ దగఁ బూని నా చరణము
లంటితి రిరువురు నయ చరితు లయి 16.

తే.గీ. వ్యాధి యిది యెల్ల నెవ్విధి వచ్చె నీకు
ఱెక్క లెట్టు లూడెను నీకు నక్కట కత
మెద్ది దండించి రెవ్వార లిట్లు నిన్ను
నడుగు చుండఁ జెప్పుమ యెల్ల నార్య నాకు 17.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నఱువదవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 61.

సంపాతి నిశాకర మునీంద్రునకుఁ దన ఱెక్కలు కాలిన వృత్తాంత మెల్ల వచించి మరణింప నిశ్చయించి నట్లు తెలుపుట.

కం. అంత సు దారుణ కర్మము
నంత దినక రానుగమన మా సంయమికిం
బంతముతోఁ జేసిన వృ
త్తాంతమును వచింపఁ దొడఁగె నండజ వరమే 1.

ఆ.వె. దేవ! వ్రణము చేత దేహ మలయ లజ్జ
యడర వ్యాకు లేంద్రియముల శ్రమము
కతనఁ బలుకఁ జాలక మునీంద్ర యుంటిని
భాషణమ్ముల నిటఁ బరమ పుణ్య! 2.

తే.గీ. దర్పమున విక్రమము సెన్న తమ్ముఁ డా జ
టాయువును నేను సంఘర్ష మే యడరఁగ
గగన తలము సేరితిమి ఱెక్కల బలమ్ము
మీఱ వీరుల మెగురుచు మిక్కుటముగ 3.

చం. మునుల సమక్ష మందు సిత భూధర శృంగము పైనఁ బందె మా
యిను పెను పెంట నేఁగ ధృతి నిద్దఱ మస్త గిరీంద్ర మారయం
దనరిచి యేఁగఁ జూగితిమి తత్క్షణ మభ్రము చేరి కంటి మా
ఘన నగరమ్ము లెల్ల నరి కాయము భంగిని వేఱు వేఱుగన్ 4.

కం. వింటిమి వాద్య రవమ్ములు
వింటిమి శ్రుతి ఘోషములను వేఱొక చోటం
గంటి మనేకుల నిఁకఁ దెలి
గంటుల రక్త వసనల నొకట గాయనులన్ 5.

ఆ.వె. శీఘ్ర మెగిరి గగన సీమకుఁ జేరి యా
దిత్య మార్గ మంత దివి తలమ్ము
నుండి కంటిమి వన ముండ శాద్వల సన్ని
భమ్ము కాననమును నెమ్మితోడ 6.

తే.గీ. ఉన్న తాద్రులతో భూమి కన్నుల కగ
పడెను ఱాళ్లతో నిండిన పగిది నపుడు
నదులు చుట్టి యుండంగఁ గనఁ బడెఁ ద్రాళ్లఁ
గట్టఁ బడిన విధమ్ముగఁ గాశ్యపి యట 7.

ఆ.వె. హిమ నగమ్ము వింధ్య యింక మేరు మహాద్రి
ముఖ ధరాధరములు పుడమి లోనఁ
గొలను లందు నున్న కుంజరముల భంగి
వెలుఁగు చున్న వింపు గొలుప భృశము 8.

ఆ.వె. అంతఁ బట్టెఁ జెమట యంగము లందు భ
యమ్ము పుట్టె నొప్పి క్రమ్మె మిగుల 9.

మోహ తమము లింక మూర్ఛ వొడమె దారు
ణమ్ముగ నిరువురకు నభము నందు

ఆ.వె. దక్షిణంపు దిక్కు దక్షిణ పూర్వాశ
పశ్చిమమ్ము నేని పడయఁ జాల
యుగపు టంత మందు జగముల నన్నిటి
నగ్ని కాల్చు రీతి నయ్యె నపుడు 10.

తే.గీ. మనము హత మయ్యె యత్నించి కనుల నాశ్ర
యించి సంధించి డెందము నించు కంతఁ
గంటి భాస్కరుని నపు డక్కజముగ నగ
పడె నతండు పుడమి ప్రమాణుఁ డయి నాకు 11.

కం. అడుగక జటాయు వక్కట
పడెను ధరణి పైన నంత భ్రాత రయమునన్
వడిఁ గాంచి యతని దుఃఖం
బడరఁగ దివి నుండి దిగితి నాత్రము తోడన్ 12.

కం. కప్పితి ఱెక్కల నాతని
నొప్పుగఁ గాలని విధముగ నుగ్రమ్ముగ నే
నప్పుడు దగ్ధుఁడ నైతిని
చప్పునఁ బడఁ బుడమి నాకసము నుండి వడిన్ 13.

తే.గీ. తలఁతు నా జటాయువు జనస్థాన మందుఁ
గూలె నంచు నా తమ్ముడు ఘోరముగను
వింధ్య గిరి యందు ఱెక్కలు విరివిఁ గాల
జడునినై  పతితుఁడ వీత చలన మకట 14.

కం. అనుజుఁడు రాజ్యము విక్రమ
మును ఱెక్కలు పోవ నాకు భూమి పయిన నే
మన నెంచ నింక గిరి వర
ము నుండి దూఁకి మరణింపఁ బొడమెఁ దలంపే 15.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నఱువది యొకటవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 62.

సంపాతి పలుకుల నాలకించి నిశాకర మహర్షి కొంత తడవు ధ్యానించి యూఱడించి ఱెక్కలు నీఁకలు బలము వొందఁ గలవని నుడివి రాముని వనవాసము సీతాపహరణము దెలిపి రామ దూత లిటకు వత్తురని వారికి సీత విషయము దెలుప నిచట నుండు మని చెప్పుట.

కం. వగచుచు మునితో నేఁ బలు
కఁగ భృశ దుఃఖమున నట్లు కరుణార్ద్రుండై
భగవంతుఁ డొకింత తలఁచి
సుగిరల నిట్లు వచియించెఁ జూచుచు నన్నున్ 1.

చం. కలుగును నీకుఁ బక్షములు కన్నులు నీఁకలు నన్య భాగముల్
బలమును విక్రమమ్ము మఱి ప్రాణము లెల్లను నిశ్చయమ్ముగన్
వెలయును గొప్పకార్య మది వింటిని పూర్వము కంటి నేఁ దపో
బలమునఁ దెల్ల మయ్యె నది పత్త్రరథోత్తమ! నాకు నాత్మలో 2.

తే.గీ. దశర థాఖ్యుఁ డిక్ష్వాకు నందనుఁడు రాడ్వ
రుఁ డతని సుతుండు రాముఁ డురుతర తేజుఁ
డుండు ఘనుఁడు మహాత్ముఁడు నుండ వెంట
లక్ష్మణుం డనుజ వరుండు రాముఁ డంత 3.

తే.గీ. అన్న సత్య పరాక్రముఁ డరుగుదెంచు
జనకు పంపున నటవి కచట నతని స
తిని నపహరించు రావణుఁ డనెడు నైరృ
తుఁడు సు రాసు రావధ్యుఁడు నడవి లోన 4.

ఉ. సీతకు నాశ పెట్టిన భుజింపదు సుంతయు భక్ష్య భోజ్య కా
మేతర వస్తు రాసుల దహింపగ దుఃఖ మెడంద నత్తఱిం
బ్రీతి నొసంగె వాసవుఁడు పే పర మాన్న ము నా సుధాభమున్
నాతికి దేవ దుర్లభ మనంగఁ జెలంగెడు దాని సేరఁగన్ 5.

చం. తెలియఁగ నింద్ర దత్త మని తెల్లముగాఁ గొని యగ్ర భాగమున్
సలలిత ముంచె రామునికిఁ జక్కఁగ భూతల మందు నంతఁ దాఁ
బలుకుచు రామ లక్ష్మణులు పన్నుగ జీవితు లైన లేక వా
ర లకట స్వర్గ మేఁగినఁ బరంగును భక్ష్యముగా నటంచునున్ 6.

ఆ.వె. రామ దూత లిటకు రామ చోదితు లయి
వానరు లరు దెంత్రు వారి కీవు
పక్షి రాజ వర్య! వైదేహి సెఱిఁగింప
వలయు నిం పొదవఁగ లలితముగను 7.

కం. చన రా దెన్నఁడు నివ్విధి
ని సెచట కేఁగెదవు వేచి నిలువుమ దేశ
మ్మును గాలమ్ము సెఱింగి త
గ నీవు పక్షముల నరయఁ గలవు విహగమా! 8.

ఆ.వె. నేఁడ నీకు నొసఁగ నేను ఱెక్కలను ద
లంప నిచట నుండి నింపుగ జగ
ములకు హిత మొసఁగు పనులను జేయఁ గల వీ
వడరి నిక్కముగ విహగ కులేంద్ర! 9.

కం. తగు నా కార్యము నీకుఁ బ
తగమ! నృప సుతు లిరువురకుఁ దాపసులకు నిం
కఁ గన సురల కింద్రునకు ద్వి
జ గణమునకు మేలు సేయఁ జక్కఁగ వినుమా 10.

తే.గీ. రామ లక్ష్మణులను జూడ రక్తి యున్న
నిచ్ఛగింపను జిర ముండ నిలను నేను 11.

వీడెద కళేబరము తత్త్వ విదుఁడు ముని వ
రేణ్యుఁ డిట్లు వచించె నగణ్య జపుఁడు

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నఱువది రెండవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 63.

సంపాతి యా మహర్షి వచనములను దెలుపుచుండఁగా సంపాతికిఁ గ్రొత్త ఱెక్క లుద్భవింప నందఱు సంతోషించి యుద్యుక్తు లగుట.

కం. గిర లన్యమ్ముల నివ్విధిఁ
బరమర్షి యనేకములను బ్రస్తుతి నన్నుం
గర మొనరిచి యనుమతి నిడి
మరలెను నిజ నిలయమునకు మానుగ నంతన్ 1.

చం. అనువుగ శైల కందరము నంతటఁ బ్రాకుచు వీడి చేరితిన్
ఘనతర వింధ్య పర్వతము గన్నుల మిమ్ములఁ జూడ వేచినం
జనె శత వర్ష కాల మిటఁ జాల వగన్ ముని భాషణమ్ములన్
మనమున నుంచి నిల్చితిని మానుగఁ జూచుచు దేశ కాలముల్ 2.

తే.గీ. కదియ నా మహాప్రస్థాన కాల మంత
ముని నిశాకరుఁడు దివము గనఁగఁ దర్క
ములు కడు సెలంగ ఘన తాపము నను సంత
తము దహించు చుండె నెడఁదఁ దద్ద యకట 3.

కం. రేఁగిన మరణంపుఁ దలఁపు
బాగుగ మరలెను మునివరు వాక్యమ్ములతోఁ 4.

దాఁ గావఁగఁ బ్రాణమ్ముల
నే గతి నిడె మతి యది వగ పెల్లను మాన్పెన్

ఆ.వె. రావణు బల మెఱిఁగి రక్షింప మైథిలి
నెంచ వకట యేల యంచు నేను
దనయు నప్డు మిగులఁ దర్జించితిఁ బరుష
భాషణముల తోడ బాధ మీఱ 5.

తే.గీ. తరుణి మైథిలి శోకమ్ము దలఁపఁ దలఁప
వారు దూర మట్లగుట నవనిజ కెఱుఁగ
దశరథుని స్నేహము దలంపఁ దనయుఁ డీయ
కుండ నుండ ముదము నాకు నెండె నోరు 6.

తే.గీ. వానరుల తోడ సంపాతి పలుకు చుండ
నిట్లు ఱెక్కలు మొలచిన వింపు గొలుప
వనచరుల సమక్షము నందుఁ బక్షి పుంగ
వునకు నక్కజముగ నెద వొంగ మిగుల 7.

కం. తనువునఁ బక్షమ్ము లొదవఁ
గని యెఱ్ఱని వర్ణములఁ బ్రకటితము లైనన్
మనమున హర్షము ప్రబలఁగ
ఘనుఁడా సంపాతి పలికెఁ గపి వర్యులతో 8.

చం. ముని వరుఁ డా నిశాకరుని భూరి తరాత్ము మహత్తు మీఱఁగా
నిన కర దగ్ధ పక్షములు నింపుగఁ బుట్టిన విప్డు నాకు విం
త నడరి యౌవనమ్మునను దద్ద వెలింగిన వీర్య మెల్లఁ గం
టి నిపుడు పౌరుషమ్మును ద్రుటిం గడుఁ బొందితిఁ బొంగె హర్షమే 9.

ఆ.వె. ఎల్ల యత్నములు కపీంద్రు లార! యొనర్ప
నొప్పు నింక ఱెక్క లుద్భ వించు
టెల్లఁ దెలుపు సిద్ధి నెల్ల జానకిఁ గాంచఁ
గలరు తథ్యముగను గల్ల కాదు 10.

కం.	హరు లందఱితో నిట్లని
గిరలను బక్షీంద్రుఁ డంత గెంతెను దిగ నా
గిరి నుండి మార్గ మింపుగ
నరయఁ దలంచి యెడఁద ముద మారంగ వడిన్	11.

కం.	విని నంత నా వచనములు
మనముల నుప్పొంగ ముదము మర్కట వృషభుల్
తనరఁగ విక్రమ మభ్యుద
య నిశ్చితు లయిరి కడింది యత్నోన్ముఖులై	12.

కం.	ప్లవగ వరేణ్యులు  బలమున
పవన సమానులు సులబ్ధ పౌరుష వర్యుల్
తివిరి యభిజిద్దిశా గతి
నవనిజ వెదకంగ గోరి యడరిరి యంతన్	13.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నఱువది మూడవ సర్గము.

## కిష్కింధా కాండము

## సర్గము 64.

సంపాతి మాటలు విని యానందమున గెంతుచు నంగ దాదులు సముద్ర తీరము సేర దాని దాఁటు నుపాయము నంగదుఁడు వానరులతోఁ దర్కించుట.

కం.	అన గృధ్ర మటుల గెంతిరి
ఘన హర్షం బొదవఁ గలసి కపి వరు లంతన్
మనముల  భీమ పరాక్రము
లు నినాదము లింపుగ నొనరుచుచు భృశముగన్	1.

కం. విని సంపాతి గిరలు ప్రీ
తి నంది మిక్కుటముగ౳ బడతిని సీతం గాం
చ నరిగిరి రావణాలయ
ము నదీపతి తీరమునకు బోరన౳ బ్లవగుల్ 2.

చం. కని రట భీమ విక్రములు గ్రన్ననఁ జేరఁగఁ దత్ప్రదేశ మం
దునఁ బ్రతిబింబమై చెలఁగఁ దోరముగా భువి కెల్ల నింపుగా
ఘనమగు దక్షి ణాంబుధినిఁ గానన వాసు లుదీచి తీర మం
దను వగు నొక్క చోటఁ దమి నందఱు గూడిరి చింత సేయఁగన్ 3.

చం. బలు లగు సత్వరాజములు పన్నుగ నాడఁగఁ దోయ రాశినిం
బలు వికృతంపు జంతువులు వక్త్రము లింపుగ విచ్చియుండఁగా
బలిసిన యట్టి కాయముల భంగ సమేతము తిర్గు చుండఁగా
వెలయఁగఁ గొన్ని నిద్రఁ దమిఁ బెద్ద నగమ్మును బోల నన్యముల్ 4.

తే.గీ. దానవేంద్రులు పాతాల తల నివాసు
లుండ సంకులముగ నబ్ధి మెండుగఁ గలి
గింప గగ్గురు లందఱికి నటఁ గడు వి
చార మంది రెదల వనచారు లెల్ల 5.

ఉ. దాఁట నశక్య మభ్రపు విధమ్ముగ నుండిన సాగరమ్ము నా
చోటఁ గనంగ వానరులు శోకము నందు మునింగి రెల్లరుం
బాటవ మొప్ప దాఁటుటకుఁ బన్నుగ నెయ్యది కార్య మంచు నా
మేటి ప్లవంగ రాజములు మిన్నక యుండఁగఁ గాంచి యంతటన్ 6.

తే.గీ. వానరు లతి విషన్ను లపార వారి
రాశి గాంచి భీతిల్ల నరసి ప్లవగ వ
రుండు వాలి సుతుం డంగదుండు వారి
నాశ్వసించె నార్తుల నెల్ల నంచితముగ 7.

ఆ.వె. గొప్ప చింత యందు నప్పు డక్కపు లెల్ల
మునుఁగ మతియుతుండు ఘన బలుండు
వాలి సూనుఁ డిట్లు పలికెఁ గాలోచిత 8.

ము లగు భాషణమ్ములు లలితముగ

తే.గీ. మనము నందు విషాదము తనరఁ దగదు
దోష మగు విషాదం బతి దుర్భరమ్మ
పురుషుఁ జంపు విషాదము మూరి క్రుద్ధ
సర్ప మడరి బాలునిఁ జంపు చంద మెంచ 9.

కం. ఎవ్వరు విషాద మూనుదు
రవ్విక్రముల ప్రభ యణఁగు నత్యధికముగా
నవ్వారి కార్యము లరయ
నివ్వసుధ నీఁక నెఱవేర వెన్నం డైనన్ 10.

చం. కడవఁగ రాత్రి యంగదుఁడు గట్టునఁ వానర కోటి తోడుతం
దడయక గూడి మంత్రములు దద్ద యొనర్పఁ దొడంగె వారితో
బెడిదపు వానరధ్వజిని పేర్మిని నంగదు చుట్టుఁ జేర నా
తఁడు గనిపించె వాసవు విధమ్ము మరుత్తులు గొల్చియుండఁగన్ 11.

ఉ. ఎవ్వఁడు వాన రోత్తముల యింపగు సైన్యము నాప శక్యుఁడౌ
నవ్వర మారుతాత్మజుని నంగదు వీడి వానరాలిలో
రివ్వన నంత వానర వరిష్ఠుఁడు వాలి కుమారుఁ డిట్లనెన్
నివ్వటిలంగ నాదరము నేర్పున వృద్ధుల పైన సేనపై 12.

తే.గీ. ఏ మహా తేజుఁ డిప్పుడు భీమ విక్ర
ముండు దాఁటంగ సాగరమును సమర్థుఁ
డగునొ సుగ్రీవునకు నమ్మహాత్మునకు న
రిందమున కిటఁ గార్యము పొందుపఱచు 13.

తే.గీ. వంద యోజనములు దాఁటు ప్లవగ సత్త
ముం డెవఁడు వీర వర్యుఁడు వెండి యెల్ల
ప్లవగ యూథపులకు భీతిఁ బాపి రక్ష
ణము నొసంగు వాఁ డెవఁడొ వానరుల యందు 14.

కం. ఫలియింపఁ గార్య మెల్ల మ 15.

రలి దార తనయ గృహముల రమ్యముగఁ గనం
గలమో సుఖముగ సెవరి య
తులప్రభావమునఁ జెపుఁడు తూర్ణం బింకన్

ఆ.వె. ఎవ్వని దయ నిప్పు డింపుగ మన మెల్ల
రామ లక్ష్మణుల నరర్షభులను
బల్లిదులను వీరు వానరేశ్వరుని సు
గ్రీవుఁ జేరఁ గలము ప్రీతి తోడ 16.

కం. వనధిని లంఘింపం జా
లిన హరి వరుఁ డున్నచోఁ ద్వరిత గతి నతఁ డి
చ్చును మన కెల్లర కభయ
మ్మును దగు పుణ్యమ్మును భృశముగ నిక్కముగన్ 17.

కం. విని యంగదుఁ డన వాక్యము
లను బలుకరు కొంచెమైనఁ బ్లవగుల యం దే
రు నకట మెదలక హరి వా
హిని నిలిచిన దత్తజి నతి హీనావస్థన్ 18.

తే.గీ. పలికె హరి వర్యుఁడు తిరిగి వానరులను
గాంచి బలవంతులం దగ్ర గణ్యు లరయ
మీరు ధృఢవిక్రములు ధర భూరి వంశ
జాతులరు పూజితుల రనిశమ్ము మీరు 19.

కం. కన మడ్డెగురఁగ సెవ్వరి
కి సెప్పు డించుకయు సెవరికి నరయ సెంతెం
త సెగడు శక్తి వచింపుఁడు
ఘన హరు లార దుముకంగఁ గడలి రయమునన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నలువది నాలుగవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 65.

అంగదుని పల్కులను విని వానరర్షభు లెల్ల లంఘించుట యందు వారి వారి శక్తి సెఱిఁగింప
నంగదుఁడు తమకు నేత కనుక నాతనిఁ బంపఁ దగ దని పలుక నంగదుఁడు తిరిగి ప్రాయోపవేశమే
తగు నని చింతింపు మన జాంబవంతుఁడు కార్య సాధకునిఁ బ్రోత్సహింతు నని పలుకుట.

తే.గీ. గజ గవాక్షులు శరభుఁడు గవయ గంధ
మాదనులు సుషేణుండును మైందుఁ డింక
ద్వివిదుఁడును జాంబవంతుఁడు తెల్పి రిట్టు
లాలకించి యంగదుని వాక్యముల నంత 1.

సీ. వారి వారి యెగురు బలము నెఱింగింపఁ దొడఁగిరి యందు గజుఁ డనఁగఁ బది
యోజనమ్ముల దూర మోజ దాటుదు నంచు నా గవాక్షుఁ డనియె నంతఁ దా ని
రువది యోజనముల నవలీల ముప్పది గవయుండు దా దాఁటఁ గల ననంగ
శరభుండు నలువది చనువాఁడ నన గంధమాదనుఁ డేఁబది తాఁ దరింతు
తే.గీ. ననఁగ మైందుఁ డఱువ దన నా ద్వివిదుఁడు
డెబ్బది తెలుపఁగ సుషేణుఁ డబ్బురముగఁ
దా నెనుబది యోజనములు దాఁటఁ జాలు
వాఁడ నన జాంబవంతుఁడు పలికె నిట్లు 2.

ఉ. వారల గౌరవించి తమిఁ బన్నుగ వృద్ధుఁడు వారిలో మహా
వీరుఁడు జాంబవంతుఁ డనెఁ బెద్ద తనం బిఁక నేఁగుదెంచె ము
న్నారయ నాకు లంఘనము నందు సమర్థత మిక్కుటమ్ముగా
మూరెను జేవ సన్నగిలెఁ బోవ వయస్సు తరింప నిత్తఱిన్ 3.

తే.గీ. రా దుపేక్షింప నీ పని రాముఁ డింకఁ
గపి వరుండు సుగ్రీవుఁడు కార్య నిశ్చ
యులయి తనరంగ దాఁటుదు యోజనములు
తొంబది యనుమానము లేక తొడరి నేను 4.

ఉ. అంత వచించె ఋక్ష వరుఁ డప్పుడు దిగ్గి ప్లవంగ కోటితో 5.

నింతియ కాదు నాకు బల మెంచఁగ లంఘన మందు మున్ను య
జ్ఞాంతర మందు విష్ణువు మహాత్ముఁడు విక్రముఁ డాక్రమింపఁగాఁ
నంతట సుప్రదక్షిణము లాతని కే నొన రించితిం దమిన్

తే.గీ. వృద్ధుఁడను గా నయితి మంద విక్రమునిగ
యౌవనము నందు నా కుండె నన్య జనుల
కప్రతిమ బల మిత్తఱి యయ్యె దింతె
చాల దిది  కార్య సిద్ధి కీ సమయ మందు 6.

కం. మన్నించి జాంబవంతుని
మిన్నగ నంగదుఁడు  ప్రాజ్ఞ మేటి కపి వరుం
జెన్నుగ నుదార వచనము
లన్నగ చర ముఖ్యుఁ డా మహాత్ముఁడు పలికెన్ 7.

ఆ.వె. వంద యోజనములు పన్నుగ దాఁట స
మర్థుఁడ హరు లార! మరల శక్తి
యున్నదొ మఱి లేదొ యెన్నఁగ లేను ని
శ్చయముగ నెద నేను  జాలి నంత 8.

కం. అన విని హరి వర్యునితో
ననె వాక్య విశారదుండు హర్యృక్షవరా!
విను జాంబవంతుఁ డెఱుఁగుదు
మని నీ శక్తి గమనమ్ము నం దెల్లరమున్ 9.

ఆ.వె. వంద లేక వేయి వాన రోత్తమ యోజ
నములు దాఁటఁ గలవు ప్రమదముగను
దిరిగి రాఁ గలవు ధృతి సెలంగ నీ విధి
తగదు సుమ్ము నీకు మగఁడ వీవు 10.

ఆ.వె. పనుచు వాఁడు తగఁడు పనుపఁ బడఁగ నెన్నఁ
డేని మేము నీకు నెల్లరము భ
టులము సుమ్ము గాన వలయు నీకు మము న
నుపఁగఁ గార్యములకుఁ గపి వరేణ్య! 11.

ఆ.వె. రక్షణీయుఁడ విట రాజువు గావున
సైన్యమునకు గతివి శత్రు దమన!
నీవు ధ్వజిని సతము నిన్ను గాపాడు చుం
డ వలయు లలితముగ నవని నధిప! 12.

కం. అరి వీర దమన! మూలం
బరయఁగ నీ వీ పని కిట నా కతమున సె
ల్లర మింపుగఁ గావ వలయు
హరి వీర సతమ్ము నిన్ను నంచిత రీతిన్ 13.

ఆ.వె. అర్థ మూలము ననయమ్ము సంరక్షింప
వలయుఁ గార్య సంవిదులకు పేరు
లుండ భద్రముగను మెండుగ సిద్ధింపఁ
దరులకు ఫల పుష్ప తతులు గనమె 14.

ఉ. బుద్ధిని విక్రమమ్ములను మూరిన వాఁడవు సత్య విక్రమా!
సిద్ధికి నీవ యుప్పనినిఁ జెన్నుగఁ గారణ మౌదు పెంచఁగా
నిద్దర నొజ్జ వొజ్జ సుతుఁ డెల్లర కీవ త్వదీయ శాస్తికిన్
బద్ధులమై సమర్థులము వానర వర్య! వహింపఁ గార్యమున్ 15.

చం. నయములు జాంబవంతు వచనమ్ముల నంగదుఁ డాలకించి తా
నియతి వచించె నుత్తరము నే నట కేఁగక యన్య వానరుల్
భయమున నేఁగ కున్న మఱి ప్రాయమె దిక్కగు నెంచి చూడఁగా
లయములు కాఁగ యత్నములు రాజ సమీపము సేర భద్రమే 16.

తే.గీ. వానరేంద్రు సందేశము ప్లవగ వర్యు
లార! యొనరింపకుండక యచట కేఁగఁ
గడవ నొసఁగిన కాలము తడయకుండఁ
బ్రాణములకు వాటిలు ముప్పు వార కకట 17.

తే.గీ. అతఁ డనుగ్రహించుట యంద యరయ కాదు
కోప మందు నత్యధికుఁడు కూడ నతని 18.

యాజ్ఞ పాటింపకుండఁగఁ బ్రాజ్ఞులార!
మరణము మనకు లభియించు హరులు! వినుఁడు

ఆ.వె. ఇట్ల తప్పక యగు నీకార్యము దలంప
నన్యవిధము కాదు మాన్య వర్య!
దీనిఁ బరిగణించి ధృతిని నాలోచింప
నర్థ మగును నీకు నంచితముగ 19.

తే.గీ. అంతఁ బ్రత్యుత్తర మొసఁగె నంగదునకు
జాంబవంతుఁడు వానరర్షభుఁడు కార్య
మించుకయు నశియింపదు మేటి కార్య
వీరుఁ బ్రేరేపు వాఁడను వీర! కనుమ 20.

కం. అంతఁ బ్రసిద్ధుని నా హను
మంతుని హరి పుంగవుని సమంచిత విధి సే
కాంతుని నెక్కాడెను ధీ
మంతుఁడు ఋక్షప్రవరుఁడు మారుతి సుఖునిన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నఱువది యేనవ సర్గము.

# కిష్కింధా కాండము

# సర్గము 66.

జాంబవంతుఁడు హనుమంతుని జన్మవిశేషములను సామర్థ్యమును వర్ణించి యతని నుత్తేజపఱచుట.

కం. లక్ష లనేకముల దళము
వీక్షించి విషణ్ణము నటఁ బేరిమి మీఱన్ 1.

ఋక్షపతి జాంబవంతుఁడు
దక్షుఁడు హనుమంతు తోడఁ దగ ననె నిట్లున్

తే.గీ. మౌన మూని యొంటరిగను వాన రాలి
వీరవర్య! సకల శాస్త్రవిద వరేణ్య!
నిలిచి యిచ్చట యక్కట కలయకుండ
నేల హనుమ! పలుక కుంటి వించుకేని 2.

తే.గీ. హరి విభునకు సుగ్రీవున కరయ సముఁడ
వీవు రామ లక్ష్మణులకు నీవు బలిమిఁ
దేజ మందు సమానుఁడ వీ జగమున
నెంచ హనుమంత! సంశయ మింత లేదు 3.

చం. తనయుఁ డరిష్టనేమి కతి దార్ఢ్యుఁడు పక్షుల నుత్తముండునై
తనరును వైనతేయుఁ డిలఁ దా గరుడుం డన సంతతమ్ము ఖ్యా
తి నడరుఁ గంటి నే నతనిఁ దీవ్ర రయున్ భుజగాలి నబ్ధినిం
గొని చను చుండఁ బల్మఱు సుఘోరముగాను మహా యశస్వినిన్ 4.

ఉ. ఆతని ఱెక్క లందుఁ గల యట్టి బలం బది నీ భుజమ్ములం
దాతత రీతిఁ గన్పడు మహాత్మ! పరాక్రమ మందు నెంచ నీ
వాతని కన్న వేగమున నైనను దక్కువ కాదు ధాత్రిలో
భూతము లందు శ్రేష్ఠుఁడవు బుద్ధి బలమ్ములఁ దేజ మందునున్ 5.

తే.గీ. యెఱుఁగ వేల నీదు బలమ్ము నింక వినుమ
యచ్చరల మిన్న కేశరి హరికి నాలు
పుంజకస్థల గుణవతి యంజ నాఖ్య
ముజ్జగముల రూపవతియుఁ బుట్టె ధరను 6.

ఆ.వె. శాపవశమున నిల నా పడతి జనించె
వానరి యయి మించి తాను గామ
రూపిణి యయి కుంజరునకు మహాత్మున
కాత్మజ యయి వాన రాధిపునకు 7.

ఉ. మానుష రూప మూని వర మానిని సుందరి యౌవనాంగియున్
మానుగ నొక్కనాఁడు తగు మాలలు భూషలు పట్టు బట్టలే
మేను నలంకరింప క్షరి మేఘము భంగిఁ జెలంగి పర్వత
స్థానపు టగ్ర భాగమునఁ దద్దయుఁ బ్రీతిని సంచరింపఁగా 8.

తే.గీ. అవ్విశాలాక్షి వస్త్రము నివ్వటిల్ల
పీత రక్త వర్ణమ్ములఁ బెద్ద గాలి
రివ్వున హరించె నక్కట యవ్వధూటి
పర్వ తాగ్రమున నిలువఁ బరవశమున 9.

ఉ. కాంచెను వాయు వూరువులఁ గాంతవి వృత్త సుసంహితమ్ములన్
మించఁ బయోదరమ్ములను మేలి ముఖమ్ము నితంబ యుగ్మ మా
యించుక యైన మధ్యమును నెల్ల శుభాంగములన్ యశస్విని
బంచనఁ గామ మోహమున వారక కూలెను జూచి నంతటన్ 10.

తే.గీ. దీర్ఘ భుజముల నాతఁడు తీవ్ర మన్మ
థార్తుఁ డయి కౌఁగిలించెఁ దా నబల నా య
నిందితను సంభ్రమమ్మున సందియమ్ము
నూన కక్కట యొక్కింత యేని మదిని 11.

ఉ. అంతట భ్రాంత చిత్త యయి యంజన పల్కెను నన్ను నెంచ నే
నింతిగ నుండ నొక్కరికి నెవ్వరు నాశము సేయ నెంచిరో
యంతయు నాలకించి యన నంజన సువ్రత హింస నీయ నే
సుంతయు నీకు నీ భయముఁ జొప్పడ నీ కనె వాయు వామెతో 12.

చం. విను నిను గౌఁగిలించికొని పేర్మి యశస్విని! మానసమ్మునం
జన సుతుఁ డుద్భవించు ఘన సత్త్వ పరాక్రముఁ డెన్న బుద్ధినిన్
ఘనుఁ డగు నాకుఁ దుల్యుఁ డగుఁ గాంచఁగ లంఘన మందు వేగమం
దును మఱి తేజ మందు నిలఁ దొయ్యలి వీడుమ భీతి నెమ్మదిన్ 13.

కం. ముద మంది నీ జనని విని
సదమల వచనమ్ము లంతఁ జక్కగ నిన్నున్
సుదతి గుహలోన గనెను ని 14.

డుద భుజముల వాఁడ! ఘను బటుతర  కపివరున్

కం.	ఉదయించు సూర్యుఁ గాంచి యె
డఁద నక్కాననమునం దడరుచు ఫలం బం
చుఁ దలఁచి బాలుఁడవు గ్రహిం
ప దాని దివి కెగిరి తీవు పన్నుగ నంతన్ 15.

కం.	చని మూడు శతమ్ముల యో
జనమ్ములు మహాకపి! దివస ధవుని తేజ
మ్మునఁ ద్రోయఁ బడిన  నించు క
యిన దిగులును గాంచ నేర వీ వబ్రముగన్ 16.

చం.	రయమున నంతరిక్షమున రాలుచు నుండఁ గపీంద్ర! క్షిప్ర మ
ప్డు యధిక రోష మానసుఁ డమోఘుపు వజ్రము వేయ వాసవుం
డె యెడమ  దౌడ విర్గె నొక యింత నగాగ్రము పైన నుండఁగా
నయముగ నట్టి కారణమునన్ హనుమంతుఁడ వైతి కీర్తినిన్ 17.

తే.గీ.	పడఁగ నిన్నట్లరసి గంధవాహుఁ డలిగి
కడుఁ బ్రభంజనుం డీ ముజ్జగముల వీవ
నొల్లఁ డయ్యె నంత నమరు లెల్ల నార్తు
లైరి యూఱడించిరి క్రుద్ధు మారుతమును 18.

ఆ,వె.	పవనుఁ డూఱడిల్ల వరము లొసంగెను
వచ్చి బ్రహ్మ నీకుఁ బవన తనయ!
శస్త్ర రాజి వలనఁ జావు లేకుండఁగ
సత్య విక్రమ! విను సమర మందు 19.

చం.	అశని విఘాత మందియును నంజన పట్టి! యరోగ ముండఁగా
భృశము సెలంగి వాసవుఁడు పేర్మి నొసంగె సహస్ర నేత్రుఁడే
యశము వహింపఁ గోరు సమయమ్మననే మరణమ్ము కల్గు న
ట్లు శుభ వరమ్ము వానర వరుండ! యయాచిత మంత నింపుగా 20.

తే.గీ.	కేసరికి నందనుండవు క్షేత్రజుఁడవు 21.

భీమ విక్రముఁడవు నీవు వీర వర్య!
వాయువున కౌరసుండ వమేయ తేజ
ము ప్లవనమ్ముల నతని సముఁడవు సుమ్ము

తే.గీ. మము గతాసువులను గావ మారుతాత్మ
జ! యిపు డర్హుఁడ వీవు దాక్ష్యమున విక్ర
మమున సంపన్నుఁడ వపర మహిత వాన
రేశ్వరుఁడ వాంజనేయ! నీ విపుడు మాకు 22.

ఉ. చేసితి నేఁ బ్రదక్షిణము చెన్నుగ భూమికి నేడు మూళ్లునౌ
వాసికి నెక్కి మారులు నపార రయమ్మున నా త్రివిక్రముం
డేసరి యాక్రమించు తఱి నింపుగ నౌషధ రాశి దేవతా
శాసన మంది కొంటిమి యొసంగ సుధన్ బలమెల్లఁ జేకుఱెన్ 23.

ఆ.వె. ముదిమి యావహించెను దఱిఁగెను బరాక్ర
మమ్ము నాకు నిపుడు మాకుఁ గాంచ
నీవ సద్గుణ వర! నిధివి యనిల సుత!
యుద్యమింపుమ ప్లవ గోత్తమ యిఁక 24.

తే.గీ. చూడఁ గోరును వాహిని శూర వర్య!
నీదు వీర్యము దాఁటుమ నీరధి వడి
లెమ్ము వానర శార్దూల! యిమ్మహిఁ దవ
గతి యఖిలములకును మిన్న గాదె యెన్న 25.

ఆ.వె. నెమ్మి కడఁగు మేల నీ వుపేక్షింతువు
విక్రమింపు మయ్య వేగ వంతుఁ
డయిన విష్ణు భంగి నా త్రివిక్రము భంగి
యెల్లరును విషణ్ణు లిచటఁ గనుమ 26.

కం. తన బల మెఱింగి మారుతి
తన నవ్విధిఁ బ్రోత్సహింపఁ దద్దయుఁ బ్రీతిన్
ఘనుఁ డయిన జాంబ వంతుఁడు
తన రూపముఁ జూపెఁ బ్లవగ తతికి ఘనమ్మున్ 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నఱువది యాఱవ సర్గము.

# కిష్కింధా కాండము

## సర్గము 67.

జాంబవంతుని ప్రోత్సాహమున హనుమంతుఁ డుబ్బి వంద యోజనములు దాఁట నుద్యుక్తుఁడై నిజ స్వరూపమును జూప వానరు లెల్ల శోకమును వీడి సంతుష్టు లగుట, మారుతి యంత సముద్రము నుత్తరింప మహేంద్ర గిరినిఁ జేరుట.

ఉ. దాఁటఁ దొడంగి యోజన శతమ్ముఁలు తద్దయుఁ బెంచ గాత్రముం
బాటవ మొప్ప శీఘ్రముగ వానర సత్తముఁ డట్లు వానరుల్
మేటి పరాక్రముం గపి నమేయ బలుం గని వీడి శోకమున్
మాటలు పెక్కు పల్కుచును మంచిగ గెంతుచుఁ దుష్టు లై రటన్ 1.

కం. ముద మంది కనిరి విస్మిత
హృదయులునై వానర వరు లెల్లరును సమ
స్త దిశల నారాయణుని ప
గిదినిఁ ద్రివిక్రముఁ డన నెదిగిన మారుతినిన్ 2.

తే.గీ. పొగడు చుండ నెల్లరు హర్షము సెలగంగ
హనుమ వర్ధిల్లె నంత మహాబలుండు
తోఁక జాడించె మురియుచుఁ దోరముగను
వీర్యవంతుఁ డయ్యె భృశము కార్య మెంచి 3.

ఆ.వె. వానర ప్రవరులచే నుతింపఁ బడఁగఁ
దేజ మెల్ల నిండ దేహ మందు
మారుతాత్మజుని మహా రూప మత్యంత 4.

ముత్తమముగ నెగడె నత్తఱిఁ గన

కం. గిరి గుహ లోన మృగేంద్ర మ
డరుచు విజృంభించు రీతి నత్యంతముగా
మరు దాత్మజుఁడు విజృంభిం
చి రేఁగె విక్రమమున హరి శేఖరుఁ డచటన్ 5.

కం. ఉదరిన ధీమంతు హనుమ
వదనము మంగలము భంగిఁ బావకు భంగిన్
వదలఁగఁ బొగ యెల్ల వెలిఁగె
సదమలమై భృశము గాంచ సమ్మద మడరన్ 6.

చం. ప్లవగుల మధ్య నుండి వడిఁ బన్నుగ లేచి ప్రహృష్ట రోముఁడై
ప్లవగ వరేణ్యుఁ డా హనుమ వానర వృద్ధులకున్ నమస్కరిం
చి వినతిఁ బల్కు లివ్విధి వచించె హుతాశను స్నేహితుండు వా
యువు బలుఁ డప్రమేయుఁడు మహోగ్రతఁ గూల్చును బర్వతాగ్రముల్ 7.

తే.గీ. గగన సంచరుం డతుల శీఘ్ర గమనుండు
వేగవంతుఁడు వానికిఁ బ్రియపు టౌర
స సుతుఁడను వాయువున కేను సముఁడ నెగుర
నాతనికి మహాత్ముని కెంచ నంచితముగ 8.

ఉ. అంబర మంటు నట్టి దగు నాయత మేరు గిరీంద్ర మంత నా
డంబర మొప్పఁ జుట్టు నెడయాడఁగ నేర్తును వేయి మార్లు నే
నంబుధి బాహు వేగమున నప్పుల కీయఁగఁ గంపనమ్ము వే
గంబున ముంచు లోకములఁ గ్రక్కున శైల నదీ హ్రదమ్ములన్ 9.

ఉ. నా తొడ లింకఁ బిక్కల యనల్ప జవమ్మున నుత్తితంబునౌ
యాతత మూర్చి తాఖిల మహాంబుకిరాత యుతమ్ము సంద్రమే
ప్రీతి నభశ్చరుండగు సరీసృప భోజను వైనతేయునిన్
వీత భయమ్ము చుట్టఁ గల వేయికి మించిన మార్లు నెంచఁగన్ 10.

చం. మండెడు రశ్మి మాలి చన మానుగఁ దా నుదయించి ప్రొద్దునన్ 11.

మెండుగ నస్తమించుటకు మీఱక మున్న స్పృశింపకే ధరం
గండ బలమ్ము నూని చని గ్రమ్మఱ నింపుగ నుత్సహింతు నే
నొండు తలంపు లేక ప్లవ గోత్తము లార! మహా రయమ్మునన్

మ. అనయం బేను నతిక్రమింపఁ గల నా యాకాశ సంచారులన్
వనధిన్ క్షోభిలఁ జేయ శక్తుఁడను విశ్వమ్మున్ విదారింతు నె
ల్ల నగాలిం బొడి చేయఁ జాలుదు సముద్రమ్మున్ గ్రహింపంగ నే
దనరం జాలుదు నూరు వేగమున నుత్సాహమ్మునన్ దాఁటుచున్ 12.

కం. వివిధమ్ములు సుమముల తో
డ వృక్షములు లతలు నే నడరుచు నెగిరి నం
త వడి విను వీధినిఁ దరలు
నవి యెల్లను నా వెనుక  మహా వేగమునన్ 13.

చం. చన విను వీధి నే నడరి చాగును స్వాతి పథంపు రీతినిన్
ఘనముగ నాదు మార్గము సుఖమ్ముగఁ బై కెగురంగ నింక డి
గ్గ నభము నుండి  భూత తతి గాంచు సమస్తము నన్ను నత్తఱిన్
వినుఁడు ప్లవంగ పుంగవులు వీర వరేణ్యులు సంతసమ్మునన్ 14.

కం. చూతురు మేరు నికాశుని
నాతతముగ నావరించి యంబర మెల్లం
బ్రీతి గ్రసించు విధమ్ముగ
వే తరలఁగ నన్నెలమిఁ గపి వృషభు లారా! 15.

తే.గీ. చీల్తు నే మహా మేఘ రాశినిఁ జెలంగి
యాయ తాద్రులఁ గంపింపఁ జేయు వాఁడ
సాగరం బెల్ల నెండింతు శక్తి మీఱ
నిజము లంఘించు నప్పుడు నెమ్మి నుండి 16.

చం. అనిలుని వైనతేయుని మహా బల మెయ్యది యున్నదో య దె
ల్ల నడరు నాకు భూతముల లంఘన మందుఁ దలంప నన్ను దాఁ
ట నొరుని గాంచ నేను గరుడండు ఖగేంద్రుఁడు నింక వాయువున్
ఘనుఁడు జవమ్మునన్ విడువగం దగ వారిని నన్ను నెవ్వనిన్ 17.

కం. ఘనమున లేచు తటిద్భం
గిని నొక నిమిషమ్ము నందుఁ గెరలుచు నా నిం
గి నిరాధారమ్మున ని
ల్తును శీఘ్రగతి సెదల వలదు విశంక లిఁకన్ 18.

తే.గీ. లోకముల నాక్రమించిన లోక నాథు
నా త్రివిక్రముని పగిది నర్ణవమును
దాఁటు నప్పు డుందును నేను బాటవంబు
మీఱఁ గపివర్యు లార! యమేయముగను 19.

ఆ.వె. ధీదఁ జూచు చుంటి స్తిరముగ మన ముందుఁ
గూడ నాతి సీతఁ గోమలిని వి
దేహ రాజ తనయ నో హరు లార! సం
తోష మరయ వలయుఁ దోరముగను 20.

కం. మారుత సమాన వేగుఁడ
ధీర గరుత్మంతునకును దీటగు వాడన్
వారక పదివే లయినను
దూరము యోజనము లడరి దూఁకెడు వాఁడన్ 21.

ఆ.వె. వజ్ర మున్న యట్టి వాసవుని మఱి స్వ
యంభువుండు నయిన యట్టి బ్రహ్మ
చేతి నుండి తెత్తు శీఘ్రమ సుధ నెంతు
లంకను బెకలించి రాఁ గల నని 22.

కం. అమి తౌజసు నా గర్జిం
చు మారుతిని వానరు వరుఁ జూచి పరమ హ
ర్షము నంది విస్మయమునఁ గ
పి ముఖ్యు లెల్లరు నిలిచిరి వీక్షించు చటన్ 23.

కం. విని యా పలుకులు కపి శో
క నాశనములను బలికెను గపి ముఖ్యుండున్ 24.

ఘనుఁ డయిన జాంబవంతుఁడు
మనం బలర మిక్కుటముగ మాటల నిట్లున్

ఉ. వీర వరేణ్య! కేసరి కపిప్రవరాత్మజ! యాంజనేయ! యో
మారుతి! జ్ఞాతి శోకము సమస్తము వేగ నశించె హన్మ! యో
ధీర త్వదీయ వాక్కులను దిట్టతనమ్మునఁ జేరి నిం గపుల్
మూరుదు రెల్లఁ గార్య ఫలముం గొన నిత్తురు మంగళమ్ములన్ 25.

తే.గీ. మునుల కపి వృద్ధుల గురుప్రముఖుల దయ సె
లఁగ మహార్ణవ మింపుగ రయము మీఱ
నుత్తరింపుమ తగఁ బాద మొకటి పైన
నిలిచి యుందు మెల్లర మెంచి నీదు రాక 26.

తే.గీ. ఈ వనౌకసుల యసువు లెల్ల నీ ప
యిన నిలిచి యున్న వని పల్క నెలమి హనుమ
వారితో ననె నీ భూమి ఘోర మైన
నాదు వేగము భరియింప లేదు గాన 27.

చం. శిలలను గూడి గొప్పవగు శృంగము లున్న మహేంద్ర పర్వతం
బలరు స్థిరమ్ముగాఁ దరు లతావళి ధాతు స నిర్ఝరమ్ములన్
బలయుత శృంగ రాజములఁ బన్నుగ వేగము పెంచి యేఁగుదుం
గలఁగఁక సైచు నే నెగురఁ గాళుల పీడన మామడల్ కడున్ 28.

తే.గీ. మారుతప్రఖ్యుఁ డా హరి మారుతాత్మ
జుం డరి దమనుం డెక్కెను గొండ నా మ
హేంద్రమును లతా శాద్వల వృక్ష నిత్య
ఫల కుసుమ మృగ సేవిత విలసితమును 29.

చం. సతతము వ్యాఘ్ర సింహ మృగ సంచరితమ్ము మదేభ బృంద సే
వితము విహంగ సంచయ విభిన్న నినాద విరాజితమ్ము సం
తత సలి లోగ్ర పీడితము తద్దయు నున్నత శృంగ వంతమున్
వితత మహేంద్ర శైలమున వేగ చరించెను వాస వాభుఁడై 30.

తే.గీ. పాద యుగమునఁ బీడింప వాయు తనయుఁ
డమ్మహాత్ముఁడు  కన్పట్టె నద్రి వరము
సింహ తాడిత మత్తేభ శేఖరమ్ము
పగిది సలిలమ్ము వడి స్రవింపంగఁ జేసె 31.

తే.గీ. చెల్లచెదరె సెల్లెడలను శిలలు భృశము
తల్లడిల్లె మృగములు మాతంగములును
దరువు లెల్లను గంపించెఁ ద్రాగి నట్టి
మత్తు నందు గంధర్వులు మరలి రంత 32.

ఆ.వె. ఎగిరెఁ బక్షు లెల్ల సెల్ల విద్యాధరు
లద్రి సానువులు భయమున వీడి
రహులు దాఁగె భీతి నదరె కొండ కొన ల
వ్విధ మగపడె నపుడు వింత నగము 33.

కం. అర వెడలిన బుస్సు మసెడు
నురగమ్ముల తోడ శైల ముండెను గాంచన్
గురుతర పతాకములతో
విరివిగ భాసిల్లు పగిది వింతగ నంతన్ 34.

కం. మునులు భయభ్రాంతులునై
ఘన శైలమ్మును ద్యజింపఁ గాంతారమునం
గనఁబడె నా శైలము నిజ
జనవ్రజము లేని బాటసారి నిభముగన్ 35.

కం. ప్లవగప్రవీరుఁడు పర జ
న వినాశకుఁ డతి జవుఁడు మనస్వి మహాత్ముం
డవిరల మాత్మ వహించి ధృ
తి వెడలి యెదఁ గదిసె లంక స్థిరమతి యెలమిన్ 36.

మ. ఇన వంశార్ణవ పూర్ణచంద్ర నిభ! మత్తేభేంద్ర సంచార! మో
హన నీలద్యుతి భాసి తావయువ! సత్యద్యోత దుర్విక్రమా
వన కార్యైక సునిశ్చయాత్మక! లసద్బాణాసన స్కంధ! సా 37.

వనిసంజాత సలక్ష్మణ స్థిత సుదుర్వైరిఘ్ను రామప్రభూ!

నారాయణ వృత్తము.
నీలి మేఘశ్యామ! రామ!
వాలి జీవధ్వంస భీమ!
లాలితోత్సంగస్థ సీత!
పాలితబ్రహ్మాండ! నాథ! 38.

మాలిని.
గుణ నిచయ విరాజీ! ఘోర రక్షోగణఘ్నా!
ప్రణుత నిజ యశస్తృప్తా!దయా వారి రాశీ!
రణ కుశల విహారీ! రాఘువాంభోధి చంద్రా!
పణి రిపు వర మిత్రా! పార్థివేంద్రప్రవీరా! 39.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమునఁ గిష్కింధా కాండ మందు నఱువది యేడవ సర్గము.

శ్రీమదాంధ్ర రామాయణము నందుఁ గిష్కింధా కాండము సమాప్తము.